# బైబులుభాష్య సంపుటావళి

## ఆరవ సంపుటం

# క్రీస్తు జీవిత పరమార్థం



# బైబులుభాష్య సంపుటావళి

ఆరవ సంపుటం

# క్రీస్తు జీవిత పరమార్థం

**ఫాదర్ పి. జోజయ్య, S.J.**
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

Copies : 3,000
First Edition : December 25, 2003

పర్యవేక్షణ :

**Fr. THANAM MARREDY**

Parish Priest

St. Peter's Cathedral
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P. INDIA

ముద్రణానుమతి :

**Rt. Rev. MALLAVARAPU PRAKASH**

Bishop of Vijayawada

ప్రచురణ :

**St. PETER'S CATHEDRAL**

Education Desk For The Children
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P., INDIA

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్ళు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

- గ్రంథకర్త

# ముందుమాట

ఫా. జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా. జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా. జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా. మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా. జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. క్రీస్తు ప్రభువు

## మనవిమాట

బైబులు భాష్యం 37-38 సంచికల్లో క్రీస్తుని గూర్చి చెప్పాం. ఆ సంచికల్లోని అంశాలను పెంచి ప్రస్తుత గ్రంథాన్ని రూపొందించాం.

క్రీస్తుని అనుసరించేవాళ్ళు క్రైస్తవులు. కనుక ఆ ప్రభువు ఎవరో, అతడు ఏమి సాధించాడో, అతనిపట్ల భక్తి విశ్వాసాలు ఏలా చూపాలో క్రైస్తవులమైన మనకు స్పష్టంగా తెలిసి వుండాలి. ఆ తెలివిడికి ఈ గ్రంథం కొంతవరకు ఉపయోగపడుతుంది.

పాఠకులు క్రీస్తుని గూర్చిన వేదవాక్యాలను చక్కగా అర్థంచేసికొని భక్తిభావంతో ధ్యానంచేసుకోవాలి. గ్రంథాంతంలో పొందుపరచిన బైబులు అవలోకనాల పట్టిక ఇందుకు ఉపయోగపడుతుంది. ఇది ఐదవ ముద్రణం.

## విషయసూచిక

# 1.మనుష్యావతారం

నరుణ్ణి దేవుణ్ణి చేయడానికి దేవుడు నరుడై పుట్టాడు అన్నారు పూర్వవేదశాస్త్రులు. ఇదే మనుష్యావతారం. ఈ యధ్యాయంలో ఆరంశాలు పరిశీలిద్దాం.

## 1. పిత వాగ్దానం, యూదుల నిరీక్షణం

పరలోకంలోని తండ్రి మెస్సియాను పంపుతానని ముందుగనే వాగ్దానం చేసాడు.యూదభక్తులు ఈ మెస్సియా కోసం గంపెడాశతో ఎదురుచూస్తూ వచ్చారు.

ఆదాము దేవుని ఆజ్ఞను ధిక్కరించి పాపం చేసిన పిదప ప్రభువు పిశాచంతో "నేను నీకూ స్త్రీకీ, నీ సంతతికీ ఆమె సంతతికీ తీరనివైరం కలిగిస్తాను. ఆమె సంతతివారు నీతల నలగద్రొక్కుతారు. నీవు మాత్రం వాళ్ళ మడమలు కరుస్తావు" అన్నాడు - ఆది 3, 15. ఈ ప్రవచనంలో పిశాచం తలను నలగద్రొక్కే స్త్రీ సంతానం మెస్సీయా. బైబుల్లో మెస్సీయాను గూర్చిన మొదటి ప్రవచనం ఇదే. అటుపిమ్మట ప్రభువు అబ్రాహాముతో "నీ సంతానంద్వారా సకల జాతులు దీవెనలు పొందుతారు" అని చెప్పాడు - ఆది 22,18. అబ్రాహాము సంతానంలో ముఖ్యుడైనవాడు మెస్సీయా. అతని ద్వారానే అన్ని జాతులు రక్షణం పొందాలి. ఆ తరువాత ప్రవక్తలకాలంలో యెషయా మెస్సీయా పుట్టువును వర్ణిస్తూ "అతడు ఆశ్చర్యకరుడైన సలహాదారుడు, బలవంతుడైన దేవుడు, శాశ్వతుడైన పిత, శాంతికరుడైన అధిపతి" అని పేరు పొందుతాడని చెప్పాడు - 9,6. ఇదే ప్రవక్త ఆ మెస్సీయా అనుభవించే బాధలనుగూడా వర్ణిస్తూ "మన పాపాలకోసం అతన్ని వధించారు. చంపడానికి తోలుకొనిపోయే గొర్రెపిల్లలాగ, ఉన్ని కత్తిరించడానికి కొనిపోయే గొర్రెలాగ అతడు మౌనంగా వుండిపోయాడు" అని నుడివాడు - 53,7. ఈలాంటి ప్రవచనాలు పూర్వవేదంలో ఇంకా చాలవున్నాయి. ఇవన్నీ దేవుడు మెస్సీయాను పంపుతానని చేసిన వాగ్దానాలు.

యూదభక్తులు ఈ మెస్సీయా కోసం గంపెడాశతో ఎదురుచూచారు. "ప్రభో! ఆ రానున్నవాణ్ణి పంపు" అని ప్రార్థించారు. ఇంకా

"ఆకాశం మంచును కురియించాలి
మబ్బులు నీతిమంతుని వర్షించాలి
భూమి రక్షకుని మొలకెత్తించాలి"

అని మనవిచేసారు - యెష 45,8.

## 2. మనుష్యావతారం ఓ జ్యోతి

పైన పేర్కొన్న ప్రభువు వాగ్దానాలు మహాభక్తులు కోరికలూ నెరవేరి మెస్సీయా విజయం చేసాడు. అతడు బేత్లెహేములో నరశిశువుగా జన్మించాడు. కన్యమరియ అతన్ని కంది. వార్త శరీరధారియై మనమధ్య వసించాడు - యోహా 1,14. అతని పరిపూర్ణతనుండి మనం కృపవెంట కృపను పొందాం - 1,16. అనగా ప్రభువు మోషేద్వారా ప్రసాదించిన ధర్మశాస్త్రం మొదటి కృప. ఇప్పుడు ఈ మెస్సీయాను పంపడం ఆ ధర్మశాస్త్రంతో తుల్యమైన రెండవ కృప. ఆ మెస్సీయా పరిపూర్ణమైన కృపాసత్యాలతో మనమధ్య నివాస మేర్పరచుకొన్నాడు - 1,14. ఈ వాక్యంలో "కృప" అంటే, తండ్రి కరుణతో మెస్సీయాద్వారా మనలను రక్షించడానికి పూనుకోవడం. "సత్యం" అంటే అతడు పూర్వం మనలను రక్షిస్తాను అని చేసిన ప్రమాణాన్ని ఈ మెస్సీయా ద్వారా నిలబెట్టుకోవడం.

బైబులు మనుష్యావతారాన్ని ఓ జ్యోతినిగా చిత్రిస్తుంది. దేవుడు వెలుగు. అతడు నరులు సమీపింపలేని తేజస్సులో వసిస్తూంటాడు - 1 తిమో 6,16. భక్తులు ఈ తేజస్సుకోసం తపించిపోయారు. "నీ వెలుగులో మేమూ వెలుగును చూస్తాం" అని ఉవ్విళ్ళూరిపోయారు - కీర్త 36,9. పుణ్యపురుషులు హృదయాల్లోని ఈ తృష్ణను తీర్చడానికి మెస్సీయా అవతరించాడు. కనుకనే అతడు "నేనే జగత్తునకు జ్యోతిని. నన్ననుసరించేవాడు చీకటిలో నడువడు" అని పల్కాడు - యోహా 8,12. ఈ వెలుగును దర్శించి భక్తులు తృప్తిచెందుతారు. ఎందుకంటే ఆ ప్రభువే మనకు జీవం. ఆ జీవం లోకానికి వెలుగు - 1,4. క్రీస్తుజయంతి పూజలో వచ్చే ఓ ప్రార్థనలో "దైవవార్త మనుష్యావతారం చేకొనడంద్వారా దేవుని వెలుగు మన మనోనేత్రాలమీద కాంతిమంతంగా ప్రకాశించింది" అని చెప్తాం. ఈ వాక్యాలన్నింటి భావం నరావతారమెత్తిన క్రీస్తు ఓ వెలుగు లాంటివాడనే.

బేత్లెహేము గుహలో, పసులగాటిలో కన్యమాతచెంత పరుండివున్న ఆ శిశువును మనసార ధ్యానించుకొందాం. అతడు అందరు మనుష్య శిశువుల్లాగే వున్నాడు. కాని నుసిమాటున నిప్పుకణాల్లాగ ఆ శిశువు మనుష్యత్వం మాటున దివ్యత్వం దాగివుంది. అతడు మనుష్యుడై కూడ దేవుడు. దేవుడైకూడ మనుష్యుడుగా జన్మించినవాడు.

## 3. మన రక్షణం మనుష్యావతారం నుండే ప్రారంభమవుతుంది

మనం మామూలుగా క్రీస్తు సిలువమరణం ద్వారా మనలను రక్షించాడు అనుకొంటాం. ఇది పొరపాటు. అతని మనుష్యావతారంనుండే మన రక్షణం ప్రారంభమైంది. ఈ యంశాన్ని గ్రహించాలంటే "ఇద్దరు ఆదాములు" "బృందనాయకుడు" అనే భావాలను చక్కగా అర్థం చేసికోవాలి.

మొదట ఇద్దరు ఆదాములు అనే భావం చూద్దాం. తొలి ఆదాము ఉన్నాడు. అతడు నరులమైన మనకందరికీ ప్రతినిధి. మనలందరినీ తనలో ఇముచ్చుకొన్నవాడు. ఆది 1, 27-28. ఇతని పాపమే మనకందరికీ సంక్రమించింది. కాని ఈ యాదాము రాబోయే రెండో ఆదామైన క్రీస్తుకి గుర్తుగా వుంటాడు - రోమా 5,14. క్రీస్తు ఆదాముని గాదు, ఆదామే క్రీస్తుని సూచిస్తాడు.

ఆదామువల్ల మనకు కలిగిన నష్టం క్రీస్తువల్ల కలిగిన లాభం ద్వారా తీరిపోయింది. ఒక మానవుని అవిధేయత వల్ల అనేకులు నీతిమంతులయ్యారు - రోమా 5,18-21. ఆదామునందు అందరూ మృతిచెందినట్లే క్రీస్తునందు అందరూ బ్రతికారు- 1కొ 15,22-23. అసలు ఆదాముద్వారా మనం పోగొట్టుకొన్న దానికంటె క్రీస్తుద్వారా మనం సంపాదించుకొందే యెక్కువ.

ఇక బృందనాయకుడు అన్న భావం చూద్దాం. యూదులసంప్రదాయం ప్రకారం సమాజంలో ఓ బృందమూ, ఆ బృందానికి ఓ నాయకుడూ వుంటాడు. ఈ నాయకుడు ఆ బృందానికి ప్రతినిధి. అతడు ఆ బృందాన్ని ఒక్కటిగా బంధించి వుంచుతాడు. ఆ బృందాన్నంతటినీ తనలో ఇముడ్చుకొని వుంటాడు. దానిమీద గాఢమైన ప్రభావం చూపిస్తాడు. ఇతనివల్ల ఆ బృందం మంచికిగాని చెడ్డకుగాని మారుతుంది.

నరజాతికి ఆదామే మొదటి బృందనాయకుడు. అతని పాపప్రభావంవల్ల నరజాతి నాశమైంది - రోమా 5,12. ఈలాగే యెషయా తన ప్రవచనం 53వ అధ్యాయంలో వర్ణించిన బాధామయసేవకుడు కూడ బృందనాయకుడు. ఇతనివల్ల నరులకు విమోచనం కలిగింది. ఇంకా, దానియేలు ప్రవచనం, 7,13-14 వర్ణించే "మనుష్య కుమారుని పోలిన నరుడు" కూడ బృందనాయకుడే. నరులంతా ఇతనిలో ఇమిడే వున్నారు.

కాని క్రీస్తు అందరికంటెగూడ గొప్ప బృందనాయకుడు. ఆదాములాగే క్రీస్తు నరులందరినీ తనలో ఇముడ్చుకొన్నాడు. నరులందరికీ ప్రతినిధి. క్రీస్తు మన నరజాతిలో పుట్టినప్పుడే నరులమైన మనమందరమూ అతనిలో ఇమిడి పోయాం. అందుచేత నరావతారం నుండి మన రక్షణ ప్రారంభమైనదని చెప్పాలి.

వాక్కు నరుడై జన్మించినపుడు ఓ ప్రత్యేక మానుష దేహాన్ని మాత్రమే స్వీకరించలేదు. అతడు మన మానుషత్వాన్నంతటినీ, అనగా మన మానవ స్వభావాన్నంతటినీ స్వీకరించాడు. మానవులమైన మనమందరమూ అతనిలో ఇమిడిపోయాం. కనుక అతడు తన మనుష్యావతారం ద్వారా నరులందరినీ రక్షించడానికి పూనుకొన్నాడు. ఈలా మన రక్షణం సిలువతోగాక, మనుష్యావతారంతో ప్రారంభమైంది.

## 4. మనుష్యావతారం నూత్న నిబంధనం లాంటిది

పూర్వవేదంలో దేవుడు యూదులతో నిబంధనంచేసికొన్నప్పుడు, నిబంధన కార్యాన్ని ప్రారంభించింది దేవుడే. మనుష్యావతారంకూడ మళ్ళా ఓ నిబంధనంలాంటిది. ఇక్కడకూడా కార్యాన్ని ప్రారంభించింది, అనగా క్రీస్తుని పంపింది, తండ్రే.

మనుష్యావతారమంటే ఓ ప్రేమ సంఘటనం. నరుణ్ణి సందర్శించడానికి తండ్రి క్రీస్తుద్వారా పరలోకం నుండి భూలోకానికి దిగివచ్చాడు. అతడు నరుణ్ణి తన దగ్గరికి రమ్మని ఆహ్వానించాడు. తనతో మళ్ళా రాజీపడమని కోరాడు - 2 కొరి 5,17. దేవుడైన తన కుమారుని ద్వారా నరులమైన మనకు దివ్యత్వాన్ని ప్రసాదిస్తానని వాగ్దానం చేసాడు. నరావతారంనుండే మానవ రక్షణం ప్రారంభమైంది. ఈ రక్షణం తర్వాత సిలువమీద ముగుస్తుంది.

దేవుడు నరుల దగ్గరికి దిగివచ్చేదీ, నరులు దేవుని దగ్గరికి ఎక్కిపోయేదీకూడ క్రీస్తు ద్వారానే. అతడు మనకు నిచ్చెనలాంటివాడు. మన నరజాతికి ప్రతినిధి. నరులందరినీ తనలో ఇముడ్చుకొన్న విశ్వమానవుడు. పూర్వం దేవుని నుండి పెడమొగం పెట్టిన నరజాతి యిప్పుడు క్రీస్తుద్వారా మళ్ళా దేవునివైపు తిరుగుతుంది.

ఆదాము పాపం ద్వారా నరులు దేవుని యింటినుండి వెళ్ళిపోయారు. కాని నరావతారమెత్తిన క్రీస్తుద్వారా మనం మళ్ళా దేవుని యింటిని చేరుకొంటాం. ఆ దివ్యధామంలో అడుగిడి తండ్రితో మళ్ళా నూత్ననిబంధన చేసికొంటాం. క్రీస్తుద్వారా ఈ నిబంధనం జరుగుతుంది. అతడు మరో మోషేలాగ మనలను తండ్రి యింటికి తోడ్కొని పోతాడు. ఆ తండ్రితో మనం నూత్ననిబంధనం చేసికొనేలా చేస్తాడు.

## 5. మనుష్యావతారం భావం

సుతుడు మనుష్యావతారమెత్తి నరశిశువుగా జన్మించడంలో చాల దైవరహస్యాలు ఇమిడివున్నాయి. వాటిల్లో కొన్నిటిని పరిశీలిద్దాం.

### 1. నరుడూ, దేవుడూ

క్రీస్తుశిశువులో మానవత్వమూ దైవత్వమూ ఐక్యమైయున్నాయి. అతడు ఎంతగా దేవుడో అంతగా నరుడుకూడ. కనుక క్రీస్తు పాపంలో తప్పితే అన్ని విషయాల్లోను మనతో సరిసమానుడు అని చెప్తుంది హెబ్రేయులజాబు - 4,15. "సుతుడు మనుష్యావతార మెత్తినపుడు తాను పూర్వం ఎవరో అతడుగానే వుండిపోయాడు. ఐనా పూర్వం ఎవరు కాదో అతడుగా తయారయ్యాడు" అన్నారు పితృపాదులు. అనగా క్రీస్తు దేవుడుగావుండే

నరుడుగా తయారయ్యాడని భావం. ఇక యేసు దేవుడు కావడంవల్ల అతని కార్యాలు దైవకార్యాలయ్యాయి. ఆ దివ్యకార్యాలు మన పాపాలకు పరిహారం చేయగలిగాయి. అందుకే తండ్రికి ఆ కుమారుడంటే పరమప్రీతి. ఆ ప్రీతివల్లనే తండ్రి కుమారునిగూర్చి "ఇతడు నా ప్రియకుమారుడు. ఇతనినిగూర్చి నే నానందం చెందుతున్నాను" అని సాక్ష్యం పల్కాడు - మత్త 17,5. అతనిలో సర్వసంపూర్ణత నెలకొని వుండాలని దేవుని అభీష్టం - కొలో 1,19.

## 2. ఇద్దరు ఆదాములు

మొదటి ఆదాముకీ రెండవ ఆదాము ఐన క్రీస్తుకీ పోలికలున్నాయి. వీళ్ళిద్దరూ మనలాగ ప్రత్యేక వ్యక్తులు మాత్రమే కాదు, మానవసమాజాన్నంతటినీ తమలో ఇముడ్చుకొన్న సాముహిక వ్యక్తులుకూడ. మొదటి ఆదాము పూర్వమానవ జాతికి పిత. అతనిద్వారానే నరులందరికీ భౌతికజీవం లభించింది. కాని అతనిద్వారానే మానవజాతి ఆధ్యాత్మికజీవం కోల్పోయిందికూడా. ఇక, రెండవ ఆదాము ఐన క్రీస్తు నూత్న మానవజాతికి పిత. ఇతనిద్వారా మానవలోకానికి భౌతికజీవంగాక, ఆధ్యాత్మికజీవం లభించింది. మొదటి ఆదామువల్ల మనం కోల్పోయిన దివ్యజీవనం ఇతనిద్వారా పునరుద్ధరింపబడింది. ఆదామునుండి అందరు ఏలా మృతి జెందుతున్నారో అలాగే క్రీస్తునందు అందరూ జీవం పొందుతున్నారు - 1కొ 15,22.

## 3. నరునినుండే నరునికి రక్షణం

క్రీస్తు మనుష్యావతారం ద్వారా, పతనమైన మానవజాతి తన్నుతానే ఉద్ధరించుకోగలిగింది. అసలు మనుష్యావతారంతో అవసరం లేకుండానే దేవుడు నరుల పాపాలను పరిహరించి వుండవచ్చు. కాని ఈ పద్ధతి మన స్వాతంత్ర్యాన్ని కించపరుస్తుంది. నరులు తమ పాపాలకు తామే పరిహారం చేసికొంటే వాళ్ళకు గౌరవంగా వుంటుంది. ఐతే పతనమైన మానవజాతి తన పాపాలకు తాను ఏలా పరిహారం చేసికోగలదు? కనుకనే దేవుడు పాపరహితుడైన క్రీస్తుని మన నరజాతిలోనికి ప్రవేశపెట్టాడు. అతడు మనలందరినీ తనలో ఇముడ్చుకొని మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసాడు. ఆ పావనమూర్తితో ఐక్యమై మన పాపాలకు మనం పరిహారం చేసికోవచ్చు. విరిగిపోయిన మొక్క తన్నుతానే చక్కజేసికొంటుంది. అలాగే పతనమైన నరజాతికూడ క్రీస్తుతో ఐక్యమై తన్నుతానే ఉద్ధరించుకొంది. దేవునికీ మనకీ మధ్య వుండి తెగిపోయిన వంతెన క్రీస్తు రాకడతో మళ్ళా నిర్మింపబడింది. ఆ దేవుడే మనవద్దకు వచ్చాడు కనుక మనం ఆ దేవుని చెంతకు వెళ్ళవచ్చు.

ఈ సందర్భంలో పితృపాదులు కొన్ని గొప్పభావాలు చెప్పారు. క్రీస్తు దేహధారణం అవసరంకాదు. కాని ఈ దేహధారణంవల్ల మనలను మనమే రక్షించుకోవడానికి అనుకూలంగా వుంటుంది. ఆ ప్రభువు ఆదాము సంతతివాడే గనక కాకపోయినట్లయితే ఆదాము సంతతికి రక్షణం కలిగి వుండేదేకాదు. సుతుడు మనుష్యుడు కాకుండానే తండ్రి ఆదాము పాపాన్ని మన్నించి వుండవచ్చు. కాని అటుతరువాత మానవులు మళ్ళా చేసే పాపాలకు పరిహారమార్గం ఏమిటి? మానుష దేవుడే గనుక మనమధ్యలోవుంటే అతని నుండి మాటిమాటికీ పాపపరిహారం పొందవచ్చు. ఈ కారణాలన్నింటివల్ల దేవుడు నరుడయ్యాడు.

## 4. ఇచ్చిపుచ్చుకోవడం

దేవుడు నరుడైంది నరుణ్ణి దేవుణ్ణి చేసేందుకు. దేవుడు మన నరజాతినుండి మనుష్యత్వాన్ని చేకొన్నాడు. దానికి బదులుగా మనకు దైవత్వాన్ని ప్రసాదించాడు. ఇది యిచ్చిపుచ్చుకోవడం. ఈ క్రియద్వారా క్రీస్తుకంటెగూడ మనకే యెక్కువ లాభం చేకూరింది. నరులు ఎన్నాళ్ళబట్టో దైవత్వాన్ని పొందాలని ఉబలాటపడుతూవచ్చారు. కాని మనంతట మనం ఈ కోర్కెను తీర్చుకోలేం. అందుకే ఆ ప్రభువు తానుస్వయంగా వచ్చి మనకు ఈ వరాన్ని ప్రసాదించాడు. నరునికి దివ్యత్వాన్ని దయచేసి అమరలోకంలోకి తీసికొని పోయాడు.

సుతుడు నరుడై జన్మించినపుడు ఓ ప్రత్యేకమైన నరదేహాన్ని మాత్రమేకాదు, మన నరత్వమంతా చేకొన్నాడు. అలా చేకొనందే మన నరజాతికి పాపవిముక్తి కలిగేదికాదు. తాను చేకొన్న ఈ నరత్వానికి బదులుగా అతడు నరులందరికీ – అనగా తన్ను విశ్వసించేవాళ్ళందరికీ – దివ్యత్వాన్ని ప్రసాదించాడు. అతడు తన్నంగీకరించే వాళ్ళందరికి దేవుని బిడ్డలయ్యే శక్తిని దయచేసాడు – యోహా 1,12. ఇక్కడ దేవునిబిడ్డలం కావడమంటే దైవత్వాన్ని పొందడమే.

## 5. దైవకృప ప్రత్యక్షమైంది

నరవతారంద్వారా అదృశ్యుడైన దేవుడు దృశ్యుడయ్యాడు. సమస్త జనుల రక్షణం కొరకు దైవకృప ప్రత్యక్షమైంది – తీతు 2,11. ఈ దైవకృపే క్రీస్తు. పూర్వవేద యూదులు దేవుని ముఖాన్ని దర్శించడానికి భయపడ్డారు. ఏ నరుడూ ఆ భగవంతుణ్ణి దర్శించి బ్రతకలేడు అనుకొన్నారు – నిర్గ 33.20. కాని ఆ భగవంతుని తేజస్సే ఇప్పుడు క్రీస్తు ముఖంలో ప్రకాశిస్తూంది. ఈ దివ్యశిశువుని మనం సమీపించగలం. ఇతనిద్వారా దేవుడు మనతో మాటలాడుతాడు, మనకు బోధ చేస్తాడు.

ఇంకా నరావతారంద్వారా బాధల కందని దేవుడు బాధలకు లొంగాడు. అతనిద్వారా మనకు విముక్తి కలిగింది. పాపులమైన మనం ఎన్ని శ్రమలనుభవించినా మనపాపాలకు పరిహారం కలిగేదికాదు. కాని క్రీస్తు నరుడై శ్రమలనుభవించడం ద్వారా నరజాతికి దోషవిముక్తి కలిగింది. అతనిపాట్లు మనకు రక్షణాన్నీ దాస్యవిముక్తినీ కలిగించాయి.

## 6. దత్తపుత్రత్వం

క్రీస్తు మనుష్యావతారం మనకు దైవపుత్రత్వాన్ని ఆర్జించిపెట్టింది. క్రీస్తు పితకు ప్రథమ పుత్రుడు. అతని ద్వారా మనం దేవుని తనయులమౌతాం. ఆ క్రీస్తుకి సోదరులమౌతాం. క్రీస్తుతో మనం సమరూపులంగావటానికే తండ్రి మనలను ఆ కుమారునియందు ముందుగానే ఎన్నుకొన్నాడు - రోమా 8,29. క్రీస్తు ఓ దేవదూతగా జన్మించి మనలను రక్షించి వుండవచ్చు. కాని అలా చేయలేదు. మన మనుష్య జాతిలో పుట్టి, మనుష్యరూపం చేకొని మనలను రక్షించాడు. ఎందుకు? తాను మనకు సోదరుడు, మనకు పెద్దన్న కావడం కోసమే - హెబ్రే 2,17. మనం ఆ క్రీస్తులోకి జ్ఞానస్నానం పొంది అతనితో ఐక్యమైనప్పుడు అతని తండ్రికి తనయులమౌతాం. క్రీస్తు స్వతస్సిద్ధంగానే దైవకుమారుడు, దైవత్వం కలవాడు. మనం స్వతస్సిద్ధంగాకాక క్రీస్తుద్వారా దేవుని కుమారులమై దైవత్వం పొందుతాం. క్రీస్తు దేవునికి సహజపుత్రుడు, మనం దత్తపుత్రులం. క్రీస్తు వరప్రసాదంద్వారా మనం దివ్యులమౌతాం. పూర్వం యిస్రాయేలీయులు నిబంధనంద్వారా దేవుని బిడ్డలూ దేవుని ప్రజలూ అయ్యారు. వాళ్ళకు నిబంధనం సంపాదించి పెట్టిన వరాలను ఈనాడు మనకు జ్ఞానస్నానం సంపాదించి పెడుతుంది.

## 6. నరుడైన క్రీస్తు

మన భక్తికార్యాల్లో నరుడైన క్రీస్తుకి ఎలాంటి స్థానం వుండాలి? మనం తరచుగా క్రీస్తుని దేవుణ్ణిగా భావిస్తామే గాని నరుణ్ణిగా భావించం. ఇది పెద్ద పొరపాటు. అతడు అచ్చంగా మనలాగే నరుడై జన్మించాడు. మనలాగే శోధనలకు గురయ్యాడు, శ్రమలనుభవించాడు - హెబ్రే 4,15. ఉత్థానుడైన మానుష క్రీస్తే నేడు దేవ ద్రవ్యానుమానాల్లో పనిచేసేది. మోక్షంలో మనం ఆనందించేదికూడ ఈ మానుషక్రీస్తునందే. మానవుడూ దేవుడూ ఐన క్రీస్తుద్వారానే నేడు మనం తండ్రిని చేరుకొనేది. కనుక మన ప్రార్థనల్లోను భక్తికార్యాల్లోను క్రీస్తుని కేవలం దేవునిగా మాత్రమే భావించగూడదు. నరుణ్ణిగాగూడ భావించుకోవాలి. లేకపోతే అతడు మనుష్యావతారమెత్తి ప్రయోజనమేమిటి?

అతడు మనకు పెద్దన్న - రోమా 8,29. మనం అతనికి తమ్ముళ్ళమూ చెల్లెళ్ళమూను. ఆ యన్నద్వారా మనం దేవుని బిడ్డలమౌతాం. ఆ యన్నను ముందుంచుకొని దేవుని సన్నిధిలోకి వెళ్తాం, దేవునితో తిరిగి రాజీపడతాం. అతడు తన దైవత్వాన్ని వరప్రసాదాన్ని మనకు పంచియిచ్చేవాడు. నరులమైన మనపట్ల సానుభూతి చూపేవాడు. అలాంటి మానుషక్రీస్తుని మనం అనుభవానికి తెచ్చుకోవాలి.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు జీవితంలో రెండు ముఖ్య సంఘటనలున్నాయి. ఒకటి క్రిందికి దిగడం, మరొకటి పైకెక్కడం. క్రిందికి దిగడమంటే, అతని మనుష్యావతారం. అతడు స్వర్గం నుండి భూమిమీదికి దిగిరావడం. పైకెక్కడమంటే, అతని వుత్థానం. అతడు ఈ లోకంలోనుండి తండ్రివద్ద కెక్కిపోవడం. పౌలు ఈ సంఘటనను గూర్చిచెప్తూ "క్రిందికి దిగివచ్చినవాడే ఆకాశమండలానికంటె పైకెక్కిపోయినవాడు. అతడు లోకాన్నంతటినీ తన వునికితో నింపుతాడు" అని చెప్పాడు - ఎఫె 4,10. ప్రస్తుతం క్రీస్తు క్రిందికి దిగిరావడాన్ని గూర్చి మాత్రమే విచారిద్దాం. పై పౌలే క్రీస్తు మనుష్యావతారాన్ని గూర్చి చెప్తూ "అతడు తన్నుతాను రిక్తుని చేసికొని, సేవక రూపం తాల్చి, మానవుల పోలికగా జన్మించాడు" అని వాకొన్నాడు - ఫిలి 2,7. ఇక్కడ క్రీస్తు తన్నుతాను "రిక్తుని జేసికొన్నాడు" అంటే తన్నుతాను ఖాళీ చేసికొన్నాడని భావం. అనగా అతడు దైవత్వాన్ని పూర్తిగా వదలుకొన్నాడో అన్నట్లు దాసుడైన నరుడుగా జన్మించాడు. ఇదే మనుష్యావతారం. ఆనాడు క్రీస్తు శిశువులో మానవత్వమేగాని దైవత్వ మెవరికీ కన్పింపలేదు. అది ఆ ప్రభువు దైన్యస్థితి. ఈలా మనకొరకు ఈ మంటిమీదికి దిగివచ్చిన ప్రభువుకీ, మనకోసం తన్నుతాను శూన్యం జేసికొన్న ప్రభువుకీ, మనం భక్తిభావంతో ప్రణమిల్లాలి.

2. యోహాను మనుష్యావతారాన్ని గూర్చి చెప్తూ "ఆ వాక్కు మానవుడై మనమధ్య వసించాడు, అతని మహిమను మనం చూచాం" అని వ్రాసాడు - 1,14. ఇక్కడ "మనమధ్య వసించడం" "మహిమ" అనే రెండంశాలను పరిశీలిద్దాం.

    మొదట "మనమధ్య వసించడం" అనే భావాన్ని తీసికొందాం. యెషయా ప్రవక్త "కన్య గర్భవతియై కుమారుని కంటుంది. అతన్ని ఇమ్మానువేలు అని పిలుస్తారు" అని చెప్పాడు - 7,14. ఈ వాక్యాన్ని మత్తయి క్రీస్తు శిశువుకి అన్వయింపజేసాడు - 1,22-23. "ఇమ్మానువేలు" అంటే మనతోవుండే దేవుడు

అని అర్థం. పూర్వవేదంలో యావే ప్రభువు నిరంతరమూ దేవళంలో యిస్రాయేలీయులమధ్య నెలకొని వుండి వాళ్ళను కాపాడేవాడు. అలాగే నూత్నవేదంలో క్రీస్తుకూడ మనమధ్య, మనతో ఉంటాడు. మనలను కాపాడుతూంటాడు. నూత్నవేదంలో ఉత్థాన క్రీస్తే మన దేవాలయమౌతాడు–యోహా 2,21–22. పై యోహాను 1,14లో "మనమధ్య వసించాడు" అన్న దానికి గ్రీకు మూలంలో "మనమధ్య గుడారం పన్నుకొన్నాడు" అని ఉంది. యూదులు గుడారాల్లో వసించేవాళ్ళు. క్రీస్తు మనుష్యావతారంకూడ అతడు ఈ భూమిమీద, తన ప్రజల మధ్య గుడారం పన్నుకోవడం లాంటిది.

ఇక రెండవ భావమైన "మహిమ" అనేదాన్ని చూద్దాం. మానవావతారమెత్తిన క్రీస్తు మహిమ అతని తండ్రి మహిమలాంటిది. ఇక్కడ మహిమ అంటే తేజస్సు. పూర్వవేదంలో తండ్రి తేజస్సుకి "షెకీనా" అని పేరు. యెరూషలేము దేవళంలో మందసంమీద ఆ తేజస్సు ప్రకాశిస్తుండేది – 1 రాజు 8,10–11. నూత్నవేదంలో క్రీస్తు తండ్రికి ప్రతిరూపం. (కనుక తండ్రి తేజస్సు అతనికీ సంక్రమిస్తుంది). ఈ తేజస్సుని క్రీస్తు తర్వాత తన అద్భుతాల ద్వారా ప్రదర్శిస్తాడు. ఉత్థానం ద్వారా అతనికి పరిపూర్ణ తేజస్సు సిద్ధిస్తుంది.

ప్రభువు నిరంతరమూ మనమధ్య వసిస్తూ మనలను ఆదరిస్తుంటాడు. అతడు తేజోమూర్తి కూడ. అలాంటి ప్రభువుకి నమస్కారం చెబుదాం.

3. యోహాను మనుష్యావతారంలో క్రీస్తు తేజస్సుని దర్శించాడు – 1,14. కాని పౌలు మనుష్యావతారంలో క్రీస్తు దైన్యాన్ని చూచాడు – ఫిలి 2,7. ఇవి రెండూ పరస్పర విరుద్ధమైన భావాలు కావు. ఒకదాన్నొకటి పరిపూర్ణం చేసికొనే భావాలు. ప్రభువు నరావతారంలో తేజస్సూ దైన్యమూ రెండూ వున్నాయి. మనకు గ్రీకు తిరుసభ, ల్యాటిను తిరుసభ అని రెండున్నాయి. మనం ల్యాటిను తిరుసభకు చెందిన క్రైస్తవులం. గ్రీకు తిరుసభకు చెందిన క్రైస్తవులు యోహాను భావాలు స్వీకరించారు. వాళ్ళు మనుష్యావతారంలో క్రీస్తు మహిమకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. అతన్ని నరునిగాకంటె దేవుణ్ణిగా భావించారు. క్రీస్తు జననోత్సవానికంటె అతని ఉత్థానోత్సవానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. ల్యాటిను తిరుసభకు చెందిన క్రైస్తవులు పౌలు భావాలు స్వీకరించారు. వాళ్ళు మనుష్యావతారంలో క్రీస్తు దీనత్వానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. అతన్ని

దేవునిగాకంటె నరుణ్ణిగా భావించారు. క్రీస్తు ఉత్థానోత్సవానికంటె అతని జననోత్సవానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. మన మట్టుకు మనం క్రీస్తు మనుష్యావతారంలో అతని దివ్యత్వమూ మహిమా రెండూ గుర్తించాలి.

4. క్రీస్తు నరావతారాన్ని తలంచుకొనేపుడు ఆ ప్రభువుకి మానుషజన్మనిచ్చిన మరియమాతనుగూడ స్మరించుకోవాలి. తొలిశతాబ్దాలనుండి క్రైస్తవ భక్తులు ఆమెను దేవుని తల్లినిగా వినుతిస్తూవచ్చారు. మరియ అనే తీగ క్రీస్తు అనే పూవు పూచింది. రక్షకుడనే పండు కాచింది. నేడు మనం ఆ పూవు సువాసనని అనుభవిస్తున్నాం. ఆ పండుని భుజిస్తున్నాం. మరియ మహోపకారానికి ఆ తల్లిని నోరార స్తుతించాలి. మనలను తన కుమారుని చెంతకు చేర్చమని అడుగుకోవాలి.

# 2. క్రీస్తు జ్ఞానస్నానం

క్రీస్తు జ్ఞానస్నానం అతని సిలువ మరణాన్ని సూచిస్తుంది. అతడు ప్రవక్త అనీ, బాధామయ సేవకుడనీ, నూత్నవేద ప్రజలకు నాయకుడనీ తెలియజేస్తుంది. ప్రత్యక్షంగా కాదుగాని పరోక్షంగా అతని జ్ఞానస్నానం మనజ్ఞానస్నానంమీద కూడ పనిజేస్తుంది. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

## 1. జ్ఞానస్నాన సంఘటనం

క్రీస్తు జ్ఞానస్నానం మత్తయి 3,13 - 17లో వర్ణింపబడింది. ఇక్కడ మనం రెండంశాలను పరిశీలిద్దాం. మొదటిది, యోహాను జ్ఞానస్నానం. ఆనాటి యూదులు యోహాను నుండి యోర్దాను నదిలో జ్ఞానస్నానం పొందారు. క్రీస్తు కూడ యోహానునుండే జ్ఞానస్నానం స్వీకరించాడు. ఇది నూత్నవేద జ్ఞానస్నానంలాగ ఓ సంస్కారం కాదు. కేవలం శుద్ధీకరణకర్మ మాత్రమే. ఇది నాటి ప్రజలను మెస్సీయా రాకడకూ అతడు నెలకొల్పబోయే దైవరాజ్యానికీ సిద్ధం చేసింది. పశ్చాత్తాప మార్గాన ప్రజలు దైవరాజ్యంలో చేరాలని బోధించింది - మార్కు 1,4. ఈ పశ్చాత్తాపం ద్వారానే ఈ జ్ఞానస్నానం భక్తులకు వరప్రసాదాన్ని ఆర్జించి పెట్టగలిగింది. తరువాత నూత్నవేద ప్రజలు పరిశుద్ధాత్మ ద్వారా పొందబోయే జ్ఞానస్నానానికి ఈ యోహాను జ్ఞానస్నానం సంకేతంగా వుంటుంది.

రెండవది, క్రీస్తు ఎందుకు జ్ఞానస్నానం పొందాడు? పూర్వవేదంలో పిత మెస్సీయాద్వారా ప్రజలను రక్షిస్తానని వాగ్దానం చేసాడు. ఆ వాగ్దానాన్ని నెరవేర్చడానికే క్రీస్తు వచ్చాడు. అనగా అతడు తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళికను సాధించేవాడు. ఆ

రక్షణ ప్రణాళికలో మొదటిమెట్టు అతని జ్ఞానస్నానం. ఈ సంఘటనంతో అతడు పిత ప్రణాళికను సాధించడానికి పూనుకొన్నాడు - మత్త 3,15. ఇంకా మెస్సీయా రక్షణోద్యమం పశ్చాత్తాపంతో ప్రారంభమౌతుంది. క్రీస్తు జ్ఞానస్నానంలో ఈ పశ్చాత్తాపం వుంది. యోహాను యిచ్చిన జ్ఞానస్నానంలో ముఖ్యాంశం ఈ పశ్చాత్తాపమే. కనుక క్రీస్తు జ్ఞానస్నాన సంఘటనంతోనే తన రక్షణోద్యమాన్ని ప్రారంభించవలసి వచ్చింది.

క్రీస్తు తనకోసం జ్ఞానస్నానం పొందలేదు. అతడు పాపరహితుడు. అతని జ్ఞానస్నానం మనకోసం. నూత్న మానవజాతికి అతడు శిరస్సు. క్రీస్తు జ్ఞానస్నానం పొందినపుడు అతని అవయవాలమైన మనంకూడ అతనియందు జ్ఞానస్నానం పొందాం. అతని పశ్చాత్తాపం మన పశ్చాత్తాపమైంది. ఈ విధంగా అతని జ్ఞానస్నానం మన జ్ఞానస్నానాన్ని సూచిస్తుంది.

## 2. పిత ఆత్మల సాక్ష్యం

ఇక్కడ మూడంశాలను పరిశీలించాలి. 1. క్రీస్తు జ్ఞానస్నానం పొందినపుడు "ఇతడు నా ప్రియకుమారుడు, ఇతనినిగూర్చి నేను ఆనందిస్తున్నాను" అని ఆకాశంనుండి ఓ స్వరం వినిపించింది - మత్త 3,17. ఇది క్రీస్తు తరపున పితపలికిన సాక్ష్యం. ఈ వాక్యానికి యెషయా ప్రవచనం 42,1 ఆధారం. అక్కడ బాధామయసేవకుడు ప్రభువు నిర్ణయించిన రక్షణకార్యాన్ని నెరవేరుస్తాడు. కనుక ప్రభువు ఆ సేవకుణ్ణిజూచి ఆనందించాడు. ఆ బాధామయ సేవకుడు క్రీస్తే. కనుక తండ్రి ఆ బాధామయ సేవకుణ్ణి గూర్చిన వాక్యంతోనే యిక్కడ క్రీస్తుకి సాక్ష్యం పలికాడు. ఇంకా ఈ క్రీస్తు తండ్రికి ప్రతిబింబం. అతని వెలుగు, అతని కుమారుడు. అతని రక్షణోద్యమాన్ని సాధించడానికి వచ్చినవాడు. తండ్రి సంకల్పాన్ని పాటించడమే ఈ క్రీస్తుకి ఆహారం. అలాంటి కుమారుని జ్ఞానస్నానాన్నిచూచి తండ్రి ఆనందించడంలో ఆశ్చర్యమేమీలేదు. ఈ ఆకాశస్వరాన్ని వినడం వల్ల స్నాపక యోహానుకి కూడ క్రీస్తుపట్ల నమ్మకం కలిగింది. తాను అతన్ని మెస్సీయాగా అంగీకరించాడు.

2. జ్ఞానస్నానం పొందిన క్రీస్తు మీదికి దేవుని ఆత్మపావురం లాగ దిగివచ్చింది. ఈలా దిగిరావడం ఆత్మపలికిన సాక్ష్యంగా భావించాలి. బైబుల్లో ఆత్మ ప్రధానంగా శక్తిని సూచిస్తుంది. ఈ ఆత్మద్వారా క్రీస్తుకి తన రక్షణోద్యమానికి కావలసిన శక్తి అనుగ్రహించబడింది. ఈ శక్తినే బైబులు "అభిషేకం" అని పిలుస్తుంది - అచ 10,38. మెస్సీయా కాలంలో ప్రభువు అందరిమీద తన ఆత్మను కుమ్మరిస్తాడు అని ప్రవక్తలు చెప్పారు - అ, 2.17. ఇక్కడ ఆత్మ మొట్టమొదట క్రీస్తుమీదనే కుమ్మరింపబడింది. ఫలితాంశమేమిటంటే, జ్ఞానస్నానానంతరం క్రీస్తుకి ఆత్మ అనుగ్రహం సమృద్ధిగా లభించింది.

ఆత్మ క్రీస్తు మీదికి పావురం రూపంలో దిగివచ్చింది. పావురంలా రావడం దేనికి? ఇది ఓ సంకేతం. యూదుల భావాల ప్రకారం పావురం ప్రజానీకాన్ని సూచిస్తుంది. క్రీస్తువరకు ఉంది పూర్వవేద ప్రజ. అతనితో నూత్నవేద ప్రజ, మెస్సీయా ప్రజ ప్రారంభమౌతుంది. ఇక్కడ ఈ పావురం, ఈ నూత్న ప్రజకు చిహ్నం. సృష్ట్యాదిలోనే దేవుని ఆత్మ ఓ పక్షిలాగ జలాలమీద అల్లల్లాడుతూంది –ఆది 1,2. ఇక్కడ మెస్సీయాతో క్రొత్త సృష్టి, క్రొత్త ప్రజ ప్రారంభమౌతుంది అని ఈ పక్షి సంకేతం భావం.

3. క్రీస్తు జ్ఞానస్నానం పొందింది యోర్దాను నదిలో. భక్తులు ఆ నదిలో దిగగా యోహాను వాళ్ళను నీటిలో ముంచేవాడు. ఆ పిమ్మట వాళ్ళు ఏటినుండి వెలుపలికి వచ్చేవాళ్ళు. యెర్దాను నదికి బైబుల్లో చాల సంకేతాలున్నాయి. పూర్వం యూదులు రెల్లుసముద్రం దాటి వాగ్దత్త భూమిలో ప్రవేశించారు. వాళ్ళలాగే క్రీస్తుకూడ ఓ సముద్రం దాటి, ఓ వాగ్దత్తభూమి చేరుతాడు. ఇక్కడ క్రీస్తు యోర్దానులోకి దిగటం అతడు రెల్లుసముద్రం దాటడం లాంటిది. అతడు చేరుకొన్న వాగ్దత్తభూమి మోక్షమే.

## 3. క్రీస్తు జ్ఞానస్నానం అతని మరణోత్థానాలకు చిహ్నం

రెల్లుసముద్రపు నీళ్ళు ఐగుప్తీయులకు మృత్యువునీ యిస్రాయేలీయులకు జీవాన్నీ తెచ్చిపెట్టాయి. ఆలాగే యోర్దాను నీళ్ళుకూడ క్రీస్తు మరణాన్నీ జీవాన్నీ సూచిస్తాయి. నదిలోకి దిగడం అతని మరణాన్ని సూచిస్తుంది. ఇక్కడ ఈ రెండంశాలను పరిశీలిద్దాం. మొదటిది క్రీస్తు మరణం. “ఇతడు నా ప్రియకుమారుడు” అని తండ్రి పలికిన సాక్ష్యం యెషయా ప్రవక్త వర్ణించిన బాధామయ సేవకుణ్ణి తలపునకు తెస్తుంది అని చెప్పాం - 42,1. ఈ సేవకుడు ప్రజలకోసం ప్రాణాలు అర్పించాడు. అలాగే క్రీస్తుకూడ ప్రజలకోసం అసువులర్పించాడు. ఇంకా, క్రీస్తు “నేను పొందవలసిన బాప్తిస్మం ఒకటుంది. దాన్ని పొందిందాకా నాకు విశ్రాంతి లేదు” అన్నాడు - లూకా 12,50. ఏమిటి ఈ బాప్తిస్మం? అతని శ్రమలూ మరణమూను. గ్రీకు భాషలో బాప్తిస్మం అంటే ముంచడం. నరుడు నీళ్ళల్లో మునిగినట్లుగా క్రీస్తు బాధల్లో మునిగితేలుతాడు. కనుక ఇక్కడ అతని జ్ఞానస్నానం అతని పాటులే. ఈ రీతిగా క్రీస్తు యోర్దాను నీళ్ళల్లోకి దిగడం అతని మరణాన్ని తెలియజేస్తుంది.

రెండవది, క్రీస్తు ఉత్థానం. అతడు యోర్దానునుండి వెలుపలికి వచ్చాడు. ఈ నిర్గమనం అతడు సమాధినుండి వెలుపలికి రావడం లాంటిది. కనుక యోర్దాను నీళ్ళలో నుండి వెలుపలికి రావడం అతని ఉత్థానానికి చిహ్నం.

## 4. క్రీస్తు జ్ఞానస్నానమూ, మన జ్ఞానస్నానమూ

మన జ్ఞానస్నానం క్రీస్తు జ్ఞానస్నానం నుండి గాక, అతని మరణోత్థానాలనుండి ఫలితం సాధిస్తుంది. కాని క్రీస్తు సొంత జ్ఞానస్నానం అతని మరణోత్థానాలను సూచిస్తుందని చెప్పాం. అందువల్ల అతని జ్ఞానస్నానం పరోక్షంగా మన జ్ఞానస్నానంమీద సోకుతుంది. మన జ్ఞానస్నానంలో క్రీస్తు మరణోత్థానాలు నూత్నీకరింపబడాలి - ఇది ముఖ్యాంశం. ఇది యేలాగో పరిశీలిద్దాం.

తొలిరోజుల్లో జ్ఞానస్నానం ఇప్పటిలాగ వుండేదికాదు. అప్పుడు జ్ఞానస్నానం పొందేవాళ్ళను మడుగులోని నీళ్ళల్లో ముంచేవాళ్ళు. గ్రీకుభాషలో బాప్తిస్మం అంటే నీళ్ళల్లో ముంచడమని ముందే చెప్పాం. ఈ జ్ఞానస్నాన పద్ధతిలో మరణోత్థానాల సంకేతం చక్కగా అన్వయించేది. చనిపోయిన క్రీస్తుని సమాధిలో పాతిపెట్టారు. అలాగే జ్ఞానస్నానం పొందే భక్తులుకూడ మడుగులోని నీళ్ళల్లో పాతిపెట్టబడతారు. క్రీస్తులాగే వాళ్ళుకూడ చనిపోతారు. ఈ చనిపోవడం భౌతికంగా గాదు, ఆధ్యాత్మికంగా. అనగా భక్తులు పాపానికి చనిపోతారు. ఈలా క్రీస్తు మరణం జ్ఞానస్నానం పొందే భక్తుల్లో నూత్నీకరింపబడుతుంది.

ఇక, క్రీస్తు సమాధిలోనుండి లేచాడు. అదే అతని ఉత్థానం. అతడు సజీవుడయ్యాడు. అలాగే భక్తులుకూడ మడుగునుండి వెలుపలికి వస్తారు. ఇది క్రీస్తు ఉత్థానంలాంటిది. వాళ్ళు ఇంతకుముందు పాపానికి చనిపోయినట్లే ఇకమీద వరప్రసాదానికి జీవిస్తారు. ఇదే వాళ్ళ క్రొత్త జీవితం, వాళ్ళు సజీవులు కావడం.

ఈలా క్రీస్తు మరణోత్థానాలు మన జ్ఞానస్నానంలో సాంకేతికంగా నెరవేరుతాయి. జ్ఞానస్నానం పొందినపుడు మనకు వరప్రసాదాన్ని సంపాదించి పెట్టేవి ఈ సంకేతాలే. పౌలు రోమీయులకు వ్రాస్తూ "మనం జ్ఞానస్నానంలో క్రీస్తు మరణంలో పాలుపొందుతూ అతనితోపాటు పాతిపెట్టబడుతున్నాం. అతని ఉత్థానంలోను పాలుపొందుతున్నాం" అని చెప్పాడు - 6,4.

ఈనాటి జ్ఞానస్నానంలో మడుగులో ముంచడం అనే పద్ధతి లేదు. ఐనా క్రీస్తు మరణోత్థానాలు అనే సంకేతాలు పాపానికి చనిపోయి క్రొత్తజీవితానికి ఉత్థానం కావడం అనే సంకేతాలూ, ఈనాటి జ్ఞానస్నానానికికూడ వర్తిస్తాయి. ఈ సంకేతాలు లేందే జ్ఞానస్నానం ఫలితం ఈయలేదు.

## 5. జ్ఞానస్నానమూ, ఆధ్యాత్మిక జీవితమూ

జ్ఞానస్నాన జీవితం జీవించగలిగితే చాలు మనం పవిత్రుల మౌతాం. పెద్దపెద్ద అర్చ్యశిష్టులుకూడ ఇంతకంటె ఎక్కువేమీ చేయలేదు. పవిత్ర జీవితమంటే

జ్ఞానస్నానవిధులను పాటించడమే. ఏమిటివి ఈ విధులు? పాపానికి చనిపోవడమూ, వరప్రసాద జీవితాన్ని జీవించడమూను. దీన్నే పౌలు క్రొత్త జీవితమని, దత్తపుత్రుల జీవితమనీ, క్రీస్తుని ధరించడమనీ నానావిధాలుగా వర్ణించాడు.

జ్ఞానస్నానంలోనే మనకు ఆత్మ అనుగ్రహింపబడుతుంది. ఈ ఆత్మ మనలను రోజురోజుకీ క్రీస్తు చెంతకు చేరుస్తూంటుంది. మనలో క్రీస్తు రూపురేఖలు తీర్చిదిద్దుతూంటుంది.

జ్ఞానస్నానం జీవితం ఒక రోజుతోగాని ఒక ఏడాదితో కాని ముగిసేదికాదు, జీవితమంతా కొనసాగేది. ఈ మధ్యలో మనం కొన్నిసార్లు కాలుజారి పడిపోతూంటాంకూడ. అలాంటప్పుడు జ్ఞానస్నానమిచ్చే వరప్రసాద సహాయంతో బలంపుంజుకొని మళ్ళా దివ్యజీవితం జీవిస్తూండాలి.

జ్ఞానస్నానాన్ని గూర్చిన పైతలంపులు దివ్యమైన భావాలను కలిగించాలి. ఆ ప్రభువు మనకు భౌతిక జీవం మాత్రమేకాదు. ఈ జ్ఞానస్నానంద్వారా ఆధ్యాత్మిక జీవంగూడ ప్రసాదించాడు. దీనిద్వారా మనం దివ్యులంగా జీవించగలం. ఓనాడు ఆ ప్రభువు దివ్యధామంలో ప్రవేశించగలం. జ్ఞానస్నానంద్వారా మనం క్రీస్తుతో ఐక్యమౌతాం. అతనితో మనకు సహవాసం లభిస్తుంది - 1కొ 1,9. ఇందుకు మనం కృతజ్ఞులమై యుండాలి.

## ప్రార్థనా భావాలు

1. ప్రభువు సొంత పేరు యేసు. హీబ్రూ భాషలో ఈ పేరు "యెహోషువా" అని వుంటుంది. అది ఆ భాషలో యెహో + యాషా అనే రెండు పదాల సంయోగం. "యావే ప్రభువు రక్షణం" అని ఈ పదాల అర్థం. అనగా తండ్రి తన ప్రతినిధియైన మెస్సీయాద్వారా ప్రజలను రక్షిస్తాడని భావం. కనుకనే యేసు అనే పేరుకి రక్షకుడు అనే అర్థం రూఢమైంది. దేవదూత యోసేపుతో "అతడు తన ప్రజలను పాపంనుండి రక్షిస్తాడు. కనుక అతనికి యేసు అనే పేరు పెట్టాలి" అని చెప్పాడు - మత్త 1,21. ఎడారిలో మోషే కంచు సర్పాన్ని పైకెత్తి చూపించినట్లే మనుష్యకుమారుణ్ణిగూడ సిలువమీద కెత్తుతారు. అతనివైపు చూచి అతన్ని విశ్వసించేవాళ్ళకి రక్షణం లభిస్తుంది - యోహా 3, 14-15. యేసు అనే పేరులో ఆ ప్రభువు రక్షణమంతా యిమిడివుంది. కనుక ఆ దివ్యనామంపట్ల మనకు అపారమైన భక్తి వుండాలి.

2. ప్రభువు సొంతపేరు యేసయితే, అతని బిరుదం క్రీస్తు. క్రీస్తు అనేది గ్రీకుమాట. దీనికి తుల్యమైన హీబ్రూపదం "మషీహో". దీన్నే మనం తెలుగులో మెస్సీయా అంటాం. మషీహో అంటే అభిషేకం పొందినవాడని అర్థం. అనగా తండ్రి తన కుమారుడికి అభిషేకంచేసి అతన్ని తనసొంత పనిమీద పంపాడని భావం. హీబ్రూ సంప్రదాయం ప్రకారం అభిషేకం పొందడమంటే ఒక పనిలో నియుక్తుడు కావడం. కనుక తండ్రి క్రీస్తుని రక్షణకార్యంలో నియుక్తుణ్ణి చేసాడు అని చెప్పాలి. పూర్వవేదంలో రాజులు యాజకులు తప్పనిసరిగాను, ప్రవక్తలు అరుదుగాను అభిషేకం పొందేవాళ్ళు. ఇక, క్రీస్తుని అనుసరించేవాళ్ళు క్రైస్తవులు ("క్రీస్తువులు" అనకూడదు) – అ.చ.11,26. మనం క్రీస్తు పేరుమీదిగా పిల్వబడేవాళ్ళం. ఈ పేరునకు మనమెంతో గర్వించాలి.

3. మషీహో లేక క్రీస్తు లేక అభిషిక్తుడు అంటే తండ్రి వలన అభిషేకం పొందినవాడని చెప్పాం. క్రీస్తు అభిషేకాలు మూడున్నాయి. మొదటిది, అతడు మనుష్యావతారమెత్తిన సమయంలో యాజకుడుగా అభిషిక్తుడయ్యాడు. ఇక్కడ పవిత్రాత్మ క్రీస్తు మానుష దేహానికి అభిషేకం చేసి దాన్ని దైవవార్తతో జోడించింది. దీని ఫలితమే మనుష్యావతారం – హెబ్రే 17-18. రెండవది, జ్ఞానస్నాన సమయంలో పవిత్రాత్మ అతన్ని ప్రవక్తగా అభిషేకించింది – మత్త 3,16 అ.చ. 4,27. 10,38. మూడవది, ఉత్థాన సమయంలో తండ్రి అతన్ని రాజుగా అభిషేకించాడు – అ.చ. 2,36. హెబ్రే 1,9. నేడు క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడు మనమూ అతని మూడభిషేకాల్లోను పాలుపొందుతాం. అతనిలాగే మనమూ యాజకులమూ, ప్రవక్తలమూ, రాజులమూ ఔతాం. ఈ భాగ్యానికి మనం ఆ ప్రభువుకి నమస్కారం చెప్పాలి.

4. ప్రభువు తన బహిరంగ జీవిత ప్రారంభంలో "ప్రభువు ఆత్మ నా మీదికి దిగివచ్చింది. అతడు పేదలకు సువార్త బోధించడానికి నన్నభిషేకించాడు" అని చెప్పుకొన్నాడు – లూకా 4,18. ఇది పూర్వవేదంలో యెషయా ప్రవక్త తన్ను గూర్చి చెప్పుకొన్న వాక్యం – 61, 1-2. అక్కడ పవిత్రాత్మ ప్రవక్తను అభిషేకించినట్లే ఇక్కడ క్రీస్తునికూడ అభిషేకించింది. దీని ఫలితంగానే క్రీస్తు బహిరంగ బోధకు పూనుకొన్నాడు. నేడు క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన భక్తులకుగూడ బోధనా సామర్థ్యాన్ని ప్రసాదించేది ఆ యాత్మే. కనుక మనంకూడ ఆ యాత్మనుండే ఈ వరాన్ని అడుగుకోవాలి.

# 3. క్రీస్తు దివ్యరూపధారణం

క్రీస్తు జ్ఞానస్నానం ప్రధానంగా అతని సిలువ మరణాన్ని సూచిస్తుంది. అలాగే అతని దివ్యరూపధారణం ప్రధానంగా అతని ఉత్థాన తేజస్సుని సూచిస్తుంది. అతని ఉత్థాన తేజస్సు మనమీద సోకుతుంది. ఈ యధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. దివ్య రూపధారణ సంఘటన

మార్కు 9,2-8 మత్త 17,1-18 లూకా 9, 28 -38 క్రీస్తు దివ్యరూపధారణాన్ని వర్ణించే ఆలోకనాలు. ఈ సంఘటనంలో చాలా అంశాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. సందర్భం. క్రీస్తూ అతని శిష్యులూ ఫిలిప్పునకు చెందిన కైసరయ ప్రాంతంలో సంచరిస్తుండగా ప్రభువు నేనెవరినని మీ యభిప్రాయం అని ప్రశ్నించాడు. శిష్యులందరి తరపున పేత్రు నీవు సజీవుడైన దేవుని కుమారుడవగు క్రీస్తువవు అని సమాధానమిచ్చాడు. అనగా అతడు రానున్న మెస్సీయా అని శిష్యులు నమ్మారని భావం - మత్త 16,16. అటుతర్వాత ప్రభువు తాను యెరూషలేములో మరణించి మళ్ళా పునరుత్థానమౌతానని శిష్యులకు తెలియజెప్పాడు - మత్త 16,21. తదనంతరం ఆరునాళ్ళు అయ్యాక అతడు కొండమీద మారురూపం తాల్చాడు. కనుక దివ్యరూపధారణ సంఘటనం అతని మరణోత్థానాలకు సంబంధించిందని అర్థం చేసికోవాలి.

2. కొండ. క్రీస్తు మారురూపం తాల్చింది తాబోరు కొండమీద అని పూర్వులు అభిప్రాయపడ్డారు. కాదు, హెర్మోను కొండమీద అని ఆధునికులు చెప్తున్నారు. బహుశ హెర్మోను కొండ అనడమే సబబుగా వుంటుంది. కైసరయా మండలానికి చేరువలోవుంది హెర్మోను కాని తాబోరుకాదు. పైగా మార్కు 9,2 ఈ కొండ ఉన్నతమైనదని చెప్తుంది. తాబోరు చిన్నది, హెర్మోను ఎత్తయినది. క్రీస్తు నాడు తాబోరు కొండమీద ఓ ప్రాకారముండేది. కనుక సామాన్యులు దానిమీదికి వెళ్ళడానికి వీలుపడేదికాదు. ఈ కారణాలవల్ల క్రీస్తు ఎక్కింది హెర్మోను కొండే అనడం ఉచితం.

3. క్రీస్తు తేజస్సు. క్రీస్తు పర్వతంమీద దివ్యరూపం ధరించి తండ్రిని దర్శించాడు. ఈ వుదంతానికి తుల్యమైన సంఘటనలు రెండు పూర్వవేదంలో వున్నాయి. పూర్వం మోషే సీనాయి కొండమీది కెక్కిపోయి దేవుణ్ణి దర్శించాడు. అక్కడ దేవుని తేజస్సుతో వెలిగిపోయాడు - నిర్గ 24,15 -18. అలాగే యేలియా ప్రవక్తకూడ హోరేబు కొండమీద దేవుణ్ణి దర్శించాడు - 1 రాజు 19, 8-14. ఈ మహాభక్తుల్లాగే ఇక్కడ ప్రభువుకూడ దేవుణ్ణి సాక్షాత్కారం చేసికొన్నాడు.

కొండమీద క్రీస్తు ముఖం సూర్యుళ్ళా ప్రకాశించింది. అతని దుస్తులు వెలుగులా తెల్లనయ్యాయి - మత్త 17,2. ఆ బట్టలు యే చాకలీ చలువచేయలేనంత తెల్లగా వున్నాయి - మార్కు 9,2. ఇక్కడ క్రీస్తు దుస్తులూ ముఖమూ ప్రకాశించాయంటే అతని మూర్తి ప్రకాశించిందని భావం. ఈలాంటి ప్రకాశాన్ని క్రీస్తు పూర్వమెప్పుడూ ప్రదర్శింపలేదు. ఈ ప్రకాశం భవిష్యత్తులో రానున్న అతని ఉత్థాన తేజస్సుని సూచిస్తుంది. ఆ యంశం తర్వాత చూద్దాం.

4. మోషే, యేలీయా. కొండమీద మోషే యేలీయా క్రీస్తుతో మాటలాడు తున్నట్లుగా కన్పించారు. ఇక్కడ మోషే పూర్వవేదంలోని ధర్మశాస్త్రాన్ని సూచిస్తాడు. ఏలీయా ప్రవక్తల సంప్రదాయాన్ని సూచిస్తాడు. ధర్మశాస్త్రమూ ప్రవచనాలు పూర్వవేదంలోని రక్షణ సాధనాలు. అవి రెండూ రానున్న మెస్సీయాను గూర్చి చెప్తాయి. ఇక యిప్పుడు వీటిపని అయిపోయింది. అవి సూచించే మెస్సీయా రానే వచ్చాడు. అతడు త్వరలో రక్షణకార్యం నిర్వహిస్తాడు. కనుక ఇక్కడ మోషేయేలీయాలు క్రీస్తు రాకడనీ, అతని రక్షణోద్యమాన్నీ ప్రశంసిస్తున్నారని అర్థం చేసికోవాలి.

ఈ భక్తులిద్దరు కొండమీద క్రీస్తుతో ఏమి మాట్లాడారు? ప్రభువు యెరూషలేములో మరణింపవలసిన అంశాన్ని గూర్చి మాట్లాడారు - లూకా 9,31. ఎప్పుడూ ప్రభువు మరణోత్థానాలు రెండూ కలసే వుంటాయి. కనుక ఆ పూర్వవేద భక్తులు క్రీస్తు మరణోత్థానాలనుగూర్చి, వాటిద్వారా అతడు సాధించబోయే మానవ రక్షణాన్నిగూర్చి సంభాషించారు. పూర్వవేదంలోని ధర్మశాస్త్రమూ ప్రవచనాల ఉద్దేశంకూడ ఇదేనని ముందే చెప్పాం.

5. తండ్రి సాక్ష్యం. బహుశ అన్నిటికంటె ముఖ్యమైన అంశం కొండమీద తండ్రి క్రీస్తుకి సాక్ష్యం పల్కడం. అతడు "ఇతడు నా ప్రియకుమారుడు, నేనెన్నుకొనినవాడు. మీరు ఇతని పల్కులు ఆలకించండి" అని చెప్పాడు - లూకా 9,35. ఇది తండ్రి క్రీస్తు జ్ఞానస్నాన సమయంలో పల్కిన సాక్ష్యం లాంటిదే. క్రీస్తు మరణోత్థానాలతో గూడిన రక్షణ ప్రణాళికను సిద్ధంచేసింది తండ్రే. కనుక అతని ద్వారానే క్రీస్తు మరణోత్థానాలు నెరవేరతాయి. ఇప్పుడు కొండమీద క్రీస్తుకి తాత్కాలికమైన ప్రకాశాన్ని ప్రసాదించిందికూడ ఈ తండ్రే.

ఇక్కడ తండ్రి పల్కిన సాక్ష్యంలో మూడంశాలు గమనింపదగ్గవి. మొదటిది, తండ్రి క్రీస్తు తనకు "ప్రియకుమారుడు" అని చెప్పడం. "నీవు నా కుమారుడివి. ఈ దినం నీవు నాకు జనించావు" అంటుది కీర్తన 2,7. ఇది మెస్సీయాను గూర్చిన వాక్యం. తండ్రి పల్కిన పైమాట ఈ కీర్తన వాక్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఉత్థానంద్వారా క్రీస్తు మెస్సీయా ఔతాడు. రెండవది, క్రీస్తు తండ్రి "యెన్నుకొనినవాడు. ఇక్కడ "ఎన్నుకొనినవాడు" అనే

పదం పూర్వవేదంలోని బాధామయ సేవకుణ్ణి గుర్తుకి తెస్తుంది. పూర్వవేదంలో ఇతడు దేవుని సేవకుడు. దేవుడు ఇతన్ని ఎన్నుకొని బలాఢ్యుణ్ణి చేసాడు. ఇతడంటే దేవుడికి ఇష్టం - యెష 42,1. ఈ సేవకుళ్ళాగే క్రీస్తుకూడ ప్రజలకోసం ఆత్మార్పణం చేసికొంటాడు. మూడవది, మీరితని పల్కులు ఆలించండి అని తండ్రి శిష్యులతో చెప్పడం. పూర్వవేదంలో మోషే ఓ రానున్న ప్రవక్తనుగూర్చి చెప్పాడు. "ప్రభువు మీ ప్రజలనుండే నావంటి ప్రవక్తనొకనిని మీ చెంతకు పంపుతాడు. మీరు అతని మాటలు వినండి" అని ఆదేశించాడు - ద్వితీ 18,15. మోషే పేర్కొన్న ప్రవక్త ఈ క్రీస్తేనని తండ్రి ఉద్దేశం. శిష్యులు క్రీస్తు పల్కులు వినాలి. కాని క్రీస్తు పలుకులు ఏమిటివి? అతడు తండ్రినిగూర్చి బోధిస్తాడు. ఆ తండ్రి దయ ప్రేమ విశ్వసనీయత మొదలైన గుణాలను విశదీకరించి చెప్తాడు. కనుక క్రీస్తు తండ్రినిగూర్చి చెప్పే సంగతులను శిష్యులు భక్తిశ్రద్ధలతో ఆలించాలని భావం.

తండ్రి మేఘంలోనుండి పై సాక్ష్యమంతా పలికాడు. బైబుల్లో మేఘం దైవసాక్షాత్కారానికి చిహ్నం. కనుక ఇక్కడ క్రీస్తు శిష్యులూ మొదలైనవాళ్ళంతా దైవసన్నిధిలో వున్నారని భావం. క్రీస్తు ఓలివు కొండనుండి మోక్షారోహణం చేసేపుడు ఈ మేఘం మళ్ళా ప్రత్యక్షమౌతుంది - అ.చ 1,9.

6. శిష్యుల బుద్ధిమాంద్యం. ప్రభువు ముగ్గురు శిష్యులనే కొండమీదికి తీసికొనివెళ్ళాడు. కాని ఈ ముగ్గురూ శిష్యులందరికీ ప్రతినిధులుగా వుంటారు. ప్రభువు మారురూపం తాల్చి మోషేయేలీయాలతో మాట్లాడుతూంటే శిష్యులు నిద్రమత్తులో వున్నారు - లూకా 9,32. ఇది వాళ్ళ భక్తినిగాక, అజ్ఞానాన్ని సూచిస్తుంది. పేత్రు క్రీస్తుకి సిలువ మరణం లేకుండానే మహిమ కలగాలని ఆశించాడు - మత్త 16,22. కనుక శిష్యులకు క్రీస్తు మరణోత్థానాల భావం ఇంకా అర్థంకాలేదు. ఈ కొండమీది దివ్యరూపధారణం భావం కూడ వాళ్ళింకా గ్రహించలేదు. పేత్రు కొండమీద మూడు పర్ణశాలలు నిర్మిస్తానన్నపుడుగూడ తాను మాట్లాడేదేమిటో తానే అర్థంచేసికోలేదు - లూకా 9,33. అతడు ఆ సమయంలో క్రీస్తు సిలువను విస్మరించి అతని మహిమను మాత్రం దక్కించుకోవాలని చూస్తున్నాడు అనుకోవాలి.

## 2. దివ్యరూపధారణం భావం

ప్రభువు కొండమీద దివ్యరూపం తాల్చడంలో ఉద్దేశమేమిటి?

1. క్రీస్తు తేజస్సు అతని ఉత్థానానికి చిహ్నంగా వుంటుంది. పర్వతంమీద ప్రభువు మూర్తి తేజస్సుతో వెలిగిపోయిందని చెప్పాం. ఈ తేజస్సు అతని ఉత్థానతేజస్సుని సూచిస్తుంది. ఓ క్షణకాలం మాత్రం ప్రభువులో ఈ తేజస్సు కన్పించింది. ఉత్థానం

తర్వాత అతడు శాశ్వత తేజస్సును పొందుతాడు. ఈ హ్రస్వకాలిక తేజస్సు ఆ శాశ్వతకాలిక తేజస్సుకి సూచనం.

పూర్వం మోషే సీనాయి కొండమీదికి ఎక్కిపోయినపుడు ప్రభువు సాన్నిధ్య ప్రభావంవల్ల అతని ముఖం ప్రకాశించింది - నిర్గ 34,29. క్రీస్తు నూత్న మోషే. కనుక ఆ మోషే ముఖంలాగ ఇక్కడ క్రీస్తు ముఖంకూడ కొండమీద ప్రకాశించింది.

2. క్రీస్తు దివ్యరూపధారణం శిష్యులకు ప్రోత్సాహకరంగా వుంటుందికూడ. ఈ సంఘటనం ముగిసిన కొలదినాళ్ళకే క్రీస్తు సిలువ మరణం వస్తుంది. ఈ సిలువ మరణానికి శిష్యులు సంసిద్ధంగా లేరు. వాళ్ళు ఆ ఘోర సంఘటనను జూచి భయపడి ధైర్యాన్ని కోల్పోతారు. వాళ్ళ విశ్వాసం చలిస్తుంది. కాని ఆ విషమసమయంలో వాళ్ళు ప్రభువు దివ్యరూపధారణాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ధైర్యం చెందవచ్చు. సిలువ మరణం అతన్ని నాశం చేయలేదనీ, అతడు కొండమీద ప్రదర్శించిన దివ్యత్వం అతనికి మళ్ళా ఉత్థాన విజయాన్ని చేకూర్చి పెడుతుందనీ గ్రహించి ఊరట చెందవచ్చు. ఈ రీతిగా క్రీస్తు దివ్యరూపధారణం కల్వరిమీద నిరుత్సాహానికి గురయ్యే శిష్యులకు ప్రోత్సాహకారణమౌతుంది. ఇక, ఈ జీవితంలో నేడు మనం కష్టాలనుభవించేపుడూ, క్రీస్తుని శంకించేపుడూ అతని దివ్యరూపం మన విశ్వాసాన్నిగూడ బలపరుస్తుంది. నా ప్రకాశాన్నిచూచి మీరు నన్ను శంకించడం మానుకొండని క్రీస్తు నేడు మనలను హెచ్చరిస్తూంటాడు- మత్త 11,6.

## ప్రార్థనా భావాలు

1. కొండమీద క్రీస్తుతో మాటలాడిన మోషే యేలీయాలు ధర్మశాస్త్రాన్నీ ప్రవచనాలనీ సూచిస్తారని చెప్పాం. ఇవి రెండూ రానున్న క్రీస్తుకి సాక్ష్యం పలుకుతాయనిగూడ చెప్పాం. కనుకనే ఉత్థానక్రీస్తు ధర్మశాస్త్రమూ ప్రవచనాలూ తన్నుగూర్చి చెప్పిన సంగతులన్నిటిని ఎమ్మావు త్రోవలో శిష్యులకు వివరించాడు - లూకా 24,44-46. క్రీస్తు మొదట శ్రమలనుభవించి ఆ పిమ్మట మహిమలో ప్రవేశిస్తాడనే ఈ సంగతులన్నిటి భావం-లూకా 24,26. నేడు మనం క్రీస్తు లోనికి జ్ఞానస్నానం పొందినపుడే అతని శ్రమలూ మహిమా కూడ మనమీద సోకుతాయి. ఈ లోకంలో మనమూ అతనితోపాటు వేదనలు అనుభవిస్తాం. అటుపిమ్మట అతని తేజస్సులో పాలుపొందుతాం. ఈ భావం పౌలుకి చాల ప్రీతికరమైంది. అతడు "క్రీస్తు పునరుత్థాన ప్రభావాన్ని అనుభవించాలనీ, అతని శ్రమల్లో పాల్గొనాలనీ నా కోరిక" అని వాకొన్నాడు - ఫిలి 3,10-11.

2. సీనాయి కొండమీద యావే ప్రభువు తేజస్సు సోకి మోషే ముఖం ప్రకాశించింది – నిర్గ 34,29. కొండమీద క్షణకాలం క్రీస్తు ముఖం ప్రకాశించింది – మత్త17,2. కాని ఉత్థానం తర్వాత అతడు ఆత్మను పొంది శాశ్వతంగా ప్రకాశిస్తాడు. ఈ ఉత్థాన క్రీస్తులోనికే మనం జ్ఞానస్నానం పొందేది. కనుక అతని మహిమ మనలోగూడ ప్రతిబింబిస్తుంది. అది మన ముఖంలోగాక, చేతల్లో ప్రతిఫలిస్తుంది. ఈ మహిమ మనలో రోజురోజుకీ వృద్ధి చెందుతూంటుంది. మనలను క్రీస్తులోనికి మార్చివేస్తూంటుంది – 2 కొ 3,18. మనకు ఈ మహిమ సోకడం ఈ లోకంలోనే ప్రారంభమౌతుంది. కాని అది మోక్షంలోగాని ముగియదు. క్రీస్తు కొండమీద పొందిన మహిమ అతని దేహమైన తిరుసభకు కూడ సంక్రమిస్తుంది. అనగా మనమందరమూ అతని తేజస్సులో పాలు పొందుతాం. ఈ భాగ్యానికి మనం ప్రభువుకి వందనాలు అర్పించాలి.

3. కొండమీద క్రీస్తు తాల్చిన మారురూపం మనకు ఓ ప్రత్యేకమైన భక్తిభావాన్ని గూడ పుట్టిస్తుంది. కొండ ఎత్తుగా వుండి దేవలోకాన్ని తాకుతూవుందో అన్నట్లుగా వుంటుంది. దానిమీద దేవుడుంటాడు అనే భావం కలిగిస్తుంది. దానిమీది కెక్కిపోతే దైవ సాక్షాత్కారం కలుగుతుంది అనే నమ్మకం కలుగుతుంది. ఈ వుద్దేశంతోనే అనాది కాలంనుండీ అన్ని మతాలవాళ్లూ కొండలమీద గుళ్లు కడుతూ వచ్చారు. మన ఆంధ్ర రాష్ట్రంలో గుణదల్లో, ఫిరంగిపురంలో, విశాఖపట్టణంలో క్రైస్తవులు దేవుణ్ణి పూజించుకొనే కొండలున్నాయి. ఇవి మన పుణ్యక్షేత్రాలు. కనుక మన క్రైస్తవులు అవకాశం దొరికినపుడెల్లా ఈ పుణ్యస్థలాలను దర్శించాలి. ఈ కొండలమీది కెక్కి ప్రార్థన చేసికొని భగవంతుణ్ణి అనుభవానికి తెచ్చుకొంటూండాలి.

# 4. క్రీస్తు శోధనలు

క్రీస్తు శోధనలు అనుభవించి పిశాచంమీద విజయం పొందాడు. నేడు మనం శోధనలకు గురైనపుడు అతని విజయం మనమీద సోకుతుంది. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. ప్రారంభ విషయాలు

1. శోధనలకు ఆధారం : మత్తయి 4,1-11 క్రీస్తు శోధనలను వర్ణిస్తుంది. క్రీస్తు శోధనలను ఎవరూ కంటితో చూడలేదు. మరి ఆ వివరాలు సువిశేషకారులకు ఏలా తెలిసాయి? క్రీస్తే ఆ సంగతి శిష్యులతో చెప్పి వుండాలి. తొలినాటి అపోస్తలుల

వేదబోధలో ఈ విషయంకూడ ఓ అంశమై వుండాలి. ఈ శోధనలను పఠించేపుడు మనకు క్రీస్తు దైవత్వాన్ని గూర్చి శంక కలుగుతుంది. ఐనా సువిశేషకారులు వీటిని సువార్తల్లో చేర్చారు అంటే ఈ ఘట్టం కల్పితం ఎంతమాత్రమూ కాదని అర్థంచేసికోవాలి.

2. పిశాచం : పిశాచాన్ని ఎదుర్కొనేందుకై పరిశుద్ధాత్మ క్రీస్తుని ఎడారికి తోడ్కొనిపోయింది. జ్ఞానస్నాన సమయంనుండి ప్రతి ముఖ్యవిషయంలోను ఆత్మే క్రీస్తుని నడిపిస్తూ వచ్చింది. మెస్సీయా బహిరంగజీవితం జ్ఞాన స్నానంతో ప్రారంభమౌతుంది. కాని మెస్సీయా సాధింపవలసిన ప్రధానకార్యం మనలను పిశాచదాస్యంనుండి విడిపించడం. కనుక అతడు తాను నిర్వహించబోయే రక్షణోద్యమం ప్రారంభంలో పిశాచాన్ని ఎదుర్కోగోరాడు. అతడే స్వయంగా వెళ్ళిపిశాచాన్ని కలుసుకొన్నాడు, అదీ మనకోసం. ఈ సందర్భములో జెరోము "క్రీస్తు స్వయంగానే పిశాచంతో పోరాడ్డానికి వెళ్ళాడు" అని నుడివాడు. ఇక, పిశాచానికి యేసే మెస్సీయా కావచ్చునేమో అనే అనుమానం మాత్రం వుంది. కనుక అతన్ని పరీక్షించి చూడాలి అన్న తలంపుతో వచ్చింది దయ్యం.

3. ఎడారి : యిస్రాయేలు సంప్రదాయం ప్రకారం ఎడారి దేవుణ్ణి కలుసుకొనే తావు, శోధనలకు గురయ్యే తావుకూడ.

క్రీస్తుకి ముందు యిస్రాయేలు ప్రజలు నలుబది యేండ్లపాటు ఎడారిలో ప్రయాణం చేసారు. ఈ కాలంలోనే మోషే నలువది రోజులపాటు ప్రార్థనలతో ఉపవాసాలతో సీనాయికొండమీద ఏకాంతంగా గడిపాడు. యేలీయా ప్రవక్తకూడ నలువదిరోజులు ఎడారిగుండ నడిచిపోయి హోరెబు కొండ చేరుకొని అక్కడ దైవసాక్షాత్కారం పొందాడు. వీళ్ళలాగే యేసుకూడ ఎడారిలో భగవత్ సాక్షాత్కారం కలిగించుకోబోతున్నాడు. ఇక, యెదారి శోధనలకు నిలయంకూడ. దేవుని మొదటి కుమారుడు యిస్రాయేలు. పిశాచం ఆ యిస్రాయేలీయులను ఎడారిలో శోధించింది. వాళ్ళు లొంగిపోయారుకూడ. క్రీస్తు దేవుని ఏకైక కుమారుడు. మళ్లా ఈ కుమారుణ్ణిగూడ దయ్యం ప్రలోభపెట్టింది. కాని ఆ మొదటి కుమారుడు పడిపోయినకాడే ఈ ఏకైక కుమారుడు గెలుపొందాడు. తన పూర్వుల పాపాలకు పరిహారంగూడ చేసాడు. ఇది విశేషం.

4. క్రీస్తుకి శోధనలు దేనికి? పాపం ఏమాత్రం సోకని పావనమూర్తి క్రీస్తు. మరి అతడు శోధనలకు గురికావడం దేనికి? యేసు శోధనలు అనుభవించింది తనకోసం కాదు, పాపులమైన మనకోసం. అతడు నూత్న నరజాతికి శిరస్సు, నాయకుడు. ఈ పాపపు నరజాతి తర్వాత శోధనలకు గురౌతుంది. కనుక తాను ఈ నరుల తరపున ముందుగనే శోధనలు ఆహ్వానించాడు. వాటిమీద విజయం సాధించాడు గూడ. అప్పటినుండి మన నాయకుని విజయం మనదౌతుంది. మనం శోధనలను ఎదుర్కొనేపుడు క్రీస్తు విజయం మనమీద సోకి మనకు గెలుపును దయచేస్తుంది.

5. క్రీస్తు శోధనలు ఎలా జరిగాయి? పిశాచం క్రీస్తుని దేవాలయ గోపురంమీదికి, రాజ్యాలన్నిటినీ చూపగలిగే ఎత్తయిన కొండమీదికి తీసికొని వెళ్ళిందని చెప్తుంది సువిశేషం. అలా దయ్యం అతన్ని యథార్థంగా దేవాలయం మీదికీ కొండమీదికి తీసికొని వెళ్ళిందోలేదో మనకు తెలియదు. లోకంలోని రాజ్యాలన్నింటినీ చూపగలిగేంత ఎత్తయిన కొండ ఏదీ ప్రపంచంలో లేదుకూడ. భూతం ఎడారిలోనే క్రీస్తు మనోనేత్రాలకు దేవాలయ గోపురాన్నీ కొండనీ ప్రదర్శించి వుండవచ్చు. అతడు ఎడారిదాటి బయటికి వెళ్ళివుండకపోవచ్చు. అసలు ఈ శోధనలు ఏలా జరిగాయో మనకు తెలియదు. ఐనా అవి మాత్రం యథార్థంగా జరిగాయి. భక్తులు క్రీస్తు దైవత్వాన్ని శంకించే అపాయమున్నా సువిశేషకారులు ఈ సంఘటనాన్ని సువార్తల్లో లిఖించారని ముందే చెప్పాం.

## 2. మూడు శోధనలు

1. భోజన ప్రీతి : పిశాచం క్రీస్తుని ముమ్మారు శోధించింది. వాటిల్లో మొదటిది భోజన ప్రీతి. ప్రభువు నలువదిరోజులు ఉపవాసముండి ఆకలిగొని వున్నాడు. అప్పుడు పిశాచం కొండమీది రాళ్ళను రొట్టెలుగా మార్చి ఆకలి తీర్చుకోవచ్చు అనే తలంపు పుట్టించింది. కొండమీది చిన్న గుండ్రాళ్ళు రొట్టెల్లాగే వుంటాయి. ఆకలైనవాడికి అన్ని వస్తువులూ ఆహారాన్నే తలపింపజేస్తుంటాయి గూడ. ఈ మనస్తత్వాన్ని ఆధారంగా తీసుకొని ఆ రాళ్ళను రొట్టెలుగా మార్చమంది దయ్యం.

ఈలాంటి శోధననే మొదట ఎడారిలో ప్రయాణం చేసే యిస్రాయేలీయులకు గూడ తెచ్చిపెట్టింది దయ్యం. ప్రభువు ఫరో చక్రవర్తిని ముప్పుతిప్పలు పెట్టి యిస్రాయేలీయులను ఐగుప్తునుండి తోడ్కొని వచ్చాడు. వాళ్ళను రెల్లు సముద్రం దాటించాడు. రేయి నిప్పుకంబంలాగ, పగలు మబ్బుకంబంలాగ తాను వాళ్ళతో ప్రయాణం చేసాడు. ఐనా వాళ్ళకు యావేమీద నమ్మకం కుదరలేదు. సీను ఎడారిలో పయనిస్తూన్నపుడు వాళ్ళు మోషేమీద తిరుగబడ్డారు. మేము ఐగుప్తులో వున్నపుడు మాంసమూ రొట్టెలూ మస్తుగా భుజించాం. ఈ ఎడారిలో ఐతే ఆకలితో చస్తున్నాం. నీవు మమ్మల్ని ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చావు?" అని గొణిగారు - నిర్గ 16,2-3. ఇది పిశాచం కలిగించిన శోధనం. దీనికి యిస్రాయేలీయులు లొంగిపోయారు. ఐనా ప్రభువు కరుణబూని అక్కడ యిస్రాయేలీయులకు అద్భుతంగా మన్నా కురిపించాడు. పూరేడు పిట్టలు గుంపులు గుంపులుగా దిగివచ్చేలా చేసాడు. వీటినన్నింటినీ భుజించి ఆ ప్రజలు అప్పటికి సంతృప్తి చెందారు.

ఈలాంటి శోధన్నే మళ్ళా క్రీస్తుకుకూడా తెచ్చిపెట్టింది పిశాచం. అతడు రాళ్ళను రొట్టెలుగా మారిస్తే బాగుంటుందని సూచించింది. కాని క్రీస్తు అలా ఎందుకు మార్చకూడదు? అలా చేయడం తండ్రి నిర్ణయించిన ప్రణాళికకు వ్యతిరేకంగా పోవడమవుతుంది. ఇక్కడ క్రీస్తు ఉపవాసం చేయాలని తండ్రి నిర్ణయం. క్రీస్తు ఈ నిర్ణయాన్ని మీరేలాచేసి అతడు తండ్రి చిత్తానికి వ్యతిరేకంగా పోయేలా చేయాలని సైతాను ఉద్దేశం. పిశాచం శోధనం క్రీస్తుకి అర్థమయింది. కనుకనే అతడు "నరుడు రొట్టెచేతమాత్రమేగాదు, దేవుని నోటినుండి వెలువడే ప్రతిమాటవలనా జీవిస్తాడు సుమా!" అనే పూర్వవేద వాక్యాన్ని ఉదాహరించాడు - ద్వితీ 8,3. ఈ వేదవాక్యంలో "మాట" అంటే దైవచిత్తం. అనగా భక్తుడు ప్రధానంగా దైవచిత్త ప్రకారం, దైవప్రణాళిక ప్రకారం జీవించాలి. మనకు కూడా గుడ్డా మొదలైనవన్నీ చేకూర్చి పెట్టేది ఆ దైవచిత్తమే. ఆ దైవచిత్తం వలననేగదా వానలు కురిసి పంటలు పండి నరులకు ఆహారం సిద్ధించేది - జ్ఞాన 16,26. కనుక భోజనానికంటెగూడ ముందు దైవచిత్తం పాటింపదగ్గది. భక్తుడు మొదట భగవంతుణ్ణి నమ్ముకొని జీవించాలి. అతని ఆజ్ఞలను పాటించాలి. అప్పుడు కూడు గుడ్డ మొదలైన అవసరాలన్ని ఆ ప్రభువే తీరుస్తాడు. క్రీస్తు ఈలా జవాబుచెప్పేప్పటికి పిశాచానికి నోట మాట రాలేదు.

2. దేవుణ్ణి పరీక్షకు గురిచేయడం : పిశాచం రెండవశోధనం ప్రారంభించింది. క్రీస్తుని యెరూషలేములోని దేవాలయం గోపురంమీదికి తీసుకొని వెళ్ళింది. అక్కడినుండి క్రిందికి దూకమంది. క్రీస్తే గనుక దేవుని కుమారుడైతే ఆ దేవుడు దూతలనుబంపి ఏ అపాయమూ కలుగకుండా వాళ్ళు అతన్ని తమ చేతుల్లో ఎత్తిపట్టుకొనేలా చేస్తాళ్ళే అని చెప్పింది. అనగా దేవుడు తన్ను కాపాడ్డానికి వస్తాడో లేదో తెలిసికొమ్మంది. దేవుణ్ణి పరీక్షకు గురిచేయమంది.

ఈలాంటి శోధన్నే పిశాచం పూర్వం ఎడారిలో పయనించే యిస్రాయేలీయులకు గూడ కలిగించింది. సీను ఎడారిలో మస్సామెరీబా అనే తావులో వుండగా వాళ్ళకు దప్పిక వేసింది. వెంటనే ఆ ప్రజలు పిశాచ శోధితులై మోషేమీద తిరుగబడ్డారు. "నీవు మమ్ము దప్పికతో చంపివేయడానికే ఈ ఎడారికి తోడ్కొని వచ్చావు. దేవుడే కనుక మనతో వుంటే ఈ యగచాట్లన్నీ యెందుకు వస్తాయి? అసలు అతడు మనతో వున్నాడు అనడానికి రుజువేమిటి?" అని వాదించారు - నిర్గ 17,3-7. ఈ విధంగా వాళ్ళు పిశాచ శోధనకు లొంగిపోయారు. ఐనా ప్రభువు వాళ్ళను కరుణించి రాతి చట్టునుండి అద్భుతంగా నీళ్ళు వెలువరించాడు. తాను వాళ్ళతో వున్నానని రుజువుచేసికొన్నాడు. అప్పుడు ప్రజలు ఆ

నీళ్ళు త్రాగి సంతృప్తి చెందారు. ఈ సందర్భంలోనే మోషే "ప్రభువుని పరీక్షకు గురిచేయకూడదు" అనే నియమం చేసాడు – ద్వితీ 6,16.

ఈలాంటి శోధన్నే పిశాచం క్రీస్తుకిగూడ తెచ్చి పెట్టింది. మెస్సీయా ఆకాశంనుండి అద్భుతంగా ఊడిపడతాడు అనే భావం ఆ రోజుల్లో యూదుల్లో ప్రచారంలో వుండేది. కనుక క్రీస్తు యిప్పుడు దేవాలయ గోపురంమీది నుండి క్రిందికి దూకితేచాలు యెరూషలేములో యూదులంతా అతన్ని మెస్సీయాగా అంగీకరిస్తారు. అలా దూకినప్పుడు తనకు ఏ అపాయమూ కలుగకుండా తండ్రి కాపాడవచ్చు కదా! అలా కాపడ్డానికి తాను దేవదూతను పంపుతాడో లేదో పరీక్షచేసి చూడమంది పిశాచం. దీనితో దేవుడు తనకు తోడుగా వుందీ లేందీ తేలిపోతుంది అని చెప్పింది. కాని క్రీస్తుకి పిశాచం మనసు అర్థమయింది. దేవుణ్ణి పరీక్షించి చూడ్డానికై మనకిష్టమొచ్చిన పిచ్చి పనులన్నీ చేయవచ్చా? పైగా క్రీస్తు ఏమి చేయాలో ఏమి చేయకూడదో తండ్రి ముందుగానే నిర్ణయించాడు. తాను ఆ తండ్రియందు అపనమ్మిక చెందనక్కరలేదు. అతన్ని మెస్సీయాగా ప్రజలు అంగీకరించే రోజులు వాటంతట అవే వస్తాయి. కనుక అతడు ప్రభువుని పరీక్షకు గురిచేయకూడదు అన్న పై వేదవాక్యంతో దయ్యం నోరు మూయించాడు.

3. విగ్రహారాధనం : సైతాను మూడవ శోధనం ప్రారంభించింది. క్రీస్తుని ఎత్తయిన కొండమీదికి తీసికొని వెళ్ళి లోకంలోని రాజ్యాలనూ వాటి వైభవాలనూ చూపించింది. నీవు చాగిలపడి నాకు మ్రొక్కావంటే అ రాజ్యాలన్నీ నీకిచ్చి వేస్తాను అంది. ఈలాంటి శోధన్నే పూర్వం ఎడారిలో పయనించే యిస్రాయేలీయులకు కూడ కలిగించింది దయ్యం. ప్రభువు అప్పుడే సీనాయికొండ దగ్గిర యిస్రాయేలీయులతో ఒడంబడిక చేసికొని ముగించుకొన్నాడు. దేవునిచే పది యాజ్ఞలు వ్రాయించుకొని రావడానికై మోషే కొండమీదికి వెళ్ళి అక్కడ కొంచెం ఆలస్యం చేసాడు. వెంటనే యిస్రాయేలీయులు అహరోనుతో "ఆ మోషే వున్నాడే అతనికి కొండమీద ఏమి కీడుమూడిందో మాకు తెలియదు. అతడిక దిగిరాడు. నీవు మాకు బంగారు కోడెదూడను చేసిపెట్టు. మేము దానిని ఆరాధించుకొంటాం" అన్నారు. అలాగే అహరోను దూడను చేయగా వాళ్ళు "మనలను ఐగుప్తునుండి కొనివచ్చింది ఈ దేవుడే" నని పలుకుతూ దాన్ని ఆరాధించారు – నిర్గ 32, 1-6. ఆ రోజుల్లో యిస్రాయేలీయులకు సోదరజాతియైన కనానీయులు బాలును కొల్చేవారు. ఆ బాలుకు చిహ్నం ఎద్దు. కనుక ఎద్దును కూడ ఆరాధించేవాళ్ళు. వాళ్ళను చూచి యిస్రాయేలీయులు కూడ ఇక్కడ వృషభపూజకు పాల్పడ్డారు. ఈ విగ్రహారాధనంవల్ల బాలుదేవుడు తమకు

అద్భుత శక్తులు ప్రసాదిస్తాడని నమ్మారు. యావేశక్తిమీద అపనమ్మకం గూడ చెందారు. ఇది పిశాచం వాళ్ళను శోధించిన తీరు.

ఈలాంటి శోధన్నే దయ్యం క్రీస్తుకికూడ కలిగించింది. తన్ను ఆరాధిస్తే అతనికి అధికారం కైవసమౌతుందని సూచించింది. మెస్సీయా రాజై దేశాలు ఏలుతాడనే భావం ఆనాడు యూదుల్లో ప్రచారంలో వుండేది. ఇకనేం, క్రీస్తు విగ్రహారాధనకు లొంగి తనకు మ్రొక్కుతాడుగదా అనుకొంది భూతం. కాని క్రీస్తుకి దయ్యం పన్నాగం అర్థమయింది. అతడు దైవభక్తుడు. దేవుణ్ణి మాత్రమే సేవించేవాడు. పైగా పిశాచం ఒట్టినే డప్పాలు కొట్టిందేగాని ఈ లోకంలోని రాజ్యాలను ధారదత్తంచేసే అధికారం దానికి లేదు. కనుక క్రీస్తు "నీ దేవుడైన ప్రభువుకి మ్రొక్కి అతన్ని మాత్రమే సేవించాలి" అనే వేదవాక్యాన్ని ఉదాహరించి ఆ దుష్టశక్తిని పారద్రోలాడు - ద్వితీ 6,13. కాని పిశాచం తాత్కాలికంగా మాత్రమే ప్రభువుని వదిలిపెట్టి వెళ్ళిపోయింది. అది మళ్ళా క్రీస్తుని శోధించదానికి వస్తుంది - లూకా 4,13.

## 3. శోధనల స్వభావం

మీద క్రీస్తు శోధనలు పరిశీలించాం. కాని వాటి భావం ఏమిటి?

1. అసలు క్రీస్తు శోధనలు ఎన్ని? ఇక్కడ సువిశేషం మూడు శోధనలు పేర్కొంది. కాని అతని శోధనలు ఇంకా చాలా వున్నాయి. ఎడారిలో నలువదినాళ్ళు మాత్రమే కాదు. అతని బహిరంగ జీవితంలో కూడ శోధనలు వస్తూనే వుండేవి. ఇన్ని శోధనలు వచ్చినా అతని శోధనేమో ఒక్కటే. ఆ వొక్క శోధనే రకరకాల రూపాల్లో మళ్ళామళ్ళా వస్తుండేది. ఏమిటది? అతడు సిలువ మార్గాన్ని విడనాడి పితచిత్తాన్ని మీరాలి అని. క్రీస్తు పిత చిత్తానికి వ్యతిరేకంగా పోయినట్లయితే మనలను రక్షించి వుండలేదు. కనుక పిశాచం అతన్ని తండ్రికి వ్యతిరేకంగా పొమ్మని మాటిమాటికి శోధిస్తుండేది. కాని క్రీస్తుకి పిశాచ హృదయం అర్థమయింది. అతడు తండ్రి యాజ్ఞ మీరేవాడుకాదు. కదన పిశాచం నేరుగా క్రీస్తుని శోధించలేక పేత్రుద్వారా అతన్ని శోధించడం మొదలుపెట్టింది. ఓమారు ప్రభువు తాను యెరూషలేములో సిలువమీద మరణిస్తానని పల్కాడు. పేత్రు "ప్రభూ నీకు సిలువమరణం ప్రాప్తించకుండుగాక" అని అతన్ని వారించబోయాడు. వెంటనే క్రీస్తు "సైతానూ! నీవు నన్ను శోధించకు, ప్రక్కకు తొలగు" అన్నాడు - మత్త 16,21-23. దీని భావం ఏమిటి? సైతాను పేత్రు ముఖాన సిలువ మరణం మానుకొమ్మని క్రీస్తుని శోధిస్తూంది. అందుకే ప్రభువు ఇక్కడ పేత్రుని "సైతాను" అని సంబోధించాడు. ఇలా

దయ్యం క్రీస్తు సిలువమీద చనిపోయిందాకా అతన్ని శోధిస్తూనే వుంది. ఐనా ప్రభువు పిశాచ ప్రలోభానికి లొంగనూలేదు, తండ్రి నియమించిన ప్రణాళికకు వ్యతిరేకంగా పోనూలేదు.

2. మామూలుగా శోధనలో మూడు మెట్లుంటాయి. మొదట మనకు ఓ పాపకార్యం చేయాలనే తలంపు వస్తుంది. అటుపిమ్మట ఆ పాపకార్యాన్ని తలంచుకొని ఆనందిస్తాం. కడపట మనం ఆ పాపకార్యాన్ని చేయడానికి సమ్మతిస్తాం. ఈలా తలంపు, ఆనందం, సమ్మతి అనేవి మూడుమెట్లు. వీటిల్లో మొదటి రెండుమెట్లు పాపం కాదు. మూడవమెట్టు మాత్రమే పాపం. పైన క్రీస్తుకి వచ్చిన మూడు శోధనల్లోను అతడు మొదటిమెట్టు దాటిపోలేదు. కాని మన దౌర్భాగ్యమేమిటంటే, ఈలాంటి శోధనలు వచ్చినపుడు మనం చివాలున మూడవమెట్టు చేరుతాం. శోధనలు వచ్చినపుడు క్రీస్తు పాపంలో పడలేదు. అదే శోధనలు వచ్చినపుడు మనం తరచుగా పాపంలో పడిపోతూంటాం.

3. శోధనల్లో మన స్వాతంత్ర్యం నశించిపోతుందా? నశిపందు. మన హృదయం మూసివేసిన కోట తలుపు లాంటిది. పిశాచమనే శత్రువువచ్చి మన హృదయమనే తలుపుమీద దబాదబా బాదగలదేగాని దాన్ని బ్రద్దలుచేసి లోపలికి ప్రవేశించలేదు. మనంతట మనమే బుద్ధిపూర్వకంగా ఈ హృదయ కవాటం తెరిస్తేనే తప్ప, అది యెంత ప్రయత్నం చేసినా మన హృదయంలో ప్రవేశించలేదు. ఇంకా పిశాచం కట్టివేసిన కుక్కలాంటిది. మనంతట మనం చపలచిత్తంతో దాని దాపుకు వెళ్తేనేతప్ప అది మనలను కరవలేదు. ఈ వుపమానాల భావం ఏమిటంటే, శోధనల్లో మన స్వాతంత్ర్యం ఎంతమాత్రమూ దెబ్బతినదు. మనం పూర్ణబలంతో పిశాచంతో పోరాడనూవచ్చు, విజయం సాధించనూవచ్చు. అది యేనాడూ మనలను నిర్బంధం చేయలేదు. కనుక మనం శోధనకు లొంగినపుడు బాధ్యత పూర్తిగా మనదే.

4. క్రీస్తు పరమ పవిత్రుడు. అతనికి శోధనలు సోకవు. కనుక ఇక్కడ అతడు వ్యక్తిగతంగా గాక మన శిరస్సుగా, మన నాయకుడుగా, మన తరపున శోధనలకు గురయ్యాడు. మన శిరస్సునందు మనమందరమూ శోధనలు పొందుతాం. ఐనా అతని అవయవాలంగనుక అతనియందు మనమందరమూ శోధనలు జయించి విజయం సాధిస్తాం. కనుకనే భక్తుడు అగస్తీను "క్రీస్తు మన మానవ స్వభావాన్ని చేకొన్నాడు కనుక మన మానవజాతి శోధనలకు తానూ గురికావలసి వచ్చింది. కానీ మనం అతనితో ఐక్యమౌతున్నాం గనుక పిశాచంమీద అతడు సాధించిన విజయం మనకు సంక్రమిస్తుంది" అని వ్రాసాడు. శోధనలు వచ్చినపుడు ఈ భావం మనకు ధైర్యమూ ఓదార్పూ కలిగించాలి. ఓ బలహీనపు తీగ ఓ

బ్రహ్మాండమైన చెట్టుమీదికి అల్లుకుంది. తానూ ఆ చెట్టుబలంలో పాలుపంచుకొంది. కనుక గాలివాన వచ్చినా అది పడిపోలేదు. గొడ్డూగోదా మేయడానికి వచ్చినా అది వాటికి అందలేదు. ఈలాగే మనంతట మనం బలహీనులం. ఐనా మనం బలాఢ్యుడైన క్రీస్తుమీదికి అల్లుకొనిపోతాం. శోధనలు వచ్చినపుడు అతని బలం మనలను రక్షిస్తుంది. ఆ ప్రభువు బలవంతుడైన పిశాచాన్ని జయించిన మహా బలశాలి - మత్త 12,29. ఆ బలాఢ్యునిముందు పిశాచబలం ఎందుకూ పనికిరాదు. కనుక శోధనలు వచ్చినపుడు మనం ఆ బలాఢ్యునినుండి బలం అడుగుకోవాలి. ఇంకా పరలోక జపంలో రోజూ "మమ్ము శోధనల్లోకి ప్రవేశింపనీకండి" అని ప్రార్థిస్తాం. ఈ వాక్యం భావం అసలు మనకు శోధనలే రాకూడదని కాదు. శోధనలు వచ్చినపుడు వాటికి లొంగకుండా వుండడానికి చాలినంత బలం దేవుడు మనకు దయచేయాలని మాత్రమే దీని భావం.

5. నరులకు శోధనలేమో తప్పవు. ఈలోకంలో నరుని జీవితం ఓ యుద్ధరంగంలాంటిది అని చెప్తుంది యోబు గ్రంథం - 7,1. కనుక నరుడు ఇక్కడ నిత్యం పోరాడుతూండవలసిందే. పైగా భగవంతుడు నరుణ్ణి పరీక్షిస్తుంటాడు. ఏలాగ? శోధనల ద్వారా. "నీవు దేవుడికి ఇష్టుడివి కనుక అతడు శోధనలద్వారా నిన్ను పరీక్షింపవలసి వచ్చింది" అని చెప్తుంది తోబీతు గ్రంథం - 12,13. కనుక శోధనలు అవసరం. యుద్ధంలో పోరాడని సైనికునికి కిరీటం ఎలా లభిస్తుంది? శోధనలు అనుభవించనివాడు మోక్షభాగ్యానికి ఏలా పాత్రుడౌతాడు? అందుకే దేవుడు మనకు శోధనలు పంపుతూంటాడు. ఆ ప్రభువు అబ్రాహాము అంతటివాణ్ణి పరీక్షింపగోరాడు. అతడు ఈసాకును తనకు బలిగా సమర్పించాలని కోరాడు - ఆది 22,1. ఇక మనం ఏపాటివాళ్ళం? శోధనలద్వారా మన ఆధ్యాత్మిక జీవనం ఇంకా బలపడుతుంది. కొండమీది చెట్టుకు పెనుగాలులు సోకుతాయి. దాన్ని అటూఇటూ వూపుతాయి. కాని ఆ గాలులవల్ల ఆ చెట్టు వేళ్ళు ఇంకా లోతుగా చొచ్చుకొని పోతాయి.

ప్రభువు మనకు శోధనలు పంపిస్తాడని చెప్పాం. కాని ఈ శోధనల్లో అతడు మనలను ఒంటరిగా వదలివేయడు. తాను మనకు తోడ్పడుతూంటాడు. హెబ్రేయుల జాబు రెండు తావుల్లో శోధనలు వచ్చినపుడు క్రీస్తుని ఆశ్రయించమని చెప్తుంది. ఆ ప్రభువు తానుకూడ శోధనలకు గురైనవాడు. కనుక శోధనలు తెచ్చిపెట్టే బాధలు అతనికి బాగా తెలుసు. అందువల్ల ఇప్పుడు అతడు శోధింపబడేవాళ్ళకు సహాయం చేయడానికి సిద్ధంగా వుంటాడు - 2,18.

ఆ ప్రభువుకి మన బలహీనతలు బాగా తెలుసు. అతడు దేవదూతల కుటుంబంలోగాక, అచ్చంగా మన మానవుల కుటుంబంలో పుట్టినవాడు. మనకు పెద్దన్న.

ఆదాము సంతతియైన నరులు మట్టిమానుసులనీ దుర్బల ప్రాణులనీ అతనికి అర్థమౌతుంది. కనుక అతడు మన బలహీనతలను అర్థంచేసికొని మనయెడల సానుభూతి చూపగలవాడు పైగా ఆ ప్రభువు కృపాసింహాసనం లాంటివాడు. అనగా దేవుని కృపా కరుణా ఈ క్రీస్తే. కనుక అతడు శోధనలు వచ్చినపుడు మనకు సమయోచితమైన సహాయం చేయగలడు. మన తరపున మనం మాత్రం అతన్ని శరణువేడాలి. నమ్మికతో ధైర్యంతో అతని సహాయం అడుగుకోవాలి -4, 14-16. ఈలా క్రీస్తుని ఆశ్రయించడం తప్ప శోధనలను జయించే మార్గం మరొకటి లేదు.

## ప్రార్థనా భావాలు

1. శోధనల్లో మన స్వాతంత్ర్యం నశించదని చెప్పాం. మనం ఏ శోధనకూ లొంగిపోవలసిన అవసరం లేదు. మనం కోరుకొంటే చాలు ఏలాంటి ప్రలోభాన్నయినా జయించవచ్చు. "దేవుడు మీ శక్తికి మించి మిమ్మ శోధింపబడనీయడు. అంతేకాక, శోధన వచ్చినపుడు దాన్ని భరించగలిగే శక్తిని మీకు దయచేస్తాడు" - 1 కొ 10,13. ఈ వాక్యాలనుబట్టి మనం శోధనల్లో వున్నపుడు ప్రభువు సహాయం మనలను ఆదుకొనటానికి సిద్ధంగా వుంటుందని అర్థంచేసికోవాలి. ఈ సహాయంకోసం మనం వినయంతో మనవిచేసికోవాలికూడ.

2. ప్రభువు సైతాను శోధనలను జయించాడని చెప్పాం. అతడు పిశాచాన్ని కూలద్రోసిన నాయకుడు. ప్రభువు వచ్చిందాకా పిశాచం ఈ లోకనాయకుడు - యోహా 12,31. కాని అతని రాకడతో అది ఓడిపోయింది. కావుననే క్రీస్తు పిశాచం మెరుపు తీగలాగ పడిపోతుంటే నేను చూచాను అని వాకొన్నాడు - లూకా 10,18. ఈలా ప్రభువుకి ఓడిపోయిన పిశాచాన్ని మనం ఏనాడు ఆశ్రయించగూడదు. ఏనాడు దాని సహాయాన్ని అడుగుకోకూడదు. ప్రభువుకి ఓడిపోయిన పిశాచం మనలను ఏలా ఆదుకొంటుంది? ఈ సంగతి తెలియక కొందరు కష్టాలు వచ్చినపుడు పిశాచాన్ని ఆశ్రయిస్తుంటారు. మంత్రతంత్రాలు, సోదె తాయతులు మొదలైనవాటికి పూనుకొంటుంటారు. వీటికి పూనుకోవడమంటే ప్రభువుని నమ్మకపోవడమే. మనలను రక్షించడానికిగాని శిక్షించడానికిగాని ప్రభువొక్కడే సమర్థుడని గ్రహించకపోవడమే. కనుక మనం ఈ ప్రలోభాలకు లొంగకూడదు.

3. మనలో ఒక్కొక్కరికి ఒక్కో బలహీనత వుంటుంది. కొందరు కామాతురులు. మరికొందరు గర్వాత్ములు. వేరుకొందరు సోమరిపోతులు. ఇంకా కొందరు కలహప్రియులు. ఈ రీతిగా ఒక్కొక్కరిని ఒక్కో దుర్గుణం పట్టి పీడిస్తుంది. ఇక,

మన బలహీనతకు సంబంధించిన రంగంలోనే మనకు ఎక్కువ శోధనలు వస్తుంటాయి. కనుక ఎవరి బలహీనతలను వాళ్ళు చక్కగా అర్థంచేసికొని ఆ రంగంలో వచ్చే విశేష శోధనలను జయిస్తుండాలి.

పైగా మనం పాపావకాశాలనుగూడ ముందుగానే గుర్తుపడుతుండాలి. పలానా తావుకి వెళ్తే, పలానా పనికి పూనుకొంటే పాపంలో పడిపోతామని మనకు ముందుగానే తెలుసు. అలాంటప్పుడు ముందుగానే జాగ్రత్తపడి ఆ శోధనలనుండి తప్పుకొంటూండాలి.

4. శోధనలు వచ్చినపుడు యేసు దివ్యనామాన్ని స్మరించుకొంటే కొండంత బలం పొందుతాం. ఆ బలంతో ప్రలోభాలను జయించవచ్చు. జాన్ క్లిమాకస్ అనే భక్తుడు "యేసు దివ్యనామంతో పిశాచాలను చావమోదవచ్చు. దయ్యాలను జయించాలంటే భూలోకంలోగాని పరలోకంలోగాని ఇంతకంటె మెరుగైన ఆయుధం మరొకటి లేదు" అని వాకొన్నాడు. యేసునామమంటే యేసుప్రభువే. కనుక మనం ఆ ప్రభువుని స్మరించుకొని అతని శక్తితో శత్రువులను జయించాలి.

# 5. క్రీస్తు తండ్రిని తెలియ జేసేవాడు

క్రీస్తు ప్రవక్త, యాజకుడు, రాజు. ప్రవక్తగా అతడు బోధ చేస్తాడు. తండ్రినిగూర్చి తెలియజేస్తాడు. తండ్రిని ఎరుకపరచడం అతని ముఖ్యకార్యాల్లో ఒకటి. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. బైబులు బోధలు

బైబులు బోధలు క్రీస్తు తండ్రిని తెలియపరచేవాడని చెప్తాయి. అతడు కేవలం తండ్రిని గూర్చిన సమాచారాన్ని తెలియజేసేవాడు మాత్రమేకాదు. ఆ సమాచారం తానే. తండ్రి క్రీస్తుద్వారానే మనలను రక్షించేది. కనుక క్రీస్తు తండ్రినిగూర్చి చెప్పే సమాచారమేమిటంటే, ఆ తండ్రి తన ద్వారా ప్రజలను రక్షిస్తాడని. కనుక క్రీస్తు తండ్రిని తెలియజేయడంద్వారా తన్నుతానే తెలియజేసికొంటాడు. క్రీస్తుద్వారా, క్రీస్తునందు తండ్రి మనకు ప్రత్యక్షమౌతాడు.

1. మొదట అపోస్తలుల చర్యలను చూద్దాం. ఈ గ్రంథంలో వుంది క్రీస్తు వుత్థానానంతరము అపోస్తలులు చేసిన తొలి బోధ. ఈ గ్రంథం భావాల ప్రకారం అద్భుతాలు

మహాకార్యాలద్వారా తండ్రి క్రీస్తుని ప్రజలకు ఎరుకపరచాడు - 2,22. తండ్రి అతన్ని మృతులలోనుండి లేపాడు - 2-24. కనుక క్రీస్తుద్వారా తండ్రి పనిచేస్తున్నాడు. దేవుడు తన్ను తాను నరులకు ఎరుకపరచుకోవడాన్ని శ్రుతి (Revelation) అంటాం. ఈ శ్రుతి కేవలం బోధలు మాత్రమే కాదు, చేతలుకూడ. ఇక్కడ క్రీస్తు అద్భుతాలూ, మరణోత్థానాలూ అతని చేతలు. క్రీస్తు చేసిన ఈ క్రియలద్వారా తండ్రి మనకు తెలియవస్తాడు. ఈలా తన బోధల ద్వారానూ చేతల ద్వారానూ క్రీస్తు తండ్రిని మనకు బయలుపరుస్తాడు.

2. పౌలు బోధలను తిలకిస్తే, అతడు తన జాబుల్లో పలుసార్లు "తండ్రి రహస్య ప్రణాళిక"ను గూర్చి మాటలాడుతూంటాడు - ఎఫె 1,9. ఆదాము పాపంద్వారా మానవ జాతి తండ్రినుండి దూరమైపోయింది. పిత క్రీస్తుద్వారా ఈ మానవజాతిని మళ్ళా తనతో రాజీపర్చుకోగోరాడు. క్రీస్తువచ్చి ఈ రాజీకార్యాన్ని నిర్వహించాడు. "తండ్రి రహస్య ప్రణాళిక" అంటే ఈ రక్షణ కార్యమే. ఇక, ఈ రక్షణ ప్రణాళికను నిర్వహించడంద్వారా క్రీస్తు తండ్రిని మనకు తెలియజేస్తాడు. అతన్ని రక్షణ ప్రణాళికా కర్తనుగా మనకు విశదపరుస్తాడు.

హెబ్రేయుల జాబు ఒక ముఖ్యమైన భావం చెప్పింది. పూర్వకాలంలో దేవుడు పెక్కుసార్లు, పెక్కు విధాలుగా ప్రవక్తలద్వారా మాట్లాడాడు. కాని ఈ కడపటి రోజుల్లో అతడు తన కుమారుని ద్వారానే మనతో మాట్లాడాడు -1, 1-2. పూర్వవేదంలో తండ్రి ప్రవక్తలద్వారా దివ్యశ్రుతిని తెలియజేసాడు. కాని అది అసంపూర్ణమైంది. అతడు నూత్న వేదంలో క్రీస్తుద్వారా మళ్ళా దివ్యశ్రుతిని తెలియజేసాడు. ఇది పరిపూర్ణమైంది. దీనిద్వారా మనం తండ్రిని చాలవరకు గ్రహిస్తాం.

3. తొలి మూడు సువిశేషాల్లోని బోధనలను పరికిస్తే శ్రుతినిగూర్చి చాల విషయాలు తెలుస్తాయి. క్రీస్తునాటి ప్రజలు అతన్ని "ప్రవక్త" అని పిల్చారు - మార్కు 6,15. అనగా అతడు తండ్రిని తెలియజేసేవాడనే ఆ ప్రజల భావం. క్రీస్తుకూడ తన బహిరంగబోధ ప్రారంభంలో "ప్రభువు ఆత్మ నా మీద వుంది. పేదలకు సువార్తను బోధించడానికి ప్రభువు నన్ను అభిషేకించాడు" అని చెప్పుకొన్నాడు - లూకా 4,18. ఈ వాక్యాన్నిబట్టికూడ అతడు పితనుగూర్చి బోధించేవాడని అర్థంచేసికోవాలి.

మత్త 11,27లో ప్రభువు "కుమారుడు తప్ప మరెవ్వరూ తండ్రి నెరుగరు. మరియు కుమారుడు ఎవరికి యెరిగింప యిష్టపడతాడో వాళ్ళు మాత్రమే తండ్రిని యెరుగుతారు" అని పల్కాడు. ఇది చాల ముఖ్యమైన భావం. క్రీస్తు తెలియజేయందే ఏ నరుడూ తండ్రినిగూర్చి తెలిసికోలేదు. అనగా క్రీస్తు శ్రుతికర్త.

పూర్వవేదంలో యావే ప్రభువు ఒక్క పలుకు పలకగానే కార్యం జరిగేది. ప్రభువు ఆజ్ఞాపింపగానే సృష్టి జరిగింది అంటుంది కీర్తన 148,5. క్రీస్తు వాక్కుకి గూడ ఈ క్రియాశక్తి వుంది. ప్రభువు ఒక్కమాటతో పిశాచగ్రస్తుల నుండి దయ్యాలను పారద్రోలి రోగుల వ్యాధులను కుదిర్చాడు - 8,16. ఈలాంటి వాక్శక్తిద్వారా అతడు తండ్రిని మనకు బయలుపరుస్తాడు. కనుక అతని పలుకులు ఏ నాటికీ గతింపవు - మార్కు 13,31.

4. యేసు శ్రుతికర్త అనే భావాన్ని నూత్నవేద రచయితలందరికంటెగూడ యోహాను ఎక్కువగా పేర్కొన్నాడు. ఏ నరుడూ దేవుణ్ణి చూడలేదు. ఆ దేవుడికి సన్నిహితుడుగా వుండి స్వయంగా దేవుడైన కుమారుడే అతన్ని మనకు ఎరుకపరచాడు - 1,18. కనుక క్రీస్తులేందే మనకు తండ్రినిగూర్చి తెలియదు. ఇంకా క్రీస్తు, ఈ లోకం నుండి నీవు నాకు అనుగ్రహించిన వారికి నేను నిన్ను తెలియజేసాను అని తన తండ్రితో చెప్పాడు - 17,6.

ఫిలిప్పు ఓ మారు ప్రభూ! నీవు మాకు తండ్రిని చూపించు, మాకు అదే చాలు అని అడిగాడు. క్రీస్తు, నన్ను చూచినవాడు తండ్రిని చూచినట్లే అని జవాబిచ్చాడు- 14,8-9. ఇది మహావాక్యం. క్రీస్తులో తండ్రి మనకు కన్పిస్తాడు. అతని మాటల్లోను చేతల్లోను పిత మనకు ప్రత్యక్షమౌతాడు.

యోహాను సువిశేషంలోని తొలి 18 వాక్యాలు చాల ముఖ్యమైనవి. ఈ ప్రారంభ భాగంలో అతడు క్రీస్తుని "వాక్కు" అని పిలుస్తాడు. "ఆదిలో వాక్కు వుంది, ఆ వాక్కు దేవునివద్ద వుంది, ఆ వాక్కు దేవుడే" అని చెప్పాడు-1,1. పూర్వవేదంలో దేవుని వాక్కు అంటే దేవుడే. కనుక దేవుని వాక్కుకి దేవునికున్నంత శక్తి వుంటుంది. ఇక, నూత్నవేదంలో క్రీస్తే ఈ వాక్కు. అతనికీ దేవునికుండే శక్తి వుంటుంది. త్రీత్వంలోపిత, సుతుడు, ఆత్మ అని ముగ్గురు దైవవ్యక్తులున్నారు. ఆ ముగ్గురిలో సుతుడు నరుడై జన్మించాడు. అతడే క్రీస్తు. అతడే దేవుని వాక్కుకూడాను. కనుక అతడు దేవునితో సరిసమానుడు. పితతో సరిసమానుడు కనుకనే అతన్ని మనకు బాగా తెలియజేయగలడు.

పైన మనం పేర్కొన్న వేదవాక్యాల సారాంశమిది. క్రీస్తు మనకు తండ్రిని తెలియజేస్తాడు. పరిపూర్ణంగాగూడ తెలియజేస్తాడు. అతడు దేవుని వాక్కు. అతడు కేవలం తన బోధలద్వారా మాత్రమేకాదు, తన చేతలద్వారాగూడా అనగా తన అద్భుతాలు మరణోత్థానాలద్వారాగూడ - ఆ తండ్రిని మనకు ఎరుకపరుస్తాడు. ఈలా ఎరుకపరచడంలో అతన్ని గూర్చిన విషయంకూడ వస్తుంది. ఎందుకంటే తండ్రి రక్షణ ప్రణాళిక నెరవేరేది అతని ద్వారానే. కనుక క్రీస్తు తండ్రిని తెలియజేసేవాడు, తన్ను తాను తండ్రి పంపినవాణ్ణిగా తెలియజేసికొనేవాడు కూడాను. క్రీస్తు బోధలద్వారా చేతల ద్వారా తండ్రి తన్నుతాను మనకు ఎరుకపరచుకొంటాడు.

## 2. పితృపాదుల బోధలు

క్రీస్తు తండ్రిని తెలియజేసేవాడు అనే అంశాన్ని గూర్చి పితృపాదులు చాల సంగతులు చెప్పారు.

1. అనాదినుండీ తండ్రి సుతుడూ వున్నారు. సుతునికి తండ్రినిగూర్చి బాగా తెలుసు. ఆ సుతుడే క్రీస్తుగా జన్మించాడు. కనుక అతడు తండ్రినిగూర్చి మనకు క్షుణ్ణంగా చెప్పగలడు. క్రీస్తు తన తండ్రి మనలను ప్రేమిస్తాడని చెప్పాడు. మనం అతనికి దత్తపుత్రులమౌతామని కూడ చెప్పాడు. కనుకనే మనం ఆ దేవుణ్ణి తండ్రి అని పిలవడానికి సాహసిస్తున్నాం.

క్రీస్తులో తండ్రి మనకు దర్శనమిస్తాడు. ఈ సందర్భంలో రోమాపురి క్లైమెంట్ "క్రీస్తు అనే అద్దంలో తండ్రి ముఖం ప్రతిబింబిస్తుంది" అని వ్రాసాడు. అనగా క్రీస్తులో తండ్రి మనకు ప్రత్యక్షమౌతాడని భావం. పితృపాదులు క్రీస్తుని తండ్రి దూత, తండ్రి ప్రవక్త, తండ్రి వాక్కు, తండ్రి వాణి అని పేర్కొన్నారు.

2. పితృపాదులందరిలోను రెండవ శతాబ్దానికి చెందిన ఇరెనేయుస్ భక్తుడు క్రీస్తు శ్రుతికకర్త అనే అంశాన్ని చక్కగా విశదీకరించాడు. ఈతని భావాల ప్రకారం, దేవుని వాక్కు నరుడై జన్మించినవుండకపోయినట్లయితే మనకు దేవుణ్ణిగూర్చి తెలిసేదే కాదు. ఆ దేవుణ్ణిగూర్చి మనకు చెప్పగల్గిన వాళ్ళు ఇంకెవరున్నారు? కనుకనే కంటికి కనిపించని దేవుణ్ణిగూర్చి కంటికి కన్పించే కుమారుడే చెప్పాలి. అది మరొకరికి సాధ్యమయ్యే పనికాదు.

ఇరెనేయుస్ రక్షణ చరిత్రను మూడు దశలుగా విభజించాడు. తొలిదశ, సృష్ట్యాదినుండి యూదులను ఎన్నుకొనేంత వరకూను. తండ్రి తన వాక్కుద్వారా సృష్టిచేసాడు. ఈ సృష్టినుండి పితను కొంతవరకు తెలిసికోవచ్చు. రెండవ దశ, యూదుల ఎన్నిక. తండ్రి తన వాక్కు ద్వారానే యూదులనుకూడ ఎన్నుకొన్నాడు. యూదుల ధర్మశాస్త్రం ద్వారా గూడా తండ్రిని గూర్చి కొంతవరకు తెలిసికోవచ్చు. ఈ రెండు దశల్లోను వాక్కు లేక సుతుడుకూడ ప్రత్యక్షమై వున్నాడు. ఈ రెండు దశల్లోను అతడు రాబోయే నరావతారానికి తన్నుతాను తయారుచేసికొంటున్నాడు. ఇక మూడవ దశ, నూత్నవేదం. తొలి రెండు దశల్లోను కంటికి కన్పింపకుండా వున్న దేవుని వాక్కు ఈ మూడవదశలో మానవాకారం చేకొని కంటికి కన్పించడం మొదలుపెట్టింది. ఇదే క్రీస్తు మనుష్యావతారం. ఈ క్రీస్తు తండ్రిని పరిపూర్ణంగా తెలియజేస్తాడు. ఇవి ఇరెనేయుస్ భావాలు. రెండవ శతాబ్దంలో ఆ వేదశాస్త్రి చెప్పిన భావాలు నేటికీ మనకు ప్రేరణం పుట్టిస్తాయి.

## 3. క్రీస్తు తండ్రిని తెలియజేసే తీరు

1. నరుడైన క్రీస్తు దేవుడైన తండ్రిని మనకు ఏలా తెలియజేస్తాడు? త్రీత్వంలో పిత, సుతుడు, ఆత్మ అని ముగ్గురు వ్యక్తులున్నారని చెప్పాం. ఈ సుతుణ్ణే యోహాను సువిశేషం "దేవుని వాక్కు" అని పిలుస్తుందనికూడ చెప్పాం. ఈ సుతుడే తర్వాత క్రీస్తుగా జన్మించాడు. త్రీత్వంలోనివాడు కనుక అతనికి తండ్రినిగూర్చి బాగా తెలుసు. తనకు తెలిసిన తండ్రినిగూర్చి అతడు మనకు స్పష్టంగా చెప్పగలడు. కనుకనే యోహాను "తండ్రికి అత్యంత సన్నిహితుడుగా వున్న కుమారుడే ఆ తండ్రిని మనకు ఎరుకపరిచాడు" అని వాకొన్నాడు-1,18.

"క్రీస్తు అదృశ్యుడైన దేవుని ప్రతిబింబం" అన్నాడు పౌలు- కొలో 1,15. ఇంకా "అతడు దేవుని మహిమ యొక్క తేజస్సు, అతని అచ్చమైన ప్రతిరూపం" అని కూడ చెప్పాడు - హెబ్రే 1,3. అనగా క్రీస్తు దేవుణ్ణి పోలినవాడని భావం. దేవుణ్ణి పోలినవాడు కనుకనే అతన్ని మనకు చూపించగల్గుతాడు. ఆ దేవుని వునికినీ, అతని హృదయాన్నీ అతని ప్రేమగుణాన్నీ మనకు విశదీకరించగల్గుతాడు.

క్రీస్తుద్వారా తండ్రి మనలను పిలుస్తాడు. మనలను తన చెంతకు రమ్మని ఆహ్వానిస్తాడు. తండ్రి శబ్దమే క్రీస్తు నోట మనకు విన్పిస్తుంది. ఆ తండ్రి ఆహ్వానాన్ని మనం వినాలి. మనం అతని దగ్గరికి వెళ్ళాలి. అతన్ని మన తండ్రినిగా అంగీకరించాలి. అలా అంగీకరించనివాళ్ళకు శిక్ష తప్పదు.

2. దివ్యశ్రుతి క్రీస్తుతో పరిపూర్ణమౌతుంది, అతనితోనే ముగుస్తుందికూడ. ఏనుగు పడితే ఏనుగే లేపాలి. దేవుణ్ణిగూర్చి దేవుడు మాత్రమే సంపూర్ణంగా చెప్పగలడు. క్రీస్తు తండ్రినిగూర్చి నరులమైన మనకు చెప్పవలసిందంతా చెప్పాడు. పూర్వం ప్రవక్తలు పితనుగూర్చి కొన్ని సంగతులు చెప్పారు. ఆ విషయాలు పూర్వవేదంలో వున్నాయి. కాని ఆ ప్రవక్తలకు తెలిసిందే తక్కువ. అసలు తండ్రి రహస్య ప్రణాళికనుగూర్చి వాళ్లకు తెలియనే తెలియదు. కనుక వాళ్ళు చెప్పిందిగూడ తక్కువే. పూర్వవేదం తర్వాత చివరి మహా ప్రవక్తగా క్రీస్తు వచ్చాడు. అతడు దేవుని వాక్కూ, దేవుని సుతుడూ కనుక దేవుణ్ణిగూర్చి సంపూర్ణంగా తెలిసినవాడు. తనకు తెలిసిన సంగతుల్లో అవసరమైన వాటిని అతడు మనకు వివరించాడు. కావున తండ్రి మనతో "నా కుమారుడైన క్రీస్తుద్వారా నన్ను గూర్చిన సంగతులన్నీ నేను మీకు ఎరుకపరచుకొన్నాను" అని చెప్పాడు. కనుకనే హెబ్రేయులజాబు "ఈ కడపటి రోజుల్లో దేవుడు తన కుమారునిద్వారా మనతో మాట్లాడాడు" అంటుంది -1,2.

క్రీస్తు దేవుణ్ణిగూర్చి మనకు సంపూర్ణంగా తెలియజెప్పాడన్నాం. కాని ఆ తండ్రి మనకు చెప్పదల్చుకొన్న ముఖ్య విషయం ఏమిటి? తన రక్షణ సందేశమే. దీన్నే పౌలు "తండ్రి రహస్యప్రణాళిక" అని పిల్చాడన్నాం. ఈ రక్షణ ప్రణాళిక ప్రధానంగా క్రీస్తు మరణోత్థానాలద్వారా నెరవేరుతుంది. కనుక క్రీస్తు మరణోత్థానాలతో తండ్రి రక్షణ ప్రణాళిక ముగుస్తుంది. అనగా దివ్యశ్రుతి క్రీస్తుతో అంతమౌతుందన్నమాట. ఈ దివ్యశృతినే తర్వాత అపోస్తలులు బోధించారు. దీన్నే తిరుసభకూడ జాగ్రత్తగా పదిలపరచి నేడు మనకు బోధిస్తుంది.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు పుట్టినప్పటినుండి చనిపోయి ఉత్థానమైనదాకాగూడ అతని బోధలూ చేతలూ అన్నీ తండ్రిని తెలియజేస్తూనే వుంటాయి. అతడు పితను ఎరుకపరచడమనేది నరావతారంతోనే ప్రారంభమౌతుంది. అతని జననమందు తండ్రి తన ప్రజలను సందర్శించాడు - లూకా 1,68. అతని పుట్టుకలో తండ్రి కృప మనకు ప్రత్యక్షమైంది - తీతు 2,11. బహిరంగ జీవితంలో క్రీస్తు అద్భుతాలు చేసినపుడల్లా తండ్రి అతనిలో పనిచేస్తూనే వున్నాడు - యోహా 10,37-38. క్రీస్తు తన మరణోత్థానాలద్వారా తండ్రిని మహిమపరుస్తాడు. తండ్రికూడ క్రీస్తుని మహిమపరుస్తాడు - యోహా 17,4. ఈ విధంగా క్రీస్తు జీవితమంతా, అతని మాటలూ చేతలూ అన్నీ, తండ్రిని తెలియజేస్తాయి. ఈ దృష్టితోనే యోహాను అతన్ని జ్యోతి అని పేర్కొన్నాడు. అనగా అతని వెలుగులో మనం తండ్రిని చూస్తామని భావం - 8,12. ఆ శ్రుతికర్తకు మనం భక్తితో నమస్కరించాలి.

2. క్రీస్తు మనకు శ్రుతిసాధనం. అనగా అతడు మనకు పితను తెలియజేసే మార్గం - యోహా 14,5-6. దేవుడే అతన్ని ఆ పనికి ఎన్నుకొన్నాడు. అతడువచ్చి ఆ దేవుడు తండ్రి కుమారుడు ఆత్మడు అనే మూడు రూపాల్లో వుంటాడని మనకు నేర్పాడు. మనం పాపులమనిగూడ మనకు విశదం చేసాడు. మనకు జీవాన్నిచ్చేది తానేనని స్పష్టం చేసాడు. అతనిద్వారానే గాని మనం తండ్రిని చేరమని రూఢం చేసాడు -14,6. ఈలా తండ్రినిచేరే మార్గమూ సాధనమూ ఐన ప్రభువుని మనం భక్తిభావంతో వందించాలి.

3. క్రీస్తు తండ్రికి సాక్షి. ఈ సాక్షి ధర్మానాకి అతడు తగినవాడుకూడ. అతడు తండ్రికి సరిసమానుడు. తండ్రి శక్తితోనే అద్భుతాలు జేసేవాడు. ఆ తండ్రిలాగే తానూ పరమ పవిత్రంగా జీవించేవాడు. కనుక తండ్రిని గూర్చిన అతని సాక్ష్యం అన్ని

విధాల నమ్మదగింది. అసలు తండ్రే క్రీస్తు తన్నుగూర్చి పల్కిన సాక్ష్యాన్ని ధ్రువపరచాడు- యోహా 6,37. ఈలా తండ్రిని ఎరుకపరచే క్రీస్తు సాక్ష్యాన్ని మనం అంగీకరించి విశ్వసించాలి.

4. తండ్రి ఆదాము పాపంద్వారా తనకు దూరమైన నరజాతిని మళ్ళా తన చెంతకు తిరిగి రమ్మని ప్రేమతో ఆహ్వానిస్తుంటాడు. ఈ యాహ్వానాన్ని తీసికొనివచ్చినవాడు క్రీస్తే. ఇక, తండ్రి ఆహ్వానాన్ని నరులు అంగీకరించాలి. కాని నరజాతి అంతటి తరపున తండ్రి ఆహ్వానానికి అంగీకారం తెలిపిన మహాభక్తుడు క్రీస్తే. అతడు నిరంతరమూ తండ్రి చిత్తప్రకారం జీవించినవాడు. ఆ దివ్యచిత్తాన్ని పాటించడమే అతని ఆహారంకూడ - యోహా 4,34. తండ్రి పంపిన పనిని నెరవేర్చడమూ, తండ్రిని ఆరాధించడమూ, అతని నిత్యకృత్యాలు. కనుక నరులు దేవుని గారాబు బిడ్డల్లా ప్రవర్తించడంలోను, అతని ఆహ్వానాన్ని భక్తిభావంతో అంగీకరించడంలోను క్రీస్తు మనకు ఆదర్శంగాను ప్రేరణంగాను వుంటాడు.

5. వేదాంతియైన తోమాసు అక్వినాసు భక్తుడు ఈలా చెప్పాడు. నరులు తమ భావాలను తోడినరులకు తెలియజేయడానికి వాటిని మాటలతోను ధ్వనులతోను పొదుగుతారు. అలాగే పరలోకంలోని తండ్రికూడ తన భావాలను నరులమైన మనకు వ్యక్తంచేయాలని అభిలషించి వాటికి నరులు అర్థంచేసికొనే రూపాన్ని కల్పించాడు. అనగా తన భావాలకు నరాకృతిని దయచేసాడు. శాశ్వతమైన తన వాక్కును నరుణ్ణిచేసి లోకంలోకి పంపాడు. అలా వచ్చిన దైవవాక్కగు క్రీస్తు తన్ను పంపిన దేవుణ్ణి మనకు విశదం చేసాడు. కనుక ఆ ప్రభువుకి మనం భక్తితో ప్రణమిల్లాలి.

# 6. క్రీస్తు సిలువ

క్రీస్తు యాజకుడుగా మనకొరకు చనిపోయాడు. పవిత్రమైన తన సిలువమరణంద్వారా మనకు పాపపరిహారం చేసాడు. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

## 1. క్రీస్తు మరణానికి కారణం ప్రేమే

క్రీస్తు తండ్రిపట్లగల ప్రేమచేతనే సిలువ మరణానికి సంసిద్ధమయ్యాడు. "నేను తండ్రిని ప్రేమిస్తున్నానని లోకం తెలిసికోవాలి. ఆ తండ్రి ఆజ్ఞను నెరవేర్చడానికే నేనీలాగు

చేస్తున్నాను" అన్నాడు ప్రభువు - యోహా 14,31. సిలువ మరణానికి ముందు ఒలీవల తోపులో శ్రమచెందుతూగూడ తన చిత్తప్రకారంగాదు తండ్రి చిత్తప్రకారమే జరగాలి అని పల్కాడు - లూకా 22,42. అతడు తండ్రిని గాఢంగా ప్రేమించాడు. కనుక తనకు మరణం సిద్ధించినాసరే ఆ తండ్రి ఆజ్ఞకు బద్దుడయ్యాడు.

క్రీస్తు మనపట్ల ప్రేమవలనగూడ సిలువమరణానికి పూనుకొన్నాడు. స్నేహితులకొరకు ప్రాణాలర్పించేవాని కంటె ఎక్కువ ప్రేమగలవాడు ఎవడూలేడు అన్నాడు ప్రభువు - యోహా 15,13. అతడు మనపట్ల తనకు గల ప్రేమను రుజువు చేసుకొంటూ చనిపోయాడు. పాపియైన నరుడు భగవంతునికి విరోధి. మనం పాపులమై దేవునికి శత్రువులంగా వుండగా అతడు మనకొరకు చనిపోయాడు - రోమా 5,10. ఆ ప్రభువు ఏ నిర్బంధానికి గురికాకుండా స్వేచ్ఛగానే మనకొరకు అసువులర్పించాడు. కనుకనే అతడు "ఎవడూ నా ప్రాణాలను గైకొనలేడు. నాయంతటనే నేనే నా యసువులు బలిగా అర్పిస్తున్నాను" అన్నాడు - యోహా 10,18. కనుక క్రీస్తు మరణానికి ప్రేమే ప్రధాన కారణం.

## 2. క్రీస్తు మరణస్వభావం

నరుని మరణంలో రెండంశాలున్నాయి. మొదటిది, దానిద్వారా మన మానవజీవితం నశిస్తుంది. మన దేహాత్మలు వేరైపోతాయి. మనం అంతమైపోతాం. అది మనకు ఎంతో బాధా దుఃఖమూ భయమూ కలిగిస్తుంది. బ్రతికివున్న ప్రాణి ఏదికూడ చనిపోడానికి ఒప్పుకోదు. ఈ దృష్టితో జూస్తే మరణం మనకు శిక్ష.

రెండవది, అది మన జీవితంలోకల్ల గొప్ప కార్యం. మన మనుగడలో తుది నిర్ణయం. మనమే దాన్ని స్వేచ్ఛా పూర్వకంగా నిర్ణయించుకొంటాం. దానిద్వారా మనం నూత్న జీవితంలోకి సాగిపోతాం. ఈ దృష్టితోజూస్తే మరణం మనకు శిక్ష కాదు. అది మన జీవితానికి ఫలసిద్ధి అవుతుంది.

ఇక, శిక్ష ఫలసిద్ధి అనే పై రెండంశాలు క్రీస్తు మరణంలో కూడ వున్నాయి. మొదట అతని మరణం శిక్షాత్మకమైంది. అతడు పాపపు నరజాతిలో పుట్టాడు. పాపం ఫలితం చావు అన్నాడు పౌలు - రోమా 6,23. కనుక క్రీస్తుకూడ చనిపోవలసి వచ్చింది. అతడు మృత్యువేదనకు గురయ్యాడు - హెబ్రే 2,9. మరణభయానికి లొంగి తండ్రీ ఈ పాత్రను నాయొద్దనుండి తొలగించు అని వేడుకొన్నాడు - మార్కు 14,36. ఈ శిక్షాత్మకమైన క్రీస్తు మరణం మనలను రక్షించలేదు.

రెండవది, అతని మరణం ఫలసిద్ధితో కూడిందికూడ. ప్రభువు మనకోసం చనిపోవడానికి స్వయంగానే నిర్ణయం చేసికొన్నాడు. నాయంతటనే నేనే నా ప్రాణాన్ని

ధారపోస్తున్నాను అన్నాడు - యోహా 10,17-18. స్వేచ్ఛాపూర్వకంగానే అతడు తన ఆత్మను తండ్రి చేతుల్లోనికి అర్పించుకొన్నాడు - లూకా 24,46. ఇంకా అతడు మనలను ప్రేమించి మనకొరకు ప్రాణత్యాగం చేసాడు-గల 2,20. స్నేహితుల కొరకు అనురాగంతో అసువు లొడ్డాడు - యోహా 15,13. ఈ రీతిగా క్రీస్తు స్వేచ్ఛగాను ప్రేమపూర్వకంగాను మన కొరకు చనిపోయాడు. మరణంద్వారా అతడు ఈ పాపపు లోకంనుండి సాగిపోయి పుణ్యప్రదమైన తండ్రి సాన్నిధ్యాన్ని చేరుకొన్నాడు. ఈ దృష్టితో చూస్తే అతని మరణం ఎంతో విలువైంది. పరమ పవిత్రమైంది. మనలను రక్షించడానికి అన్ని విధాల తగింది. యోగ్యమైన అతని మరణం నుండి జీవం పుట్టుకవచ్చింది.

క్రీస్తు తండ్రి చిత్తానికి లొంగి చనిపోయాడు. మన పట్లగల ప్రేమచేగూడ చనిపోయాడు. కనుక విధేయాత్మకమూ ప్రేమపూరితమూ ఐన అతనిమరణం మనలను రక్షించింది. కావున శిక్షాత్మకమైన క్రీస్తు మరణం కాక, ఫలసిద్ధితో గూడిన క్రీస్తు మరణం మనకు ఉపయోగపడుతుంది.

## 3. సిలువ మరణం

కాని క్రీస్తు చనిపోతే చనిపోవచ్చుగాక, బాధలేని మామూలు మరణం మరణించవచ్చుగదా? సిలువమీద అంత ఘోరమైన, అంత కౄరమైన మరణం మరణించడం దేనికి? ఇక్కడ యింకో విషయంకూడ గుర్తించాలి. సిలువ మరణం కౄరమైంది మాత్రమే కాదు, నీచమైందికూడ. ప్రభువు సిలువమీద చనిపోయాడు గనుక ఇప్పుడు ఆ సిలువ మనకు పవిత్రవస్తు వయింది. కాని క్రీస్తు నాడు దానికా పవిత్రత లేదు. ఆనాడు పరమ దుర్మార్గులనూ పెద్దపెద్ద బందిపోటు దొంగలనూ సిలువమీద కొట్టి చంపేవాళ్లు. హీబ్రూ సంప్రదాయం ప్రకారం "సిలువమీద చనిపోయేవాడు శాపగ్రస్తుడు' ' - ద్వితీ 21,23. అది చాలా నీచమైన మరణం. మామూలు మరణాన్నిగాక, ఈలాంటి నీచాతినీచమైన సిలువ మరణాన్ని క్రీస్తు అంగీకరించాడు - ఫిలి2,8. అతడు ఇంత నీచమైన చావుకి పాల్పడ్డం దేనికి? అపార ప్రేమ తప్ప దీనికి మరో కారణం లేదు.

క్రీస్తు సిలువ కేవలం యాదృచ్ఛికమైంది కాదు. తండ్రి రక్షణ ప్రణాళికలోనే సిలువకూడ నిర్ణయింపబడింది. అది తండ్రి ఆజ్ఞ - యోహా 14,31. క్రీస్తు పొందవలసిన జ్ఞానస్నానం.-లూకా 12,50. కనుక క్రీస్తు సిలువద్వారాగాక మరొక మార్గంలో మనలను రక్షించడం పొసగదు.

సిలువమరణం క్రీస్తు వినయవిధేయతలకూ బాధలకూ ప్రబల సాక్ష్యం. దానిద్వారా అతడు ఎంత క్రిందిస్థాయికి దిగిపోవడానికి వీలుందో అంత క్రింది స్థాయికి

దిగిపోయాడు. ఆ మరణం క్రీస్తు అనురాగానికి గూడ నిదర్శనంగా వుంటుంది. సిలువ మరణం తండ్రికీ క్రీస్తుకీ మనపట్ల ఎంత ప్రేమవుందో నిరూపిస్తుంది. మనంకూడ ఆ తండ్రి కుమారులకు బదులు ప్రేమ చూపాలని ఉద్ఘోషిస్తుంది.

## 4. క్రీస్తు పాతాళసందర్శనం

క్రీస్తు మరణించి సమాధిలో వుంచబడిన పిదప పాతాళానికి దిగిపోయాడు. 1 పేత్రు 3,18-22 ఈ సంఘటనాన్ని పేర్కొంటుంది. ఈ వేదవాక్యాల ప్రకారం, క్రీస్తు పాతాళానికి వెళ్ళి అక్కడ చెరలోవున్న ఆత్మలకు బోధ చేసాడు. ఆ యాత్మలు దేవుణ్ణి విధేయించనివీ, అతని సహనాన్ని పరీక్షించేవీని. క్రీస్తు పాతాళంనుండి వెలుపలికివచ్చి పునరుత్థానుడై దేవుని కుడిపార్శ్వాన్ని చేరుకొన్నాడు.

ఈ వేదవాక్యాలకు వేదపండితులు వివిధార్థాలు చెప్తూ వచ్చారు. ప్రాచీన పండితులు చెప్పిన అర్థమిది. క్రీస్తు పాతాళానికి వెళ్ళి నోవా మొదలైన పూర్వవేద పితరులకు రక్షణాన్ని బోధించాడు. తన వుత్థానంద్వారా వాళ్ళను పాతాళంనుండి విడిపించి మోక్షానికి తీసికొనివెళ్ళాడు. మూసిన మోక్షాన్ని మళ్ళా తెరచాడు. కనుక క్రీస్తు ఇక్కడ ఓ ప్రత్యేక రక్షణకార్యం నిర్వహించాడు.

కాని ఆధునిక పండితులు పై వాక్యాలకు మరో అర్థం చెప్తున్నారు. క్రీస్తు పాతాళానికి వెళ్ళింది పూర్వవేద పితరులకు బోధ చేయడానికి కాదు. అక్కడ వసించే పిశాచాలను ఖండించడానికి. అక్కడ వుత్థానక్రీస్తు దేవునికి ఎదురు తిరిగిన పిశాచాలమీద తన ఆధిపత్యాన్ని నెరపాడు. సిలువమరణం వలన పిశాచాలు ఓడిపోయాయని తెలియజేయడమే అతని బోధ. కనుక ఈ యర్థం ప్రకారం పాతాళంలోవున్న "ఆత్మలు" పితరులుకాదు, పిశాచాలు. క్రీస్తు ఇక్కడ ప్రత్యేక రక్షణకార్యమేమీ నిర్వహించలేదు. పాతాళానికి దిగడం అతని మరణంలో ఓ భాగం మాత్రమే. నేడు మనం ఈ రెండవ అర్థాన్ని గ్రహించాలి.

క్రీస్తు పాతాళానికి దిగడం అన్న సంఘటనంలో రెండంశాలు వున్నాయి. మొదటిది, అది అతని మరణాన్ని తెలియజేస్తుంది. యూదుల సంప్రదాయం ప్రకారం పాతాళం అంటే దైన్యస్థితి. కనుక క్రీస్తు పాతాళానికి వెళ్ళాడంటే దైన్యస్థితిని పొందాడని భావం. ఆ దైన్యస్థితి అతని సిలువ మరణంలో ఓ భాగం. యూదుల భావాలప్రకారం చనిపోయినవాళ్ళంతా పాతాళం చేరుకొంటారు. కనుక క్రీస్తుకూడ అక్కడికి వెళ్ళాడు. అక్కడ దైవదర్శనం లభించదు. పాతాళంలోని ఘోరాతిఘోరమైన అంశం ఇదే. ఇక క్రీస్తు ఈ దుఃఖపూరితమైన తావుకి వెళ్ళాడు అంటే మహా దుస్థితికి గురయ్యాడని భావం.

క్రీస్తు ఈ తావుకి వెళ్ళి అక్కడవున్న పిశాచాలకు తన విజయాన్ని ఎరుకపరచాడు. వాటి పతనాన్ని వాటికి తెలియజేసాడు. పిశాచాల ఓటమి పాతాళ సందర్శనంలో ఓ ముఖ్యాంశం.

రెండవది, క్రీస్తు పాతాళ సందర్శనం అతని ఉత్థానాన్ని గూడ తెలియజేస్తుంది. పిశాచ ఖండనం ముగిసిన వెంటనే ప్రభువు ఉత్థానమై తండ్రిని చేరుకొన్నాడు. అతడు పాతాళానికి వెళ్ళినపుడు ఎంత దైన్యస్థితికి దిగజారిపోయాడో, మళ్లా తండ్రిని చేరుకొన్నపుడు అంత ఉచ్ఛస్థితిని పొందాడు.

పేత్రు మొదటి జాబు జ్ఞానస్నానాన్ని పురస్కరించుకొని వ్రాయబడింది. జ్ఞానస్నానంలో క్రీస్తు మరణోత్థానాలు మనమీద సోకుతాయి. పిశాచంమీద క్రీస్తు సాధించిన విజయంకూడ ఈ పుణ్యక్రియలో మనకు సంక్రమిస్తుంది. ఈ భావాలను వివరించడానికే రచయిత ఈ జాబు వ్రాసాడు. ఇక, క్రీస్తు పాతాళ సందర్శనం అతని మరణోత్థానాలను సూచిస్తుందనే భావం, అతడు పిశాచాలమీద విజయం సాధించాడనే భావం, ఈ మొదటి పేత్రు జాబుని వ్రాసిన రచయిత భావాలకు సరిపోతాయి.

ఫలితార్థమేమిటంటే, క్రీస్తు పాతాళంలో బోధచేసిన ఆత్మలు పిశాచాలు కాని పితరులు కాదు. అతని బోధ పిశాచాల ఓటమిని వాటికి తెలియజేయడమే. క్రీస్తు పాతాళంలో ప్రత్యేక రక్షణకార్యమేమీ నిర్వహించలేదు. పాతాళ సందర్శనం అతని మరణంలో ఓ భాగం అంతే. యూదుల పరిభాషలో ఆ సంఘటన అతని మరణోత్థానాలను సూచిస్తుంది.

## 5. క్రీస్తు మరణ ఫలితాలు

బైబులు క్రీస్తు మరణ ఫలితాలను పలువిధాలుగా వర్ణిస్తుంది.

1. విమోచనం. యూదుల్లో ఎవడైనా పేదవాడయి బానిసగా అమ్ముడు పోయినట్లయితే అతని దగ్గరి చుట్టం డబ్బు చెల్లించి అతన్ని బానిసంనుండి విడిపించేవాడు. ఈలా విడిపించడాన్నే "విమోచనం" అన్నారు - లేవీ 25,47-49. ఇక ఐగుప్తులో యూదులు ఫరో చక్రవర్తికి బానిసలై వెట్టిచాకిరి చేస్తున్నారు. యావే ప్రభువు వాళ్ళ శ్రమలుచూచి వాళ్ళకోపు తీసికొన్నాడు. తాను వాళ్ళకు దగ్గరి చుట్టమయ్యాడు. వాళ్ళను ఫరో దాస్యాన్నుండి విడిపించుకొని వచ్చాడు. ఇది పూర్వవేద విమోచనం. నూత్నవేదంలో మనం ఫరోకుగాక పిశాచానికి బానిసలమయ్యాం. క్రీస్తు మనకు దగ్గిర చుట్టమయ్యాడు. తాను సిలువమీద చనిపోయి పిశాచ దాస్యంనుండి మనలను విడిపించాడు. అనగా మన పాపాలు పరిహరించాడు. ఇది నూత్నవేద విమోచనం.

2. నూత్ననిబంధన. పూర్వవేదంలో యావే ప్రభువు యిస్రాయేలీయులకు దాస్యవిముక్తి కలిగించి, సీనాయికొండ దగ్గిర వాళ్ళతో నిబంధనం చేసికొన్నాడు. ఆ నిబంధనం ఫలితంగా అతడు వాళ్ళు కొలిచే దేవుడయ్యాడు. వాళ్ళు అతడు కాచికాపాడే ప్రజలయ్యారు. ఈ సందర్భంలో పూర్వవేదం "నేను మీ దేవుడను, మీరు నా ప్రజలు" అనే వాక్యం ఉదాహరిస్తుంది. ఇక నూత్నవేదంలో క్రీస్తు సిలువ మరణం క్రొత్త నిబంధనమౌతుంది. ఈ సిలువమరణం ద్వారా అతడు మనం కొల్చే దేవుడౌతాడు. మనం అతడు కాచి కాపాడే ప్రజలమౌతాం. కనుకనే క్రీస్తు అంత్యభోజన సమయంలో "ఇది నూత్ననిబంధనపు నా రక్తం" అన్నాడు – మత్త 26,28.

ఇదే సందర్భంలో యెషయా ప్రవక్త వర్ణించిన బాధామయ సేవకుణ్ణిగూడ పేర్కొనాలి. ఇతడు తన శ్రమల ద్వారాను మరణంద్వారాను ప్రజలకు పాపవిమోచనం కలిగించాడు – యెష 53, 11–12. ఇక నూత్నవేదం పలుతావుల్లో క్రీస్తే ఈ బాధామయ సేవకుడని సూచిస్తుంది. ఈ సేవకుని ద్వారా మనకు విమోచనం కలిగిందని వాకొంటుంది – అచ 2,27. మార్కు 10,45.

3. మన ప్రతినిధిగా. క్రీస్తు మనకొరకు మరణించాడు అన్నాడు పౌలు – 1 కొ 15,3. ఇక్కడ "మన కొరకు" అంటే మన స్థానంలో అని అర్థంగాదు. అనగా మనం పాపులమూ వధార్హులమూ ఐ యుండగా అతడు మన స్థానంలో చనిపోయి మనలను ప్రాణాలతో బ్రతకనిచ్చాడని అర్థం చెప్పగూడదు. మరి, అతడు మన తరపున, మన ప్రతినిధిగా చనిపోయాడని అర్థం చెప్పాలి. అనగా అతడు మనలను తనలో ఇముడ్చుకొని చనిపోయాడు. కనుకనే అతని మరణం మనలను రక్షించగలిగింది. అతడు దేవునికీ నరులకీ మధ్య పనిచేసే ఏకైక మధ్యవర్తి – 1 తిమొ 2,5. ఆ మధ్యవర్తి మరణంవల్ల మనం బ్రతికిపోయాం. ఫలితార్థమేమిటంటే, క్రీస్తు మన ప్రతినిధిగా చనిపోయాడుగాని మన స్థానంలో చనిపోలేదు.

4. నెత్తుటిద్వారా ప్రాయశ్చిత్తం. నెత్తురు పూర్వవేదంలో చాల పనులు చేసింది. అది నరుల పాపాలకు పరిహారం చేసింది. నరుల హృదయాలను శుద్ధిచేసింది. వాళ్ళను దేవునితో ఐక్యపరిచింది.

ఐగుప్తులో యూదులు పాస్కగొర్రెపిల్ల నెత్తురు తమద్వారబంధాలకు పూసికొన్నారు. దీనిద్వారా వాళ్ళ గృహాలు పవిత్రమయ్యాయి. ఆరాత్రి ఐగుప్తీయుల ప్రథమ సంతానాన్ని చంపడానికి బయలుదేరిన దేవదూత, గొర్రెపిల్ల నెత్తురు పూసివున్న యూదుల ఇండ్లల్లో ప్రవేశింపనేలేదు – నిర్గ 12, 13. ఇంకా, సీనాయికొండ దగ్గిర నిబంధనం

జరుగూతున్నపుడు మోషే కోడెలనెత్తురు ప్రజలమీదా పీఠంమీదా చిలకరించాడు. ఆ క్రియద్వారా ప్రజల హృదయాలు శుద్ధి చెందాయి. అక్కడ పీఠం దేవునికి గుర్తు. నెత్తురు ప్రాణానికి గుర్తు. ఈ చిలకరింపుద్వారా ప్రజల హృదయాలు శుద్ధిని పొంది దేవునితో ఐక్యమయ్యాయని సూచింపబడింది - నిర్గ 21,8.

ఇక న్నూతవేదంలో క్రీస్తు నెత్తురుకూడ పై కార్యాలన్నీ చేస్తుంది. ఆ ప్రభువు చిందించిన నెత్తురుద్వారా మన పాపాలకు ప్రాయశ్చిత్తం జరిగింది. మన హృదయాలు శుద్ధిచెంది దేవునితో ఐక్యమయ్యాయి. పూర్వవేదంలో పొట్టేళ్ళ నెత్తురూ కోడెదూడల నెత్తురూ ప్రజల హృదయాలను శుద్ధిచేస్తే, నూత్నవేదంలో నిర్దోషియైన క్రీస్తు నెత్తురు మనలను ఇంకా యెంత ఎక్కువగా శుద్ధిచేస్తుందో ఊహించు కొమ్మన్నాడు హెబ్రేయుల లేఖాకారుడు - 9, 13-14.

5. తండ్రితో రాజీ. తొలి మానవుడు పాపంద్వారా దేవునికి శత్రువయ్యాడు. ఈ శత్రుత్వం అతని సంతతియైన మానవజాతి కంతటికీ సంక్రమించింది. నరులందరూ దేవునికి విరోధులయ్యారు. ఈ విరోధాన్ని తొలగించి దేవునితో మనకు మళ్ళా మైత్రి చేకూర్చినవాడు క్రీస్తు. మనం దేవునికి శత్రువులమై యుండగా క్రీస్తు మరణంద్వారా దేవునితో మనకు మళ్ళా రాజీ యేర్పడింది - రోమా 5,10. దేవుని యింటి నుండి వెడలిపోయిన నరుడు క్రీస్తు మరణంద్వారా మళ్ళా దేవుని యింటిలో అడుగు పెట్టాడు. దుడుకు చిన్నవాడిలాగ, తప్పిపోయిన గొర్రెలాగ, పాపపు నరుడు మళ్ళా తండ్రి యింటిని చేరుకున్నాడు. క్రీస్తుతోకూడి మనం మళ్ళా దేవుని కుమారులం అనిపించుకున్నాం.

6. ప్రాత నరుని సిలువ వేయడం. క్రీస్తు భౌతిక నరుడుగా చనిపోయి ఆధ్యాత్మిక నరుడుగా ఉత్థానమయ్యాడు. ఈ ఉత్థాన క్రీస్తులోకే మనం జ్ఞానస్నానం పొందేది. ఈ జ్ఞానస్నానం ద్వారా మనం పాపానికి చనిపోయి వరప్రసాదానికి ఉత్థానమౌతామని చెప్పాం. జ్ఞానస్నానంతో మనలోని పాతనరుడు, అనగా పాపపు నరుడు, సిలువ వేయబడతాడు - రోమా 6,6. అనగా మనకు పాపపరిహారం జరుగుతుంది. ఇకమీదట మనం నూతన జీవితం జీవిస్తాం. క్రీస్తుని ధరిస్తాం - రోమా 13,14. ఇదంతా క్రీస్తు సిలువ మరణం ద్వారా లభించిన భాగ్యం.

7. పిశాచంమీద విజయం. పిశాచం చెట్టుమీద వుండి తొలినరుణ్ణి జయించింది. క్రీస్తుకూడ మళ్ళా చెట్టుమీద వుండే పిశాచాన్ని జయించాడు. "దేవుడు తన సొంత కుమారుని శరీరధారినిగా పంపి శరీరమందే పాపానికి శిక్ష విధించాడు" అన్నాడు పౌలు - రోమా 8,3. ఇది భావగర్భితమైన వాక్యం. పూర్వం పిశాచం దేహధారియైన ఆదామునందు తన

రాజ్యం నిర్మించుకొంది. అనగా అతన్ని లొంగదీసికొంది. ఇప్పుడు క్రీస్తుకూడ దేహధారి అయ్యాడు. దేహధారిగానే పిశాచాన్ని ఓడించాడు. అనగా ఏ మానుష దేహాన్ని ఆధారంగా జేసికొని పిశాచం పూర్వం విజయం సాధించిందో ఆ మానుష దేహంవలననే ఇప్పుడు పరాజయం పొందింది. తన స్థలంలోనే తాను ఓటమికి గురైంది. ఈలా ఓడిపోయిన పిశాచం ఇక మనకు నాయకుడు కాదు. అతనికి మనం దాసులంగాము. మన ప్రభువు ఇక ఉత్థాన క్రీస్తే.

8. వరప్రసాద ప్రదానం. ప్రభువు సిలువమరణం ద్వారా మనకు పాపపరిహారం చేసాడు. అనగా మన పాపం తొలగింపబడింది. పాపం తొలగిపోగా మనకు వరప్రసాదం లభిస్తుంది. ఉత్థాన క్రీస్తు తనకు విధేయులయ్యేవాళ్ళందరికి నిత్యరక్షణకారకుడయ్యాడు – హెబ్రే 5,9. ఉత్థానక్రీస్తు వరప్రసాదం అతనిలోనికి ఐక్యమయ్యే భక్తుల్లోకి ప్రసరిస్తుంది. చెట్టులోని సారం కొమ్మల్లోకి ప్రసరిస్తుంది. శిరస్సులోని ప్రాణం అవయవాల్లోకి ప్రసరిస్తుంది. అలాగే క్రీస్తు వరప్రసాదం మనలోకి ప్రసరిస్తుంది. సూర్యుడు ప్రపంచానికంతటికీ వెలుగును ప్రసాదిస్తాడు. ఉత్థానక్రీస్తు ప్రజలందరికీ వరప్రసాదాన్ని ప్రసాదిస్తాడు. ఈ వరప్రసాదం తిరుసభ ద్వారా దేవద్రవ్యానుమానాలద్వారా మనలను చేరుతుంది.

## ప్రార్థనా భావాలు

క్రీస్తు శ్రమలవల్లా మరణంవల్లా మనకు వరప్రసాదం సిద్ధిస్తుంది అని చెప్పాం. కాని ఈ వరప్రసాదాన్ని మన దాన్నిగా చేసికోవాలి. చెట్టుమీది పండ్లు కోసికొంటే మనవౌతాయి. అంగటిలోని మిఠాయి కొనుక్కుంటే మనదౌతుంది. నదిలోని నీళ్ళు ముంచుకొంటే మనవౌతాయి. అలాగే క్రీస్తు శ్రమల ఫలితాన్ని కూడ మనం రాబట్టుకొంటేనే అతని వరప్రసాదం మనకు లభించేది. కాని మనం క్రీస్తు శ్రమల ఫలితాన్ని ఏలా రాబట్టుకోగలం?

1. మనం ప్రభువు శ్రమలను ధ్యానం జేసికోవాలి. పౌలు అంతటివాడు క్రీస్తు శ్రమల్లో పాలుపొంది అతని పునరుత్థాన బలాన్ని అనుభవానికి తెచ్చుకోవాలి అనుకొన్నాడు – ఫిలి 3,10. కనుకనే అర్చ్యశిష్టులు చాలమంది క్రీస్తు పాటులను భక్తిభావంతో ధ్యానించుకొన్నారు. ఈ భక్తికార్యం ద్వారా మనం భక్తిమంతమైన జీవితం జీవించవచ్చు. శోధనలను ఎదుర్కోవచ్చుగూడ. ఈ సందర్భంలో పదునాల్గు స్థలాల ప్రార్థనం చేసికోవడం చక్కని భక్తిమార్గం.

2. క్రీస్తు మరణాన్ని ధ్యానం చేసికొనే మార్గాల్లో ఉత్తమమైంది దివ్యపూజ. ఈ పవిత్ర కార్యంలో పాల్గొనేపుడెల్లా మనం ప్రభువు మళ్ళా రెండవమారు విజయంచేసిదాకా గూడా అతని మరణాన్ని ప్రకటిస్తూంటాం. అతని మరణాన్ని తండ్రికి జ్ఞాపకం చేస్తూంటాం. ఆ జ్ఞాపకంద్వారా తండ్రి అనుగ్రహాన్ని పొందుతూంటాం - 1కొ 11, 25-26.

3. మన తరపున మనం ప్రభువు శ్రమల్లో పాలు పొందుతూండాలి. అతని సిలువను మోస్తూండాలి. అనగా మన జీవితంలో సంభవించే వ్యాధిబాధలనూ కష్టాలనూ ప్రభువుకోసం సదుద్దేశంతో భరిస్తూండాలి. పచ్చి చెట్టులాంటి వాడైన క్రీస్తుకే అలాంటి శ్రమలు ప్రాప్తిస్తే ఎండుచెట్టు లాంటివాళ్ళమైన మనకెన్ని శ్రమలు ప్రాప్తించవు? - లూకా 23,31. శిష్యుడు గురువుకంటె గొప్పవాడు కాదుగదా? మన గురువు బాధామయమార్గంలో పయనిస్తే మనం సుఖమార్గంలో పయనించాలి అనుకోవడం భావ్యమా? క్రీస్తు మొదట బాధలనుభవించి అటుపిమ్మట మహిమను పొందాలి. మనకు మాత్రం వేరే మార్గం వుంటుందా? - లూకా 24,26. పాటుల సమయంలో క్రీస్తు కురేనియా సీమోనుని సహాయం అంగీకరించాడు- మార్కు 15,21. అతడు మనకుగూడ తన సిలువలో పాలుపంచియిస్తూంటాడు. దీనిద్వారా మనం ఆ ప్రభువుతో అధికంగా ఐక్యమౌతాం.

4. కడన మన మరణాన్నిగూడ ప్రభువుకే అర్పించుకోవాలి. స్వేచ్ఛాపరుడైన నరుని చిట్టచివరి కార్యం మరణం. క్రీస్తు తన మరణాన్ని దేవుని కర్పించినట్లే మనం కూడ మన మరణాన్ని క్రీస్తుద్వారా దేవునికి అర్పించాలి. మనం ఉదయకాల సమర్పణంలో రోజువారి పనులను ప్రభువుకి అర్పిస్తుంటాం. కాని ఈ పనులు మన జీవితానికి చెందినవి. అవి మన జీవితమనే చెట్టుమీద కాసిన పండ్లు. ఈ పండ్లను దేవునికి అర్పించడం మంచిదే. ఐనా ఆ చెట్టునే దేవునికి అర్పిస్తే ఇంకా యోగ్యంగా వుంటుంది. అనగా మన జీవితాన్నీ మరణాన్నీ ఆ ప్రభువు చేతుల్లోకి అర్పించుకొంటే ధన్యాత్ముల మౌతాం. వేయేల, మనం క్రీస్తుతో బాధలనుభవిస్తే అతనితో మహిమను పొందుతాం - రోమా 8, 17. "క్రీస్తు అనుభవించిన కష్టమా! నాకు ఓదార్పును దయచేయండి" అని ప్రార్థించాడు ఇగ్నేష్యస్ లొయోలా. ఈ భాగ్యం కోసమే మనమూ వేడుకోవాలి.

# 7. క్రీస్తు ఉత్థానం

క్రీస్తు తన సిలువ మరణం ద్వారా మాత్రమే కాక, ఉత్థానంద్వారా కూడ మనలను రక్షిస్తాడు. ఈ యధ్యాయంలో నాలుగంశాలు పరిశీలిద్దాం.

## 1. ఉత్థానంద్వారా క్రీస్తు తండ్రిచెంతకు తిరిగిపోతాడు

ఆదాము పాపంద్వారా నరజాతి తండ్రి యింటినుండి వెళ్ళిపోయింది. మనమంతా తండ్రి కోపానికి గురయ్యాం. ఐనా అతడు దయతో మనలను మళ్ళా తన చెంతకు చేర్చుకోగోరాడు. కాని పాపపు మానవుడు దేవుని సన్నిధిని చేరుకోవడం ఏలా? కనుకనే తండ్రి క్రీస్తుని పంపాడు. అతనివెంటబోయి మనం మళ్ళా దేవుని యింటిలో అడుగుపెట్టవచ్చు. ఈ క్రీస్తు పాపానికి లొంగకుండానే పాప ఫలితాలకు గురయ్యాడు. తాను మన పాపపు దేహాన్ని చేకొన్నాడు. ఆ బలహీనపు శరీరంతో చనిపోయి మహిమాన్విత శరీరంతో ఉత్థానమయ్యాడు. ఉత్థానంద్వారా అతడు పాపపు నరదశనుండి పవిత్రమైన దైవదశకు చేరుకున్నాడు. మరణం నుండి లేచిన క్రీస్తు మరల మరణించడు. ఇకమీదట మృత్యువుకి అతనిమీద ఎలాంటి శక్తీలేదు. అతని మరణం పాపానికి శాశ్వతమైన మరణం. ఇప్పుడు అతడు దేవుని కొరకు దివ్య జీవితం జీవిస్తున్నాడు - రోమా 6,9-10.

యోహాను క్రీస్తు ఉత్థానాన్ని అతడు తండ్రి వద్దకు తిరిగిపోవడాన్నిగా భావించాడు. "యేసు తాను ఈ లోకాన్ని వీడి తండ్రి చెంతకు వెళ్ళవలసిన గడియ సమీపించిందని యెరిగి ఈ లోకంలో వున్న తనవారిని చివరిదాకా ప్రేమించాడు" - 13,1. ఈ వాక్యాన్నిబట్టి క్రీస్తు ఉత్థానమంటే అతడు తండ్రివద్దకు తిరిగిపోవడమే కదా!

యోహాను భావాల ప్రకారం క్రీస్తు ఉత్థానం క్రొత్త నిర్గమనం లాంటిది. పూర్వం మోషే పూర్వవేదపు ప్రజలను వెంటబెట్టుకొని పాపపు దేశమైన ఐగుప్తునుండి పవిత్రమైన వాగ్దత్తభూమికి వెడలిపోయాడు. అలాగే క్రీస్తుకూడ నూత్నవేద ప్రజలను వెంటబెట్టుకొని పాపమూ ద్వేషమూ మృత్యువుతో కూడిన ఈ లోకంనుండి తండ్రి సామ్రాజ్యానికి వెడలిపోయాడు. యోహాను సువిశేషం క్రీస్తు "మరణించాడు" అనడానికి బదులుగా అతడు తండ్రివద్దకు "వెళ్ళిపోయాడు" అంటుంది. "తాను దేవునివద్దనుండి వచ్చితిననియు మరల దేవుని వద్దకు వెళ్ళిపోవలసి వున్నదనియు యేసు యెరిగెను" అన్న వాక్యంలో ఈ ప్రయోగం కన్పిస్తుంది - 13,3. ఈ వెళ్ళిపోవడం పూర్వం యూదులు ఐగుప్తునుండి వెళ్ళిపోవడాన్ని

జ్ఞప్తికి తెస్తుంది. అనగా క్రీస్తు ఉత్థానం లేక నిర్గమనం, యూదుల నిర్గమనం లాంటిదన్నమాట.

ఇక, అతడు వంటరిగా తండ్రివద్దకు వెళ్ళిపోడు. మన ప్రతినిధిగా, మనలను తనతో కలుపుకొనే, తండ్రివద్దకు వెళ్తాడు. అతడు ముందుగా మన కొరకు పరలోకంలో ఓ నివాసస్థలం సిద్ధంచేస్తాడు - 14,3. తాను వున్నచోటనే మనంకూడ వుండాలని అతని కోరిక - 17,24. ఈలా యోహాను క్రీస్తువుత్థానాన్ని నూత్ననిర్గమనంగా భావించాడు.

క్రీస్తు ద్వారా మనంకూడ తండ్రి చెంతకు తిరిగిపోతాం. ప్రభువు ఉత్థానాన్ని వర్ణిస్తూ పౌలు "మరణంలో నిద్రించే వారిలో ప్రథమ ఫలంగా క్రీస్తు మృత్యువునుండి లేవనెత్తబడ్డాడు" అన్నాడు - 1కొ 15,20. ఈ వాక్యం భావమిది. యూదులు ప్రథమ ఫలాల పండుగనాడు పొలంలో పండిన మొదటి వెన్నులను దేవళంలో అర్పించేవాళ్లు. ఈ వెన్నులు పండిన పంటనంతా సూచిస్తాయి. పిడికెడు వెన్నులద్వారా పండిన పంటంతా దేవునికే అర్పింపబడిందని సూచింపబడింది. ఉత్థానుడైన క్రీస్తుకూడ మానవజాతిలో మొదటి వెన్నులాంటివాడు. అతని ఉత్థానం మానవులమైన మనందరి ఉత్థానాన్ని సూచిస్తుంది. మానవజాతికి ప్రతినిధియైన క్రీస్తు ద్వారా మనమందరమూ ఓనాడు తండ్రి గృహాన్ని చేరుకొంటాం.

మనం ఈ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందుతాం. అతన్ని విశ్వసించి అతనితో ఐక్యమౌతాం. కనుక అతనితో పాటు మనమూ ఉత్థానమై అతని వెనువెంట తండ్రి ఇంటిలో అడుగుపెడతాం. ఈ ఉత్థానదశ మనకు ఈ జీవితంలోనే పాక్షికంగా సిద్ధిస్తుంది. చనిపోయాక ఆ దశ మనకు పూర్తిగా లభిస్తుంది.

మనం మామూలుగా క్రీస్తు మనలను తన మరణం ద్వారా మాత్రమే రక్షించాడు అనుకొంటాం. ఇది పొరపాటు.

అతడు మనలను తన ఉత్థానంద్వారా గూడ రక్షించాడు. క్రీస్తు మరణంద్వారా మనకు పాపపరిహారం జరుగుతుంది. అతని ఉత్థానంద్వారా మనకు వరప్రసాదం లభిస్తుంది. ఈ పాపపరిహారమూ ఈ వరప్రసాదమూ - ఇవి రెండూ కలిసే రక్షణం.

క్రీస్తు మరణోత్థానాలు రెండూ కలసే మనలను రక్షిస్తాయి. మన పాపం మన రక్షణానికి అవరోధంగా వుంటుంది. క్రీస్తు మరణం ఈ యవరోధాన్ని నిర్మూలిస్తుంది. ఓమారు ఈ యవరోధం తొలగిపోయాక ఇక మనకు రక్షణం కలుగుతుంది. క్రీస్తు ఉత్థానం మనకు నూత్న జీవాన్ని వరప్రసాదాన్నీ దయచేసి ఈ రక్షణాన్ని సంపాదించి

పెడుతుంది. ఈలా అతని మరణోత్థానాలు రెండూ మన రక్షణకు తోడ్పడతాయి. మరణం పాప నిర్మూలనాన్నీ, ఉత్థానం వరప్రసాదాన్నీ దయచేస్తాయి. ఈ భావాన్నే పౌలు "మన పాపాలకు అతడు మరణానికి అప్పగింపబడ్డాడు. మనలను నీతిమంతులనుగా చేయడానికి అతడు మరల లేపబడ్డాడు" అని చెప్పాడు - రోమా 4,25. ఈ భావాన్నే లూకా కూడ "క్రీస్తు శ్రమలనుభవించిన పిదప మహిమలో ప్రవేశింపవలసి వుంది" అనే వాక్యంలో పేర్కొన్నాడు - 24,26.

ఇప్పుడు క్రైస్తవ ప్రపంచానికి క్రిస్మసు పెద్ద పండుగయింది. కాని తొలిశతాబ్దంలో క్రిస్మసుకంటె ఉత్థానం పెద్దపండుగ. అనగా క్రీస్తు ఉత్థానం క్రైస్తవులకు ప్రధాన సంఘటన మన్నమాట. ఇప్పుడు జ్ఞానస్నానం దివ్యసత్ప్రసాదం పాపసంకీర్తనం మొదలైన సంస్కారాలన్నిటిలోను పనిచేసేది ఉత్థానక్రీస్తే. మనకు వరప్రసాదం లభించేది అతనినుండే. శ్రీసభకు అధిపతి అతడే. మనం మోక్షంలో చేరుకొనేది గూడ అతని సన్నిధినే. అలాంటి ఉత్థాన క్రీస్తుని క్రైస్తవ భక్తుడు అనుభవానికి తెచ్చుకోవాలి.

ఇక్కడ ఇంకో విషయంకూడ చెప్పాలి. వేదగ్రంథం క్రీస్తు మూడవరోజు జీవంతో లేచాడని చెప్తుంది - 1కొ 15,4. ఇది కేవలం మనుష్యుల కర్థమయ్యేరీతిలో చెప్పిన వాక్యం. క్రీస్తు శరీరం భూమిలో క్రుళ్ళిపోలేదని, అతడు మళ్ళా సజీవుడై లేచాడనీ మాత్రమే ఈ వాక్యం భావం. యథార్థంగా జరిగిందేమిటంటే, క్రీస్తు మరణించినప్పుడే ఉత్థానమయ్యాడు. అతని మరణానికీ, ఉత్థానానికీ మధ్య వ్యవధియేమీలేదు. అతని మరణమే అతని ఉత్థానంకూడ.

క్రీస్తు మరణమూ ఉత్థానమూ వస్తుతః ఒకే సంఘటనం. కాలరీత్యా మాత్రం దాన్ని రెండు సంఘటనలుగా జెప్పారు. అనగా అతని మరణానికీ వుత్థానానికీ మధ్య వ్యవధి వున్నట్లుగా వర్ణించారు. అలా వర్ణించకపోతే క్రీస్తు మనకు నిజంగా మరణించినట్లుగా కన్పించడు. అతని మరణం నిజమైందిగా చూపట్టదు. మన కన్నులు ఆ మరణాన్ని చూడలేదు కనుక మనం దాన్ని నమ్మం. కావున మనకు నమ్మకం కలగడంకోసం వేదగ్రంథం క్రీస్తు మరణోత్థానాలను వేరువేరు సంఘటనలనుగా పేర్కొంటుంది. వస్తుతః మాత్రం అవి ఒకే సంఘటనం. అతని మరణమూ ఉత్థానమూ ఏకకాలంలో జరిగిపోయాయి.

## 2. ఆత్మను పొందిన క్రీస్తు

మొదటి ఆదాము జీవించే ప్రాణి అయ్యాడు. కాని కడపటి ఆదాము జీవమిచ్చే ప్రాణి అయ్యాడు అని వ్రాసాడు పౌలు -1కొరి 15,45. సృష్ట్యాదిలో దేవుడు మట్టిముద్దలోనికి శ్వాస ఊదగా అది జీవించే ప్రాణి ఐంది. అతడే ఆదాము - ఆది 2,7. అతడు ప్రాకృతిక మానవుడు. తనకుతాను జీవించినవాడు. ఇతనిద్వారానే మనకు ప్రాకృతిక జీవం లభించింది. ప్రభువు మళ్ళా పిడికెడు మట్టిముద్దలోనికి, అనగా మృతదేహంలోనికి, శ్వాస ఊదాడు. ఈ మృత దేహానికి గూడ జీవం లభించింది. అతడే ఉత్థానక్రీస్తు. కాని తొలి ఆదాములాగ ఈ కడపటి ఆదాము కేవలం తనకుతాను జీవించే ప్రాణి కాలేదు. మనకు జీవమిచ్చే ప్రాణి అయ్యాడు. అక్కడ దేవుడు రెండుసారులు ఊదిన శ్వాస పరిశుద్ధాత్మే. ఆ యాత్మద్వారానే తొలి ఆదాము రెండవ ఆదాము ఐన మృతక్రీస్తూ సజీవులయ్యారు. అనగా ఉత్థాన సమయంలో క్రీస్తు ఆత్మతో నిండిపోయాడు. అలా తాను పొందిన ఆత్మనే అతడు మనమీద కుమ్మరిస్తాడు.

ఇక్కడ ఇద్దరు ఆదాములకూ వున్న వ్యత్యాసాన్ని గుర్తించాలి. తొలి ఆదాము తనకుతాను జీవించాడు. తన భౌతిక జీవాన్ని మనకుకూడ అందించాడు. కాని ఉత్థానక్రీస్తు తనకుతాను జీవించడం మాత్రమేకాదు. మనకుకూడ జీవమిచ్చేవాడు అయ్యాడు. అతడిచ్చే జీవం భౌతికమైంది కాదు, ఆధ్యాత్మికమైంది. అనగా వరప్రసాద సంబంధమైంది. ఇదే పరిశుద్ధాత్మ. అనగా ఉత్థానక్రీస్తు స్వయంగా ఆత్మను పొంది తాను పొందిన ఆత్మను మనకుకూడ దయచేస్తాడు. ప్రభువే ఆత్మ అని వ్రాసాడు పౌలు - 2 కొ 3,17. ఇక్కడ క్రీస్తు ఆత్మ ఐపోయాడని భావంకాదు. ఆత్మతో పూర్ణంగా నిండిపోయాడని అర్థం. తాను నింపుకొనిన ఆ యాత్మనే అతడు మనకుకూడ ప్రసాదిస్తాడు.

యోహాను కూడ క్రీస్తు ఆత్మతో నిండిపోతాడనీ, అలా నిండిపోయిన ఆత్మను మనకూ ప్రసాదిస్తాడనీ చెప్పాడు. "దప్పిక గొన్నవాడు నాయొద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు. నన్ను విశ్వసించేవాని అంతరంగంలోనుండి జీవజల ప్రవాహం పొంగిపారుతుంది అన్నాడు ప్రభువు. అతడు తన్ను విశ్వసించేవాళ్ళు పొందబోయే ఆత్మనుగూర్చి ఈలా చెప్పాడు" - 7,38-39. ఇక్కడ జీవజల ప్రవాహం అంటే పరిశుద్ధాత్మే. ఈ యాత్మ క్రీస్తు హృదయంలోనుండి భక్తుని అంతరంగంలోకి పారుతుది. అనగా ఉత్థానక్రీస్తు మనకు ఆత్మనిస్తాడని భావం. క్రీస్తు ఉత్థానమయ్యాడు అంటే ప్రప్రథమంగా అతడు ఆత్మను

పొందాడనే భావం. ఉత్థానానికిముందు అతడు దాసునిరూపంతాల్చిన సేవకుడు. కాని ఇప్పుడు మహిమను పొందిన ప్రభువు – ఫిలి 2,7.

## 3. క్రీస్తు ఉత్థానం మన ఉత్థానంకూడ

"క్రీస్తుని మరణంనుండి లేవనెత్తిన దేవుని యాత్మే కనుక మీలో వున్నట్లయితే, క్రీస్తుని మృతులలోనుండి లేవనెత్తినవాడు మీలోవున్న తన ఆత్మద్వారా మీ మృతదేహాలకు కూడా జీవం దయచేస్తాడు" – రోమా 8,11. తండ్రి క్రీస్తు మృతదేహాన్ని ఆత్మద్వారా లేపాడు. అదే ఆత్మ మనలో కూడా వుంది. కనుక తండ్రి ఆత్మద్వారా క్రీస్తుని లేపినట్లే మనలనూ లేపుతాడు. క్రీస్తు ఆత్మ మనలోవుండి మన దేహాన్ని ఉత్థానానికి సిద్ధం చేస్తూవుంటుంది – రోమా 8,23. ఈ రీతిగా క్రీస్తు ఉత్థానం మనమీద సోకి మనకు కూడ ఉత్థానాన్ని సాధించిపెడుతుంది. మనం అతని జ్ఞానదేహ మౌతాంగదా!

ఇంకా ఉత్థానక్రీస్తు దేహంకూడ మనకు ఉత్థానాన్ని ఆర్జించి పెడుతుంది. అదే దివ్యసత్ప్రసాదం. ఈ దివ్యసత్ప్రసాదం మనలను అంతిమ దినాన లేపుతుంది – యోహా 6,54.

విశ్వాస సంగ్రహంలో శరీరం ఉత్థానాన్ని విశ్వసిస్తున్నాను అని చెప్తాం. మన మానవజాతికి శిరస్సూ ప్రతినిధీ ఐన క్రీస్తు ఈవరకే ఉత్థానమయ్యాడు. అతని ప్రభావం వలన మనంకూడ ఓనాడు ఉత్థానమౌతాం. ప్రభువు తల్లి ఈ వరకే ఉత్థాపన భాగ్యానికి నోచుకొంది. మనకు ఆ శుభదినం ఇంకా రాలేదు. కాని ఆ పునీతమాత మనకు ఆదర్శంగా వుంటుంది. ఆమెనులాగే మనలనుకూడ ప్రభువు జీవంతో లేపుతాడు.

## 4. ఉత్థాన జీవితపు బాధ్యతలు

1. ఉత్థాన జీవితం నైతికమైన బాధ్యతలను తెచ్చిపెడుతుంది. "మీరు క్రీస్తుతోపాటు సజీవులుగా లేవనెత్తబడ్డారు. కనుక మీ హృదయాలను పరలోకంలోని వస్తువులవైపు మరల్చండి. అక్కడ క్రీస్తు దేవుని కుడిప్రక్కన సింహాసనం మీద ఆసీనుడై వున్నాడు. కనుక మీరు మీ మనస్సులను ఈ భూమిమీది వస్తువులమీద కాక అక్కడ పరలోకంలోని వస్తువులమీద లగ్నం చేసికొనండి" అన్నాడు పౌలు – కొలో 3,1-2. మనం ఉత్థానక్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందుతాం. అప్పటినుండి అతని ఉత్థానం మనమీద

సోకుతుంది. కనుక జ్ఞానస్నాన సమయంనుడే మనం నైతిక జీవితం జీవించాలి. పూర్వం యూదులు నిబంధనం వలన మోషే ధర్మశాస్త్రం ప్రకారం జీవింప బాధ్యులయ్యారు. ఉత్థాన క్రీస్తులోనికి పొందే జ్ఞానస్నానమే మన నిబంధనమౌతుంది. కనుక ఈ జ్ఞానస్నానంనుండి మనం రెండవ మోషేయైన క్రీస్తు కట్టడలు పాటించాలి.

2. ఉత్థానక్రీస్తు ఆత్మద్వారా పనిచేస్తాడు. కనుక నైతిక జీవితంలో మనలను నడిపించేదిగూడ ఆత్మే. పాపపుణ్యాల విషయంలో మన అంతరాత్మను ప్రబోధించేది ఆ పరిశుద్ధాత్మే. మోషే ధర్మశాస్త్రం రాతిపలకమీద వ్రాయబడింది. కాని క్రీస్తు ధర్మశాస్త్రం ఆత్మచే మన హృదయం మీదనే వ్రాయబడుతుంది. కనుక మనం ఆ యాత్మ ప్రబోధం ప్రకారం నడుచుకొంటూ నిర్మల జీవితం గడపాలి.

3. ఇప్పుడు క్రీస్తు పరలోకంలో తండ్రి ప్రక్కన ఆసీనుడై యున్నాడు. కనుక మన హృదయాలనుగూడ ఈ భూమి మీది వస్తువులమీదినుండి వైదొలగించి ఆ పరలోకంలోని వస్తువులమీదికి మరల్చుకోవాలి. ఇది చాల దొడ్డ భాగ్యం. కనుకనే కీర్తనకారుడు

"మోక్షంలో మాత్రం నీవుదప్ప ఇంకెవరున్నారు?
ఈ లోకంలో నీవు దప్పితే మరొకటి నాకు రుచించదు"

అన్నాడు - 73,25. ఈ మనస్తత్వం మనకుకూడ అబ్బితే ఎంత బాగుంటుంది!

4. ఉత్థానం దేహానికి సంబంధించింది. కనుక మన దేహాన్ని పవిత్రంగా వుంచుకోవాలి. ప్రస్తుతం ప్రపంచంలో నరదేహం కామవస్తువుగా మారిపోయింది. సినిమా, టీవీ ప్రకటనలు మొదలైన ప్రచార సాధనాల్లోనైతేనేమి, రోజువారి అలంకరణ విధానంలోనైతేనేమి మానుష దేహం - విశేషంగా స్త్రీదేహం - పశుప్రాయమైన కామాన్ని రెచ్చగొట్టే సాధనంగా పరిణమించింది. ఈలాంటప్పుడు క్రైస్తవ భక్తులు తమ దేహాన్ని చాల పవిత్రంగా వుంచుకోవాలి. ఈ దేహం జ్ఞానస్నానంనుండే ప్రభువుతో ఐక్యమౌతుంది. దీన్ని దివ్యసత్ప్రసాదంతో పోషిస్తాం. ఇది పవిత్రాత్మకు ఆలయం. ఇది మళ్ళా ఉత్థానమై దేవుని సన్నిధిలో నిలుస్తుంది. ఇది ప్రభువుకి చెందింది. పవిత్రమైంది. ఈలాంటి శరీరాన్ని వ్యభిచారం మొదలైన అపవిత్ర కార్యాలతో అమంగళపరచకూడదు- 1కొ 6,13. ఉత్థానక్రీస్తూ అతని ఆత్మా మనమీద పనిచేసి ఈ లోకంలో మనం విశుద్ధంగా జీవించే భాగ్యం దయచేస్తారు. ఈ భాగ్యంకోసం మనం భక్తితో ప్రార్థించాలి.

# ప్రార్థనా భావాలు

1. క్రీస్తుని అనుసరించేవాళ్ళు క్రైస్తవులు. కాని మనం ఏనాడో గతించి కాలగర్భంలో కలిసిపోయిన నాయకుణ్ణి అనుసరించం. మన నాయకుడైన క్రీస్తు కేవలం రెండు వేలయేండ్లనాడు జీవించినవాడు మాత్రమేకాదు. అతడు ఈనాడు కూడ తిరుసభలో సజీవుడై వున్నాడు. ఉత్థానంద్వారా మన ఆధునిక ప్రపంచంలో, మన మధ్యలో ప్రత్యక్షమై వున్నాడు. తన ఆత్మద్వారా నిత్యం మనకు ప్రేరణం పుట్టిస్తుంటాడు. అలాంటి సజీవనాయకుడూ చైతన్యమూర్తి ఐన క్రీస్తుని అనుసరించే భాగ్యం కలిగినందుకు మనమెంతైనా సంతోషించాలి.

2. ఉత్థానం క్రీస్తు మృత్యువుమీద విజయం సాధించాడని తెలియజేసేది మాత్రమేకాదు. అతడు దేవుడని రుజువుచేసేది మాత్రమే కాదు. అతని శ్రమలకుగాను తండ్రి అతన్ని బహూకరించాడని తెలియజెప్పేది మాత్రమేకాదు. అది ప్రధానంగా మన రక్షణ సంఘటనం. ఉత్థానంద్వారానే మనకు పాప విమోచనం కలిగింది. ఈ సంఘటనమే కనుక లేకపోయినట్లయితే మనమింకా మన పాపాల్లోనే వుండిపోయేవాళ్ళం. మన విశ్వాసమంతా వ్యర్థమైపోయేది - 1కొ 15,17. ఈలా మన రక్షణానికి పట్టుగొమ్మయైన ఈ దైవరహస్యాన్ని మనం గాఢభక్తితో విశ్వసించాలి.

3. క్రీస్తు నూత్న నరజాతికి జీవనదాత. మనుష్యావతారం ద్వారా ఆ జీవనదాత మొట్టమొదటిసారిగా మన నరజాతిలోనికి ప్రవేశించాడు. సిలువమీద చనిపోవడంద్వారా అతడు రక్షణావరోధాలను నిర్మూలించాడు. నరులు దివ్యజీవాన్ని స్వీకరించడంలో వున్న అడ్డంకులన్నీ తొలగించాడు. కడన ఉత్థానంద్వారా అతడు మనకు దివ్యజీవాన్ని ప్రసాదిస్తాడు. ఈ యంశాన్నిగూర్చే హెబ్రేయులజాబు "అతడు పరిపూర్ణుడై తనకు విధేయులైన వారికందరికి నిత్యరక్షణకారకుడయ్యాడు" అని చెప్తుంది - 5,9. ఈ వాక్యం భావం ప్రకారం ఉత్థానం ద్వారా క్రీస్తు పరిపూర్ణుడౌతాడు. ఆ పిమ్మట మనకు రక్షణం దయచేస్తాడు. క్రీస్తు దయచేసే రక్షణమూ దివ్యజీవనమూ ఏమిటంటే వరప్రసాదమూ పవిత్రతాను. నేడు మనం క్రీస్తునుండి ఈ దివ్యజీవాన్ని అందుకోవడానికి సంసిద్ధంగా వుండాలి.

# 8. క్రీస్తు మోక్షారోహణం

క్రీస్తు మోక్షారోహణం ప్రధానంగా అతని మహిమను తెలియజేస్తుంది. మనమూ అతని మహిమలో పాలు పొందుతాం. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. మోక్షారోహణ సంకేతాలు

అపోస్తలుల చర్యల గ్రంథం 1,9-14 క్రీస్తు మోక్షారోహణాన్ని వర్ణిస్తుంది. ఇక్కడ "నలువదినాళ్ళు" "మేఘం" "దేవదూతలు" అనే మాటల భావం పరిశీలించిచూద్దాం. ప్రభువు మరణానికి పిమ్మట నలభై రోజులదాకా శిష్యులకు దర్శనమిస్తూ వచ్చాడు - 1,3. అతడు ఈ లోకంలో సేవకు పూనుకోకముందు నలువదినాళ్లు ఎడారిలో సంసిద్ధమయ్యాడు. అలాగే పరలోకంలో తండ్రి యెదుట సేవకు పూనుకోకముందు మళ్ళా నలువదినాళ్ళు సిద్ధమయ్యాడు. ఈ నలభై ఖచ్చితంగా నలభైరోజులనుగాదు, సుదీర్ఘకాలాన్ని సూచిస్తుంది. యూదులకు నలభై పరిపూర్ణమైన సంఖ్య.

ప్రభువు ఒలీవ కొండమీద నుండి మోక్షారోహణం చేసాడు. పూర్వం ఈ కొండమీదినుండి ప్రభువు తేజస్సు యెరూషలేమును వీడిపోతుండగా యెహెజ్కేలు ప్రవక్త చూచాడు - యెసే 11,23. ఇప్పుడు మళ్ళా కొండమీది నుండే తండ్రి తేజస్సు ఐన క్రీస్తు కూడ యెరూషలేము వీడి వెళ్ళిపోయాడు.

మోక్షానికి ఎక్కిపోతున్న క్రీస్తుని ఓ మేఘం కప్పివేసింది - 1,9. బైబుల్లో మేఘం దైవ సాన్నిధ్యానికి గుర్తు. ఇదే మేఘం క్రీస్తు జ్ఞానస్నాన సమయంలో దివ్యరూపధారణ సమయంలోను కన్పిస్తుంది. ఈ సందర్భంలో ఇద్దరు దేవదూతలుకూడ శిష్యులకు కన్పించారు. వీళ్ళు క్రీస్తు సమాధి చెంత పుణ్యస్త్రీలకుకూడ దర్శనమిచ్చారు. బైబుల్లో దేవదూతలుకూడ దైవసాక్షాత్కారానికి గుర్తుగా వుంటారు.

క్రీస్తు ఉత్థానము మోక్షారోహణము వేరువేరు కార్యాలు కాదు. అవి రెండు ఒకే సంఘటనం. క్రీస్తు ఉత్థానం కాగానే తండ్రి సన్నిధినికూడ చేరుకొన్నాడు. ఐనా అతడు ఇంకా నలువదినాళ్లు శిష్యులతో మెలుగుతూ వాళ్ళకు దర్శనమిస్తూ వచ్చాడు. ఆ దర్శనాల్లో చివరిదాన్ని ఇక్కడ లూకా మోక్షారోహణంగా వర్ణించాడు. ఆ మీదట ప్రభువు మళ్ళా భౌతికంగా శిష్యులకు కన్పించడు.

క్రీస్తు తండ్రివలన పరలోకానికి చేర్చబడ్డాడు - 1,11. అది అతడు పొందిన మహిమ. పూర్వం అతడు విధేయుడై మోక్షంనుండి మన మంటిమీదికి దిగివచ్చాడు. ఆ విధేయతకూ వినయానికీ బహుమానంగా తండ్రి ఇప్పుడు క్రీస్తుని మోక్షానికి కొనిపోయాడు.

ఆ మోక్షంలో అతడు తండ్రి కుడి ప్రక్కన కూర్చున్నాడు - మార్కు 16,19. బైబుల్లో "కూర్చోవడం" పని పూర్తయిందని తెలియజేస్తుంది. ఇక్కడ క్రీస్తు రక్షణకార్యాన్ని పూర్తిచేసాడని భావం. క్రీస్తు తండ్రి "కుడిప్రక్కన" కూర్చున్నాడు అంటే ఆ తండ్రి మహిమలో పాలుపొందాడని భావం. పూర్వం అతడు వినయంతో బానిసరూపం చేకొన్నాడు. నీచమైన సిలువ మరణం అనుభవించాడు. అందుకుగాను ఇప్పుడు కీర్తిని పొందాడు. తండ్రితో పాటు తానూ రాజ్యపాలనం చేస్తాడు.

## 2. కొత్త సాన్నిధ్యం

క్రీస్తు నలభై రోజులపాటు శిష్యులకు కన్పిస్తూవచ్చాడు అన్నాం. ఈ కాలంలో వాళ్ళు క్రీస్తు ఎడబాటుకి అలవాటు పడ్డారు. ఆ పిమ్మట ప్రభువు మోక్షారోహణం చేయగా అతని సాన్నిధ్యం వాళ్ళనుండి పూర్తిగా వైదొలగింది. ఇక క్రీస్తు శారీరకంగా శిష్యులకు కన్పించడు. ఐనా క్రీస్తు భౌతిక సాన్నిధ్యానికి మారుగా ఆధ్యాత్మిక సాన్నిధ్యం ప్రారంభమైంది. అనగా అతడు ఆత్మద్వారా శిష్యులతో నివసించడం మొదలెట్టాడు. ప్రభువు ఈ యాత్మనుగూర్చి శిష్యులకు ముందుగానే తెలియజేసాడు. తండ్రిచెంతనుండి తనకు బదులుగా మరో ఆదరణకర్తను పంపుతానని చెప్పాడు - యోహా 14,16. తాను వెళ్ళిన పిదపనేగాని ఆ యాదరణకర్త రాదన్నాడు - 16,7. ఈ యాదరణకర్త క్రీస్తు మోక్షారోహణం చేసిన పిదప శిష్యులమీదికి దిగివచ్చాడు. ఇకమీదట క్రీస్తు ఈ యాత్మద్వారా శిష్యులకు ప్రత్యక్షమౌతాడు. ప్రభువు లోకాంతము వరకు శిష్యులతో వుంటానని మాట యిచ్చాడు కదా? - మత్త 28,20. ఏలా వుంటాడు? పరిశుద్ధాత్మద్వారానే. శారీరక రూపంలో గాదు. వరప్రసాద రూపంలో. ఆయాత్మ క్రీస్తుని శిష్యులకు అందిస్తుంది. ఇప్పుడు శ్రీసభలో క్రీస్తు ప్రత్యక్షమైయుండేదికూడ ఆ యాత్మద్వారానే.

క్రీస్తు మనలను అనాథులనుగా వదిలివేయనన్నాడు - యోహా 14,18. అతడు మన చెంతకు వచ్చినపుడు తండ్రిని విడనాడలేదు. అలాగే మోక్షారోహణమై మరల తండ్రి చెంతకు వెళ్ళినపుడు మనలను విడనాడడు. తన ఆత్మద్వారా మనకు ప్రత్యక్షమౌతుంటాడు.

## 3. క్రీస్తు మహిమ మన మహిమ

క్రీస్తు బానిస రూపాన్ని స్వీకరించి క్షుద్రమైన సిలువ మీద చనిపోయాడు. కనుక తండ్రి క్రీస్తు వినయానికి మెచ్చుకొని అతనికి ఉత్థానాన్ని ప్రసాదించాడు. అతన్ని ఆరోహణంచేసి తన చెంతకు చేర్చుకొన్నాడు. ప్రభువు అనే అతని సొంత నామాన్నే

క్రీస్తుకిచ్చి అతన్ని సత్కరించాడు. సమస్త ప్రాణులూ ఇకమీదట ఆ ఉత్థాన ప్రభువు ముందట మోకాలు వంచాలి -ఫిలి 2,6-11. ఇకమీదట మనకు ఆ ప్రభువు ద్వారా తప్ప మరియొక వ్యక్తిద్వారా రక్షణం సిద్ధించదు - అచ 4,12. అది క్రీస్తు మహిమ.

ఇక, క్రీస్తు మహిమ అతన్ని విశ్వసించే భక్తులకు కూడ సంక్రమిస్తుంది. మానవజాతి కంతటికీ ప్రథమఫలమో అన్నట్లు క్రీస్తు ఉత్థానమై మహిమను పొందాడు - 1కొ 15,20. మోక్షారోహణం చేసాడు. యూదులు దేవాలయంలో అర్పించిన ప్రథమఫలాలు పంటనంతటినీ సూచిస్తాయి. అలాగే క్రీస్తు ఉత్థానం మానవజాతి ఉత్థానాన్నంతటినీ సూచిస్తుంది. కనుక అతని ఉత్థానమూ మోక్షారోహణమూ మనకుకూడ సంక్రమిస్తాయి. మనంకూడ అతని మహిమలో పాలు పొందుతాం.

ఒక్క నరులు మాత్రమేకాదు భౌతిక సృష్టికూడ మోక్షారోహణ క్రీస్తువలన మహిమను పొందుతుంది. ఈ మహిమ కోసమే సృష్టి అంతా కాచుకొనివుంది - రోమా 8, 22. క్రీస్తు మనుష్యావతార మెత్తినపుడు మన భౌతిక శరీరాన్ని స్వీకరించాడుగదా? అందువలన ఈ భౌతిక ప్రపంచం కూడ అతని శరీరంలో భాగమైంది. ఇప్పుడు మోక్షంలో మహిమను పొందిన అతని ఉత్థాన శరీరం ఓనాడు ఈ భౌతిక ప్రపంచానికికూడ మహిమను చేకూర్చి పెడుతుంది. కాని అది ఎప్పుడు జరుగుతుందో, ఏలా జరుగుతుందో మనకు తెలియదు.

ప్రభువు "నేను భూమిమీదినుండి పైకెత్తబడితే అందరినీ నా యొద్దకు ఆకర్షించుకొంటాను" అన్నాడు - యోహా 12,32. మోక్షంలోని ప్రభువు మనలనందరినీ తన చెంతకు ఆకర్షిస్తాడు. మనలనుకూడ ఆ తండ్రి కుడిపార్శ్వాన కూర్చోబెడతాడు. అదే క్రీస్తు వలన మనం పొందే మహిమ.

ఇంకా ప్రభువు "నా తండ్రి గృహంలో అనేక నివాస స్థలాలున్నాయి. నేను వెళ్ళి మీకుకూడ ఓ నివాసం సిద్ధం చేస్తాను. నేను మళ్ళా వచ్చి మిమ్ము అక్కడికి తీసుకొని వెళ్తాను" అని చెప్పాడు - యోహా 14,2-3. ఆ నివాసస్థలం మోక్షమే. అనగా మోక్షం చేరుకొన్నపుడు మన మహిమ సంపూర్ణమౌతుంది.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు నికొదేముతో మాట్లాడుతూ "పరలోకం నుండి దిగివచ్చిన మనుష్యకుమారుడు తప్ప ఎవడూ పరలోకానికి ఎక్కిపోలేదు" అని చెప్పాడు - యోహా 3,13. ఈ వాక్యంలో పరలోకం నుండి దిగిరావడమంటే క్రీస్తు మనుష్యావతారం. పరలోకానికి

ఎక్కిపోవడమంటే అతని ఉత్థానమూ మోక్షారోహణమూను. ప్రభువు మోక్షారోహణాన్ని భక్తిభావంతో విశ్వసించే భాగ్యం కొరకు అడుగుకొందాం.

2. క్రీస్తు మోక్షానికివెళ్ళి తండ్రి ప్రక్కన ఆసీనుడయ్యాడు – అచ 5,31. క్రీస్తు జీవిత సంఘటనలు మన జీవితంలోకూడ నెరవేరతాయి. కనుక మనంకూడ అతనితోపాటు మోక్షారోపణంచేసి తండ్రి కుడిపార్శ్వాసన ఆసీనులమౌతాం. ఇక్కడ "ఆసీనులు కావడం" అంటే రాజ్యపాలనం చేయడం. కనుక క్రీస్తుతోపాటు మనంకూడ రాజ్యపాలనం చేస్తాం. కనుకనే పౌలు "దేవుడు క్రీస్తుతోపాటు మనకు కూడ దివ్యలోక పరిపాలనాధికారం అనుగ్రహించాడు" అని చెప్పాడు – ఎఫె 2,6. ఈ భాగ్యం మనకు లోకాంతంలో సిద్ధిస్తుంది. కాని అది సిద్ధించడం మాత్రం ఖాయం. శిర సున్నకాడనే అవయవాలుకూడ వుండాలికదా! కావున క్రీస్తు ఉన్నచోటికే మనంకూడ చేరుకొంటాం. పురాతన చిత్రకారులు క్రీస్తు కర్ణధారియై తిరుసభ అనే నావను మోక్షానికి నడిపిస్తున్నట్లుగా చిత్రించారు. అనగా ఆ ప్రభువు తన భక్తులమైన మనలనుకూడ తానున్నచోటికి కొనిపోతాడని భావం. ఈ భాగ్యానికిగాను మనమెంతైనా సంతోషించాలి.

3. ప్రభువు మోక్షారోహణం చేశాడంటే మనలను విడనాడి వెళ్ళిపోలేదు. అతడు మనల నేనాడూ అనాథులను జేయడు. కనుక అతడు మన ఆశాచిహ్నంగా పరలోకానికి వెళ్ళాడు. అతడు తిరుసభకు అధిపతి. జ్ఞానశరీరానికి శిరస్సు. అనగా మనలనందరినీ తనలో ఇముడ్చుకొన్నవాడు. కనుక అతడు తానున్నకాడికే మనలనుకూడ తీసికొని వెళ్తాడు. మన రోజు వచ్చినపుడు మనంకూడ అతని మహిమలో పాలుపొందుతాం.

4. మన తరపున మనం శారీరకంగా ఈ లోకంలో వసిస్తూన్నా మానసికంగా పరలోకంలో జీవించాలి. మనకు ఈ లోకంలో స్థిరమైన పట్టణమేమీ లేదు. మనం రాబోయే పట్టణంకోసం – అనగా మోక్షం కోసం – ఎదురుచూస్తుండాలి. హెబ్రే 13,14. మనం ఇహలోకానికి చెందిన వాళ్ళంకాదు, పరలోక పౌరులమని గుర్తించాలి – ఫిలి 3,20. భక్తితో అడుగుకొంటేచాలు మోక్షారోహణమూర్తియైన ప్రభువు మనకు ఈ భాగ్యాన్ని దయచేస్తాడు. ఈ మంటి మీద వసించే నరుడు తన హృదయాన్ని పరలోకంవైపు త్రిప్పుకోవడమే ఓ గొప్ప భాగ్యమని చెప్పాలి.

# 9. ఆత్మ ప్రదానం

ఉత్థానక్రీస్తు మనకు ఆత్మను దయచేస్తాడు. ఆయాత్మ తన తరపున తాను మనకు క్రీస్తుని దయచేస్తుంది. మనలను నిరంతరమూ క్రీస్తు చెంతకు నడిపించుకొని పోతూంటుంది. నేడు మనం ఆత్మద్వారా తప్పితే క్రీస్తుని చేరలేం. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. పెంతెకోస్తు

పెంతెకోస్తు మొదట యూదుల పండుగ. పాస్క పండుగ ముగిసాక 50 దినాలకు వాళ్లు ఈ పండుగ జరుపుకొనేవాళ్ళు. గ్రీకులో పెంతెకోస్తు అంటే యాభైయని అర్థం. ఈ పండుగకే వారాల పండుగ అనికూడ పేరు. ఇది తొలిరోజుల్లో వ్యవసాయోత్సవంగా వుండేది. ఈ దినాన యూదులు దేవునికి తొలివెన్నులు కానుకగా అర్పించేవాళ్ళు - నిర్గ 34,22. క్రమేణ ఇది సీనాయి నిబంధనాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనే పండుగగా మారిపోయింది. క్రీస్తు శిష్యులు యెరూషలేములో ఈ పండుగ జరుపుకొంటూండగా ఆత్మవాళ్ళమీదికి దిగివచ్చింది. అప్పటినుండి అది క్రైస్తవుల పెంతెకోస్తుగా మారింది.

పెంతెకోస్తు దినాన ఆత్మ గాలి, నిప్పు, నాలుకల రూపాల్లో శిష్యులమీదికి దిగివచ్చింది. ఇవన్నీ సంకేతాలు. కనుక వాటి భావాన్ని అర్థంచేసికోవాలి. 1. ఆత్మకు హీబ్రూ భాషలో "రువా" అని పేరు. ఈ మాటకు గాలి, ఊపిరి అని అర్థం. సర్వప్రాణులకూ ఊపిరినిచ్చేది ఆత్మ. తాను ప్రాణశక్తినని సూచిస్తూ ఇక్కడ ఆత్మ గాలిరూపంలో దిగివచ్చింది. 2. అగ్ని బైబుల్లో దైవ సాక్షాత్కారానికి గుర్తుగా వుంటుంది. మోషే సీనాయికొండమీదికి వెళ్ళినపుడు పొగల్లో మంటల్లో దేవుడతనికి దర్శనమిచ్చాడు. నిర్గ 19, 18-20. ఇక్కడ ఈ దిగివచ్చిన ఆత్ముడు దేవుడు అని సూచింపబడింది. 3. నాలుక వాక్శక్తిని సూచిస్తుంది. శిష్యులు ఆత్మనుండి వాక్శక్తిని పొందుతారు. ఆ శక్తితోనే తర్వాత క్రీస్తుని బోధిస్తారు.

దేవుడు అంత్యదినాల్లో మానవులందరిమీదా తన ఆత్మను కుమ్మరిస్తాడని యోవేలు పూర్వవేదంలో ప్రవచించాడు. ఆ ప్రవచనం నెరవేరి ఆత్మ దిగివచ్చిందని పేత్రు యెరూషలేమున తన తొలి ప్రసంగంలో పేర్కొన్నాడు - అచ 2,17.

పెంతెకోస్తుతో క్రీస్తు పాస్క సంఘటనం ముగుస్తుంది. అతడు చనిపోయి, ఉత్థానుడై, తండ్రి కుడిపార్శ్వాన్ని చేరుకొని పితనుండి ఆత్మను పొంది, తాను పొందిన ఆత్మను శిష్యులమీద కుమ్మరించాడు - అచ 2,33. కనుక పెంతెకోస్తుతో ప్రభువు ఉత్థానం పరిపూర్ణమైందని చెప్పాలి. ఈ వుదంతంతో ఉత్థానక్రీస్తు రక్షణం వస్తుతః ప్రారంభమౌతుంది. ఈ సంఘటనతోనే తిరుసభకూడ ప్రారంభమౌతుంది. క్రీస్తు తిరుసభమీదికి తన ఆత్మను

పంపాడు. ఆ యాత్మ ఇక తిరుసభను నడిపిస్తుంది. క్రీస్తును తిరుసభకు ప్రత్యక్షం చేస్తుంది. క్రీస్తు ఆత్మద్వారా తిరుసభ సభ్యులను పవిత్రపరుస్తూపోతాడు. విశేషంగా దేవద్రవ్యాను మానాలద్వారా ఈ కార్యం జరుగుతుంది.

పూర్వం మోషే సీనాయి కొండమీద దేవుని నుండి ధర్మశాస్త్రం పొందాడు. ఇప్పుడు పెంతెకోస్తునుండి నూత్న ధర్మశాస్త్రం ప్రారంభమౌతుంది. ఆ పదాజ్ఞలకు బదులుగా ఇక్కడ ప్రేమాజ్ఞ ప్రాముఖ్యంలోకి వస్తుంది. యిర్మీయా పేర్కొన్న నూత్ననిబంధనం ఈ సంఘటనంతో ప్రారంభమౌతుంది - 31,33.

## 2. ఉత్థానక్రీస్తు మనకు ఆత్మను దయచేస్తాడు

క్రీస్తు తాను తండ్రిని చేరుకొని అతని చెంతనుండి ఆత్మను పంపిస్తానని శిష్యులతో చెప్పాడు - యోహా 14,16. తాను వెళ్ళేనేగాని ఆ యాదరణకర్త రాడని పల్కాడు - 16,7. ఆ యాత్ముడు వచ్చి తనకు సాక్ష్యమిస్తాడని నుడివాడు - 15,26. అనగా పరిశుద్ధాత్ముడు శిష్యుల హృదయాల్లో క్రీస్తుని సమర్థిస్తూ మాట్లాడుతాడు.

ఇంకా ప్రభువు "దప్పిక గొన్నవాడు నా వద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు. నన్ను విశ్వసించేవాడి అంతరంగంలో నుండి జీవజల ప్రవాహం పొంగిపారుతుంది" అన్నాడు. ఈ ప్రవాహం ఏమోకాదు, పరిశుద్ధాత్మే. ఈ యాత్మ క్రీస్తునుండి బయలుదేరి భక్తుని హృదయంలోకి ప్రవేశిస్తుంది. కాని పై వాక్యం చెప్పేప్పటికి యేసే యింకా ఉత్థానంకాలేదు. కనుక అతడే ఇంకా తండ్రినుండి ఆత్మను పొందలేదు. అతడు మొదట తాను ఆత్మను పొందిన పిదపగాని ఆ యాత్మను శిష్యులమీద కుమ్మరించడు - 7, 37-39.

యోహాను 7,39 క్రీస్తు ఉత్థానం కాకముందు ఆత్మను పొందలేదని చెప్తుంది. కాని మత్తయి లూకా సువార్తలు అతడు పుట్టువునుండే ఆత్మతో నిండివున్నట్లుగా వర్ణిస్తాయి. ఈ విరుద్ధ భావాలను సమన్వయం చేయడం ఏలా? యోహాను ఆలోచన ప్రకారం క్రీస్తులోని ఆత్మ రెండు విధాలుగా పనిచేస్తుంది. ఆత్మ క్రీస్తులోనే వుండి అతన్ని నడిపించడం ఒక విధానం. ఈ పద్ధతిలో ఆత్మ మొదటినుండీ క్రీస్తులో వుంది. మత్తయి లూకా పేర్కొంది ఈ విధానాన్నే. యోహాను మాత్రం ఈ విధానాన్ని పేర్కొనలేదు. ఇక, ఆత్మ క్రీస్తునుండి మనలోనికి వేంచేసి మనలనుకూడ నడిపించడం రెండవ విధానం. ఈ పద్ధతిలో ఆత్మ మొదటి నుండీ క్రీస్తులో లేదు. అతడు ఉత్థానమైనంక మాత్రమే అతని ఆత్మ మనలోనికి ప్రవేశిస్తుంది. పై యోహాను 7,39 వచనం ఈ రెండవ విధానాన్ని పేర్కొంటుంది.

ఉత్థాన క్రీస్తు తండ్రి కుడిపార్శ్వాన్ని చేరుకొని అతని నుండి తాను ఆత్మను పొందాడు. ఆలా తాను పొందిన ఆత్మను తర్వాత శిష్యులమీద కుమ్మరించాడు. అదే

మొదటి పెంతెకోస్తు - అచ 2,33. మన పెంతెకోస్తు మన జ్ఞానస్నానమే. జ్ఞానస్నాన సమయంలోనే క్రీస్తు తన ఆత్మను మనమీద కుమ్మరిస్తాడు. తర్వాత భద్రమైన అభ్యంగనము పొందినపుడు ఈ యాత్మ యింకా అధికంగా మనమీదికి దిగివస్తుంది. అసలు తొలిరోజుల్లో ఇవి రెండు ఒకే సంస్కారంగా వుండేవి. తరువాత వీటిని రెండుగా విడదీసారు.

## 3. ఆత్మ మనలను క్రీస్తు చెంతకు చేరుస్తుంది

ఉత్థాన క్రీస్తు మనకు ఆత్మనిస్తాడని చెప్పాం. ఆ యాత్మ మనలను మళ్ళా క్రీస్తు చెంతకు కొనిపోతుంది. మనం క్రీస్తుని దేవుణ్ణిగా అంగీకరించేలా చేస్తుంది. అతన్ని విశ్వసించి ప్రేమించేలా చేస్తుంది. క్రీస్తు బోధలను, విశేషంగా అతని మరణోత్థానాలను అర్థంచేసికొనేలా చేస్తుంది. ఆ క్రీస్తుని మనకు ప్రత్యక్షం చేస్తుంది. ఈ భావాలను పరిశీలిద్దాం.

ఎవడైనా నా వద్దకు రావాలి అంటే నా తండ్రి అతణ్ణి ఆకర్షించాలి అన్నాడు క్రీస్తు - యోహా 6,44. ఈ వాక్యంలో "ఆకర్షణం" అంటే ప్రేమే. ఈ ప్రేమే పరిశుద్ధాత్మ. కనుక తండ్రి పరిశుద్ధాత్మద్వారా భక్తులను క్రీస్తువద్దకు రాబడుతూంటాడు. అనగా తండ్రి కోర్కె ప్రకారం ఆత్మ ప్రజలను క్రీస్తు చెంతకు లాగుకొని వస్తూంటుంది. ఆత్మ మనలను తన చెంతకుగాదు, క్రీస్తు చెంతకు రాబడుతుంది. ఆ యాత్ముడు అంత నిస్స్వార్థపరుడు.

పవిత్రాత్మవలన తప్ప ఎవడుకూడ యేసే ప్రభువు అని అంగీకరింపలేడు అన్నాడు పౌలు - 1 కొ 12,3. ఈ వాక్యంలో "ప్రభువు" అంటే రాజుకాదు, దేవుడు. క్రీస్తు దేవుడు అని విశ్వసించే శక్తి మనకు ఆత్మవలన కాని కలుగదు. ఆ రోజుల్లో రోమను ప్రజలు కైసరు చక్రవర్తే ప్రభువు (దేవుడు) అని చెప్తున్నారు. కాని క్రైస్తవులు ఆ వాదాన్ని ఖండించారు. మా ప్రభువు (దేవుడు) కైసరుగాదు క్రీస్తే అన్నారు. అందుకు వాళ్ళు వేదసాక్షులుగా మరణింపవలసి వచ్చింది. సరే, ఆ తొలినాటి క్రైస్తవులకు యేసుని దేవుణ్ణిగా అంగీకరించే శక్తిని ప్రసాదించింది ఎవరు? ఆత్మే. నేడు మనకూ అంతే. "యేసే ప్రభువు" అనే పైవాక్యం పౌలునాడు ఓ చిన్న విశ్వాస సంగ్రహంగా వాడుకలో వుండేది.

పరిశుద్ధాత్మ తన్ను గూర్చి బోధిస్తుంది అన్నాడు క్రీస్తు - యోహా 16,13-14. ఆత్మ క్రీస్తు బోధలను మళ్ళా విప్పి చెప్తుంది. శిష్యులు తమంతట తాము యేసు బోధలను అర్థం చేసికోలేరు. ఆత్మ మళ్ళా విప్పి చేస్తేనేగాని అవి వాళ్ళకు బోధపడవు. విశేషంగా క్రీస్తు మరణోత్థానాలు చాల ముఖ్యమైనవి. అవి అతని జీవితంలో జరగబోయే ప్రధానాంశాలు. కనుక ఆత్మ ప్రభువు మరణోత్థానాల భావాన్ని శిష్యులకు తెలియజేస్తుంది. అలా తెలియజేసి వాళ్ళను "సంపూర్ణ సత్యంలోనికి" నడిపిస్తుంది. బైబుల్లో సత్యమంటే

క్రీస్తే. కనుక ఆత్మ శిష్యులను సంపూర్ణ క్రీస్తులోనికి నడిపిస్తుంది. అనగా శిష్యులు క్రీస్తునీ అతని బోధలనూ సంపూర్ణంగా అర్థం చేసికొంటారని భావం. ఆత్మ క్రీస్తుని గూర్చి బోధిస్తుంది అనే భావం యోహాను మొదటిజాబు 2,27లో కూడ కన్పిస్తుంది.

క్రీస్తు లోకాంతం వరకు క్రైస్తవ సమాజంలో వుంటానని మాటయిచ్చాడు - మత్త 28,20. ఉత్థానమై తండ్రివద్దకు వెళ్ళిపోయిన ప్రభువు మళ్ళా శ్రీసభలో ఎలా నెలకొని వుంటాడు? ఆత్మద్వారానే. నేడు ఆత్మ క్రీస్తుని మనకు ప్రత్యక్షం చేస్తుంది. ఆత్మ యిచ్చే వరప్రసాదం ద్వారా క్రీస్తు మన హృదయాల్లో నెలకొంటాడు. మనం ఆరాధనలో పాల్గొనేపుడూ, పాపసంకీర్తనం దివ్యసత్ప్రసాదం మొదలైన సంస్కారాలను పొందేపుడూ క్రీస్తుని మనకు ప్రత్యక్షం చేసేది ఆ యాత్మే. మనం బైబులు గ్రంథం చదువుకొనేపుడు అతన్ని మనకు సాక్షాత్కారం చేసేది ఆ యాత్మే. వేయేల, ఇప్పుడు ఈ లోకంలో ప్రభువు సాన్నిధ్యమంతా ఆత్మద్వారానే.

ఇలా ఉత్థానక్రీస్తునుండి వెడలివచ్చి మన హృదయాల్లో ప్రవేశించే ఆత్మ మనలను మళ్ళా క్రీస్తు చెంతకు చేరుస్తుంది. ఆ క్రీస్తుని మనకు సాక్షాత్కారం చేస్తుంది. మన తరపున మనం ఆత్మను ప్రసాదించమని క్రీస్తుని అడుగుకోవాలి. ఆ క్రీస్తుని అనుభవానికి తెచ్చుకొనేలా చేయమని ఆత్మనుకూడ అడుగుకోవాలి. ఆత్మ అనుగ్రహించందే క్రీస్తుని మనం అర్థంచేసికోలేం, మన హృదయంలో నిలుపుకోలేం.

## 4. పాస్క పెక్కు సంఘటనలా లేక ఏక సంఘటనమా?

క్రీస్తు పాస్కలో అతని మరణమూ, ఉత్థానమూ, మోక్షారోహణమూ ఆత్మప్రదానమూ అనే పెక్కు కార్యాలున్నాయి. కాని వీటినన్నిటినీ ఏక సంఘటనంగానే భావించాలి. నూత్నవేదంలో రెండు సంప్రదాయాలున్నాయి. యోహాను భావాల ప్రకారం పై వుదంతాలన్నిటినీ ఒకే వొక సంఘటనంగా అర్థంచేసికోవాలి. లూకా భావాల ప్రకారం వీటిని వేరువేరు సంఘటనలుగా గ్రహించాలి. ఈ రెండంశాలను విపులంగా పరిశీలిద్దాం.

యోహాను సువిశేషాన్ని తిలకిస్తే క్రీస్తు మరణమూ ఉత్థానమూ మోక్షారోహణమూ ఆత్మప్రదానమూ ఒకేవొక సంఘటనం అని తెలుస్తుంది. క్రీస్తు మరణించినపుడే ఉత్థానమయ్యాడు. ఉత్థానమైన ఆదివారం రోజుననే అతడు మరియ మగ్దలేనకు కన్పించి "నేను తండ్రివద్దకు ఆరోహణమై పోతున్నాను" అనిచెప్పాడు - 20,17. అదే ఆదివారం అతడు శిష్యులమీదికి శ్వాసనూది మీకు పవిత్రాత్మను పొందండని చెప్పాడు - 20,22. కనుక యోహాను దృష్టిలో క్రీస్తు మరణం నుండి అతడు ఆత్మను పంపేవరకు జరిగిన వృత్తాంతాలన్నీ ఏక కాలంలో జరిగిపోయాయి. కనుక వాటినన్నిటినీ ఏకసంఘటనంగానే భావించాలి.

కాని లూకా సువిశేషం తిలకిస్తే మరో సంప్రదాయం కన్పిస్తుంది. క్రీస్తు మరణించాక మూడు రోజులకు ఉత్థానమయ్యాడు. ఉత్థానమయ్యాక 40 రోజులకు మోక్షారోహణం చేసాడు. ఈ మోక్షారోహణం అతడు శిష్యులకు ప్రసాదించిన తుది శారీరక దర్శనం. దీని తర్వాత వాళ్ళతన్ని మళ్ళా శారీరకంగా చూడరు. ఉత్థానానంతరం 50 రోజులకు అతడు ఆత్మను పంపాడు.

యోహాను దృష్టిలో క్రీస్తు పాస్క వృత్తాంతాలన్నీ కలసి ఒక్క సంఘటనమౌతాయి. లూకా దృష్టిలో అవి పరస్పరవ్యవధికల వేరువేరు సంఘటనలౌతాయి. యోహాను ఈ వుదంతాలన్నిటినీ ఏకంచేసి చెప్పడంవల్ల అతని సువిశేషంలో వాటిని అర్థం చేసికోవడం కొంచెం కష్టంగా వుంటుంది. లూకా వీటిని విడివిడిగా విభజించిచెప్పడంవలన అతని సువిశేషంలో వీటిని అర్థం చేసికోవడం సులభంగా వుంటుంది. కాని లూకాకంటె యోహానే యథార్థానికి దగ్గరగా వుంటాడు. యథార్థంగా క్రీస్తు పాస్క కార్యాలన్నీ ఏకకాలంలోనే జరిగిపోయాయి. అవన్నీ కలసి ఒకే రక్షణ కార్యమౌతాయి. ఈలా యోహాను లూకా భిన్న సంప్రదాయాలను అనుసరించినా అవి పరస్పర విరుద్ధాలు కావు. అవి ఒకదాన్నొకటి సంపూర్ణం చేసికొంటాయి.

తిరుసభ ఆరాధనలో నాల్గో శతాబ్దం వరకు క్రీస్తు పాస్కకార్యాలన్నీ ఏక సంఘటనంగానే పరిగణింపబడ్డాయి. తొలినాటి క్రైస్తవులు క్రీస్తు రక్షణకార్యం అతని మరణంతో ప్రారంభమై ఆత్మ ప్రదానంతో ముగుస్తుందనీ, అది యేక రక్షణక్రియ అనీ భావించారు. నాల్గవ శతాబ్దం నుండి మాత్రమే క్రైస్తవులు ఆ యేకక్రియను భిన్న సంఘటనలుగా విభజించడం ప్రారంభించారు. నేడు మనం వాటిని ఏకక్రియగా గ్రహించాలి.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు ఉత్థానంద్వారా మనకు జీవమీయడానికి సిద్ధమయ్యాడు. మోక్షారోహణంద్వారా ప్రభువుగా సింహాసనాసీనుడయ్యాడు. ఆత్మ ప్రదానంద్వారా మనలను పవిత్రులను చేయడం మొదలుపెట్టాడు. మనకు జీవమీయడం ప్రారంభించాడు. ఈ మూడు కార్యాలు ఒకే రక్షణ సంఘటనమని చెప్పాం. పవిత్రమైన ప్రభువు పాస్క కార్యాలను భక్తిభావంతో ధ్యానంచేసికొనే భాగ్యంకొరకు వేడుకొందాం.

2. పూర్వవేదంలో ఇద్దరు నాయకుల సంప్రదాయం వుంది. పూర్వనాయకుడు ప్రారంభించిన పనిని రెండవ నాయకుడు కొనసాగిస్తాడు. ఉదాహరణకు మోషే దాటిపోతూ యోషువాను యిస్రాయేలు ప్రజలకు నాయకునిగా నియమించాడు.

అతడు ఆ ప్రజను వాగ్దత్తభూమికి చేర్చాడు. ఏలీయా దాటిపోతూ యెలీషాను ప్రవక్తగా నియమించాడు. అతడు గురువుగారి ప్రవచన సంప్రదాయాన్ని కొనసాగించాడు. అలాగే క్రీస్తు తండ్రివద్దకు వెళ్ళిపోతూ పరిశుద్ధాత్మను రెండవ ఆదరణకర్తగా నియమించాడు. క్రీస్తు తర్వాత వచ్చిన ఈ యాత్మ క్రీస్తు రక్షణకార్యాన్ని కొనసాగిస్తుంది. మనలను క్రీస్తు చెంతకు చేరుస్తూంటుంది. లోకాంతం వరకు ఈ కార్యం ఈలాగే కొనసాగాలి. కనుక ఇప్పుడు మనం ఆత్మద్వారా తప్పితే మరో మార్గంలో క్రీస్తుని చేరలేం. కావున ఆ యాత్మపట్ల మనకు తప్పక భక్తి వుండాలి.

3. మనం క్రీస్తుద్వారా ఒకే ఆత్మయందు తండ్రిని చేరుతాం అన్నాడు పౌలు - ఎఫె 2,18. అంటే మనం ఆత్మ సహాయంతో క్రీస్తుని చేరతాం. క్రీస్తుద్వారా తండ్రిని చేరతాం. పూర్వవేదకాలంలో తండ్రి ప్రజలకు మొదటి నాయకుడు. అతని తర్వాత నూత్నవేదకాలంలో క్రీస్తు రెండవ నాయకుడుగా వచ్చాడు. క్రీస్తు తర్వాత పవిత్రాత్ముడు మళ్ళా మూడవ నాయకుడుగా వచ్చాడు. ఇక త్రీత్వంలో నాల్గవ నాయకుడంటూ లేడు. కనుక ఇప్పుడు మనం ఆత్మ ద్వారా క్రీస్తునీ, క్రీస్తుద్వారా తండ్రినీ చేరుకోవాలి. ఇప్పుడు ఆత్మ అనుగ్రహంలేందే క్రీస్తు దొరకడు.

4. ఆత్మ గొప్ప శక్తి. కనుక ప్రభువు శిష్యులతో "పవిత్రాత్మ మీమీదికి వచ్చినపుడు మీరు శక్తిని పొందుతారు" అని పల్కాడు - అచ 1,8. ఆ శక్తితోనే శిష్యులు ప్రభువుని బోధించారు, భూదిగంతాలవరకూ అతనికి సాక్షులుగా నిల్చారు. నేడు మనంకూడ క్రీస్తుకి సాక్షులంగావుండి అతన్ని బోధించాలి అంటే ఆత్మ శక్తి అవసరం. కాని క్రీస్తుని బోధించడమనేది కేవలం ఉపన్యాసాలద్వారానే జరగదు. ఆదర్శవంతమైన క్రైస్తవ జీవితం ద్వారాగూడ జరుగుతుంది. కావున భక్తి విశ్వాసాలతోగూడిన క్రైస్తవ జీవితం జీవించి ప్రభువుకి సాక్షులంగా వుండే భాగ్యాన్ని ప్రసాదించమని ప్రభువు ఆత్మనుండే అడుగుకొందాం.

## 10. క్రీస్తు రాజు

క్రీస్తు పాస్క కార్యాలు అతని మరణంతో ప్రారంభమై అతని రాజపదవితో పరిపూర్ణమౌతాయి. పూర్వవేదంలో తండ్రిలాగే నూత్నవేదంలో కుమారుడుకూడ రాజు. అతని రాజ్యాధికారం ప్రత్యక్షంగా తిరుసభమీదా పరోక్షంగా ఈ విశ్వమంతటిమీదా చెల్లుతుంది. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

# 1. బైబులు బోధలు

1. శిష్యుల తొలినాటిబోధ అపోస్తలుల చర్యల్లో కన్పిస్తుంది. ఈ గ్రంథం ఉత్థానక్రీస్తుని "ప్రభువు" అని పేర్కొంటుంది. ఈ పదంలోనే అతడు రాజు అనే భావం కూడ యిమిడివుంది. పేత్రు యెరూషలేములో ప్రసంగిస్తూ "మీరు సిలువమీద చంపిన ఈ యేసునే దేవుడు ప్రభువుగాను క్రీస్తుగాను నియమించాడు" అన్నాడు - అచ 2,36. క్రీస్తు ఉత్థానమై తండ్రి కుడిపార్శ్వాన్ని చేరుకొని ప్రభువయ్యాడు.

యావే పూర్వవేదంలో యిస్రాయేలు ప్రజలకు ప్రభువు. అనగా అతడు వారికి దేవుడు, రాజుకూడ. నిబంధనం ద్వారా అతడు వాళ్ళకు ప్రభువయ్యాడు. ఇప్పుడు నూత్నవేద ప్రజలకు తండ్రికి మారుగా క్రీస్తు ప్రభువౌతాడు. అనగా అతడు వాళ్ళకు దేవుడూ రాజూ ఔతాడని భావం. ఉత్థానంనుండి అతని రాజ్యం ప్రారంభమౌతుంది. అంతందాకా అతడు తిరుసభలో పరిపాలనం చేస్తాడు.

2. పౌలు క్రీస్తుకి "శిరస్సు" అనే మాట వాడాడు. ఈ సందర్భంలోనే రాజు అనే భావంకూడ ఇమిడి వుంది. దేవుడు సమస్తమూ క్రీస్తు పాదాలక్రింద వుంచాడు. సమస్తానికీ శిరస్సుగా అతన్ని తిరుసభకు అనుగ్రహించాడు. ఆ తిరుసభ క్రీస్తు శరీరం - ఎఫె 1, 22-23. కావున సమస్త సృష్టికీ, తిరుసభకీ క్రీస్తు శిరస్సు. శిరస్సుగానే అతడు తన మరణోత్థానాలనే పాస్కకార్యాలద్వారా తిరుసభను పవిత్రం చేస్తాడు. ఇక్కడ శిరస్సు అంటే నాయకుడు, అధిపతి అనే అర్థం. కనుక రాజు అనికూడ భావం. క్రీస్తు ఆధిపత్యం ప్రత్యక్షంగా తిరుసభమీద చెల్లుతుంది. మిగిలిన విశ్వం మీద పరోక్షంగా చెల్లుతుంది.

3. తొలి మూడు సువిశేషాలూ క్రీస్తుని దావీదు వంశజుణ్ణిగా పేర్కొంటాయి. అనగా అతడు దావీదు వంశంలో పుట్టే రాజు. దేవుడు తండ్రియైన దావీదు సింహాసనాన్ని అతనికి అనుగ్రహిస్తాడు - లూకా 1, 32-33. అతడు దావీదు కుమారుడుగా రాజ్యం చేస్తాడు.

క్రీస్తు పిలాతు తన్ను రాజు అని పిల్వడానికి అంగీకరించాడు- మార్కు 15,2. కాని అతడు కైసరు చక్రవర్తితో పోటీపడేవాడు కాదు - లూకా 23,2. క్రీస్తు బుద్ధిపూర్వకంగానే ఆనాటి రాజకీయాలకు దూరంగా వుండిపోయాడు. ప్రజలు తన్ను రాజును చేయబోగా అతడందులకు అంగీకరింపలేదు - యోహా 6,15. అసలు అతడు లౌకికమైన రాజు కాదు.

4. నాల్గవ సువిశేషంలో యోహాను క్రీస్తుకి "ఎత్తబడ్డం" అనే పదం వాడాడు. ఈ శబ్దంలో అతడు రాజు అనే భావంకూడ ఇమిడివుంది. అతడు "నేను భూమిమీది

నుండి పైకెత్తబడినపుడు అందరినీ నా యొద్దకు ఆకర్షిస్తాను" అన్నాడు - 12, 32-33. ఈ యెత్తబడ్డమే అతని సిలువ. సిలువే అతని సింహాసనం. సిలువ సింహాసనంమీది నుండి అతడు రాజుగా ఏలుతాడు. సిలువలో అతని మహిమ వెల్లడియౌతుంది. సిలువమీదినుండి అతడు అందరినీ తన దగ్గరికి ఆకర్షించుకొంటాడు. పౌలు భావాల ప్రకారం సిలువ క్రీస్తు దైన్యాన్ని సూచిస్తుంది. కాని యోహాను భావాల ప్రకారం, అది అతని మహిమను సూచిస్తుంది. ఇది పెద్ద భేదం. ఇక, క్రీస్తు సిలువమీది కెత్తబడ్డంతో పిశాచరాజ్యం కూలిపోయింది - యోహా 12,31. పిశాచరాజ్య పతనంతో క్రీస్తు రాజ్యం ప్రారంభమౌతుంది.

క్రీస్తుని సిలువవేసేటప్పుడు పిలాతు అతన్ని యథార్థంగా రాజుగా ప్రకటించాడు. అతడు "నజరేయుడైన యేసు, యూదులరాజు" అనే విలాసం వ్రాయించి సిలువ మీద పెట్టించాడు - 19,19.

ఈ రీతిగా నూత్నవేదంలో ప్రభువు, శిరస్సు, దావీదు వంశజుడు, ఎత్తబడ్డం మొదలైన పదాలు క్రీస్తు రాజని తెలియజేస్తాయి.

## 2. పిత్రుపాదుల బోధలు

క్రీస్తురాజు పండుగ 1925లో ప్రారంభమైంది. కాని క్రీస్తు రాజు అనే భావం ప్రాచీనకాలంనుండీ క్రైస్తవారాధనంలో కన్పిస్తుంది. ఈ యారాధనంలో రాజత్వమనేది ఒక బిరుదం కాదు, ఓ సంఘటనం. అనగా క్రీస్తు తన పాస్క కార్యాలద్వారా మహిమను పొంది అధికారాన్ని చేపట్టాడు. రాజుగా చలామణి అయ్యాడు.

తొలి శతాబ్దంలో వాడుకలోవున్న క్రీస్తు స్వరూపాలు కొన్ని దొరికాయి. వాటిల్లో అతడు రథసారథిగా, కర్ణధారిగా, కుడిచేతిని పైకెత్తిచూపించేవాడుగా కన్పిస్తాడు. ఈ భావాలన్నీ అతని రాజత్వాన్ని సూచిస్తాయి. తొలి రోజుల్లో నుండి క్రైస్తవులు అతన్ని రాజుగానే భావిస్తూ వచ్చారు అనడానికి ఇదొక తార్కాణం.

పూర్వవేదంలోని దేవునికి "ఎల్ షడాయి" అని పేరు. సర్వశక్తిమంతుడు లేక మహోన్నతుడు అని ఈ హీబ్రూపదానికి అర్థం. అతనికి "దళాధిపతి" అని మరో పేరుకూడ ఉంది. ఈ పేర్లన్నీ పూర్వవేదపు దేవుడు రాజు అని సూచిస్తాయి. ఇక క్లమెంట్, ఓరిజన్, అతనేష్యస్ మొదలైన తొలి శతాబ్దాల పిత్రుపాదులు ఈ పేర్లను క్రీస్తుకికూడా వాడారు. అనగా పూర్వవేదంలో యావేలాగే నూత్నవేదంలో క్రీస్తు కూడ సర్వశక్తిమంతుడు, రాజు అని భావం. అతడు సర్వసృష్టికి అధిపతి, సర్వాన్నీ తనలో ఇముడ్చుకొనేవాడు. పిత్రుపాదులు క్రీస్తు తిరుసభను ప్రత్యక్షంగా తన ప్రభావంతో నింపుతాడని చెప్పారు. ఆ తిరుసభద్వారా విశ్వాన్ని పరోక్షంగా తన శక్తితో నింపుతాడని చెప్పారు.

## 3. క్రీస్తు ఏలా రాజు?

1. పూర్వవేదంలో తండ్రి ప్రభువు - రాజు. తండ్రి క్రీస్తుని తన ప్రతిరూపంగా లోకంలోకి పంపాడు - కొలో 1,15. కనుక ఆ తండ్రిలాగే అతని ప్రతినిధియైన క్రీస్తుకూడ రాజు.

2. క్రీస్తుకి రాజపదవి జన్మహక్కు, గెల్చుకొన్న హక్కుకూడ. మనుష్యావతార మెత్తినప్పటినుండే అతడు రాజు కనుక రాజపదవి అతని జన్మహక్కు. పైగా మరణోత్థానాల ద్వారాగూడ క్రీస్తు ఆ హక్కుని సంపాదించుకొన్నాడు. అతని పాస్క కార్యాలకు తండ్రి అతన్ని ప్రభువుని చేసాడు - అచ 2,36. కావున రాజపదవి అతడు గెల్చుకొన్న హక్కుకూడ.

3. క్రీస్తు సృష్టికంతటికీ రాజే. అతడు ఇహపరలోకాలకు అధిపతి - ఎఫె 1,21. ఐనా అతని అధికారం ప్రధానంగా ఆధ్యాత్మికరంగానికి చెందింది. "నా రాజ్యం ఈ లోకసంబంధమైంది కాదు" అని అతడే చెప్పుకొన్నాడు- యోహాను 18,36. భౌతిక ప్రపంచంమీద అతని అధికారం పరోక్షంగా మాత్రమే చెల్లుతుంది. ఆర్థిక రాజకీయాధి భౌతిక రంగాలకు ప్రత్యేకమైన నియమాలున్నాయి.

క్రీస్తు ప్రధానంగా నరుల హృదయాల్లో రాజ్యం చేయగోరుతాడు. ఈ లోకపు అధికారుల పాలనం ప్రధానంగా పెత్తనం చెలాయించే రూపంలో ఉంటుంది. కాని క్రీస్తు పాలనం ప్రధానంగా సేవచేసే రూపంలో ఉంటుంది. యథార్థంగా అతడు మనలను ఏలడు, మనకు సేవలు చేస్తాడు- మార్కు 10,42-45. నేడు ప్రభువు తిరుసభలో వుండి నరులందరినీ తన చెంతకు ఆకర్షించుకొంటూంటాడు. వాళ్ళకు పరిచర్యలు చేస్తూంటాడు. ఈ తిరుసభకూడ క్రీస్తు పేరుమీదిగా లోకానికి సేవలు చేస్తూంటుంది.

4. క్రీస్తు రాజ్యాధికారం ఈ విశ్వానికంతటికీ వర్తిస్తుంది. స్వర్గ మర్త్యలోకాలూ, నరులూ, భౌతిక వస్తువులూ అన్నీ అతని పాలనంక్రిందికి వస్తాయి - ఎఫె 1,10. తెయ్యార్ ద షార్డాన్ అనే శాస్త్రజ్ఞుడు క్రీస్తుని గూర్చి చాల గొప్ప భావాలు చెప్పాడు. క్రీస్తు ఈ విశ్వమంతటిలోను వుంటాడు. ఈ విశ్వమంతా క్రమంగా అతనిలోనికి పరిణామం చెందుతూంటుంది. ఈ లోకానికి అతడు తుదిమెట్టు. ఈ ప్రపంచం ఆ తుదిమెట్టును చేరుకోవాలి. అతని లోనికి మారిపోతేనే గాని ఈ జగత్తుకు సార్థక్యం లేదు.

5. క్రీస్తు రాజ్యపదవి లోకాంతంలోగాని పరిపూర్ణం కాదు. లోకాంతంలో అతడు రాజ్యాన్ని తండ్రికి అప్పగిస్తాడు -1 కొ 15,24. ఈ రాజ్యం తిరుసభ, దైవరాజ్యం, సర్వ ప్రపంచంగూడ. కాని యిలా అప్పగించడంతో తిరుసభ అంతం కాదు. పరిపూర్ణమౌతుంది.

క్రీస్తు రాజ్యపదవి కూడ అంతం కాదు. పరిపూర్ణమౌతుంది. అసలు అతని రాజ్యానికి అంతం ఉండదు - లూకా 1, 33.

దేవునికి మానవునికీ మధ్య మధ్యవర్తి క్రీస్తు. అతని మధ్యవర్తిత్వం కలకాలం వుంటుంది. మోక్షంలో మనం అతనిద్వారానే ఎల్లకాలం తండ్రిని దర్శిస్తాం. కనుక అతడు సర్వకాలం మధ్యవర్తి, రాజు.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు నరావతారమెత్తి తండ్రిని తెలియజేసాడు. మరణోత్థానాలకు గురై నరులను రక్షించాడు. మహిమను పొంది రాజయ్యాడు. నరావతారంతో ప్రారంభమైన అతని జీవితం రాజపదవితో పరిపూర్ణమౌతుంది. క్రీస్తు జీవిత సంఘటనలు మనకు రక్షణదాయకా లౌతాయి. కనుక వాటిని భక్తిభావంతో విశ్వసించే భాగ్యాన్ని దయచేయమని ప్రభువుని అడుగుకొందాం.

2. క్రీస్తురాజు పండుగ పూజలోవచ్చే ప్రెఫేస్ ప్రార్థనం ఈలా చెప్తుంది. "క్రీస్తు రాజ్యం సత్యంతోను జీవంతోను కూడింది. పావిత్ర్యంతోను వరప్రసాదంతోను నిండింది. న్యాయం ప్రేమ శాంతి అనే గుణాలతో ఒప్పింది." ఈ రాజ్యం నేటి తిరుసభే. మనం ఈ రాజ్యానికి చెందినవాళ్ళం. ఈ భాగ్యానికి ప్రభువునకు వందనాలు అర్పించాలి.

3. పరలోక జపంలో మీ రాజ్యం వచ్చునుగాక అని చెప్తాం. దైవరాజ్యమూ క్రీస్తు రాజ్యమూ ఒకటే. ఈ రాజ్యం ప్రధానంగా మన హృదయాల్లో నెలకొంటుంది. కాని మన హృదయంలో పిశాచరాజ్యంకూడ వుంటుంది. అది కూలిపోతేనేగాని దైవరాజ్యం మన గుండెల్లో చోటుచేసికోదు - యోహా 12,31. జ్ఞానస్నానంనుండే తండ్రి మనలను "అంధకారశక్తినుండి విడిపించి తన ప్రియపుత్రుని సామ్రాజ్యంలోనికి తోడ్కొని వచ్చాడు" - కొలో 1,13. దీనికి తగినట్లుగా మనం పవిత్ర జీవితం జీవిస్తూ మన హృదయంలో దైవరాజ్యాన్ని పెంపొందించు కొంటూండాలి.

4. మనంకూడ ప్రభువు రాజపదవిలో పాలుపొందుతాం. పరలోకంలో అతనితోపాటు రాజ్యపాలనం చేస్తాం - లూకా 22,29-30. కాని ఈ భాగ్యాన్ని పొందాలంటే మనం ఇప్పటినుండే భక్తివిస్వాసాలతో జీవించాలి. క్రీస్తుని సేవించాలి. అతని యాజ్ఞలు పాటించాలి. అప్పుడు కాని జీవితాంతంలో మనంకూడ ఆ మంచి దొంగలాగే "యేసూ! నీవు నీ రాజ్యంలో ప్రవేశించినపుడు నన్నుకూడ జ్ఞాపక ముంచుకో" అని చెప్పలేం - లూకా 23, 42.

# 11. తిరుహృదయం

తిరుహృదయం క్రీస్తు ప్రేమకు చిహ్నం. మన రక్షణమంతా దానిలో ఇమిడివుంది. మనం తిరుహృదయ భక్తిని పాటించినపుడు క్రైస్తవ పరిపూర్ణతనంతటినీ సాధించి నట్లవుతుంది. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. దేవుని ప్రేమ

తిరుహృదయం అంటే ప్రధానంగా భగవంతుని ప్రేమకథ. కనుక ఆ భగవంతుడు మనలను ప్రేమించేతీరును గూర్చి కొన్ని బైబులు ఆలోకనాలను పరిశీలిద్దాం. ప్రవక్తల బోధల ప్రకారం పూర్వవేదంలోని భగవంతుడు ఓ అమ్మానాన్న లాంటివాడు. "తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను మరచిపోతుందా? తనశిశువును ప్రేమించకుండావుంటుందా? ఒకవేళ తల్లి తాను కనిన బిడ్డను మరచిపోతే పోతుందేమోకాని నేను మాత్రం మిమ్ము మరచిపోను - యెష 49,12. తండ్రి తన కుమారునిమీద కరుణజూపినట్లే ప్రభువు తనకు భయపడేవాళ్ళమీద జాలిచూపుతాడు" - కీర్త 103, 13. మానవులమైన మనకు తెలిసిన ప్రేమల్లో తల్లిదండ్రుల ప్రేమ ఉత్తమోత్తమైంది. పై బైబులు వాక్యాలు రెండూ భగవంతుడు అమ్మ నాన్నలలాంటివాడని తెలియజేస్తాయి. ఇంకా ప్రవక్తలు భగవంతుడు నరులపట్ల చూపే ప్రేమను భర్త భార్యపట్ల చూపే ప్రేమతో పోల్చారు. "నిన్ను సృజించిన ప్రభువే నీ భర్త. నేను ఒక్క క్షణం నిన్ను విడనాడాను. కాని యిప్పుడు శాశ్వత కృపతో నిన్ను కరుణిస్తాను. కొండలు కదిలితే కదలవచ్చుగాక, తిప్పలు తావుదప్పితే తప్పవచ్చు గాక, నా కరుణ మాత్రం నిన్ను విడనాడదు" - యెష 54,5-10. పూర్వవేదంలోని భగవంతుని ప్రేమ ఇంత గాఢమైంది.

ఈ భగవంతుడు తన ఏకైక కుమారుణ్ణి లోకంలోకి పంపాడు. "దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఆ కుమారుణ్ణి విశ్వసించే ప్రతివాడూ నాశం చెందక నిత్యజీవం పొందడానికే దేవుడు అలా చేసాడు" - యోహా 3,16. ఇక క్రీస్తు ప్రేమ తండ్రి ప్రేమకు ప్రతిబింబంగా వుంటుంది. కనుకనే అతడు "స్నేహితుల కొరకు ప్రాణాలు ధారపోసేవానికంటే ఎక్కువ ప్రేమ కలవాడెవడూ లేదు" అని వచించాడు - యోహా 15,13.

సిలువమీద క్రీస్తు హృదయాన్ని ఈటెతో పొడిచి తెరచారు. ఈ సంఘటనం ఆ ప్రభువుకి మనమీదకల ప్రేమను పరిపూర్ణంగా వ్యక్తం చేస్తుంది. పూర్వం మెరీబా వద్ద మోషే రాతిబండను బెత్తంతో కొట్టగా నీళ్ళు వెలువడ్డాయి - సంఖ్యా 20,11. ఈ

సంఘటనం క్రీస్తుకి అన్వయిస్తుంది. "ప్రభువు దప్పిక గొన్నవాడు నావద్దకు రావచ్చును. నన్ను విశ్వసించేవాడు దప్పిక తీర్చుకోవచ్చును. లేఖనం చెప్పినట్లు అతని (క్రీస్తు) అంతరంగంనుండి జీవజలనదులు ప్రవహిస్తాయి" అన్నాడు - యోహా 7,37-38. ఇక్కడ జీవజలం అంటే పవిత్రాత్మే. ఈ యాత్మే క్రీస్తు హృదయంలోనుండి బయలుదేరుతుంది. భక్తుల హృదయాల్లోనికి ప్రవహిస్తుంది. ప్రభువు సిలువమీద వ్రేలాడుతుండగా అతని హృదయాన్ని ఈటెతో పొడిచి తెరచారు. ఈ హృదయంనుండి నీళ్ళూ నెత్తురూ కారాయి - యోహా 19,34. ఆ నీళ్ళు జ్ఞానస్నానాన్నీ, ఆత్మనీ, ఆత్మ దయచేసే వరప్రసాదాలనూ సూచిస్తాయి. ఆ నెత్తురు దివ్యసత్రసాదాన్ని సూచిస్తుంది. ఇంకా, తెరువబడిన క్రీస్తు హృదయంనుండి తిరుసభకూడ పుట్టుకవచ్చింది. పూర్వం నిద్రపోయిన మొదటి ఆదాము ప్రక్కలోనుండి ఏవ ఉద్భవించింది. అలాగే మరల సిలువ మీద నిద్రించిన రెండవ ఆదాము క్రీస్తు ప్రక్కలోనుండి రెండవ ఏవలాగ తిరుసభ ఉద్భవించింది. ఈ తిరుసభ మనమే. ఈలా మోషే బెత్తంతో కొట్టిన రాతిబండ సిలువమీద తెరువబడిన క్రీస్తు హృదయానికి చిహ్నంగా వుంటుంది. ఆ బండనుండి నీళ్ళలాగే, క్రీస్తు హృదయంనుండి నీళ్ళూ నెత్తురూ వెలువడ్డాయి. సిలువమీద తెరవబడిన క్రీస్తు హృదయం అతని గాఢ ప్రేమకు చిహ్నంగా వుంటుంది. ప్రాచీన కాలంలోనే బోనవెంచరు భక్తుడు ఈలా నుడివాడు. "ఈటెతో పొడవడం వల్ల క్రీస్తు హృదయం గాయపడింది. ఈ గాయం మన కంటికి కన్పిస్తుంది. కాని మన కంటికి కన్పించే ఈ గాయం మన కంటికి కన్పించని శ్రీ హృదయ ప్రేమగాయానికి గుర్తుగా వుంటుంది".

## 2. హృదయం ప్రేమకు సంకేతం

తిరుహృదయ భక్తిసాధనంలో మనం ఆరాధించేది ఆ ప్రభువు ప్రేమనే. అతని భౌతిక హృదయం ఈ ప్రేమకు చిహ్నంగా వుంటుంది. కనుక మనం అతని హృదయాన్ని ఆరాధిస్తాం. ఈ హృదయం అతని రక్తమాంసాలతో కూడింది. అతని ప్రేమకు తార్కాణంగా వుండేది. ఇక, మన తరపున మనం క్రీస్తుకి బదులుప్రేమ చూపడం గూడ తిరుహృదయ భక్తిలో ఓ భాగమే. ఎప్పుడుకూడ ఈ భక్తి దేవుడు మానవునిపట్ల ప్రేమజూపడం, మానవుడు దేవుని పట్ల ప్రేమజూపడం అనే రెండంశాలతో కూడి వుంటుంది.

తిరుహృదయ భక్తిలో మనం క్రీస్తు మానుష హృదయాన్ని ఆరాధిస్తామని చెప్పాం. ఎందుకు? రెండు కారణాలనుబట్టి. మొదటిది, క్రీస్తు నరావతారంలో అతని మానుషదేహం

దైవవార్తతో జోడింపబడి దివ్యత్వాన్ని పొందింది. కనుక అతని మానుష దేహం ఆరాధ్యవస్తువౌతుంది. క్రీస్తు హృదయం కూడ అతని మానుష దేహంలో భాగం. కనుక అదికూడ ఆరాధ్యవస్తువౌతుంది. రెండవది, క్రీస్తు హృదయం అతనికి నరజాతిపట్లగల ప్రేమకు చిహ్నంగా వుంటుంది. ఏ సంస్కృతిలోనైనా హృదయం ప్రేమకు చిహ్నమేగదా? క్రీస్తు గుండెకూడ అచ్చంగా మన గుండెలాంటిదే. ఇంకా నరుని హృదయం అతని భౌతిక, నైతిక, ఆధ్యాత్మిక జీవితానికి చిహ్నంగా వుంటుంది. అతని జీవితానికంతటికీ కేంద్రంగా వుంటుంది. ప్రధానంగా అది నరుని వ్యక్తిత్వాన్ని సూచిస్తుంది. మన హృదయమంటే మన వ్యక్తిత్వం. అలాగే క్రీస్తు హృదయంకూడ అతని ప్రేమపూరితమైన వ్యక్తిత్వానికీ, రక్షణాత్మకమైన వ్యక్తిత్వానికీ ప్రతీకగా వుంటుంది. ఈలా క్రీస్తు ప్రేమకీ వ్యక్తిత్వానికీ చిహ్నమైన అతని భౌతిక హృదయాన్ని ఆరాధిస్తాం.

క్రీస్తు హృదయం అతని ప్రేమకు చిహ్నంగా వుంటుందని చెప్పాం. అతని ప్రేమ దైవప్రేమ, మానుషప్రేమ అని రెండు రకాలుగా వుంటుంది. మొదట అతని దైవప్రేమను తిలకిద్దాం. త్రీత్వంలోని ముగ్గురు దివ్యవ్యక్తులూ మనలను గాఢంగా ప్రేమించి మన రక్షణానికి పూనుకొన్నారు. ఆ దివ్యవ్యక్తుల ప్రేమ నరావతారమెత్తిన క్రీస్తు మానుష హృదయంలోకి ప్రవేశించి అతడు గాఢానురాగంతో మన కొరకు ఆత్మార్పణం చేసికొనేలా చేసింది. కనుక క్రీస్తు దైవప్రేమను మనం ఆరాధిస్తాం. అటుతరువాత అతని మానుష ప్రేమను పరిశీలిద్దాం. క్రీస్తు మనలాగే అచ్చంగా నరుడు. నరుల్లాగే అతడు మనలను ప్రేమించాడు. మనలను అంతం వరకు ప్రేమించాడు - యోహా 13,1. అనగా తన జీవితాంతం వరకూ, తాను ప్రేమించగలిగినంతవరకూ గూడ మనలను ప్రేమించాడు. కనుక అతని మానుష ప్రేమనుగూడ మనం ఆరాధిస్తాం. ఈలా క్రీస్తు హృదయం అతని దైవమానుష ప్రేమలు రెండింటికీ గుర్తుగా వుంటుంది. మనం ఆ రెండు ప్రేమలను పూజిస్తాం.

## 3. బదులుప్రేమ

మీ దేవుడైన ప్రభువుని పూర్ణహృదయంతో, పూర్ణ మనసుతో, పూర్ణశక్తితో ప్రేమించండి అన్నది మోషే ధర్మశాస్త్ర కాలంనుండీ వస్తూన్న ఆజ్ఞ - ద్వితీ 6,5. దేవుని ప్రేమ క్రీస్తులోను అతని హృదయంలోను మనకు ప్రత్యక్షమౌతుంది. కనుక పౌలులాగ మనంకూడ "అతడు నన్ను ప్రేమించి నా కొరకు ప్రాణత్యాగం చేసాడు" అని చెప్పాలి - గల 2,20.

మనం స్వార్థబుద్ధితో క్రీస్తుని ప్రేమించం. కాని "క్రీస్తు మనలను ప్రేమించాడు. దేవునికి ప్రీతినిగూర్చే సువాసనతో గూడిన అర్పణంగాను బలిగాను తన్నుతాను అర్పించుకొన్నాడు" - ఎఫె 5,2. అలా ఆత్మార్పణం కావించుకొన్న క్రీస్తు ప్రేమ మనలను నిర్బంధిస్తుంది - 2కొ 5,14. ఆ ప్రభువుకి బదులుప్రేమ చూపించమని మనలను బలవంతం చేస్తుంది. తిరుహృదయ భక్తిద్వారా మనం ఈ బదులు ప్రేమను చూపించవచ్చు. తిరుహృదయమంటే దేవుని తరపునా మన తరపునాగూడ ప్రేమగాథ అని చెప్పాం.

శ్రీహృదయ భక్తిని ప్రదర్శించే మార్గాలు చాలావున్నాయి. క్రీస్తు ప్రేమను అంగీకరించి ఆ ప్రభువుకి ఆత్మ నివేదనం చేసికోవచ్చు. మన పాపాలకూ ఇతరుల పాపాలకూ గూడ పరిహారం చేయవచ్చు. శ్రీహృదయం పండుగను భక్తితో జరుపుకోవచ్చు. మానవజాతినీ కుటుంబాలనూ దివ్యహృదయానికి సమర్పించుకోవచ్చు. తిరుహృదయం పటాన్ని ఇంటిలో నెలకొల్పుకొని పూజించుకోవచ్చు. ఈలాంటి భక్తి క్రియలను ఎవరికి నచ్చినరీతిలో వాళ్ళు ఆచరించవచ్చు. వీటిల్లో ముఖ్యమైన విషయమేమిటంటే, క్రీస్తు ప్రేమను గుర్తించి అతనికి బదులు ప్రేమ చూపడం.

## ప్రార్థనా భావాలు

1. దేవుని ప్రేమా, క్రీస్తు ఆర్జించిన రక్షణమూ కూడ తిరుహృదయంలో ఇమిడివున్నాయి. క్రీస్తు హృదయాన్ని ప్రేమభావంతో పూజించి అతని ఆజ్ఞల ప్రకారం జీవించినపుడు మన క్రైస్తవ ధర్మాలన్నిటినీ నెరవేర్చినవాళ్ళమౌతాం. శ్రీహృదయ భక్తిలో క్రైస్తవ మతమంతా, క్రైస్తవ పరిపూర్ణత అంతా యిమిడివుంది. అలాంటి ఉత్తమ భక్తి విధానాన్ని మనం అశ్రద్ధ చేయకూడదు.

2. నరులు కృతఘ్నులు. క్రీస్తు మనలను ప్రేమించినట్లుగా మనం అతన్ని ప్రేమించం. కనుకనే ప్రభువు పునీత మర్గరీత మరియమ్మకు దర్శనమిచ్చినపుడు ఆమెతో "ఇదిగో ఈ హృదయం నరులను గాఢంగా ప్రేమించింది. నరులమీదగల అనురాగంచేత ఈ హృదయం దహించుకొనిపోతుంది. ఐనా ఈ ప్రేమకు బదులుగా చాలామంది నాకు నిందావమానాలే కలిగిస్తున్నారు" అని పలికాడు. ఈ వాక్యాలు నేడు మనకూ అక్షరాల వర్తిస్తాయి. కనుక మన పాపాలకు పరిహారం చేసికోవాలి. ప్రభువే స్వయంగా ఈ పరిహారాన్ని కోరాడు. "నులివెచ్చనితనంగల సోమరిపోతుల నుండి నేను పొందే నింధావమానాలకు నీవైనా పరిహారం చేయి" అని అతడు మర్గరీత మరియమ్మగారిని అడిగాడు.

3. నాల్గవ శతాబ్ది భక్తుడైన క్రిసోస్తం ఈలా వ్రాసాడు. "సైనికుడు పరిశుద్ధ దేవాలయం గోడకు కన్నం వేసాడు. ఆ దేవాలయంలోని నిధి నా కంటబడి ది. వెంటనే నేను దాన్ని స్వాధీనం చేసికొన్నాను." క్రిసోస్తం భక్తుడు పేర్కొన్న ఈ నిధి తిరుహృదయమే. అది ప్రేమకు నిలయం. వరప్రసాదాలకు ఆకరం. కనుక మనం ఆవశ్యం తిరుహృదయ భక్తిని అలవర్చుకోవాలి.

4. భక్తులు చాలమంది దివ్యహృదయాన్ని ఆశ్రయంగా భావించారు. 13వ శతాబ్ది భక్తుడు బోనవెంచర్ ఈలా వ్రాసాడు. "ప్రభూ! నీ ప్రక్కను ఈటెతో ఎందుకు పొడిచారు? మేము నీ హృదయంలోకి ప్రవేశించే మార్గం ఏర్పడ్డానికేగదా? మేము ఈ ప్రపంచ వ్యామోహాల నుండి వైదొలగి నీ హృదయంలో నివాస మేర్పరచుకోవడానికే గదా? ఈటె క్రీస్తు ప్రక్కను పొడిచి గాయంచేసింది. కొండ బండలో నెర్రె ఏర్పడింది. క్రీస్తు భక్తుడా లే! రాతి నెర్రెలో గూడుకట్టుకొనే పావురంలాగే నీవుకూడ తెరువబడిన క్రీస్తు హృదయంలో నివాసమేర్పరచుకో!" ఈ భక్తుడు సూచించినట్లుగా మన కష్టసుఖాల్లోను మనం క్రీస్తు హృదయంలోనికి ప్రవేశిస్తూండాలి.

5. దేవుని ప్రేమకి బదులుప్రేమ చూపడం తిరుహృదయ భక్తిలో ఓ భాగమని చెప్పాం. కాని సోదరప్రేమ లేందే దైవప్రేమ లేదు. నా సోదరుల్లో అత్యల్పునికి చేసిన కార్యం నాకు చేసినట్లే భావిస్తాను అన్నాడు ప్రభువు - మత్త 25,40. కనుక మనం తోడి నరులను విశేషంగా పేదసాదలను, ఆదరంతో చూస్తుండాలి. ఈ సోదరప్రేమ మన దైవప్రేమను వృద్ధిచేస్తుంది.

6. తిరుహృదయ పండుగలోవచ్చే ఫ్రిఫేస్ ప్రార్థనం యిది. "క్రీస్తు సిలువమీదికి ఎత్తబడినపుడు మన కొరకు ప్రాణాలర్పించాడు. మనపట్ల అతనికికల ప్రేమ అంత గొప్పది. గాయపడిన అతని ప్రక్కలోనుండి నీళ్ళూ నెత్తురూ స్రవించాయి. ఈ ప్రక్కయే శ్రీసభలోని సంస్కారాలన్నిటికీ ఆధారం. రక్షకుడు తెరువబడిన తన హృదయంలోనికి నరులనందరినీ ఆహ్వానిస్తాడు. ఆ రక్షణపు బుగ్గనుండి మనం ఆనందంతో జలాన్ని స్వీకరించవచ్చు." క్రీస్తు హృదయం ఆత్మకూ, వరప్రసాదానికీ, రక్షణకూ నిలయమని ఈ ప్రార్థనం భావం. తిరుహృదయ భక్తికి మనం ఏలాంటి విలువనీయాలో ఈ ప్రార్థనే తెలియజేస్తుంది.

# ప్రశ్నలు

## అధ్యాయం -1

1. "బైబులు మనుష్యావతారాన్ని ఓ జ్యోతినిగా చిత్రిస్తుంది" – వివరించండి.
2. మన రక్షణం మనుష్యావతారంనుండే ప్రారంభమైంది – వివరించండి.
3. మనుష్యావతారం నూత్న నిబంధనం లాంటిది – వివరించండి.
4. మనుష్యావతారం భావాన్ని గూర్చి చెప్పిన అంశాల్లో ఏ మూడింటినైన సవిస్తరంగా వివరించండి.
5. మన భక్తికృత్యాల్లో క్రీస్తుని దేవుణ్ణిగానేగాని నరుణ్ణిగా భావించకపోవడం పెద్ద పొరపాటని చెప్పాం. ఎందుకు?
6. మనుష్యావతార విషయంలో గ్రీకు ల్యాటిను తిరుసభలకున్న వ్యత్యాసమేమిటి?
7. నేడు క్రిస్మసు పండుగ సందర్భంలో మన ప్రజలు ప్రదర్శించే భక్తిలో మీకు నచ్చిన అంశాలను కొన్నిటిని పేర్కొనండి.

## అధ్యాయం - 2

1. యోహాను జ్ఞానస్నానానికీ, క్రీస్తు జ్ఞానస్నానానికీ తేడా యేమిటి?
2. "ఇతడు నా ప్రియకుమారుడు" అని క్రీస్తు తరపున తండ్రి పలికిన సాక్ష్యం భావం ఏమిటి?
3. పవిత్రాత్మ క్రీస్తుమీదికి పావురం రూపంలో దిగిరావడంలో భావం ఏమిటి?
4. క్రీస్తు జ్ఞానస్నానం అతని మరణోత్థానాలను ఏలా సూచిస్తుంది?
5. యేసు, క్రీస్తు అనే పేరుల అర్థం వివరించండి.
6. క్రీస్తు స్వీకరించిన మూడభిషేకాలను వివరించండి.

## అధ్యాయం - 3

1. కొండమీద తండ్రి క్రీస్తునిగూర్చి పల్కిన సాక్ష్యంలోని మూడంశాలను వివరించండి.
2. క్రీస్తు దివ్యరూపధారణ భావం ఏమిటి?
3. మన పుణ్యక్షేత్రాల్లో మన క్రైస్తవ భక్తులు భగవంతుణ్ణి అనుభవానికి తెచ్చుకొనే తీరును మీకు తెలిసినంతవరకు వివరించండి.

## అధ్యాయం - 4

1. "యిస్రాయేలు సంప్రదాయం ప్రకారం ఎడారి దేవుణ్ణి కలసికొనేతావు, శోధనలకు గురయ్యే తావుకూడ" - వివరించండి.
2. భోజనప్రీతి, దేవుణ్ణి పరీక్షకు గురిచేయడం, విగ్రహారాధనం అనే మూడు క్రీస్తు శోధనల్లో ఒక్క దాన్ని సవిస్తరంగా వివరించండి.
3. క్రీస్తు ఏకైక శోధన ఏమిటి?
4. శోధనల్లో మన స్వాతంత్ర్యం నశించదు - వివరించండి
5. మన శోధనల్లో క్రీస్తు విజయం మనమీద ఏలా సోకుతుందో తెలియజేయండి.

## అధ్యాయం - 5

1. యేసు శ్రుతికర్త అనే భావాన్ని నూత్నవేద రచయిత లందరికంటె గూడ యోహాను ఎక్కువగా పేర్కొన్నాడు - వివరించండి.
2. క్రీస్తు తండ్రిని తెలియజేయడాన్ని గూర్చి ఇరెనేయుస్ సూచించిన భావాలను పేర్కొనండి.
3. నరుడైన క్రీస్తు దేవుడైన తండ్రిని మనకు ఏలా తెలియజేస్తాడు?
4. "నా ద్వారానేగాని ఎవడైనా తండ్రివద్దకు రాలేడు" అనే వాక్యం భావాన్నిగాని, లేదా "నన్ను చూచినవాడు తండ్రిని చూచినట్లే" అనే వాక్యం భావాన్ని కాని వివరించండి - యోహా 14,6-9.

## అధ్యాయం - 6

1. విధేయాత్మకమూ ప్రేమపూరితమూ ఐన క్రీస్తు మరణం మనలను రక్షించింది - వివరించండి.
2. క్రీస్తు సిలువ మరణంవరకు విధేయుడయ్యాడు" అనడంలో పౌలు భావం ఏమిటి? - ఫిలి 2,8.
3. క్రీస్తు పాతాళానికి దిగడంలో ఉద్దేశం ఏమిటి?
4. క్రీస్తు చిందించిన నెత్తురు మన పాపాలకు ఏలా ప్రాయశ్చిత్తం చేసిందో వివరించండి.
5. క్రీస్తు మరణంద్వారా మనకు దేవునితో రాజీ యేలా కుదిరింది?
6. క్రీస్తు శ్రమలనుభవించి మహిమలో ప్రవేశించడం అగత్యం కాదా? ఈ వాక్యం నేడు మన జీవితానికి ఏలా వర్తిస్తుందో తెలియజేయండి - లూకా 24,26.

## అధ్యాయం - 7

1. యోహాను క్రీస్తు ఉత్థానాన్ని అతడు తండ్రివద్దకు తిరిగిపోవడాన్నిగా భావించాడు – వివరించండి.
2. క్రీస్తు మరణోత్థానాలు రెండూ కలసే మనలను రక్షిస్తాయి – వివరించండి.
3. "కాని కడపటి ఆదాము జీవమిచ్చేప్రాణి అయ్యాడు" -1 కొరి 15,45. వివరించండి.
4. క్రీస్తు ఉత్థానం మనకుకూడ ఉత్థానాన్ని సాధించి పెడుతుంది – ఏలాగో తెలియజేయండి.
5. ఈ లోకంలో మన ఉత్థాన జీవితపు బాధ్యతలు తెలియజేయండి.

## అధ్యాయం - 8

1. క్రీస్తు మోక్షారోహణంతో అతని భౌతిక సాన్నిధ్యానికి మారుగా ఆధ్యాత్మిక సాన్నిధ్యం ప్రారంభమౌతుంది – వివరించండి.
2. క్రీస్తు మహిమ అతన్ని విశ్వసించే భక్తులకు గూడ సంక్రమిస్తుంది – ఏలాగో తెలియజేయండి.

## అధ్యాయం - 9

1. పెంతెకోస్తు భావాలను వివరించండి.
2. ఉత్థాన క్రీస్తు మనకు ఆత్మను దయచేసే తీరును తెలియజేయండి.
3. ఆత్మ మనలను క్రీస్తు చెంతకు చేర్చే తీరును వివరించండి.
4. క్రీస్తు పాస్క కార్యాలన్నీ ఏలా ఏక సంఘటనమౌతాయో తెలియజేయండి.
5. అసలు మన క్యాతలిక్ సమాజంలోని ప్రజలకు ఆత్మను గూర్చి తెలుసా? నీ మట్టుకు నీకు ఆత్మను గూర్చిన అనుభవం ఏమైనా వుందా?

## అధ్యాయం - 10

1. యోహాను సువిశేషంలో "ఎత్తబడ్డం" అనే పదం క్రీస్తు రాజు అని యేలా తెలియజేస్తుందో వివరించండి.
2. క్రీస్తు రాజు అనే విషయాన్నిగూర్చిన పితృపాదుల బోధలను పేర్కొనండి.
3. క్రీస్తు ఏలా రాజౌతాడో తెలియజేయండి.

## అధ్యాయం - 11

1. మోషే బెత్తంతో కొట్టిన రాతిబండ సిలువమీద తెరువబడిన క్రీస్తు హృదయానికి ఏలా గురుతుగా వుంటుందో వివరించండి.
2. మనం క్రీస్తు మానుష హృదయాన్ని ఎందుకు ఆరాధించాలి?

# బైబులు అవలోకనాలు

## అధ్యాయం -1

ఏవ సంతానమైన మెస్సీయా - ఆది 3,15.

మన మధ్య వసించే దేవుడు - యోహా 1,14

ఇద్దరు ఆదాములు - రోమా 5,18-21. 1 కొరి 15,22-23

క్రీస్తు జ్యోతి - యోహా 8,12

మన దత్తపుత్రత్వం - యోహా 1,12. రోమా 8,29

దైవకృప ప్రత్యక్షమైంది - తీతు 2,11

క్రీస్తు పైకెక్కడం, క్రిందికి దిగడం - ఎఫె 4,10

క్రీస్తు తన్నుతాను రిక్తుని చేసికోవడం - ఫిలి 2,7

ఇమ్మానువేలు - మత్త 1,22-3. యెష 7,14

## అధ్యాయం - 2

క్రీస్తు జ్ఞానస్నానం
- మత్త 3,13-17
- మార్కు 1,9-11
- లూకా 3,21 -22

ఇతడు నా ప్రియకుమారుడు - మత్త 3,17. యెష 42,1

క్రీస్తు బప్తిస్మం అతని సిలువ మరణమే - లూకా 12,50

మన జ్ఞానస్నానంలో క్రీస్తు మరణోత్థానాలు - రోమా 6,4

యేసు అంటే రక్షకుడు - మత్త 1,21

క్రీస్తుకి
- యాజకుడుగా అభిషేకం - హెబ్రే 2,17-18
- ప్రవక్తగా అభిషేకం - మత్త 3,16. అచ 4,27,10,38
- రాజుగా అభిషేకం - అచ 2,36. హెబ్రే 1,9

## అధ్యాయం - 3

| | |
|---|---|
| | మార్కు 9,2-8 |
| మారురూపం | మత్త 17,1-8 |
| | లూకా 9,28 -38 |

కొండమీద మోషే - నిర్గ 24, 15-18

మన ప్రకాశం - 2 కొ 3,18

మోషే పేర్కొన్న ప్రవక్త - ద్వితీ 18,15

## అధ్యాయం - 4

| | |
|---|---|
| | మత్త 4,1-11 |
| క్రీస్తు శోధనలు | లూకా 4,1-13 |
| | మార్కు 1,12-13 |

భోజన ప్రీతి - నిర్గ 16,2-3

దేవుణ్ణి పరీక్షించడం - నిర్గ 17,3-7

విగ్రహారాధనం - నిర్గ 32,1-6

| | |
|---|---|
| | మత్త 12,29 |
| బలవంతుణ్ణి జయించిన బలవంతుడు | లూకా 11,21-22 |
| | లూకా 10,18 |

శోధనల్లో క్రీస్తు సహాయం - హెబ్రే 2,18. 4,14-16

దేవుని సహాయం - 1కొరి 10,13

## అధ్యాయం - 5

తండ్రి రహస్య ప్రణాళిక - ఎఫె 1,9.

క్రీస్తు దేవునికి ప్రతిబింబం - కొలో 1,15

ఈ కడపటి రోజుల్లో కుమారునిద్వారా - హెబ్రే 1,1-2

కుమారుడు ఎరిగించేవాళ్ళకు మాత్రమే - మత్త 11,27

దేవునికి సన్నిహితుడైన కుమారుడే - యోహా 1,18

నన్నుచూస్తే తండ్రిని చూచినట్లే - 14,8-9

నా ద్వారా తప్ప ఎవడూ - 14,5-6

ఆదిలో వాక్కు వుంది - 1,1

లోకానికి వెలుగు - 8,12

## అధ్యాయం - 6

క్రీస్తుకి దేవునిపట్ల ప్రేమ - యోహా 14,31

మనపట్ల ప్రేమ - యోహా15,31. గల 2,20

స్వేచ్ఛగా ప్రాణాలు ధారపోసాడు- యోహా 10,17-18

పాపం ఫలితం చావు - రోమా 6,23

నీచమైన సిల్వమరణం - ఫిలి 2,8. ద్వితీ 21,23

అది తండ్రి ఆజ్ఞ - యోహా 14,31

క్రీస్తు పాతాళ సందర్శనం - 1 పేత్రు 3,18-22

క్రీస్తు నెత్తురు - హెబ్రే 9,13-14

తండ్రితో మనకు రాజీ - రోమా 5,10

మన జీవితంలో క్రీస్తు మరణోత్థానాలు - ఫిలి 3,9-10

నా జ్ఞాపకార్థం - 1 కొరి 11,25-26

శ్రమలద్వారా మహిమ - లూకా 24, 26

## అధ్యాయం - 7

క్రీస్తు తండ్రివద్దకు వెళ్ళిపోవడం - యోహా 13,1

క్రీస్తు ప్రథమఫలంగా ఉత్థానం కావడం - 1 కొరి 15,20

కడపటి ఆదాము జీవమిచ్చే ప్రాణి - 1కొరి 15,45

జీవజల ప్రవాహం - యోహా 3,38-39

క్రీస్తు ఉత్థానం మన ఉత్థానం - రోమా 8,11. యోహా 6,54

మన మనసు పరలోకంలోని వస్తువులమీద - కొలో 3,1-2

ఈ శరీరం వ్యభిచారానికిగాదు - 1 కొరి 6,13

ఉత్థానమే గనక లేకపోతే - 1 కొరి 15,17.

## అధ్యాయం - 8

మోక్షారోహణం - 1,9-14

తండ్రి ప్రక్కన ఆసీనుడు - మార్కు 16,19

లోకాంతంవరకు మనతో - మత్త 28,20

మనలను అనాథులను చేయడు - యోహా 14,18

సిలువా క్రీస్తు దైన్యమూ - ఫిలి 2,6-11

భౌతిక సృష్టికి కూడ మహిమ - రోమా 8,22

అందరినీ నా యొద్దకు ఆకర్షించుకొంటాను - యోహా 12,32

మనకు పరలోకంలో ఓ నివాసస్థలం - యోహా 14,2-3

రాబోయే పట్టణం కోసం - హెబ్రే 13,14.

## అధ్యాయం - 9

పెంతెకోస్తు - అ.చ. 2, 1-4

క్రీస్తు ఆత్మను కుమ్మరించడం - అ.చ. 2,33

క్రీస్తు ఆత్మను పంపుతానని చెప్పడం - యోహా 14,16

ఆత్మే జీవజలం - 7,37-39

తండ్రి ఆకర్షిస్తేనేగాని - యోహా 6,44

ఆత్మవలన యేసే ప్రభువు అని అంగీకరిస్తాం - 1 కొరి 12,3

ఆత్మ క్రీస్తుని గూర్చి బోధిస్తుంది - యోహా 16, 13-14

ఆత్మద్వారా తిరుసభలో క్రీస్తు సాన్నిధ్యం - మత్త 28,20

క్రీస్తు మోక్షారోహణం - యోహా 20,17

ఆత్మప్రదానం - 20,22

## అధ్యాయం - 10

క్రీస్తు ప్రభువు - అ.చ. 2,26

శిరస్సు - ఎఫె 1,22 -23

నీవు రాజువా? - మార్కు 15,2

నేను పైకెత్తబడినపుడు - యోహా 11,32-33

యూదుల రాజు - 19,19

పిశాచరాజ్యం - 12,31

అతన్ని రాజును చేయబోగా - 6,15

నారాజ్యం ఈలోక సంబంధమైంది కాదు - 18,36

క్రీస్తు పరిపాలనం సేవే - మార్కు 10,42-45
రాజ్యాన్ని తండ్రికి అర్పించడం - 1కొరి 15,24
అతని రాజ్యానికి అంతం లేదు - లూకా 1,33
మన రాజ్యపాలన - లూకా 22,29-30

## అధ్యాయం - 11

తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను - యెష 49,15
ప్రభువే నీ భర్త - 54, 5-10
దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి - యోహా 3,16
స్నేహితుల కొరకు ప్రాణాలు - 15,13
రాతిబండనుండి నీళ్ళు - సంఖ్యా 20,11
జీవజల నదులు - యోహా 7,37-39
సిలువమీద హృదయాన్ని తెరవడం - 19,34
మీ పూర్ణ హృదయంతో ప్రేమించండి - ద్వితీ 6,5
అంతంవరకు ప్రేమించాడు - యోహా 13,1
క్రీస్తు ప్రేమ మనలను నిర్బంధిస్తుంది - 2కొరి 5,14

# ౨. క్రీస్తు శ్రమలు

## మనవిమాట

ఈ గ్రంథం క్రీస్తు శ్రమలనూ మరణాన్నీ వివరిస్తుంది. దీన్ని పూర్వమే బైబులు భాష్యం 109-111 సంచికల్లో ప్రచురించాం.

ఈ పొత్తం మత్తయి 26-27 అధ్యాయాల మీద వ్యాఖ్య. క్రీస్తు శ్రమల విషయంలో మత్తయి చెప్పని అంశాలేవీ మార్కు చెప్పలేదు. లూకా కొన్ని ప్రత్యేకాంశాలు చెప్పాడు. వాటిని కాలక్రమ పద్ధతిలో ఈ గ్రంథంలో చేర్చాం. ఇక, యోహాను చాల ప్రత్యేకాంశాలు చెప్పాడు. కాని అవి తొలి మూడు సువిశేషాలు చెప్పిన పద్ధతిలో కాక ప్రత్యేకరీతిలో వుంటాయి. కనుక యోహాను చెప్పిన అంశాలను కట్ట కడన, 8వ అధ్యాయంలో చేర్చాం. ఈ విధంగా ఇది క్రీస్తు శ్రమల మీద సంపూర్ణ వ్యాఖ్య ఔతుంది.

ప్రాచీన క్రైస్తవులు క్రీస్తు పాటులను భక్తితో మననం చేసికొన్నారు. ప్రభువు పాటుల ధ్యానం మన హృదయాన్ని పవిత్రం చేస్తుంది. మన మనస్సుని ఐహిక వ్యామోహాల నుండి మరల్చి పరలోక విషయాల మీదికి త్రిప్పుతుంది. మన ప్రజలు సంవత్సరం పొడుగునా, విశేషంగా తపస్సు కాలంలో, ప్రభువు శ్రమలను ధ్యానం చేసికోవడానికి ఈ పొత్తం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం.

పాఠకులు ఈ గ్రంథంలోని ఆయా అధ్యాయాల ఆరంభంలో వచ్చే అవలోకనాలను మొదట అవధానంగా సువిశేషాలనుండే చదువు కోవాలి. ఆ పిమ్మటనే ఈ వ్యాఖ్యను చదవాలి. లేకపోతే ఈ వివరణం అర్థం కాదు. ఇది మూడవ ముద్రణం.

## విషయ సూచిక

# క్రీస్తు శ్రమలు

మత్తయి 26-27 అధ్యాయాలు క్రీస్తు శ్రమలను వర్ణిస్తాయి. మత్తయి తన సువిశేషం అంతటితో పాటు ఈ శ్రమల ఘట్టాల్లో కూడ మార్కు సువిశేషాన్ని ఎక్కువగా అనుసరించాడు. ఐనా చాలాచోట్ల తన సొంత భావాలను కూడ చేరుస్తూ వచ్చాడు. ఆ భక్తుడు బోధించిన అంశాలను ఈ క్రింద సంగ్రహంగా పరిశీలిద్దాం.

## 1. క్రీస్తు తన శ్రమలను ముందుగా తెలియజేయడం - 26,1-16

ఈ ఘట్టంలో మూడు భాగాలున్నాయి. 1) ప్రభువు తన శ్రమలను ముందుగానే తెలియజేసాడు. అదే సమయంలో క్రీస్తు శత్రువులు అతన్ని నాశం చేయడానికి పథకం పన్నారు- 26,1-5. 2) ఒక భక్తురాలు క్రీస్తు శిరస్సుని పరిమళ తైలంతో అభిషేకించి అతని భూస్థాపనాన్ని సూచించింది - 26,6-13. 3) అదే సమయంలో యూదా క్రీస్తుని ముప్పది వెండికాసులకు అమ్మివేసాడు - 26,14-16. ఇక ఈ మూడంశాలను పరిశీలిద్దాం.

### 1. శ్రమలను ముందుగానే తెలియజేయడం - 26,1-5

మత్తయి 24-25 అధ్యాయాల్లో ప్రభువు అంత్య కాలాన్ని గూర్చి చెప్పాడు. ఈ యంత్యకాల విషయాలన్నీ బోధించాక తన శ్రమలను ప్రస్తావించాడు. అతడు తన శ్రమలను గూర్చిన అంశాన్ని బుద్ధిపూర్వకంగానే చిట్ట చివరిదాకా మిగిల్చాడు అనుకోవాలి. క్రీస్తు మాటల ప్రకారం పాస్కాపండుగ సందర్భంలో అతడు సిలువ మరణానికి అప్పగింపబడతాడు - 26,2. క్రీస్తు ఈ మాటలు పలికింది బుధవారం. ప్రభువుని శుక్రవారం సిలువ వేసారు. ఆ శుక్రవారం ఆ యేడు నీసాను నెల 15వ తారీఖున వచ్చింది. అదే పాస్కోత్సవ దినం. ఆ రోజే ప్రభుని సిలువ వేసిన రోజు కూడ. పాస్కోత్సవం ఈజిప్టులోని యూదుల దాస్య విముక్తిని జ్ఞప్తికి తెస్తుంది. క్రీస్తు తన మరణం ద్వారా ఇక్కడ మరొక దాస్యవిముక్తిని దయచేస్తాడు. ఈజిప్టులో ఫరో దాస్యం నుండి విముక్తి కలిగింది. కాని కల్వరిపై పాపదాస్యం నుండి విముక్తి కలుగుతుంది. ప్రభువు నిజమైన పాస్క గొర్రెపిల్ల.

క్రీస్తు సిలువ మరణానికి "అప్పగింపబడతాడు". ఎవరి చేత? క్రీస్తుని సిలువ మరణానికి అప్పగించేది ప్రధానంగా తండ్రే. నరులపై గల గాఢ ప్రేమచే, క్రీస్తు సమ్మతితోనే, ఆ తండ్రి ప్రభువుని సిలువ మరణానికి గురిచేసాడు. ఈ ప్రక్రియలో ఆ తండ్రి నరమాత్రులను గూడ వాడుకొన్నాడు. కనుక యూదా, ప్రధానార్చకులు మొదలైన శత్రువర్గం కూడ క్రీస్తుని అప్పగించారు.

క్రీస్తు ఎవరివల్లనో నిర్బంధింపబడి, ఎవరికో లొంగిపోయి, చేతగానివాడి లాగ సిలువపై మరణించలేదు. ఆ ప్రభువు తన సిలువ మరణాన్ని తానే ముందుగానే నిర్ణయించుకొన్నాడు. కనుక మనుష్య కుమారుడు సిలువ మరణానికి అప్పగింపబడతాడు సుమా అని ముందుగానే ఠీవితో పల్కాడు. మరణ సంఘటనలు అతన్ని అదుపులోకి తీసికోవు. అతడే వాటిని అదుపులో వుంచుకొంటాడు.

ప్రభువు తన సిలువ మరణాన్ని గూర్చి శిష్యులను హెచ్చరించటం అది మొదటిసారి కాదు, నాల్గవసారి. ఇంతకు ముందే అతడు మూడుసార్లు ఈ యంశాన్ని ప్రస్తావించాడు. మత్తయి 16,21లోను 17,22లోను 17,19లోను ఈ ప్రస్తావనం వస్తుంది. కైసరయ ఫిలిప్పిలో పేత్రు తన్ను మెస్సియాగా ప్రకటించిన పిదప ప్రభువు నాల్గు పర్యాయాలు ఈ సంగతి చెప్పాడు. అనగా ఈ యంశం అతని మనసులో ఎప్పుడూ మెదులుతూనే వుంది అనుకోవాలి. ప్రభువుకి తన సిలువమరణం ముందుగానే తెలుసు. ముందుగానే దాన్ని పరిపూర్ణంగా అంగీకరించాడు కూడ. అతనికి ముందుగా తెలిసినట్లే శ్రమల ఘట్టంలోని సంఘటనలన్నీ జరిగిపోయాయి.

యూదుల ప్రధానార్చకులు పెద్దలు ప్రధాన యాజడైన కైఫాయింట సభ దీర్చారు - 26,3. ఈ సభకు సానెడ్రిన్ అని పేరు. దీనిలో 72 మంది సభ్యులుంటారు. యూదుల మత విషయాల్లో ఈ సభ మన సుప్రీం కోర్టు లాంటిది. కనుక దాని నిర్ణయాలకు తిరుగులేదు.

ఈ సభ సభ్యుల పన్నాగాలు మొదటినుండీ వంచనతోను కుట్రతోను కూడివున్నాయి. కనుకనే వాళ్లు యేసుని దొంగచాటుగా బంధించి చంపాలనుకొన్నారు. క్రీస్తుకి కొండంత ప్రజాదరణం వుంది. అతని అద్భుతాలు బోధలు అతనికి ఎందరో అభిమానులను సంపాదించి పెట్టాయి. అలాంటివాణ్ణి బహిరంగంగా బంధిస్తే ప్రజలు వూరుకోరు. అల్లరిచేస్తారు. విప్లవం లేవదీస్తారు. పాస్కతిరునాళ్ళలో యెరూషలేము గలిలయ యాత్రికులతో క్రిక్కిరిసి వుంటుంది. వాళ్ళల్లో చాలమంది క్రీస్తంటే పడిచస్తారు. క్రీస్తుని బహిరంగంగా బంధిస్తే వీళ్ళను రెచ్చగొట్టినట్లే. విప్లవాన్ని కొని తెచ్చుకొన్నట్లే. కనుక సానెడ్రిన్ సభ్యులు యేసుని పాస్క తిరునాళ్లు ముగిసాక రహస్యంగా బంధించాలని కుట్ర పన్నారు.

ఇక్కడ క్రీస్తు ఠీవికి సానెడ్రిన్ సభ్యుల దొంగబుద్ధికీ వున్న వ్యత్యాసాన్ని చక్కగా గమనించాలి. క్రీస్తు స్వీయ మరణాన్ని గూర్చి తన శిష్యులతో బహిరంగంగా మాట్లాడితే, ఈ సభ్యులు అదే అంశాన్ని గూర్చి చాటుమరుగ్గా మాట్లాడారు. క్రీస్తుకి భవిష్యత్ జ్ఞానం వుంది. అతనికి తన మరణం ఎప్పుడు వస్తుందో ఏలా వస్తుందో తెలుసు. సభ్యులకు ఆ

జ్ఞానం లేదు. వాళ్లు పాస్కపండుగ సందర్భంలో క్రీస్తుని బంధించ కూడదనుకొన్నారు. కాని తర్వాత యూదా ద్రోహం వల్ల వాళ్లు వద్దనుకొన్న కాలంలోనే అతన్ని బంధించారు. క్రీస్తు తండ్రి చిత్తానికి లొంగేవాడు. ధర్మాన్ని నెరవేర్చేవాడు. ఠీవితో తన మరణానికి సంసిద్ధుడయ్యేవాడు.

అతని శత్రువులైన సానెడ్రిన్‌సభ సభ్యులు వరప్రసాద ప్రబోధాన్ని పెడచెవిని బెట్టారు. క్రీస్తుపై పగబెంచుకొని అతన్ని వంచనతో నాశం చేయజూచారు. అతని మరణానికి సాధనమాత్రులయ్యారు. మనకూ మన పోకడలకూ ఆదర్శంగా వుండవలసింది ప్రభువు కాని ఈ దుష్టులు కాదు.

## 2. బెతానియాలో అభిషేకం 26,6-13

బెతానియా గ్రామంలో ఒక స్త్రీ క్రీస్తుకి అభిషేకం చేసిన ఉదంతం నాల్గు సువిశేషాల్లోను వస్తుంది. లూకా మాత్రం ఈ సంఘటనకు క్రీస్తు శ్రమలతో సంబంధం లేనట్లుగా చెప్పాడు. అతని సువిశేషంలో స్త్రీ పాపాత్మురాలు. తన పశ్చాత్తాపాన్ని తెలియజేయడానికి ఆమె క్రీస్తుని అభిషేకించింది. ప్రభువు ఆమె పాపాలను మన్నించాడు - లూకా 7,36-50.

మత్తయి సువిశేషంలో ఈ యభిషేకానికి క్రీస్తు శ్రమలకు సంబంధం వుంది. ఈ యభిషేకం క్రీస్తు భూస్థాపనాన్ని సూచిస్తుంది. మార్కు సువిశేషంలో పుణ్య స్త్రీలు క్రీస్తు దేహాన్ని లేపనం చేయడానికి పరిమళ ద్రవ్యాలు తీసుకొని వస్తారు - 16,1. కాని మత్తయి గ్రంథంలో ఆ పుణ్యస్త్రీలు ఈలా పరిమళ ద్రవ్యాలతో రారు. వాళ్లు వట్టినే సమాధిని చూడ్డానికి వచ్చారు - 28,1. కనుక మత్తయి గ్రంథంలో ఈ భక్తురాలే క్రీస్తు దేహానికి లేపనం చేస్తుంది. ఇక్కడ ఈమె పశ్చాత్తాప తప్తురాలుగా గాక, క్రీస్తు పట్ల అపారమైన ప్రేమగల భక్తురాలుగా చిత్రింపబడింది. ఈమె పేరేమిటో సువిశేషం చెప్పదు.

యూదులు భూస్థాపనం చేయకముందు మృతదేహాలకు లేపనం చేసేవాళ్లు. వాళ్ళ దృష్టిలో అది కరుణకార్యం, పవిత్రకార్యం. కనుక ఇక్కడ ఈ భక్తురాలు క్రీస్తు దేహానికి ఈ పవిత్రకార్యాన్ని నిర్వహించాలనుకొంది. ఈ కార్యం ద్వారానే ఆమె క్రీస్తు మరణాన్నీ భూస్థాపనాన్నీ సూచించింది. కాని ఈ సంఘటనలు ఆమెకు ముందుగానే ఏలా తెలిసాయి? అంతర్ దృష్టితో ఆమె క్రీస్తు కాలం సమీపించిందని గుర్తించింది. క్రీస్తు మరణాన్ని పసికట్టింది. కనుక పరమ భక్తిభావంతో ఈ పవిత్రమైన అభిషేకాన్ని నిర్వహించింది.

ఇంకా, యూదుల సంప్రదాయం ప్రకారం వారి రాజులు అభిషేకం పొందేవాళ్లు. ఇక్కడ క్రీస్తుకూడ ఓ రాజుగా అభిషేకం పొందాడు అనుకోవాలి. అభిషిక్తుణ్ణి హీబ్రూలో మెస్సీయా అంటారు. గ్రీకులో క్రీస్తు అని పిలుస్తారు. కనుక ఇక్కడ ఈ యభిషేకం ద్వారా యేసు మెస్సీయా అని అర్థం జేసికోవాలి.

ఈ భక్తురాలు క్రీస్తు శిరస్సుకి అభిషేకం చేయడం జూచి శిష్యులు కోపించారు. ఈలా ఈ పరిమళ ద్రవ్యాన్ని వ్యర్థం చేయడమెందుకు? దీన్ని విక్రయించి వచ్చిన సొమ్ముతో పేదలకు దానం చేయవచ్చు గదా అన్నారు. మార్కు రచన ప్రకారం ఈ ద్రవ్యం 300 దీనారాలు చేస్తుంది - మార్కు 14,9. ఆ రోజుల్లో కూలీలకు ఒకరోజు కూలికి ఒక దీనారం చెల్లించే వాళ్లు. అనగా ఒక శ్రామికునికి సంవత్సరం పొడుగునా వచ్చే ఆదాయమెంతో ఈ ద్రవ్యం ఖరీదు అంత! ఇది పెద్ద సొమ్మే. ఈ భక్తురాలు హృదయంలోని ప్రేమభావంతో పెద్ద ఖరీదు చేసే పరిమళ ద్రవ్యాన్ని క్రీస్తు శిరస్సుపై కుమ్మరించింది. ప్రేమ వ్యయాన్ని లెక్కచేయదు కదా! ఆమె యెదదలో క్రీస్తుపట్ల ఎంత గాఢానురాగం, ఎంత లోతైన భక్తిభావం వుందో ఎవరికి తెలుసు?

శిష్యులు ఆ పుణ్యాత్మురాలిని విమర్శించడం జూచి క్రీస్తు ఆమె కోపు తీసికొన్నాడు. ఆమె చేసింది సత్కార్యం అని సమర్థించాడు. శిష్యులు ఈ సొమ్ము పేదలకు దానం చేయవచ్చు గదా అన్నారు. క్రీస్తు వాళ్ళకు ఈలా జవాబు చెప్పాడు. పేదలు ఎప్పుడూ మన చుట్టూ వుంటారు. వాళ్లకు మీరెప్పుడైనా దానాలు చేయవచ్చు. నేను మాత్రం ఎల్లప్పుడు శారీరకంగా మీతో వుండను. నా మరణం సమీపిస్తుంది. కనుక మీరు నాకేదైనా చేయదల్చుకొంటే ఇప్పుడే చేయాలి. ఈమె నన్ను గౌరవిస్తూ, నా భూస్థాపనాన్ని సూచిస్తూ ఈ యభిషేకం చేసింది. మీరు ఆమెను మెచ్చుకోవాలి గాని విమర్శించగూడదు అన్నాడు. ఇక్కడ ఈ పునీతురాలు చేసింది సత్కార్యం (గ్రీకు మూలంలో "రమ్యమైన" కార్యం.) క్రీస్తు మరణం సమీపించిందని శిష్యులు గ్రహించకపోయినా ఈమె గ్రహించింది. అది ఆమె గొప్పతనం.

"పేదలు ఎల్లప్పుడు మీతో వుంటారు" అనే వాక్యం ద్వితీయోపదేశకాండం 15,11లో వస్తుంది. పేదలను పట్టించు కోనక్కరలేదని ఈ వాక్యం భావం కాదు. ఈ భక్తురాలు క్రీస్తు పట్ల గల ప్రేమభావంచే యూదమతం విధించే లేపన కార్యాన్ని నిర్వహించింది. కనుక ఆమెను మెచ్చుకోవాలి అని మాత్రమే ఇక్కడ ఈ వాక్యం భావం.

కడన క్రీస్తు ఈ సువార్త ప్రచారంలోకి వచ్చిన తావులన్నిటిలోను ప్రజలు ఈ భక్తురాలు చేసిన పవిత్ర కార్యాన్ని ప్రశంసిస్తారు అని నుడివాడు - 26,13. ఇది చాల మంచివాక్యం. ప్రభువు చెప్పినట్లుగా ఈ పునీతురాలిని తప్పక కొనియాడవలసిందే. ఈ

లోకంలో పురుషులతో పాటు స్త్రీలు కూడ ఎన్నో ఘనకార్యాలు చేసారు. ఐనా పురుషులు చేసిన సత్కార్యాలు చరిత్రలో కెక్కాయిగాని స్త్రీలు చేసిన మంచి కార్యాలు అలా యెక్కలేదు. అన్ని ప్రాచీన సమాజాలు కూడ పురుషాధిక్య సమాజాలు. కనుక అవి స్త్రీలను అశ్రద్ధ చేసాయి. కాని క్రీస్తు అలా చేయలేదు. నాడు ప్రభువులాగే నేడు మనం కూడ ఈ పుణ్యాత్మురాలిని తప్పక అభినందించాలి. ఇంకా, ఈ పాపపు లోకంలో నరులు చేసే సత్కార్యాలు చీకటిలో దీపంలాగ ప్రకాశిస్తాయి. ఇక్కడ ఈ పుణ్యకార్యం చేసి చూపించిన ఈ విశుద్ధమూర్తి నేడు మనం కూడ మంచి పనులు చేయాలని ప్రేరేపిస్తూంటుంది. విశేషంగా యూదా, ప్రధానార్చకులు చేసిన దుష్టకార్యంతో పోల్చి చూస్తే ఈ భక్తురాలు చేసింది ఎంతో పవిత్రకార్యం గదా!

## 3. యూదా ద్రోహం - 26,14-16

ఓ వైపు పై భక్తురాలు ప్రేమ భావంతో క్రీస్తుకి అభిషేకం చేస్తూండగా మరోవైపు యూదా ద్రోహబుద్ధితో ప్రభువుని అప్పగించడానికి పూనుకొన్నాడు. ఆమె యోగ్యురాలైన శిష్యురాలు. యూదా కూడ పన్నిద్దరు శిష్యుల్లో ఒకడు. కాని అయోగ్యుడైన శిష్యుడు. అతడు దుష్ట శిష్యులకు గురుతుగా వుంటాడు. నేడు కూడ మనం ఆ యూదాలాగే ప్రభువుకి ద్రోహం చేసే అపాయం లేకపోలేదు.

నేను యేసుని మీ కప్పగిస్తే మీరు నాకేమి యిస్తారని యూదా ప్రధానార్చకులను అడిగాడు - 26,15. ఈ వాక్యాన్ని బట్టి అతడు ధనలోభం వల్ల క్రీస్తుని పట్టి యిచ్చాడనుకోవాలి. ధనవాంఛ పనికిరాదని ప్రభువు ముందుగానే హెచ్చరించాడు. అతడు ఈ లోకంలో సంపదలు కూడబెట్టుకోవద్దన్నాడు. మన సంపదలున్న చోటనే మన హృదయం వుంటుంది. కనుక మన సొత్తు ఎప్పుడూ పరలోకం లోనే వుండాలి. అప్పుడు మన మనసుకూడ పరలోకం మీదనే వుంటుంది - 6,19. ఇంకా, నరులు ఇద్దరు యజమానులను కొలవగూడదు. ఆ యిద్దరు యజమానులు దేవుడు ధనమూను - 6,24. పైగా శిష్యులు వెండిబంగారాల మీద గాక దేవుని మీదనే ఆధారపడాలి - 10,9. కాని యూదా ఈ బోధలన్నిటినీ పెడచెవిని బెట్టాడు.

యూదా మూర్ఖుడై అమూల్యమైన నిధిని పోగొట్టుకొన్నాడు. క్రీస్తే ఆ నిధి. ఆ నిధికి బదులుగా "ముప్పది వెండి నాణాలు" సంపాదించుకొన్నాడు. కాని వాటి విలువెంత? ఇక్కడ "వాళ్ళు అతనికి ముప్పది వెండి నాణాలు ఇచ్చారు" అనే వాక్యం జకర్యా ప్రవచనం 11,12 నుండి గ్రహింపబడింది. అక్కడ ఆ ప్రవక్త కొందరు అధికారులకు కాపరిగా కుదిరాడు. కాని ఆ యధికారులు ప్రవక్తను చిన్నచూపు చూచి అతనికి ఓ బానిసను

కొనడానికిచ్చే కొద్దిపాటి సొమ్ము మాత్రమే చెల్లించారు. ముప్పది వెండి కాసులు ఆ రోజుల్లో బానిసను కొనడానికి చెల్లించే సొమ్ము. అనగా శత్రువుల దృష్టిలో క్రీస్తు విలువలేని నిరుపేద బానిసలాంటివా డయ్యాడని భావం. మత్తయి యిక్కడ ఈ పూర్వవేద ప్రవచనాన్ని ఉదహరించడంలో ఉద్దేశం ఇదే. యూదా క్రీస్తుని శత్రువులకు పట్టియిస్తాడని పూర్వ వేదం ముందుగానే పేర్కొంది. తండ్రికి ఈ సంగతి ముందుగానే తెలుసు. కాని తండ్రి ఈ దుష్ట కార్యాన్ని గూడ మనకు రక్షణాన్నిచ్చే దాన్నిగా మార్చివేసాడు. అతడు చెడ్డనుండి కూడ మంచిని రాబట్టేవాడు.

ప్రధానార్చకుల నుండి సొమ్ము తీసికొన్నప్పటినుండి యూదా క్రీస్తుని అప్పగించడానికి "తగిన సమయం" కొరకు వేచివున్నాడు - 26,16. ప్రభువు కూడ "తన సమయం" కొరకు కాచుకొని వున్నాడు - 26,18. ఈ సమయం క్రీస్తు శత్రువులకు అప్పగింపబడే సమయమే. కాని యూదా ముప్పది వెండి నాణాలకు ఆశపడి ఈ సమయం కొరకు వేచివున్నాడు. క్రీస్తు మాత్రం మానవుల రక్షణ కొరకు స్వీయ ప్రాణాన్ని ధారపోయడానికి ఇదే సమయం కొరకు కాచుకొని వున్నాడు. ఇద్దరి వుద్దేశాల్లో ఎంత అంతరం!

ధనదాహం యూదాను నాశం చేసింది. ఆ దాహం నేడు మనలను కూడ కాల్చివేయవచ్చు. కనుక మన తరపున మనం జాగ్రత్తగా మసలుకోవాలి.

## 2. పాస్క విందు 26,17-35

ఈ ఘట్టంలో నాల్గంశాలున్నాయి. అవి 1) శిష్యులు పాస్క విందును సిద్ధం జేయడం - 26,17-19. 2) ప్రభువు యూదా ద్రోహాన్ని ముందుగానే తెలియజేయడం - 26,20-25. 3) అంత్యభోజనం - 26,26-29. 4) పేత్రు బొంకు - 26,30-35. ఇక ఈ నాల్గంశాలను సంగ్రహంగా పరిశీలిద్దాం.

### 1. శిష్యులు విందును సిద్ధం జేయడం 26,17-19

ఇక్కడ పేర్కొన్న సంఘటనం గురువారం జరిగింది. పాస్కోత్సవం యూదులకు అతి ప్రధానమైన పండుగ. అందరు భక్తి భావంతో ఆ దినం విందు భుజిస్తారు. కాని ఆ రోజు యూదులు పులియని రొట్టెలు మాత్రమే తినాలి. కనుక వాళ్లు ఆ ముందటి దినమే పులిసిన రొట్టెలను ఇండ్లలో నుండి తీసివేసేవాళ్లు. ఈ పాస్కోత్సవం గురువారం సాయంత్రం ప్రారంభమైంది. ఆ సాయంత్రమే ప్రభువు కడపటి విందు ఆరగించాడు.

శిష్యులు క్రీస్తుని అయ్యా! ఈ యేడు పాస్కవిందు ఎక్కడ తయారుచేయమంటారు అని అడిగారు. ప్రభువు వారితో మీరు నగరంలోని పలానా పెద్దమనిషి దగ్గరికి వెళ్ళండి.

నా సమయం సమీపించింది. దానికి ముందుగా నీ యింటిలో నా శిష్యులతో కలసి పాస్కవిందు భుజిస్తానని అతనితో చెప్పండి అన్నాడు-26,18. శిష్యులు వెళ్ళి గురువు చెప్పినట్లే చేసి విందు సిద్ధం జేసారు. ఈ పెద్దమనిషి యెవరో మనకు తెలియదు. కాని అతడు క్రీస్తు అనుచరుడై యుండాలి. ఇక్కడ ప్రభువు పల్కిన ఈ వాక్యంలో అతని ఠీవి, గాంభీర్యం కన్పిస్తాయి. క్రీస్తు గంభీరంగా ఆజ్ఞ యిచ్చాడు. శిష్యులు ఎదురు ప్రశ్న వేయకుండా వెంటనే వెళ్ళి అతడు చెప్పినట్లు చేసారు. అది వాళ్ళ విధేయతకు గుర్తు.

ఈ సందర్భంలో "సమయం" అంటే సిలువ మరణం. పూర్వవేదంలో యావే కడతీర్పు తీర్చేదినాన్ని "సమయం" అని పిల్చేవాళ్లు. అది రక్షణ సమయం. అలాగే యిక్కడ క్రీస్తు సిలువ మరణం ద్వారా మనకు రక్షణం లభిస్తుంది. కనుక ఇది కూడ రక్షణ సమయం. క్రీస్తు శిష్యులు కలసే విందు భుజిస్తారు. కాని భోజనానంతరం ఓలివు తోటలో శిష్యులు క్రీస్తు నుండి విడిపోతారు.

## 2. మీలో వొకడు - 26,20-25

ప్రభువు గురువారం సాయంత్రం యెరూషలేములో శిష్యులతో విందు భుజిస్తున్నాడు. క్రీస్తు మీలో వొకడు నన్ను శత్రువులకు పట్టియిస్తాడని విచారంగా పల్కాడు. శిష్యులు చింతా క్రాంతులై ప్రభువా! ఆ పనిచేసేది నేనా నేనా అని గ్రుచ్చి గ్రుచ్చి అడిగారు. ఇక్కడ "ప్రభువు" అనే పదం క్రీస్తు అధికారాన్నీ దైవశక్తినీ సూచిస్తుంది. ఆ పదాన్ని వాడ్డం ద్వారా శిష్యులు తమకు క్రీస్తునందు పూర్ణవిశ్వాసం వుందని తెలియజేసారు. "నాతో పాటు ఈ పాత్రలో చేయి ముంచినవాడే నన్ను అప్పగిస్తాడు" అని క్రీస్తు జవాబు చెప్పాడు. ఈ వాక్యం కీర్తన 41,9 నుండి గ్రహింపబడింది. "నాతో పాటు పాత్రలో చేయిముంచడం" అంటే, కలసి భుజించడం, లేక సహపంక్తి భోజనం చేయడం. యూదులు భోజనం చేసేపుడు అందరూ కలసి ఒకే పాత్రలో వున్న కూరను రొట్టోతో అద్దుకొని తినేవాళ్లు. ఈలా కలసి భుజించినవాళ్లు మిత్రులౌతారు. కనుక నా మిత్రుడే నాకు కీడు చేస్తాడని క్రీస్తు పలికిన వాక్యానికి అర్థం. యూదా మిత్రద్రోహి.

ఈ సందర్భంలో ప్రభువు మనుష్య కుమారుని అప్పగించేవానికి అనర్థం. అతడు పుట్టకుండావున్నా బాగుండేది అన్నాడు - 26,24. ఇవి క్రీస్తు తీవ్రమైన హృదయ వేదనతో పల్కిన పల్కులు. ఓవైపు తన్ను గూర్చి ప్రవక్తలు ముందుగా నుడివినట్లే మనుష్యకుమారుడు చనిపోతాడు. తండ్రి అతనికి ఓ రక్షణ ప్రణాళికను సిద్ధం జేసియిచ్చాడు. క్రీస్తు దైవచిత్తానికి లొంగి ఆ ప్రణాళిక ప్రకారం చనిపోతాడు. కాని మరో వైపు ఈ మరణం యూదా ద్రోహం ద్వారా సంభవిస్తుంది. దానికి అతడు పూర్తిగా బాధ్యుడౌతాడు. అతడు ఈ ఘోర

కార్యం చేయడం కంటే అసలు పుట్టివుండకుండా వుంటే బాగుండేది. ఈలాంటి పాపకార్యం చేసాడు. కనుక అతడు దేవుని తీర్పునూ శిక్షనూ తప్పించుకోలేడు. ప్రతి నరుడు తన కార్యాలకు తాను బాధ్యుడవుతాడు. యూదా ధనాన్నెన్నుకొని క్రీస్తుని నిరాకరించాడు. అతడు ఆ పాపానికి తగిన శిక్ష అనుభవించి తీరుతాడు. ఇవి భయంకరమైన పలుకులు. యూదా లాగే మనమూ ప్రభువుకి ద్రోహం చేసి అతడు పొందిన శాపాన్ని కొనితెచ్చుకోవచ్చు. ఈ ప్రమాదం మన జీవితంలో ఎప్పుడూ వుంటుంది.

కడన యూదా తన తప్పును కప్పి పెట్టుకోగోరి గురువా! నిన్నప్పగించేది నేను, నేను కాదు గదా? అని అడిగాడు. క్రీస్తు ఆ మాట నీవే చెప్పావు అని జవాబిచ్చాడు - 26,24.

మీద శిష్యులంతా క్రీస్తుని ప్రభువు అని సంబోధించారు. యూదా వొక్కడే అతన్ని గురువు అని సంబోధించాడు. యూదరబ్బయిలు క్రీస్తుని శంకిస్తూ అతన్ని గురువా అని పిల్చేవాళ్లు. ఇక్కడ యూదాలో కూడ ఈ సందేహం వుంది. మత్తయి సువిశేషంలో క్రీస్తుని "గురువా" అని పిల్చేవాళ్ళు మంచి ఉద్దేశంలో పిల్వరు.

ప్రభువు యూదాతో నీవే నన్ను అప్పగిస్తావని నేరుగా చెప్పలేదు. "ఆమాట నీవే చెప్పావు" అన్నాడు. ఇది ఓ రకమైన అరమాయిక్ ప్రయోగం. సువిశేషంలో ఈ ప్రయోగం మళ్లామళ్లా వస్తుంది. ఈ ప్రయోగం వచ్చినపుడల్లా ప్రశ్న అడిగిన వ్యక్తే ఆ ప్రశ్నలోని కార్యానికి బాధ్యుడవుతాడని భావం. యూదా క్రీస్తుని నిన్ను అప్పగించేది నేనా, నేను కాదుగదా అని అడిగాడు. క్రీస్తు ఈ కార్యానికి నీవే బాధ్యుడివి అని జవాబు చెప్పాడు. అనగా క్రీస్తుని అప్పగించేది యూదాయే అని భావం. ఇక్కడ యూదా తాను చేయబోయే కార్యాన్ని ఓ ప్రశ్నగా మలచి క్రీస్తుని అడిగాడు. క్రీస్తు నీ ప్రశ్నకు నీవు చేయబోయే పనే జవాబు అని సమాధానం చెప్పాడు. యూదా క్రీస్తూ ఇద్దరూ ఈ ప్రశ్న భావమూ సమాధానం భావమూ కూడ బాగానే అర్థం జేసికొన్నారు. ఈలా ప్రభువు యూదాను అతడు చేయబోయే ఘోరకార్యాన్ని గూర్చి ముందుగా హెచ్చరించినా అతని మనసు కరగలేదు.

## 3. పాస్క భోజనం - 26, 26-29

అంత్యభోజనం క్రీస్తు శ్రమల ఘట్టంలో అతి ముఖ్యమైంది. దీనిలో చాల భావాలున్నాయి. ప్రస్తుతం కొన్నిటిని పరిశీలిద్దాం. ఈ భోజనాన్ని సూచిస్తూ ప్రభువు ఇంతకు ముందే రెండుసార్లు భోజనాలు వడ్డించాడు. అవి రెండూ కూడ రొట్టెలను అద్భుతంగా పెంచి ప్రజలకు ఆహారం పెట్టిన సందర్భాలే. అవి మత్తయి 14, 13-21లోను 15,32-39 లోను వస్తాయి. ఈ రెండద్భుతాలు మళ్లా ప్రభువు పూర్వం

యిస్రాయేలీయులకు దయచేసిన మన్నా భోజనాన్ని జ్ఞప్తికి దెస్తాయి - నిర్గ 16. ఇంకా యివి పూర్వం ఏలీయా యెలీషా ప్రవక్తలు భక్తులకు అద్భుతంగా ఆహారాన్ని దయచేసిన సందర్భాలను గూడ జ్ఞప్తికి దెస్తాయి. ఏలీయా భక్తురాలైన సారెఫతు విధవకు పిడతలో నూనె కుండలో పిండి తరిగిపోకుండా వుండేలా చేసాడు - 1రాజు 17,8-16. అలాగే యెలీషా ఇరువది రొట్టెలతోను కొద్దిపాటి గోదుమ వెన్నులతోను నూర్గురు భక్తులకు చాలినంత ఆహారాన్ని పెట్టాడు - 2 రాజు 4,42-44. ఈలా క్రీస్తు రొట్టెలను పెంచి చాల మందికి భోజనం పెట్టిన రెండద్భుతాలు బైబుల్లోని పూర్వ భోజన సంఘటనలను జ్ఞప్తికి దెస్తాయి. పైగా ఈ యద్భుతాలు బావికాలంలో రాబోయే భోజనాన్ని గూడ సూచిస్తాయి. యెషయా ప్రవక్త భావికాలంలో ప్రభువు సియోను కొండమీద దివ్యభోజనాన్ని వడ్డిస్తాడని ప్రవచించాడు - 25,27. ఈ దివ్యభోజనం మెస్సియా కొనివచ్చే రక్షణానికే చిహ్నంగా వుంటుంది.

సర్వశక్తి మంతుడైన ప్రభువు ఈ కొండమీద
సకల జాతులకు విందు సిద్ధంజేస్తాడు
అది ప్రశస్త మాంసభక్ష్యాలతోను
మధువుతోను కూడి ఉంటుంది
క్రొవ్విన పశువుల మాంసంతోను
తేరుకొనిన ద్రాక్షాసవంతోను నిండివుంటుంది.

రక్షణ కాలమైన అంత్యకాలంలో క్రీస్తు కరుణామయుడైన మెస్సీయాగా వచ్చాడు. అతడు ప్రజలకు రొట్టెల ఆహారాన్నే గాక వాక్యాహారాన్ని గూడ పెట్టాడు. ప్రజల వ్యాధిబాధలను తొలగించి వారికి చికిత్సాహారాన్ని గూడ పెట్టాడు. ఇప్పుడు ఈ కడపటి భోజనాన్ని కూడ శిష్యులకు అందిస్తున్నాడు.

పూర్వం యూదులు దాస్యవిముక్తి పొందిన పిదప ఐగుప్తు నుండి బయలుదేరక ముందు పాస్క గొర్రెపిల్లను భుజించారు. ఈ పాస్క విందులో క్రీస్తు తన్నే శిష్యులకు ఆహారంగా అందిస్తాడు. ఇక్కడ శిష్యులు భుజించే రొట్టె క్రీస్తు శరీరం. వారు పానం చేసే ద్రాక్షరసం అతని నెత్తురు. ఈ విందులో త్రుంచిన రొట్టె సిలువపై నలిగిపోయిన క్రీస్తు దేహానికి గుర్తు. వారు పానం చేసే ద్రాక్షరసం సిలువపై చిందించబడే క్రీస్తు రక్తానికి గురుతు. కనుక పాస్కవిందు శుక్రవారం అతడు అనుభవింపబోయే సిలువ మరణాన్ని సూచిస్తుంది.

ప్రభువు పానపాత్రాన్ని అందుకొని "ఇది నూత్న నిబంధనం యొక్క నా రక్తం" అని పల్కాడు. పూర్వం మోషే కోడెల నెత్తురు ప్రజలమీదా, పీఠం మీదా చిలకరించి ఒక

నిబంధనం చేసాడు. అప్పుడతడు యావే మీతో చేసికొన్న నిబంధనకు సంబంధించిన రక్తం ఇదే అని పల్కాడు - నిర్గ 24,7. ఆ మోషే నిబంధనం కడపటి విందులో క్రీస్తు నందు నెరవేరింది. మోషే నిబంధన రక్తాన్ని మనసులో పెట్టుకొనే క్రీస్తు "ఇది నూత్న నిబంధనం యొక్క నా రక్తం అన్నాడు. ఆ నిబంధనం యూదులకు రక్షణాన్ని సంపాదించి పెట్టింది. అలాగే ఈనాడు క్రీస్తు చేసే నిబంధనం గూడ నూత్న ప్రజలకు రక్షణాన్ని చేకూర్చిపెడుతుంది. ఆనాడు మోషే నిబంధనం ద్వారా యిస్రాయేలీయులు యావే ప్రజలయ్యారు. ఈనాడు క్రీస్తు నిబంధనం ద్వారా ఈ నూత్న ప్రజ కూడ దైవజనమౌతారు. ఈ దైవజనం ఒక్క భక్త సమాజంగా ఏర్పడి ఈ దివ్యశరీరాన్ని మళ్లామళ్లా భుజిస్తారు. ఇదే నేటి దివ్యసత్ప్రసాద విందు.

క్రీస్తు రక్తం "అనేకుల" పాపపరిహారార్థం చిందబడుతుంది. ఇక్కడ "అనేకులు" అంటే చాలమంది అని అర్థం గాదు. అందరు అనే అర్థం. యెషయా వర్ణించిన బాధామయ సేవకుడు "పెక్కుమంది" దోషాలను భరిస్తాడు - 53,12. అనగా అందరి దోషాలను భరిస్తాడు. అలాగే క్రీస్తు కూడ అందరి పాపాలు పరిహరిస్తాడని భావం. మత్తయి క్రీస్తే మన బాధామయ సేవకుడని తన సువిశేషంలో చాలసార్లు సూచించాడు. బాధామయ సేవకుడు ప్రధానంగా ప్రజలను రక్షించేవాడు. క్రీస్తు సొంతపేరు యేసు. ఆ పేరుకి పాపం నుండి మనలను రక్షించేవాడని అర్థం - మత్త 1,21. కనుక అతడు ఆ సేవకునికి పోలికగా వుంటాడు. ఆ సేవకుణ్ణి యెషయా

అతడు మన బాధలను భరించాడు
మన దుఃఖాలను వహించాడు

అని వర్ణించాడు - 53,4. మత్తయి ఈ వాక్యాలను క్రీస్తుకి ఈ విధంగా వర్తింపజేసాడు.

ఆయన మన బలహీనతలను తనపై వేసికొన్నాడు
మన రోగాలను తానే భరించాడు - 8,17.

అనగా అద్భుతాలు చేసి ప్రజల వ్యాధిబాధలు తొలిగించడం ద్వారా ప్రభువు ఆ ప్రజల బాధలను ఎత్తి తన నెత్తిన పెట్టుకొన్నట్లయింది.

బాధామయ సేవకుల్లాగే ప్రభువు ప్రధానంగా సేవకుడు. అతడు సేవలు చేయించుకోవడానికి కాక సేవలు చేయడానికే వచ్చాడు. అనేకుల రక్షణార్థం తన ప్రాణాలు ధారపోయడానికి వచ్చాడు - మత్త 20,28.

క్రీస్తు చిందించే రక్తం "అనేకుల పాప పరిహారానికి" ఉద్దేశింపబడింది. అతడు ముఖ్యంగా నరుల పాపాలను తొలగించేవాడు. ఈ లోకంలో మనుష్యకుమారునికి నరుల పాపాలు మన్నించే అధికారం వుందని వాకొన్నవాడు - మత్త 9,6.

అంత్య భోజనం ముగిసినపుడు ప్రభువు శిష్యులతో ఈ లోకంలో నేను మళ్లా మీతో కలసి ఈ ద్రాక్షరసం త్రాగనన్నాడు. ఎందుకంటే అతడు ఆ మరుసటి రోజే సిలువపై చనిపోతాడు. కాని అతడు తండ్రి రాజ్యంలో శిష్యులతో కలసి నూత్నంగా ద్రాక్షాసవాన్ని సేవిస్తానన్నాడు - 26,29. అది అతని వుత్థానానంతరం జరుగుతుంది. అనగా వుత్థానానంతరం క్రీస్తూ శిష్యులూ మోక్షంలో ఐక్యమౌతారని భావం. యూదులు మోక్షాన్ని గొప్పవిందుగా భావించారు. ఈలా ఈ కడపటి వాక్యం క్రీస్తు మరణోత్థానాలను సూచిస్తుంది.

అంత్య భోజనమే నేటి మన దివ్యసత్ప్రసాద విందు. దీనిలో మనం భక్తి భావంతో పాల్గొనాలి. అది పవిత్ర భోజనం. క్రీస్తు మరణోత్థానాలను జ్ఞప్తికి తెచ్చే భోజనం.

## 4. పేత్రు బొంకు - 26, 30-35

అంత్య భోజనం ముగిసాక క్రీస్తూ శిష్యులూ ఓ కీర్తన పాడారు. ఇది 114 నుండి 118 వరకు వచ్చే స్తుతి కీర్తనల వర్గం లోనిది. ఈజిప్టు దాస్యం నుండి యిస్రాయేలీయులను రక్షించినందులకు ఈ కీర్తనలు ప్రభుని స్తుతిస్తాయి. సువిశేషం క్రీస్తు పాటలు పాడినట్లుగా చెప్పేది ఈ వొక్క సందర్భంలోనే.

క్రీస్తు యూదా పతనాన్ని గూర్చి ముందుగానే తెలియజేసినట్లే ఇతర శిష్యులు పడిపోవడాన్ని గూర్చి గూడ ముందుగానే తెలిపాడు. అతడు వాళ్ళకు పతన కారణమౌతాడు. నరులు త్రోవలో రాతిని తట్టుకొని పడిపోయినట్లుగా శిష్యులు క్రీస్తుని తట్టుకొని పడిపోతారు. అనగా అతనిపట్ల వాళ్ళ విశ్వాసం చలిస్తుంది. ఎందుకు? శిష్యులు అతడు మహిమ ప్రతాపాలు గల మెస్సీయాగా వచ్చి రోమనులతో యుద్ధం చేస్తాడు అనుకొన్నారు. కాని క్రీస్తు వాళ్లు ఆశించినట్లుగా తన శక్తిని ప్రదర్శించడు. చేతగాని వాళ్లాగ సిలువ మీద చనిపోతాడు. అందుచే వాళ్ళ విశ్వాసం చలిస్తుంది. వాళ్లు అతన్ని విడనాడి పారిపోతారు.

నేను గొర్రెలకాపరిని వధిస్తాను, మందలోని గొర్రెలు చెల్లాచెదరౌతాయి అని జకర్యా ప్రవక్త పూర్వమే ప్రవచనం చెప్పాడు - జక 13,7. ఆ ప్రవచనం క్రీస్తు పట్ల నెరవేరింది. శత్రువులు క్రీస్తు కాపరిని పట్టుకోగానే శిష్యులంతా భయపడి పారిపోతారు. క్రీస్తు యూదులకు కాపరి, లేక నాయకుడు. ఆ ప్రజలు కాపరి లేని మందలాగ వుండడం జూచి ప్రభువు జాలిచెంది వారి కోపు తీసికొన్నాడు. వారికి బోధ చేసి అద్భుతాలు చేసి వారిని దారికి తీసికొని రాగోరాడు. 9,36.

ప్రభువు ఉత్థానమైన పిమ్మట శిష్యులకంటె ముందుగా తాను గలిలియ సీమకు వెళ్తానని చెప్పాడు - 36,32. ప్రభువు వచ్చినపని అతని మరణంతో ముగియదు.

మరణించిన తర్వాత అతడు మళ్లా ఉత్థానమౌతాడు. కనుక ఈ వాక్యం క్రీస్తు ఉత్థానాన్ని పేర్కొంటుంది. అతడు ఉత్థానానంతరం గలిలయకు వెళ్తాడు. పూర్వం అక్కడనే ప్రభువు శిష్యులను ప్రోగుజేసికొన్నాడు. అక్కడనే అతడు చాల అద్భుతాలు బోధలు చేసాడు. కనుక అక్కడనే వారిని మళ్లా కలసికొంటారు. శిష్యులు క్రీస్తుని విడచి పారిపోయి పాపం కట్టుకొంటారు. కాని ఉత్థాన క్రీస్తు గలిలయలో వారి పాపాన్ని మన్నిస్తాడు. వారిని తిరిగి తనతో రాజీపరచుకొంటాడు. లోకమంతట తన్ను గూర్చి బోధించమని అక్కడనే వారికి తుది ఆజ్ఞనిస్తాడు. ఇక్కడ క్రీస్తుకి శిష్యులపట్ల గల దయనూ సానుభూతినీ చక్కగా అర్థం చేసికోవాలి. వాళ్లు అతన్ని నిరాకరించినా అతడు వాళ్ళను నిరాకరించడు. వాళ్లు అతనికి ద్రోహం చేసినా అతడు ఆ ద్రోహాన్ని పట్టించుకోకుండా వాళ్లను మళ్లా తనకు మిత్రులను చేసికొంటాడు.

మీరు నా కారణంగా పడిపోతారు. నన్ను విడనాడి వెళ్లిపోతారు అని ప్రభువు ముందుగానే శిష్యులతో చెప్పాడు. కాని పేత్రు ప్రభువుతో వీళ్లంతా నిన్ను విడనాడినా నేను మాత్రం నిన్ను విడనాడనని బింకాలు పల్కాడు. కాని పేత్రు తన మాట నిలబెట్టుకోలేదు. ప్రభువు పేత్రూ! నీవా నన్ను విడనాడకుండా వుండేది! ఈ రాత్రే, కోడికూయకముందే, నీవు నన్ను మూడుసార్లు నిరాకరిస్తావు సుమా అని హెచ్చరించాడు. పేత్రు రోషం తెచ్చుకొని నేను నీతో చనిపోవలసివచ్చినా నిన్ను నిరాకరించను అని గొప్పలు చెప్పుకొన్నాడు. ఇతర శిష్యులు కూడ అతనిలాగే డాబుసరి మాటలు పల్కారు.

కాని శత్రువులు క్రీస్తుని బంధించడం జూచి పేత్రు భయపడిపోయాడు. కనుక అతడు ప్రభూ నేనే నిన్ను వదలనే వదలనని ఎంత గట్టిగా చెప్పాడో అంత గట్టిగానే నేనతన్ని యెరుగనే యెరుగనని మూడుసార్లు బొంకాడు. అతనికి తొందరపాటు ఎక్కువ. తనమీద తనకు ఉండకూడనంత నమ్మకం వుంది. తన బలహీనత తనకే తెలియదు. ఈ యతి నమ్మకం పేత్రునిలాగే మనలను కూడ నాశం చేయవచ్చు. ఉత్తముడు తన్ను తాను నమ్మాలి. కాని తన బలహీనతను తలంచుకొని భయపడాలి కూడ. స్వల్ప విషయం లోనే మనమంతా కూలిపోతాం. అతి తేలికగా పాపం కట్టుకొంటాం.

## 3. గెత్సెమని - 26, 36-56

ఈ భాగంలో రెండంశాలున్నాయి. మత్తయి మొదట క్రీస్తు చేసిన ప్రార్థనను వర్ణించాడు - 26,36-46. అటుపిమ్మట శత్రువులు క్రీస్తుని బంధించిన తీరును వివరించాడు - 26,47-56. ఈ రెండంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. గెత్సెమని ప్రార్థనం - 26, 36-46

నూత్న వేదంలోని అతి ప్రశస్త భాగాల్లో ఇదీ వొకటి. ఈ భాగాన్ని మోకాళ్ళమీద వుండి చదువుకోవాలి. చదువుకొని భక్తి భావంతో ప్రభుని ఆరాధించాలి. గెత్సెమని అంటే ఓలివు చమురుతీసే గానుగ. ఇది ఓ ఓలివు తోట. దీని యధికారి క్రీస్తుకి స్నేహితుడై యుండవచ్చు. కనుకనే ప్రభువు ఇక్కడికి చాలసారులు శిష్యులతో వచ్చి నిరాటంకంగా ప్రార్థన చేసికొని పోతూండేవాడు. ఈ తోట కిద్రోను లోయలో, ఓలివు కొండకు ఆనుకొని వుంది.

ప్రభువు శిష్యులతో ఈ తోటకు వచ్చాడు. నేను అల్లంత దూరంపోయి ప్రార్థన చేసికొని వస్తాను. మీరిక్కడనే కూర్చొనండి అని శిష్యులతో చెప్పాడు. పూర్వం ఈసాకుని మోరీయా కొండకు తీసికొని పోయిన అబ్రాహాము కూడ తన పనివారితో "మీ రిక్కడనే వుండండి. నేను చిన్నవాడు అక్కడికి వెళ్ళి దేవునికి మొక్కులు చెల్లించుకొని తిరిగి వస్తాం" అని చెప్పాడు - ఆది 22,5. బైబుల్లో ఈసాకు క్రీస్తుకి పోలికగా వుంటాడు. క్రీస్తు విశ్వాసం అబ్రాహాము విశ్వాసాన్ని మించింది.

ప్రభువు పదకొండు మంది శిష్యులను తోటలో ఒక తావున ఆపి ముగ్గురుని మాత్రం తనతో తీసికొని ముందుకి వెళ్లాడు. ఈ ముగ్గురు పేత్రు యాకోబు యోహాను. వీరికి శిష్యుల్లో ఓ ప్రత్యేక స్థానం వుంది. అతడు వీరినే మొదట పిల్చాడు - 4,18-22. వీళ్ళు మాత్రమే తబోరు కొండమీద క్రీస్తు మారురూపం తాల్చినపుడు అతనితో పాటు వున్నారు - 17,1-8. కొండమీద క్రీస్తు తేజస్సును చూచిన ఈ ముగ్గురు ఇప్పుడు క్రీస్తు తాగబోయే పాత్రను కూడ చూస్తారు. ఆ పాత్రను తాము కూడ తాగితేనే గాని క్రీస్తు మహిమను స్వీకరించలేరు - 20,22-33.

తోపులో ప్రభువు చింతాక్రాంతుడై ఆవేదన పడసాగాడు - 26,37. ఈ వాక్యం 42వ కీర్తనలోని "ప్రభూ! నేను విచారంలో మునిగి నిన్ను జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాను" అనే 6వ చరణాన్ని స్మృతికి తెస్తుంది. ప్రభువు ఇక్కడ ఈ 42వ కీర్తనను జపించి ఉండవచ్చు కూడ. అతడు శిష్యులతో నా యాత్మ మరణ వేదనను అనుభవిస్తూంది అని చెప్పాడు. ప్రభువుకి మరణ సమయం సమీపంలోనే వుంది. కనుక మరణించే వ్యక్తికి ఎంత వేదన కలుగుతుందో అతనికీ ఈ సమయంలో అంత వేదన కలిగిందనుకోవాలి.

మామూలుగా మనం మన ప్రసంగాల్లో విన్నట్లుగా క్రీస్తుకి ఇక్కడ ఆవేదన కలిగించింది భావికాలంలో మనం చేయబోయే పాపాలు కాదు. అతడు దేవుని కుమారుడైనా

పరిపూర్ణంగా నరుడు కూడ. నరులందరికీ మరణమంటే భయం, దుఃఖం, అనిష్టం కలుగుతాయి. కనుక క్రీస్తుకి కూడ తన మరణం భయం, అనిష్టం కలిగించింది. ఈ యనిష్టమే అతనికి ఆవేదన కలిగించింది. ముప్పది మూడేండ్ల యీడున చనిపోవడానికి ఎవరిష్టపడతారు?

క్రీస్తు శిష్యులతో మీరు నాతో జాగరణం చేయండి అని పల్కాడు - 26,38. అనగా నాతో మేల్కొని ఉండండని భావం. ఎందుకు? క్రీస్తు సమయం అసన్నమైంది - 26,28. అనగా క్రీస్తు మరణకాలం సమీపించింది. అతని మరణోత్థానాల ద్వారానే మనకు రక్షణం. కనుక ఈ ముఖ్య సమయంలో శిష్యులు మేల్కొని ఉండాలే గాని నిద్రపోగూడదు. ఆ చివరి క్షణాల్లో క్రీస్తుకి అండగా ఉండడం వాళ్ళ పూచీ. మెలకువతో వుండండి. ఆ దినంగాని, గడియ గాని మీ రెరుగరు - 25,13.

క్రీస్తు నేల మీద చాగిలపడి తండ్రీ! సాధ్యమైతే ఈ పాత్రను నానుండి తొలగించు అని ప్రార్థించాడు - 26,39. బైబులు భక్తులు భగవంతుని పట్ల తమకు గల గౌరవభావాన్నీ ఆరాధాన భావాన్నీ సూచించడానికి నేలమీద చాగిలపడేవాళ్ళు. క్రీస్తుకూడ ఇక్కడ అలాగే చేసాడు. ప్రభువు పరలోక పితను తండ్రీ అని పిల్చాడు. మనం దేవుణ్ణి తండ్రీ అని పిల్వాలనే అతడు పరలోక జపంలో నేర్పించాడు. తాను నేర్పిన సూత్రాన్ని ఇక్కడ తానే పాటించాడు - 6,9. పరలోక జపానికీ గెత్సెమనీ ప్రార్థనకీ దగ్గరి సంబంధం వుంది. పితకూ క్రీస్తుకీ తండ్రీ కుమారుల సంబంధం వుంది. క్రీస్తుకి తండ్రిపట్ల నమ్మకమూ విధేయతాగుణమూ వున్నాయి. పూర్వ వేదంలో యిస్రాయేలు ప్రజలంతా కలసి దేవుని కుమారుడు. ఇక్కడ క్రీస్తు తండ్రికి విధేయుడైన యిస్రాయేలు. స్వీయ మరణానికి గూడ జంకకుండ తండ్రి నిర్ణయించిన రక్షణ మార్గాన్ని సాధించే యిస్రాయేలు. కనుక ఈ మరణకాలంలో గూడ అతడు తండ్రికి నమ్మదగిన కుమారుడుగానే ప్రవర్తించాడు.

క్రీస్తు ఈ పాత్రను తొలగించు అని తండ్రికి మనవి చేసాడు. యూదుల భాషలో మన పాలబడేది ఏదైనా "పాత్రే". అది కష్టమూ గావచ్చు సుఖమూ గావచ్చు. ఇక్కడ సిలువ మరణమే పాత్రం - 20,22-23.

ప్రభువు నా చిత్తం కాదు, నీ చిత్తమే నెరవేరనీయి అని తండ్రిని వేడుకొన్నాడు - 26,39. నరుడు కష్టసుఖాల్లోను దేవుని చిత్తానికి లొంగాలి. తన చిత్తప్రకారం తాను ప్రవర్తించకూడదు. పరలోక జపంలో ప్రభువు "నీ చిత్తం పరలోకంలో నెరవేరినట్లు భూలోకంలోను నెరవేరును గాక" అని తండ్రికి ప్రార్థన చేయమన్నాడు. ఆ నియమాన్ని ఇక్కడ తానే పాటించాడు. మనం తరచుగా దేవుని చిత్తానికి లొంగం. అసలు దైవచిత్తం ఒకటుందని కూడ మనకు తెలియదు. కనుకనే సులువుగా పాపంలో పడిపోతూంటాం.

క్రీస్తు ప్రార్థనలోని ముఖ్యాంశాలు రెండు. మొదటిది, దేవుణ్ణి తండ్రిగా భావించి చనువుతో తండ్రీ అని పిల్వడం. రెండవది, దేవుని చిత్తానికి లొంగడం.

ఈ సందర్భంలో లూకా సువిశేషం మత్తయి సువిశేషంలో లేని అంశాలను రెండింటిని పేర్కొంటుంది - లూకా 22,43-44. మొదటిది, స్వర్గం నుండి ఓ దేవదూత దిగివచ్చి క్రీస్తుని బలపరచాడు. ఇక్కడ దేవదూత చేసిన పని దైవవరప్రసాదాన్ని కొనిరావడమే. తండ్రి క్రీస్తు ప్రార్థనను ఆలించి అతనికి వరప్రసాద బలాన్ని దయచేసాడు. ఈ బలంతో అతడు తండ్రి చిత్తానికి లొంగివుండగలడు. తండ్రి నిర్ణయించినట్లుగా సిలువ మరణాన్ని అంగీకరించగలడు.

రెండవది, క్రీస్తు చెమట రక్తబిందువుల్లాగ బొట్టుబొట్లుగా కారి భూమిమీద పడింది. మన జపపుస్తకాలు వర్ణించినట్లుగా ప్రభువు ఇక్కడ రక్తచెమట చెమర్చలేదు. అతని చెమట రక్తబిందువుల్లాగ బొట్లుబొట్లుగా కారి నేలమీద పడింది, అంతే. చెమట బిందువులకు రక్తబిందువులు కేవలం ఉపమానం మాత్రమే. ప్రభువు ఇక్కడ మరణంతో పోరాడుతున్నాడు. ఆ పోరాటం పందెంలో ఆటగాడు, యుద్ధంలో సైనికుడు పోరాడినట్లుగా వుంటుంది. ఈ పోరాటంలో కలిగిన శ్రమవల్ల అతడు మామూలు చెమటనే చెమర్చాడు. ఆ చెమట బిందువులు రక్తబిందువుల్లాగా కారి నేలమీద పడ్డాయి. ఇది లూకా ఉద్దేశించిన భావం. క్రీస్తు రక్తచెమట చెమర్చలేదు అంటే, ఆ ప్రభువు శ్రమలపట్ల మనకు భక్తి సన్నగిల్లిపోయినట్లు కాదు. మన కొరకు అసువులు బాసిన ప్రభువు పట్ల మనకు ఎప్పుడూ భక్తి వుండవలసిందే.

మొదటిసారి ప్రార్థన చేయడం ముగించాక క్రీస్తు ముగ్గురు శిష్యుల దగ్గరికి వచ్చాడు. కాని వారు నిద్రలో వున్నారు. ఇది కేవలం శారీరకమైన నిద్ర మాత్రమే కాదు. ఆధ్యాత్మికమైన నిద్రకూడ. ప్రభువు సమయం ఆసన్నమైంది. నరజాతి రక్షణం అతని మరణోత్థానాల మీద ఆధారపడి వుంది. అతని మరణకాలంలో పిశాచం తన శక్తిని బలంగా చూపుతుంది. ఈ ముఖ్య సమయాన్ని శిష్యులు గుర్తించడం లేదు. ప్రార్థన చేసికొని ఆ కష్ట సమయానికి సిద్ధం కావడం లేదు. అవివేకంతో కునుకు తీస్తున్నారు. కనుక ఈ విషమ సమయంలో వాళ్ళు తప్పక కూలిపోతారు. పిశాచ శోధనకు లొంగిపోతారు. ఏమి శోధన? క్రీస్తు శోధన పిత చిత్తానికి లొంగకుండా వుండటం. అతడు ప్రార్థన చేసికొని ఆ శోధనను జయించాడు. శిష్యుల శోధన క్రీస్తు మరణ కాలంలో అతనికి అండగా నిల్వకపోవడం. వాళ్లు గూడ ప్రార్థన చేసికొని ఆ శోధనను జయించాలి. కనుక ప్రభువు వారిని మేల్కొనివుండి జాగ్రత్తగా ప్రార్థనం చేసికొమ్మని హెచ్చరించాడు.

ఆత్మ ఇచ్చగించినా దేహం దుర్బలంగా వుంది అన్నాడు క్రీస్తు - 26,41. ఇక్కడ ఆత్మ అంటే ఆధ్యాత్మిక మానవుడు. దేహం అంటే పాపపు మానవుడు. నరుల్లో

ఆధ్యాత్మిక మానవుడు విజృంభించాలి. పాపపు మానవుడు కూలిపోవాలి. కాని శిష్యుల్లో ఈ సూత్రం కేవలం భిన్నంగా వుంది. ఇక్కడ భావం ఇది. మన ఆత్మలో దైవాత్మ సాన్నిధ్యం వుంటుంది. దీనితో మనం శోధనలను జయించగలం. కాని మనలో పాపగుణం కూడ వుంటుంది. ఇది మనలను బలహీనులను చేస్తుంది. మనం శోధనలకు లొంగిపోయేలా చేస్తుంది. కనుకనే క్రీస్తు శిష్యులను మేల్కొని వుండి ప్రార్థనం చేయమన్నాడు. ఆ ప్రార్థన ద్వారా శోధనను జయించమన్నాడు. ఇక్కడ శోధనమంటే యూదా ద్వారా రాబోయే పిశాచశక్తి. ఈ శక్తి క్రీస్తుని తండ్రికి విధేయుడవు కావద్దని ప్రేరేపిస్తుంది. శిష్యులను మరణకాలంలో క్రీస్తుకి అండగా వుండవద్దని ప్రేరేపిస్తుంది. క్రీస్తు ఈ శక్తికి లొంగడు. శిష్యులు మాత్రం లొంగిపోతారు. కనుకనే వాళ్లు ముందుగా ప్రార్థనం చేసికొని ఈ దుష్ట శక్తిని ఓడించాలి.

మత్తయి సువిశేషంలో క్రీస్తు శిష్యులను చాలసార్లు "అల్ప విశ్వాసులారా" అని సంబోధించాడు. అల్ప విశ్వాసి అంటే ఆధ్యాత్మిక నరుడుగాగాక పాపపు నరుడుగా ప్రవర్తించడమే - 14,31.

క్రీస్తు రెండవసారి కూడ పూర్వపు ప్రార్థననే చేసాడు. కాని రెండవసారి ఈ పాత్ర తొలగిపోకుంటే నేను దాన్ని త్రాగడానికి సంసిద్ధుణ్ణి అని అన్నాడు - 26,42. అనగా అతడు దైవచిత్తానికి అధికాధికంగా విధేయుడయ్యాడని అర్థం జేసికోవాలి. అతడు మూడవసారి కూడ మొదటిరీతినే ప్రార్థించాడు. అనగా తాను తండ్రిపట్ల భక్తి విశ్వాసాల తోను వినయవిధేయతలతోను చేసిన ఆ తొలి ప్రార్థననే తిరిగితిరిగి చేసాడు. మనం తరచుగా ప్రార్థనను కొనసాగించం. అందువల్ల పొందవలసిన వరప్రసాదాలు కూడ పొందం.

మూడవసారి ప్రార్థన చేసి ముగించాక అతడు శిష్యుల దగ్గరికి వచ్చి వారిని నిద్ర లేపాడు. మనుష్య కుమారుని పాపులకు అప్పగించే సమయం రానే వచ్చింది. ఇక లెండి, పోదాం అన్నాడు - 26,45-46. క్రీస్తు సమయం, అనగా అతన్ని అప్పగించే గడియ ఆసన్నమైంది. అతడు మేల్కొని వుండి ప్రార్థన చేసికొని బలాన్ని పొందాడు. ఆ విషమ సంఘటనను ఎదుర్కోడానికి శక్తిని పొందాడు. ఆ శక్తితోనే అతడు శత్రువులను కలసికోవడానికి ముందుకి వెళ్లాడు. ఇక లేవండి శత్రువుల యెదుటికి వెళ్దాం అని శిష్యులను గూడ హెచ్చరించాడు - 26,46.

గెత్సెమని సంఘటనం మనకెన్నో భక్తిభావాలను నేర్పిస్తుంది. 1. రెండవ శతాబ్దంలో జీవించిన క్రైస్తవ వేదాంతి టెర్టూలియన్ సువిశేషాల్లోకి ఎక్కని క్రీస్తు వాక్యాన్ని

ఒకదాన్ని ఉదహరించాడు. అది ఇది. "శోధనకు గురికానివా డెవడూ దైవరాజ్యంలోకి ప్రవేశించలేడు". క్రీస్తుకి గెత్సెమని ఒక శోధనలాంటిది. అతడు దైవచిత్తానికి లొంగుతాడో లేదో ఆ శోధన పరీక్షించింది. అక్కడ క్రీస్తు తండ్రీ! నీ చిత్త ప్రకారమే కానీయి అని పల్కి ఆ శోధనను జయించాడు. క్రీస్తుకు లాగే ఈనాడు మన గెత్సెమని మనకుంటుంది. మన శోధనలే మన గెత్సెమని అనుకోవాలి. కాని వాటి నుండి మనం గట్టెక్కగలమా?

2. క్రీస్తు గెత్సెమని తోపులో శిష్యులతో వున్నా వంటరివాడయ్యాడు. వాళ్ళ వల్ల అతనికి ఏ సహాయమూ లభించలేదు. మనం కూడ మన బాధల్లో చాలసార్లు వంటరి వాళ్లమైపోతాం. మనచుట్టూ వున్నవాళ్లు కూడ మనకు సాయం చేయలేరు. అలాంటి పరిస్థితిలో మన వంటరితనపు బాధను తొలగించమని ప్రభువునే అడుగుకోవాలి. ఆనాడు ఓలివు తోటలో వంటరితనాన్ని అనుభవించిన ప్రభువు మన బాధను అర్థం జేసికొంటాడు.

3. మూడవసారి ప్రార్థన చేసి ముగించాక క్రీస్తు శిష్యుల దగ్గరికి వచ్చి "ఇక లేవండి, పోదాం. నన్ను పట్టియిచ్చేవాడు సమీపంలోనే వున్నాడు" అన్నాడు - 24,46. సెల్సస్ అనే రెండవ శతాబ్దపు రోమను పౌరుడు క్రైస్తవులకు బద్ధ శత్రువు. అతడు "ఇక లేవండి, పోదాం" అన్న పై క్రీస్తు మాటలను ఉదాహరించి, ఇక్కడ క్రీస్తు శత్రువుల నుండి పారిపోగోరాడు అని వాదించాడు. కాని ఇక్కడ "లేవండి, పోదాం" అంటే యూదాతో వచ్చే శత్రువర్గం నుండి పారిపోదామని భావం కాదు. ఆ శత్రువర్గాన్ని ఎదుర్కోడానికి వెళ్లాం పదండి అని భావం. క్రీస్తు యూదా నుండి పారిపోలేదు, అతనికి ఎదురు వెళ్లాడు. కాని ఈ శక్తి అతనికి ఏలా వచ్చింది? తాను మూడుసార్లు ప్రార్థనం చేసికోవడం వల్లనే. నేడు మనం కూడ ప్రార్థన ద్వారానే శక్తిని పొందాలి. ఆ శక్తితోనే ఈ లోకంలో మన కెదురయ్యే బాధలనూ సమస్యలనూ ఎదుర్కోవాలి. కనుక ప్రార్థన చేసికోనివాడు ఈ లోకంలో ఎదురయ్యే పోరాటాల్లో నిలువలేడు.

4. శిష్యుల బాధ్యత క్రీస్తు మరణ సమయంలో అతనికి అండగా నిల్వడం. అతడు తండ్రి నిర్ణయించిన సిలువ మరణాన్ని అనుభవించేలా చూడ్డం. కాని వాళ్లు ఈ బాధ్యతను విస్మరించి నిద్రపోయారు. కనుక శోధనకు గురయ్యారు. శత్రువులకు భయపడి క్రీస్తుని విడనాడి పారిపోయారు. ఈనాడు మనం కూడ ఆ శిష్యుల్లాగే మన బాధ్యతలను విస్మరిస్తాం. మనం చేయవలసిన కార్యాలను వదలివేసి ఏవేవో పిచ్చిపిచ్చి పనుల్లో పడిపోతాం. కాలుజారి పాపంలో పడిపోతాం. క్రీస్తు చెప్పినట్లుగా, శోధనలకు గురికాకుండా వుండాలంటే, జాగ్రత్తగా మేల్కొనివుండి ప్రార్థనం చేసికోవాలి. మన బాధ్యతలను మనం సక్రమంగా నిర్వర్తించాలి.

## 2. శత్రువుల చేతిలో ప్రభువు - 26,47-56

ప్రభువు శిష్యులను నిద్ర లేపుతూండగానే యూదా పెద్ద జనసమూహంతో వచ్చాడు. వాళ్ళను ప్రధానార్చకులు పంపారు. ఈ సంఘటనం ఈలా జరుగుతుందని క్రీస్తుకి ముందుగానే తెలుసు. కనుకనే అతడు నాగడియ సమీపించింది, నన్ను పట్టియిచ్చేవాడు సమీపంలోనే వున్నాడు అని ముందుగానే చెప్పాడు. శత్రువులు సమీపించినపుడు గూడ క్రీస్తు ఠీవినీ గాంభీర్యాన్ని కోల్పోలేదు.

యూదా ద్రోహబుద్ధితో వచ్చాడు. నేను ముద్దు పెట్టుకొనేవాణ్ణి మీరు బంధించండి అని అతడు ముందుగానే జనసమూహానికి ఆనవాలు ఇచ్చాడు. రబ్బయిల శిష్యులు గౌరవ సూచకంగా తమ గురువులను ముద్దు పెట్టుకొనేవాళ్లు. కనుక బయటికి గౌరవాన్ని చూపిస్తున్నట్లు నటిస్తూ యూదా గురువుని ముద్దుపెట్టుకొన్నాడు. అతని హృదయం మాత్రం విషంతో నిండివుంది. దుర్మార్గులు లోపల ఒకటి పెట్టుకొని బయటికి ఇంకొకటి చెప్తుంటారు.

మనమయితే ఈలాంటి సందర్భంలో యూదా మీద విరుచుకుపడతాం. నీవు తేనె పూసిన కత్తివని చెడాబడా తిడతాం. కాని క్రీస్తు ఇక్కడ సంయమనాన్ని కోల్పోలేదు. అతడు గురుద్రోహిని స్నేహితుడా అని సంబోధించాడు. నీవు వచ్చినపని కానీయి అని చెప్పాడు. అనగా ఓయి నీవు ఈ ముద్దులాంటి బాహిర క్రియలతో కపట నాటకాలు ఆడ్డమెందుకు? పనికి పూనుకో. నన్ను వెంటనే పట్టియీయి అని భావం.

క్రీస్తు యూదాతో మాట్లాడి చాలించిందాకా జనసమూహం అతని మీద చేయి వేయలేదు. అతడు సంభాషణం చాలించిన పిదపనే వాళ్లు అతన్ని పట్టుకొన్నారు. ప్రభువుకి జరగబోయే సంఘటనలన్నీ ముందుగానే తెలుసు. అతడు నిస్సహాయుడై ఆ సంఘటనలకు లొంగిపోడు. తానే వాటిని నడిపిస్తూంటాడు. వాటిని అదుపులో పెట్టుకొంటూంటాడు. ఠీవి, గాంభీర్యం, హుందాతనం అతనిలో ఎప్పుడూ కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంటాయి.

ప్రధానార్చకులు పాస్కపండుగ సమయంలో క్రీస్తుని బంధించకూడదనుకొన్నారు. కాని యూదా అతన్ని పాస్క తిరునాళ్ల సందర్భంలోనే రహస్యంగా బంధించే మార్గం చూపించాడు. కనుక శత్రువులు తమ ప్రణాళికకు విరుద్ధం గానే ప్రభువుని పట్టుకొన్నారు.

జనం క్రీస్తుని పట్టుకోగా పేత్రు ఆవేశంతో ప్రధానార్చకుని చెవిని తెగనరికాడు. అతని పేరు మాల్కుస్. కాని ప్రభువు పేత్రుని కత్తిదించమన్నాడు. ఇందుకు అతడు మూడు కారణాలు చూపాడు. 1. కత్తిని ఎత్తేవాడు కత్తితోనే మరణిస్తాడు. హింసకు పూనుకొనేవాడు హింస వల్లనే నశిస్తాడు. ఇది వో సామెత. క్రీస్తు హింసను ఎంతమాత్రం అంగీకరించలేదు. అతడు నీ కుడి చెంపపై కొట్టినవానిని నీ ఎడమ చెంపమీద కూడ కొట్టనీయమని బోధించాడు

కదా! - 5,9. 2. క్రీస్తుకి పేత్రు రక్షణం అక్కరలేదు. రక్షణ కావాలనుకొంటే దేవదూతల దళాలు వచ్చి అతన్ని కాపాడతాయి. 3. క్రీస్తు శ్రమల సంఘటనలన్నీ పూర్వ వేద ప్రవక్తలు చెప్పినట్లుగానే జరుగుతాయి. వాటిని అలా జరగనీయవలసిందే. ఎవరూ వాటిని ఆపలేరు. ప్రవచనాలు క్రీస్తునందు పరిపూర్ణంగా నెరవేరాలి.

కడన క్రీస్తు జన సమూహాన్ని మందలించాడు. వాళ్ళు కత్తులతో గుదియలతో పెద్ద కోలాహలంతో క్రీస్తుని పట్టుకోడానికి వచ్చారు. ఇంత ఆర్భాటమెందుకు? రోజూ అతడు దేవాలయంలో బోధిస్తూ వారికంట పడుతూనే వున్నాడు కదా? ఐనా అప్పుడు వాళ్ళు అతన్ని పట్టుకోలేదు. ఎందుకు? అతనికి ప్రజాదరణం వుంది. అతన్ని బహిరంగంగా బంధిస్తే జనం ఊరుకోరు. ఇప్పుడు మాత్రం అతన్ని రహస్యంగా బంధిస్తున్నారు. పూర్వవేద ప్రవచనాలు నెరవేరడానికే ఈ కార్యం ఈలా జరిగింది. క్రీస్తు నందు ప్రవచనాలు నెరవేరాయి అనే అంశాన్ని మత్తయి మళ్ళీమళ్ళీ పేర్కొంటాడు.

శత్రువులు క్రీస్తుని బంధించగానే శిష్యులంతా భయపడి పారిపోయారు - 26,56. శోధనకు లొంగకుండా వుండడానికి మేల్కొనివుండి ప్రార్థన చేయమని ప్రభువు వారిని ఆదేశించాడు. ఐనా వాళ్ళు ఆ కార్యం చేయలేదు. కనుక ఇప్పుడు శోధనకు తట్టుకొనే బలం వాళ్ళకు లేదు. కావున శత్రువులకు దడిసి క్రీస్తుని విడనాడి పారిపోయారు.

ప్రభువు శత్రువులకు చిక్కిపోయాడు. అతని శ్రమలు ప్రారంభమయ్యాయి. ఇక అతని మరణ సంఘటనలు ఒకదాని తర్వాత ఒకటి చరాచరా సాగిపోతాయి.

## 4. న్యాయసభ తీర్పు - 26,57-27,10

గురువారం రాత్రి క్రీస్తుని బంధించి ప్రధానార్చకుని యింటికి తోసికొని పోయారు. కయిఫా ముందు క్రీస్తు నేనే మెస్సీయాననీ దైవ కుమారుడననీ ధైర్యంగా ప్రకటించాడు. పేత్రు యూదా అలా ప్రకటించలేకపోయారు. యూదుల న్యాయ సభ క్రీస్తుని చంపించ గోరింది. పిలాతు అతనికి మరణశిక్ష విధించాడు. ఈ భాగంలో నాల్గంశాలున్నాయి. 1) యూదుల న్యాయసభ క్రీస్తుని పరిశీలించడం - 26,57-68. 2) పేత్రు క్రీస్తుని ఎరుగనని బొంకడం - 26,69-75. 3) న్యాయసభ క్రీస్తుని చంపించాలని నిర్ణయించడం - 27,1-2. 4) యూదా దుర్మరణం - 27,3-10. ఇక ఈ నాల్గంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

### 1. న్యాయసభ క్రీస్తుని పరిశీలించడం 26,57-68

క్రీస్తు తీర్పు మూడు భాగాలుగా జరిగింది. మొదటి భాగంలో యూదుల న్యాయసభ అతన్ని పరిశీలించింది. ఇది గురువారం రాత్రి జరిగింది - 26,57-68.

రెండవ భాగంలో, అదేసభ మళ్లీ శుక్రవారం ప్రాతఃకాలాన సమావేశమై క్రీస్తుని చంపించాలని నిర్ణయించింది - 27,1-2. మూడవభాగంలో పిలాతు క్రీస్తుకి మరణ శిక్ష విధించాడు - 27,11-26.

శత్రువులు గురువారం రాత్రి క్రీస్తుని బంధించి ప్రధానార్చకుడైన కయిఫా ఇంటికి తీసకొని పోయారు. ఇక్కడే యూదుల న్యాయసభ లేక సానెడ్రిన్ సభ సమావేశమై క్రీస్తు దోషాలను పరిశీలించి చూచింది. కాని ఈ సభ ఈ రాత్రి తుది తీర్పు చెప్పలేదు. ఆకార్యం శుక్రవారం వేకువజామున జరుగుతుంది. శత్రువులు క్రీస్తుని ప్రధానార్చకుని యింటికి తీసికొని వస్తుంటే, పేత్రు కూడా అతన్ని దూరం నుండి అనుసరిస్తూ వచ్చాడు. అతడు కూడా ఆ యింటి లోపలికి వెళ్లాడు. ప్రధానార్చకుని తీర్పు పర్యవసానాన్ని చూడాలని అతని కోరిక. ఆ పర్యవసానంలో ప్రభువు మరణం ఇమిడే వుంది. యూద నాయకులు క్రీస్తుని సులువుగా వదలిపెట్టరని పేత్రు శంకించి ఉండవచ్చు. అతడు శంకించినట్లే అంతా జరుగుతుంది. ఆ సమయంలో పేత్రు ధైర్యంగా ప్రధానార్చకుని యింటిలోనికి వెళ్ళినందుకు అతన్ని అభినందించాలి. ఈ సందర్భంలో మార్కు సువిశేషం అతడు కయిఫా యింట సేవకులతో కలసి చలిమంట వద్ద కూర్చున్నాడని చెప్తుంది - మార్కు 14,54. కాని మత్తయి ఈ యంశాన్ని వదలివేసాడు. అతడు ఈలాంటి వివరాలను అట్టే పట్టించుకోడు.

క్రీస్తుని నాశం చేయడానికై సానెడ్రిన్ సభ అసత్య సాక్ష్యాలు వెదికింది - 26,59. అనగా మొదటినుండి ఈ సభ దురుద్దేశంతోనే ప్రవర్తించింది. అది న్యాయసభ ఐనా అన్యాయంగా మెలిగింది. అక్కడివాళ్లు చాలమంది క్రీస్తుకి వ్యతిరేకంగా కూటసాక్ష్యం చెప్పబోయారు కాని అది కుదరలేదు.

చివరకు ఇద్దరు సాక్షులు లేచి ఇతడు నేను దేవాలయాన్ని పడగొట్టనూగలను దాన్ని తిరిగి నిర్మంచనూగలను అని పల్కాడు అని చెప్పారు - 27,61. ధర్మశాస్త్రం ప్రకారం ఒక్కరి సాక్ష్యం చెల్లదు, ఇద్దరి సాక్ష్యం కావాలి - ద్వితీయ 17,6. కనుకనే మత్తయి ఇక్కడ ఇద్దరు సాక్షులను పేర్కొన్నాడు. మత్తయి భావాల ప్రకారం క్రీస్తు నేను దేవాలయాన్ని పడగొడతాను అనలేదు. దాన్ని పడగొట్టే శక్తీ పునర్నిర్మించే శక్తీ తనకు ఉందని మాత్రమే పల్కాడు.

అసలు ఈ కూట సాక్ష్యంలో నిజమెంత? నేను యెరూషలేము దేవాలయాన్ని పడగొడతానని క్రీస్తు నేరుగా ఎక్కడా చెప్పలేదు. కాని భావికాలంలో రోమీయులు వచ్చి ఆ దేవాలయాన్ని కూలద్రోస్తారని మాత్రం చెప్పాడు. ఈ దేవాలయాన్ని రాతిమీద రాయి నిలువకుండా పడగొడతారని పల్కాడు - 24,2. పైగా అతడు దేవాలయాన్ని శుద్ధిచేసాడు.

అక్కడి బేరగాళ్ళను వెళ్లగొట్టాడు. ప్రార్థనాలయమైన దేవాలయాన్ని యూదనాయకులు దొంగల గుహగా మార్చారని కోపించాడు - 21,13. ఈ వాక్యం యిర్మీయా ప్రవచనం 7,11-15 నుండి గ్రహింపబడింది. అక్కడ యిర్మీయా ప్రవక్త యావే ప్రభువు యెరూషలేం దేవాలయాన్ని నాశం చేస్తాడని ప్రవచించాడు. అలా ప్రవచించినందుకు ఆనాటి ప్రజలు యిర్మీయాకు మరణశిక్ష విధించగోరారు కూడ. ఇంకా, మెస్సియాకాలం వచ్చినపుడు భక్తులు అశుద్ధమైన యెరూషలేం దేవాలయాన్ని ధ్వంసం చేసి శుద్ధమైన దేవాలయాన్ని నిర్మిస్తారని కూడ యూదులు నమ్మారు.

ఈ సంగతులన్నీ మనసులో పెట్టుకొని పై యిద్దరు సాక్షులు క్రీస్తుపై నేరం తెచ్చారు. కాని వాళ్లు క్రీస్తు పల్కులను తారుమారు చేసారు. క్రీస్తు రోమీయులు దేవళాన్ని పడగొడతారని చెప్పగా, సాక్షులు క్రీస్తే దేవాలయాన్ని పడగొడతానన్నాడని కొంత సత్యమూ కొంత అసత్యమూ చేర్చి చెప్పారు.

ఇక్కడ ఓ గూఢార్థం వుంది. క్రీస్తుశకం 70లో టైటస్ అనే రోమన్ సైన్యాధిపతి వచ్చి యెరూషలేం దేవళాన్ని నేలమట్టం చేసాడు. నగరాన్ని కాల్చివేసి యూదులను ఊచకోత కోసాడు. కనుక అంతా క్రీస్తు ముందు చెప్పినట్లుగానే జరిగింది. కాని ఆనాడు న్యాయసభలో ఈ దేవాలయం ప్రస్తావనం వచ్చినపుడు అక్కడివాళ్ల కెవరికీ భావిలో జరుగబోయే దేవాలయ విధ్వంసాన్ని గూర్చి తెలియదు. క్రీస్తుకి ఒక్కడికి మాత్రమే తెలుసు. మత్తయి తన సువిశేషాన్ని క్రీ॥శ॥70 తర్వాత వ్రాసాడు. యూద నాయకులు క్రీస్తుని నిరాకరించినందుకే వారికి ఈ విపత్తు దాపురించిందని అతడు నొక్కిచెప్పాడు. భూస్వామి కౌలుదార్ల సామెతలో, కౌలుదార్లు భూస్వామి కుమారుణ్ణే చంపివేస్తారు. అందుకు భూస్వామి ఆ దుష్టులైన కౌలుదార్లను మట్టుపెట్టాడు - మత్త 21,41. ఇక్కడ భూస్వామి యావే ప్రభువు. కౌలుదార్లు, యూదనాయకులు. కనుక దేవుడే ఆ నాయకులను శిక్షించాడని మత్తయి బోధ.

యెరూషలేము దేవాలయ పతనానంతరం ఉత్థాన క్రీస్తే మన దేవాలయ మయ్యాడు. ఉత్థాన క్రీస్తు, అతనితో ఐక్యమైన క్రైస్తవ సమాజమూ కలసి నేడు దేవాలయమౌతారు. మనం నిర్మించే రాతిగుళ్లకంటె ఇది ముఖ్యమైన దేవాలయం.

పై కూట సాక్ష్యం తర్వాత ప్రధాన యాజకుడు నీమీద వచ్చిన ఈ నేరానికి నీవేమి జవాబు చెప్తావని క్రీస్తుని ప్రశ్నించాడు. కాని యేసు సమాధానం చెప్పకుండా మౌనంగా వుండిపోయాడు - 26,63. పూర్వం బాధామయ సేవకుడు శత్రువులు తన్ను బాధిస్తున్నా పల్లెత్తుమాట అనలేదు. వధ్యస్థానానికి వెళ్లే గొర్రెపిల్లలాగే మౌనంగా వుండిపోయాడు. - యెష 53,7. ఇక్కడ మత్తయి క్రీస్తుని ఈ సేవకునితో పోల్చాడు.

క్రీస్తు మౌనానికి కయిఫా విస్తుపోయాడు. అతడు సజీవుడైన దేవుని మీద ఒట్టుపెట్టుకొని అడుగుతున్నాను. నీవు దేవుని కుమారుడవైన క్రీస్తువా అని ప్రశ్నించాడు - 26,63. క్రీస్తు ఏ పరిస్థితుల్లోను ఒట్టు వేయవద్దన్నాడు - 5,37. కయిఫా ఆరంభంలోనే ఈ నియమాన్ని మీరాడు. ఇంతకు ముందు పేత్రు నీవు సజీవుడైన దేవుని కుమారుడివి అని క్రీస్తుతో చెప్పాడు - 16.16. కాని పేత్రుకున్న విశ్వాసం కయిఫాకు లేదు. కనుకనే అతడు క్రీస్తుని పైరీతిగా ప్రశ్నించాడు.

ఇక్కడ కయిఫా దేవుని కుమారుడు, క్రీస్తు అనే రెండు మాటలు వాడాడు. మొదట దేవుని కుమారుడు అంటే అర్థం ఏమిటి? యూదుల భావాల ప్రకారం వారి రాజు దేవుని కుమారుడు. కనుకనే కీర్తన 2,7లో యావే ప్రభువు ఆనాటి రాజు నుద్దేశించి “నీవు నా కుమారుడవు. ఈనాడు నీవు నాకు జన్మించావు” అంటాడు. ఇంకా, ప్రభువు కొరకు బాధలు అనుభవించి ఆ శ్రమల్లోను భక్తిని కోల్పోనివాడు కూడ దేవుని కుమారుడే. సోలోమోను జ్ఞాన గ్రంథం ఈలా చెప్తుంది :

నీతిమంతుడు దేవుని కుమారుడేని
దేవుడు అతని కోపుతీసికొంటాడు
శత్రువుల బారినుండి అతన్ని కాపాడతాడు - 2,18

ఇక, ఇక్కడ క్రీస్తు దేవుని కుమారుడు అనడంలో మత్తయి భావం ఇది. క్రీస్తు దేవునికి సన్నిహితుడు. దేవుని శక్తిని పొందినవాడు. మృత్యువుని జయించి ఉత్థానుడైన వాడు. దేవుని ఆజ్ఞలకు విధేయుడయిన నిజమైన యిస్రాయేలు. యిస్రాయేలు ప్రజల కోరికలూ ఆశలూ తీర్చేవాడు అతడే. అతడు నిజంగా దేవుని కుమారుడు, దేవుడంతటివాడు.

ఈ దేవుని కుమారుడు క్రీస్తు కూడ. క్రీస్తంటే మెస్సీయా. దేవుని ప్రతినిధిగా వచ్చి యిస్రాయేలీయులను కాపాడేవాడు.

కయిఫా ప్రశ్నకు క్రీస్తు నేరుగా జవాబీయకుండా నీవన్నట్లే అని బదులు చెప్పాడు. ఇది ఓ రకమైన అరమాయిక్ ప్రయోగం. ఇక్కడ కయిఫా తన ప్రశ్న ద్వారానే క్రీస్తు దేవుని కుమారుడని సూచించాడు అనుకోవాలి. ఆ ప్రశ్నలోనే అతడు తెలిసికోగోరిన జవాబు ఇమిడి ఉంది అనుకోవాలి. ఈ ప్రయోగాన్ని పూర్వమే వివరించాం. (చూడు 26,25 మీద వివరణం).

క్రీస్తు ఈ సందర్భంలో తన్ను గూర్చి ఇక్కడ రెండు సూత్రాంశాలు చెప్పుకొన్నాడు. 1. ఇకనుండి మనుష్య కుమారుడైన తాను సర్వశక్తిమంతుని కుడిప్రక్కన కూర్చుండి వుంటాడు. 2. తాను ఆకాశము నుండి మేఘారూఢుడై దిగివస్తాడు - 26,64. ఈ రెండంశాలను కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

క్రీస్తు దేవుని కుమారుడు మాత్రమేకాదు, మనుష్య కుమారుడు కూడ. బైబుల్లో మనుష్యకుమారుడు అంటే నరజాతికి చెందినవాడు, నరుడు అని భావం. ఇక్కడ ఈ బిరుదం క్రీస్తు నరుడుగా జన్మించడం వల్ల పొందిన అవమానాన్నీ, తర్వాత ఉత్థానం కావడం వల్ల పొందిన మహిమనూ కూడ సూచిస్తుంది.

తండ్రి క్రీస్తుని ఉత్థానం చేసాడు. అతన్ని మహిమ పరచి తన కుడి ప్రక్కన కూర్చోబెట్టుకొన్నాడు. ఇక మీదట తండ్రితో పాటు క్రీస్తు కూడ రాజ్యపాలనం చేస్తాడు. అతడు తండ్రి యంతటివాడు. ఈ సందర్భంలో కీర్తన కూడ ఈలా చెప్తుంది :

ప్రభువు నా ప్రభువుతో ఈలా అన్నాడు
నేను నీ శత్రువులను నీకు పాదపీఠంగా చేసేంతవరకు
నీవు నా కుడిప్రక్కన ఆసీనుడివికా - 110,1.

ఈ ప్రవచనం ఉత్థాన క్రీస్తుకి అన్వయిస్తుంది.

ప్రభువు మేఘారూఢుడై ఆకాశం నుండి దిగివస్తాడు అనే భావం దానియేలు 7,13 నుండి గ్రహింపబడింది. ఇక్కడ ప్రభువు మేఘారూఢుడై వచ్చేది కడపటి దినాన నరులందరికీ తీర్పు తీర్చడానికి. కనుక ఈ వాక్యం అతడు రెండవసారి న్యాయాధిపతిగా వేంచేస్తాడని తెలియజేస్తుంది. క్రీస్తు తండ్రి కుడిపార్శ్వాన ఆసీనుడు కావడం, న్యాయాధిపతిగా రావడం అనే రెండు కార్యాలు అతని ఉత్థానం నుండి ప్రారంభమౌతాయి. కనుకనే క్రీస్తు ఇక్కడ "ఇక నుండి" అనే మాట వాడాడు - 26,64.

క్రీస్తు ఈ రెండంశాలను న్యాయసభకు తెలియజేసినట్లుగా సువిశేషంలో వున్నా, మత్తయి ఈ విషయాలను ప్రధానంగా తొలినాటి క్రైస్తవ సమాజానికి తెలియజేసాడు అనుకోవాలి. అతని సువార్త ప్రచారంలోకి వచ్చినపుడు ఆదిమ క్రైస్తవ సమాజం ఈ సత్యాలను భక్తితో మననం జేసికొంది.

క్రీస్తు ఈ అంశాలను చెప్పగానే ప్రధానార్చకుడు బట్టలు చించుకొన్నాడు. క్రీస్తు తన్ను దేవునితో సమానం చేసికొన్నాడు. కనుక అతడు దేవదూషణలు పలికాడని అరిచాడు. యూదులు దేవదూషణలు విన్నపుడూ సంతాపాన్ని తెలియజేసేపుడూ బట్టలు చించుకునేవాళ్లు. కయిఫాకు వంతపాటపాడే న్యాయసభ సభ్యులంతా యేసు మరణశిక్షకు పాత్రుడని పల్కారు - 26,66. ఐనా న్యాయసభ ఇక్కడ క్రీస్తుని చంపించాలని నిర్ణయించలేదు. ఆ కార్యం శుక్రవారం వేకువజామున జరుగుతుంది - 27,1.

ఈ విచారణం జరిగాక న్యాయసభ సభ్యులే క్రీస్తుని అవమానించారు. వాళ్ళు అతని ముఖం మీద ఉమిసి అతన్ని పిడికిళ్ళతో పొడిచారు. అతని ముఖానికి గంతకట్టి

చెంపలపై బాది నిన్ను కొట్టిందెవరో ప్రవచించమన్నారు. యేసు తాను మెస్సీయానని చెప్పుకొన్నాడు కదా! మెస్సీయాకు ప్రవచనశక్తి వుంటుంది. కనుక అతడు తన ప్రవచన శక్తిని చూపించాలని ఇక్కడ సభ్యుల భావం.

యూదుల న్యాయసభ సభ్యులు క్రీస్తుని విశ్వసించడానికి బదులుగా అతనికి శత్రువులయ్యారు. అతన్ని అపహాసం చేసారు. నేడు కూడ క్రీస్తు సందేశాన్ని విన్నవాళ్లెవరూ ఉదాసీనంగా ఉండిపోరు. వాళ్లు క్రీస్తుని నమ్మి అతని భక్తులైనా ఔతారు, లేదా అతన్ని ప్రతిఘటించి శత్రువులైనా ఔతారు.

## 2. పేత్రు బొంకు - 26,69-75

యేసు న్యాయసభ ముందు తాను మెస్సీయానని బాహాటంగా ప్రకటించాడు. కాని పేత్రు అదే సభముందు తాను క్రీస్తు శిష్యుణ్ణని ధైర్యంగా చెప్పుకోలేకపోయాడు. ఇక్కడ ప్రభువు ధైర్యానికీ పేత్రు పిరికితనానికీ వున్న వ్యత్యాసాన్ని పాఠకులు జాగ్రత్తగా గమనించాలి.

"యేసుతో" వున్నందుకు దాసి పేత్రు మీద తప్పుపట్టింది - 26,69. శిష్యుని ధర్మం గురువుతో ఉండడం గదా! పేత్రు ఆమె మాటలకు దడిసి అమ్మా! నీ పలుకుల భావమేమిటో నాకు అర్థం కావడం లేదు అని పల్కాడు. అలా అతడు ఆమె నుండి తప్పించుకోజూచాడు. ఈలా అతడు మొదటిసారి బొంకాడు. అంతకు ముందు అతడు నేను నీతో మరణించవలసి వచ్చినా నిన్నెరుగనని బొంకను అని క్రీస్తుతో చెప్పిన మాటలను పూర్తిగా మర్చిపోయాడు - 26,35. ఇక ఆ యింటి ప్రాంగణంలో ఉండలేక తత్తరపాటుతో ఇంటి ద్వారం వద్దకు వచ్చాడు. అక్కడ మరో దాసి నీవుకూడ ఆ నజరేయుని శిష్యుడవు కాదా అని అతన్ని నిలదీసింది. ఇక్కడ మొదట బొంకినప్పటికంటే ఎక్కువ మంది జనులున్నారు. వారందరిముందు నేను క్రీస్తుని ఎరగనే ఎరగనని రెండవసారి బొంకాడు. అలా బొంకి ఒట్టుగూడ వేసికొన్నాడు. క్రీస్తు ఒట్టు వేసికోవద్దని ఖండితంగా చెప్పాడు. కయిఫా ఒట్టు పెట్టినా పేత్రు ఒట్టు పెట్టినా అది తప్పే.

ఈ రెండు సంఘటనలు జరిగాక కూడ పేత్రు ఆ తావు నుండి వెళ్ళిపోలేదు. క్రీస్తు పట్ల వున్న భక్తిభావం వల్ల కాబోలు ఇంకా అక్కడే శత్రువుల మధ్యనే ఉండిపోయాడు. ఇంతలో అక్కడివాళ్ళంతా పేత్రు చుట్టూ గుమిగూడారు. వాళ్లు పూర్వం కంటె ఇంకా పెద్ద గుంపయ్యారు. నిక్కంగా నీవు కూడ అతని అనుచరుడవే. నీ ఉచ్చారణమే నీవు గలిలయుడవని నిరూపిస్తుంది అని దబాయించారు - 26,74. గలిలయ రాష్ట్రంవాళ్లు అరమాయిక్ భాషను ఒకలాగ ఉచ్చరించేవాళ్లు. కనుక యూదయా రాష్ట్రంవాళ్లు

గలిలయులను తమ ప్రార్థనా మందిరాల్లో వేదగ్రంథాన్ని చదవనిచ్చేవాళ్లు కాదు. పేత్రు ఇరకాటంలో పడ్డాడు. ఆ గుంపు నుండి తన్ను తాను రక్షించుకోవడానికి నేను ఆ మనుష్యుని ఎరుగనే ఎరుగనని పెద్దగా నొక్కిచెప్పాడు. తన నిజాయితీని నిరూపించుకోవడానికి ఒట్టు వేసికొన్నాడు. శపించడానికి కూడ పూనుకొన్నాడు. ఎవరిని? పేత్రు తన్ను తానైనా శపించుకొని ఉండవచ్చు. లేదా క్రీస్తునైనా శపించి వుండవచ్చు. ఈలా మూడవసారి బొంకాడు. అతడు మొదటిసారి చాలమంది ముందు పెద్దగా బొంకి వొట్టువేసికొన్నాడు. రెండవసారి బొంకాడు. మూడవసారి పెద్దగుంపు ముందు బిగ్గరగా బొంకాడు. ఆవేశంతో ఒట్టు వేసికొని శాపనార్థాలకు దిగాడు. ఈ విధంగా అతని పాపం మెట్టుమెట్టుకూ పెరిగిపోతూ వచ్చింది.

పేత్రు మూడవసారి బొంకుతుండగానే కోడి కూసింది. వెంటనే క్రీస్తు పలుకులు గుర్తుకి వచ్చాయి. కోడి కూయకముందే నీవు నన్నెరగనని మూడుసార్లు బొంకుతావని ప్రభువు అతన్ని పూర్వమే హెచ్చరించాడు - 26,34. ఆ హెచ్చరిక కోడికూతకంటె గూడ పెద్దగా అతని చెవుల్లో ప్రతిధ్వనించింది.

పేత్రుకి తానెంత దుర్బలుడో అర్థమైంది. తన పాపమెంత ఘోరమైందో తెలిసింది. ఇక అక్కడ వుండలేక పోయాడు. కయిఫా యింటి ద్వారాన్ని దాటి, శత్రువుల మధ్యనుండి తప్పించుకొని, వెలుపలికి వచ్చాడు. గురువుకి ఎంత ద్రోహం చేసాను అనుకొని పుట్టెడు దుఃఖంతో వెక్కివెక్కి యేడ్చాడు.

ఇక్కడ ఇంకో విషయం గూడ చెప్పాలి. యూదాలోకి ప్రవేశించి అతన్ని వశం జేసికొన్న పిశాచం పేత్రునీ మిగిలిన అపోస్తలులను గూడ స్వాధీనం చేసికోవాలని కోరుకొంది. అది వాళ్ళను గోదుమలను జల్లించినట్లుగా జల్లించాలని - అనగా బలంగా శోధించాలని ఆశించింది. పేత్రుని తీవ్రంగా శోధించి అతని విశ్వాసాన్ని నాశం జేయాలనుకొంది. ఐనా ప్రభువు ముందుగానే పేత్ర కొరకు ప్రార్థన చేసాడు. ఆ ప్రార్థనా బలం వల్లనే పేత్రు పడిపోయి కూడ మళ్లా లేచాడు. క్రీస్తుని ఎరగనని బొంకికూడ మళ్లా పశ్చాత్తాపపడ్డాడు. అలా పరివర్తనం చెందిన పేత్రు ఇతరులకు కూడ పశ్చాత్తాపం కలిగిస్తాడు. పూర్వం క్రీస్తుని విడచి పారిపోయినవాళ్లను మళ్లా ప్రభువు దగ్గరికి తీసికొనివస్తాడు. వాళ్లను బలపరుస్తాడు. అతడు యెరూషలేములోని శిష్యులందరికీ నాయకుడౌతాడు - లూకా 22, 31-32.

సువిశేష రచయితలు ఎంతో నిజాయితీ కలవాళ్లు. వాళ్లు పేత్రు దౌర్బల్యాన్ని కప్పిపెట్టలేదు. అతని తప్పుని ఉన్నదాన్ని ఉన్నట్లుగా వర్ణించారు.

ప్రజల యెదుట నన్ను నిరాకరించేవాణ్ణి పరలోకం లోని నా తండ్రి యెదుట నేను నిరాకరిస్తానని క్రీస్తు రూఢిగా చెప్పాడు - 10,32-33. ఐనా ప్రభువు పేత్రు నిజాయితీని మెచ్చుకొని కరుణతో అతని తప్పిదాన్ని మన్నించాడు.

ఈ సందర్భంలో మత్తయి సువిశేషంలో లేని చిన్నవాక్యమొకటి లూకా సువిశేషంలో కన్పిస్తుంది. "ప్రభువు ప్రక్కకు తిరిగి పేత్రుని చూచాడు" -లూకా 22,61. ఇది ఎంత చిన్న వాక్యమో అంత తీక్షణమైనది. పేత్రు క్రీస్తు ఒకే తావులో అనగా ప్రధానార్చకుని ముంగిటలో వున్నారు. పేత్రు తన్నెరుగనని ముమ్మారు బొంకుతూండగా క్రీస్తు విన్నాడు. అతడు కరుణతో పేత్రు వైపు తేరిపారజూచాడు. ఆ చూపు బాణంలాగ పేత్రుగుండెల్లో గ్రుచ్చుకొని అతనికి పశ్చాత్తాపం పుట్టించింది. అతనిలో ఆరిపోయిన ప్రేమ జ్యోతిని మళ్లా వెలిగించింది. పేత్రు ఇక అక్కడ నిలువలేక పోయాడు. వెలుపలికి వెళ్లి బోరున ఏడ్చాడు. నేడు మనం తప్పు చేసినపుడు ప్రభువు మనలను కూడ ఈలాగే హెచ్చరిస్తూంటాడు. తన వరప్రసాదంతో మన హృదయాన్ని ప్రేరేపించి పశ్చాత్తాపాన్ని వెలికి తీస్తూంటాడు.

పేత్రు దౌర్బల్యాన్ని చూచి తిరుసభ అధికారులు పాఠం నేర్చుకోవాలి. మన పదవులూ అధికారాలూ మనలను పాపం నుండి కాపాడలేవని గుర్తించాలి. ఒక్క తిరుసభ అధికారులే గాక క్రైస్తవులందరూ పేత్రుని జూచి వివేకం తెచ్చుకోవాలి. మనం మనమనుకొన్న దానికంటె దుర్బలులం. కొద్దిపాటి ప్రలోభాలకే కూలిపోతాం.

పేత్రు న్యాయసభ యెదుట క్రీస్తులా ధైర్యంగా నిలువలేకపోవచ్చు. నిజమే, కాని అతడు యూదాలాగ నిరాశ చెంది ఆత్మహత్యకు పూనుకోలేదు. కనుక అతడు యోగ్యుడైన శిష్యుడే. చిత్తశుద్ధితో కూడిన అతని పశ్చాత్తాపం నేడు మన పశ్చాత్తాపానికి ఆదర్శంగా వుంటుంది.

## 3. న్యాయసభ తీర్పు - 27,1-2

గురువారం రాత్రి న్యాయసభ క్రీస్తుపై విచారణం ప్రారంభించింది. ఆ విచారణం అడపాదడపా రాత్రంతా కొనసాగింది. శుక్రవారం వేకువనే న్యాయసభ సభ్యులందరూ ఏకమై క్రీస్తుని చంపించాలని అధికార పూర్వకంగా నిర్ణయించారు. కనుక అతన్ని బంధించి పిలాతుకు అప్పగించారు.

యూదుల న్యాయసభకు ముద్దాయికి మరణశిక్ష విధించే అధికారం లేదు. మరణశిక్షను విధించేదీ దాన్ని అమలు చేయించేదీ కూడ రాష్ట్ర పాలకుడైన పిలాతే. కనుకనే ప్రధాన యాజకులు క్రీస్తుని అతని కప్పగించారు.

ఈ సంగతులన్నీ క్రీస్తు పూర్వమే ప్రవచించాడు. మనుష్య కుమారుని యెరూషలేములో ప్రధానార్చకులకు అప్పగిస్తారు. వాళ్లు అతనికి మరణదండనం విధిస్తారు. అతన్ని అన్యజనులకు అప్పగిస్తారు. ఆ జనులు అతన్ని సిలువ వేస్తారు - అని ప్రభువు ముందే చెప్పాడు - 20,18-19.

న్యాయసభ సభ్యులు క్రీస్తుమీద తెచ్చిన ప్రధాన నేరం దైవదూషణం. కాని ఈ కారణానికే పిలాతు క్రీస్తుని చంపించడని వాళ్ళకు బాగా తెలుసు. కనుక వాళ్లు పిలాతు నెదుట క్రీస్తుమీద మూడు పెద్దనేరాలు మోపారు. అవి ఇవి. క్రీస్తు తిరుగుబాటు చేస్తున్నాడు. చక్రవర్తికి పన్ను చెల్లింపవద్దంటున్నాడు. తానే రాజునని చెప్పుకొంటున్నాడు. కాని ఈ మూడు కూడ అసత్యాలైన నేరాలే - లూకా 23,2.

## 4. యూదా దుర్మరణం - 27,3-10

యూదా దుర్మరణాన్ని గూర్చిన కథ మత్తయి సువిశేషంలో మాత్రమే వస్తుంది. మనుష్య కుమారుని అప్పగించేవానికి అనర్థం. అతడు పుట్టకుండా ఉండినా బాగుండేది అన్నాడు ప్రభువు - 26,24. యూదా దుర్మరణం ద్వారా ఈ వాక్యాలు అక్షరాల నెరవేరాయి.

శుక్రవారం ప్రాతఃకాలాన న్యాయసభ సభ్యులు యేసుని చంపించాలని నిర్ణయించారు. ఆ నిర్ణయం యూదాకు తెలిసింది. క్రీస్తుకి కయిఫా యింట తీర్పు జరుగుతుంటే పేత్రు లాగే యూదా కూడ ఆ దరిదాపుల్లోనే వుండి చూచాడనుకోవాలి. పేత్రు న్యాయసభ రాత్రితీర్పులో పడిపోయాడు. యూదా దాని ఉదయంతీర్పులో పడిపోయాడు.

ప్రధానార్చకులు క్రీస్తుని చంపించగోరారని తెలిసికొని యూదా "విచారించాడు" - 27,3. అతడు పేత్రు లాగా తన పాపానికి పశ్చాత్తాపపడలేదు. తన పొరపాటుకి తానే చింతించాడు. కాని ఆ చింతతో అతడు క్రీస్తు దగ్గరికి వెళ్ళలేదు. ప్రధానార్చకుల దగ్గరికి వెళ్లాడు. నేను ఈ సొమ్ముతో నిర్దోషియైన క్రీస్తు ప్రాణాన్ని మీకప్పగించాను. ఘోరమైన పాపం చేసాను. మీ సొమ్ము మీరు తీసికొని అతన్ని విడిపించండి అని అడిగాడు. తర్వాత పిలాతు కూడా క్రీస్తుని గూర్చి ఆ నిర్దోషి ప్రాణం విషయంలో నేను నిరపరాధిని అంటాడు - 27,24. ప్రధానార్చకులకు కావలసింది సొమ్ము కాదు, క్రీస్తు ప్రాణం. కనుక వాళ్లు యూదాతో నీ పాపానికి నీవే బాధ్యుడివి. దాని ఫలితాన్ని నీవే అనుభవించు. మేము క్రీస్తుని వదలిపెట్టం అన్నారు. యూదా దుఃఖంతో డబ్బుని వాళ్ళ ముందు విసరికొట్టాడు.

క్రీస్తు మరణానికి ప్రధానార్చకులు కూడ బాధ్యులే. గాని వాళ్లు ఆ బాధ్యతను అంగీకరించలేదు. యూదా తెచ్చిన పాపపు సొమ్మును గూడ అంగీకరించలేదు. యూదాకు దుఃఖం కలిగింది. నిరాశ పుట్టింది. అతడు తన ఘోరపాపానికి నిష్కృతి లేదని నిరుత్సాహం చెందాడు. ఆ నిరుత్సాహంతోనే వెళ్ళి ఉరివేసికొన్నాడు.

పూర్వం అహిటోఫెలు అనేవాడు అబ్షాలోము పక్షాన జేరి దావీదుని నాశం జేయగోరాడు. పన్నాగం వేసాడు. కాని ఆ పన్నాగం బెడిసికొట్టగా ఇంటికివెళ్ళి ఉరివేసికొని చచ్చాడు - 2సమూ 17,23. ఇక్కడ యూదా అచ్చంగా ఈ అహీటోఫెలులాగే చేసాడు.

యూదా నుండి రక్తపు సొమ్ము తీసికోవడానికి ఇష్టపడని యాజకులు కదన దాన్ని ఎత్తి తీసికొన్నారు. కాని అది యూదా ద్రోహబుద్ధితో క్రీస్తుని అప్పగించి సంపాదించిన పాపపుసొమ్ము కనుక దాన్ని కానుకల పెట్టెలో వేయగూడదనుకొన్నారు. ఐనా వాళ్లు తాము అన్యాయంగా మోసంతో క్రీస్తుని పిలాతుకు పట్టియిచ్చినందుకు ఏమీ బాధ పడలేదు. వాళ్ళది వట్టి కపటభక్తి.

ఆ సొమ్ముతో వాళ్లు యెరూషలేములో చనిపోయిన పరదేసులను పాతిపెట్టడానికి ఓ కుమ్మరివాని పొలం కొన్నారు. క్రీస్తు రక్తపు సొమ్ముతో కొన్న పొలం గనుక దానికి రక్తపు పొలం అని పేరు వచ్చింది. అది నేటికి గూడ - అనగా మత్తయి సువిశేషం వ్రాసేకాలానికి - అదే పేరుతో చలామణి ఔతూంది - 27,8.

ఈ సందర్భంలో మత్తయి యిర్మీయా ప్రవచనాన్ని ఉదాహరించాడు. ముప్పది వెండి నాణాలకు కుమ్మరివాని పొలాన్ని కొన్నారు అని ఆ ప్రవచనం చెప్తుంది. కాని ఈ వాక్యం యిర్మీయా ప్రవచనంలో కాక, జకర్యా ప్రవచనం 11,13లో వస్తుంది. అక్కడ ఆ ప్రవక్త అధికారులు తనకు చెల్లించిన 30 వెండి నాణాలను తాను దేవాలయ కోశాగారంలో ఉంచినట్లుగా చెప్పుకొన్నాడు. కుమ్మరివాని పొలం ప్రస్తావనం మాత్రం లేదు.

యూదా దుర్మరణాన్ని గూర్చిన కథ అ.చ. 1,18-19లో కూడ వస్తుంది. కాని లూకా కథకీ మత్తయి కథకీ తేడాలున్నాయి. లూకా కథలో యూదాయే రక్తపు సొమ్ముతో ఓ పొలాన్ని కొనుక్కొంటాడు. అతడు ప్రమాదవశాత్తు ఆ పొలంలో జారిపడి చనిపోతాడు గాని ఆత్మహత్య చేసికోడు. క్రీస్తు రక్తాన్ని బట్టికాక యూదా సొంత నెత్తుటితో తడిసినందుననే ఆ పొలానికి రక్తభూమి అని పేరు వచ్చింది. దీన్ని బట్టి యూదా దుర్మరణాన్ని గూర్చినకథ ఆ తొలిరోజులలో భిన్న సంప్రదాయాలుగా వ్యాప్తిలో వుందనుకోవాలి. మత్తయి ఓ సంప్రదాయాన్ని ఎన్నుకొంటే, లూకా మరో సంప్రదాయాన్ని ఎన్నుకొన్నాడు అనుకోవాలి.

యూదా కథ మనకు చాల పాఠాలు నేర్పుతుంది. 1. యూదా పేత్రు ఇద్దరూ ప్రభువుకి ద్రోహం చేసారు. కాని పేత్రు క్రీస్తు దగ్గరికి తిరిగివచ్చాడు. నమ్మకంతో పశ్చాత్తాప

పడ్డాడు. క్రీస్తునుండి మన్నింపు పొందాడు. యూదా మాత్రం క్రీస్తు దగ్గరికి రాకుండా ప్రధానార్చకుల దగ్గరికి వెళ్లాడు. నిరాశ చెందాడు. నిరాశతోనే ఆత్మహత్య చేసికొన్నాడు. పాపం చేసినవాళ్లు నిరాశ చెందకూడదు. మనం చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడితే చాలు ప్రభువు ఎంత పెద్ద పాపాన్నయినా మన్నిస్తాడు. క్రీస్తు సిలువ మరణం ఎంత ఘోర పాపాన్నయినా మన్నిస్తుంది. దాన్ని వ్యర్థం చేసేంతటి పాపం మనమేమీ చేయలేం.

2. ధనాశ యూదాను నాశం చేసింది. ఈ యపాయం నేడు మనకు కూడ వుంది.

3. యూదా క్రీస్తుని పట్టియీయడం ద్వారా సంపాదించిన 30 వెండి నాణాలతో తనకు సంతృప్తి కలుగుతుందనుకొన్నాడు. కాని ఆ సొమ్ము చేతిలోకి వచ్చాక అతనికి అసంతృప్తి కలిగింది. ఆ డబ్బును వదలించుకొన్నదాకా అతనికి మనశ్శాంతి లేదు. దీన్నిబట్టి మనం ఓ సత్యాన్ని అర్థం జేసికోవాలి. పాపంతో సంపాదించిన వస్తువు మనలను సంతోష పెడుతుందనుకొంటాం. కాని అది మనలను సంతోషపెట్టడానికి బదులుగా దుఃఖపెడుతుంది. అది మనకు అమృతంగాక విషమౌతుంది. కనుక పాపంతో ఏ వస్తువునీ దక్కించుకోగూడదు.

కట్టకడన, పేత్రుని యూదాను పరస్పరం పోల్చిచూడ్డం మంచిది. వీళ్ళిద్దరికీ చాల పోలికలున్నాయి. ఇక్కడ కొన్నిటిని పరిశీలిద్దాం. 1. ప్రభువు ఆ యిద్దరినీ సైతానులని పిల్చాడు. నీకు సిలువ మరణం వద్దన్నపుడు అతడు పేత్రుని సైతాను అని పిల్చాడు. నేనే జీవాహారాన్నని చెప్పినపుడు యూదానుద్దేశించి మీలో ఒకడు పిశాచం అన్నాడు. 2. ప్రభువు ఆ యిద్దరితోను మీరు పడిపోతారని ముందుగానే చెప్పాడు. ఈరాత్రి కోడికూయక మునుపే నీవు నన్నెరుగనని ముమ్మారు బొంకుతావని పేత్రుతో చెప్పాడు. ప్రభూ! నిన్నుపట్టి యిచ్చేది నేనా అని అడుగగా నీవేనని యూదాతో చెప్పాడు. 3. ఆ యిద్దరూ ప్రభువుని త్యజించారు. పేత్రు ప్రధమాచార్యుని పనికత్తెతో యేసుని గూర్చి నాకు తెలియదు అన్నాడు. యూదా వెండికాసులకు గురువుని అమ్మివేసాడు. తర్వాత ఓలివు తోపులో అతన్ని శత్రువులకు పట్టియిచ్చాడు. 4. ప్రభువు ఆ యిద్దరినీ రక్షించాలని చూచాడు. ప్రధమాచార్యుని యింటిలో వుండగా ప్రభువు పేత్రువైపు చూచాడు. శత్రువులకు తన్ను పట్టియీయడానికి రాగా యూదాను "స్నేహితుడా" అని సంబోధించి అతనిలోని మంచితనాన్ని మేల్కొలుప జూచాడు. 5. ఆ యిద్దరూ తమ తప్పుకి చింతించారు. పేత్రు వెలుపలికి వెళ్ళి వెక్కివెక్కి యేడ్చాడు. యూదా 30 వెండికాసులను ప్రధానాచార్యుల యొద్దకు కొనివచ్చి నేను నిర్దోషి రక్తాన్ని మీకప్పగించి పాపం కట్టుకొన్నాను అన్నాడు.

ఐతే పేత్రు గొప్పతనమేమిటి? యూదా తక్కువతనమేమిటి? సువిశేషాల్లో పేత్రు పేరు అపోస్తలుల జాబితాలో మొదట రావడమెందుకు, యూదాపేరు అసలు ఆ జాబితాలోకి ఎక్కడ పోవడమెందుకు? పేత్రు దేవుణ్ణి తలంచుకొని దేవుని ముందట పశ్చాత్తాపపడ్డాడు. కనుక పాపపరిహారాన్ని పొందాడు. యూదా తన తప్పుని తలంచుకొని తనలో తానే చింతించాడు. దేవుని యెదుట పశ్చాత్తాపపడనే లేదు. కనుక పాపపరిహారాన్ని పొందనే లేదు. అతడు చేసిందల్లా తన తప్పుని తలంచుకొని చింతించడం. ఇక ఇప్పుడేమీ చేయలేంగదా అని బాధపడ్డం. నిరాశ చెందడం. నరకంలోని పిశాచాలు కూడ తమ తప్పునకు చింతిస్తాయి. కాని అవి దేవుని యెదుట పశ్చాత్తాపపడవు.

యూదా నేను నిరపరాధి రక్తాన్ని అప్పగించాను అన్నాడేకాని ఆ రక్తం తన పాపమాలిన్యాన్ని కడిగివేయాలని కోరుకోలేదు. అతడు ఎంతసేపటికి తనవైపు తాను చూచి దిగులుపడ్డాడే గాని దేవునివైపు జూచి పశ్చాత్తాపపడలేదు. పేత్రు ప్రభువుని తలంచుకొని వెక్కి వెక్కి యేడ్చి తనకు రక్షణాన్ని దయచేయమని వేడుకొన్నాడు. యూదా చెట్టు కొమ్మకు ఉరివేసికొనేపుడు గూడ తనకు ఎదురుగా కొండపై నిల్చివున్న సిలువవైపు చూడలేదు.

మన దిగులు, మన చింత, మన నిరాశ మనకు పాప పరిహారాన్ని సంపాదించిపెట్టవు. దేవుణ్ణి నమ్మి అతని యెదుట మన పాపానికి దుఃఖపడితే దోషవిముక్తి కలుగుతుంది. ఎప్పుడు కూడా పపాపరిహారం దేవుని నుండి కాని నరుని నుండి కాదు. పేత్రు లాగే యూదా కూడ అపోస్తలుల జాబితాలో కెక్కి "పునీత యూదా" అని పిలువబడేవాడే. కాని అతడు చేతులారా ఆ యవకాశాన్ని జారవిడచుకొన్నాడు.

## 5. పిలాతు తీర్పు - 27,11-31

క్రీస్తు పిలాతు ముందు నిల్చున్నాడు. పిలాతు అతనికి తీర్పు చెప్తున్నాడు. ప్రధానార్చకులు, యూద ప్రజలు క్రీస్తుకి మరణశిక్ష విధించమని పిలాతుని వత్తిడి చేసారు. దానికి లొంగి అతడు క్రీస్తుని సిలువ మరణానికి అప్పగించాడు. ఈ భాగంలో మూడంశాలున్నాయి. 1) పిలాతు క్రీస్తుని ప్రశ్నించడం 27,11-14. 2) యేసు-బరబ్బ 27,15-26. 3) సైనికులు క్రీస్తుని పరిహసించడం 27,27-31.

### 1. పిలాతు క్రీస్తుని ప్రశ్నించడం - 27,11-14.

న్యాయసభవాళ్లు క్రీస్తుని రాష్ట్ర పాలకుడైన పిలాతు దగ్గరికి తోసికొని వచ్చారు. అతనిచే క్రీస్తుకి మరణశిక్ష వేయించాలని వాళ్ళ తలంపు. పిలాతు ప్రభువుకి తీర్పు చెప్పడానికి

పూనుకొన్నాడు. "మిమ్ము న్యాయస్థానాలకు ఈడ్చుకొని పోతారు. రాజుల చెంతకు రాష్ట్ర పాలకుల చెంతకు తోడ్కొని పోతారు. మీరు అక్కడ నాకు సాక్ష్య మీయాలి" అని ప్రభువు పూర్వమే శిష్యులతో చెప్పాడు - 10,17-18. క్రీస్తే మొదట ఈ హింసలకు గురయ్యాడు. తర్వాత శిష్యులు కూడ ఈ బాధలు అనుభవిస్తారు.

పిలాతు క్రీస్తుని నీవు యూదుల రాజువా అని ప్రశ్నించాడు. యేసుని అందరు మెస్సీయాగా భావిస్తున్నారు. మెస్సీయా యావే ప్రతినిధిగా, రాజుగా వచ్చి తమ్ము పాలిస్తాడని యూదుల నమ్మకం. క్రీస్తుని గూర్చిన ముఖ్యాంశం అతడు రాజు అనేదే. కనుకనే మొట్టమొదటనే పిలాతు ఈ ప్రశ్న వేసాడు. క్రీస్తు నేరుగా జవాబు చెప్పలేదు. నీవన్నట్లే అని సమాధానం చెప్పాడు. ఇది ఓ రకమైన అరమాయిక్ ప్రయోగం. ఈ రకం ప్రయోగం వచ్చినపుడు ప్రశ్నవేసే వ్యక్తి ప్రశ్నలోనే జవాబు కూడ ఇమిడి వుంటుంది. పిలాతు యేసుని నీవెవరివి అని అడుగలేదు. నీవు యూదుల రాజువా అని అడిగాడు. ఆ ప్రశ్నలోనే అతడు యూదుల రాజేననే సమాధానం ఇమిడి వుంది. కావున నీవు చెప్పినట్లుగా నేను రాజునేనని క్రీస్తు బదులు పల్కాడు. అతడు దావీదు వంశంలో వచ్చే రాజు. ఆ రాజు కొరకే యిస్రాయేలీయులు వేయి కండ్లతో ఎదురుచూస్తున్నారు. ఐనా అతడు లౌకికరంగంలో గాక ఆధ్యాత్మికరంగంలో రాజు.

ప్రధానార్చకులు యేసుపై ఏవేవో నేరాలు తెచ్చారు. కాని అతడు వారికి ప్రత్యుత్తర మీయకుండా మౌనంగా వుండిపోయాడు. వారు నీపై మోపే నేరాలకు నీవు ప్రత్యుత్తర మీయవా అని పిలాతు అడిగినా యేసు ఏమీ మట్లాడకుండా మౌనంగా నిల్చుండి పోయాడు. పూర్వం బాధామయ సేవకుడు ఈలాగే మౌనంగా వుండిపోయాడని యెషయా వాకొన్నాడు - 53,7. ఆ ప్రవచనం ఇక్కడ క్రీస్తులో నెరవేరింది. క్రీస్తు మౌనాన్ని చూచి పిలాతు విస్తుపోయాడు. ఠీవితో తన యెదుట నిల్చివున్న క్రీస్తుని చూడగానే పిలాతుకి అతడు దోషికాడని తట్టింది. అతన్ని విడుదల చేయడం సబబని తోచింది. అలా చేయడానికి మార్గం బరబ్బా.

కాని బరబ్బా ఉదంతానికి ముందు మనం ఇంకో అంశం చూడాలి. ఈ యంశం లూకా 23,6-12లో మాత్రమే వస్తుంది. క్రీస్తు గలిలయ ప్రాంతానికి చెందినవాడని విని పిలాతు అతన్ని హేరోదు దగ్గరికి పంపాడు. ఈ హేరోదు పెద్ద హేరోదు కొడుకు. గలిలయకు అధిపతి. స్నాపక యోహానును చంపించినవాడు. ఇతడు ఈ సమయంలో పాస్కపండుగ జరుపుకోవడానికి వచ్చి యెరూషలేములో మకాము చేస్తున్నాడు. స్నాపక యోహానే మళ్లా క్రీస్తురూపంలో విజయం చేసాడని జనం చెప్పుకొంటుండగా హేరోదు విన్నాడు. ఆ ప్రభువు అద్భుతాలను గూర్చి కూడ విన్నాడు. కనుక క్రీస్తుని కంటితో చూడాలనీ అతని

అద్భుతాలను ప్రత్యక్షంగా పరిశీలించాలనీ ఇతడు కుతూహలపడుతుండేవాడు. ఆ కుతూహలంతోనే అతడు క్రీస్తుకి చాల ప్రశ్నలు వేసాడు. కాని ప్రభువుకి అతని దుష్ట స్వభావం తెలుసు. కనుక అతడు హేరోదు ప్రశ్నలకు ఏమాత్రం జవాబు చెప్పకుండా బాధామయ సేవకుళ్లాగ మౌనంగా వుండిపోయాడు - యెష 53,7. క్రీస్తు మౌనాన్ని చూచి హేరోదు నిరుత్సాహం చెందాడు. అతడూ అతని సైనికులూ క్రీస్తుని చిన్నచూపు చూచి అవమానించారు. ప్రభువుకి విలువైన వస్త్రాన్ని కప్పి అతన్ని మళ్లా పిలాతు దగ్గరికి పంపారు.

క్రీస్తు తాను రాజునని చెప్పినందున అతన్ని పరిహసించడానికి హేరోదు ఈ రాజవస్త్రాన్ని కప్పి వుండవచ్చు. ఇది తెల్లని యుడుపు. కనుక ఇది క్రీస్తు నిర్దోషత్వానికి గూడ చిహ్నంగా వుంటుంది.

అంతవరకు శత్రువులుగా వున్న హేరోదు పిలాతు ఆనాడే ఈ సంఘటనం ద్వారా మళ్లా మిత్రులయ్యారు. కీర్తన 2,2 చెప్పినట్లుగా "ప్రభువునీ, అతడు అభిషేకించిన రాజునీ ఎదిరించడానికి ఈ లోకపు రాజులు సంసిద్ధులయ్యారు". యెరూషలేములోని ఆదిమ క్రైస్తవులు దేవునికి ప్రార్థించినట్లుగా "నీవు అభిషేకించిన నీ పావన సేవకుడైన యేసుకి విరోధంగా పోన్స్యస్ పిలాతు, హేరోదు ఈ నగరంలో ఏకమయ్యారు - అచ. 4,27. ఐనా హేరోదు పిలాతు కలసి కూడ క్రీస్తుని దోషిగా నిరూపించలేదు. అతడు నిర్దోషి అనే వాళ్లిద్దరి అభిప్రాయం.

## 2. యేసు - బరబ్బా - 27,15-26

పాస్క పండుగ సందర్భంలో గవర్నరు యూదులు కోరిన బందీని విడుదల చేసే ఆచారం వుంది. ఈ పండుగ యూదుల దాస్య విముక్తిని జ్ఞప్తికి తెచ్చేది. కనుక ఆ దినం ఓ బందీని వదలిపెడితే యూదులకు సంతోషం కలుగుతుందనుకొని రోమీయులు ఈ యాచారాన్ని అంగీకరించారు.

ఈ సమయంలో బరబ్బ అనే పేరు మోసిన నేరగాడు చెరలో వున్నాడు. అతడు రోమీయుల మీద తిరుగుబాటు చేసే యూదులకు నాయకుడు. పిలాతు క్రీస్తుకీ ఇతనికీ లంకెవేసి పాస్కపండుగ సందర్భంలో ఈ ఇద్దరిలో ఎవరిని విడిపించమంటారో తెలియజేయండని ప్రజల గుంపును అడిగాడు. ప్రధానార్చకులు క్రీస్తు ప్రసిద్ధికి అసూయపడి అతన్ని తనకు అప్పగించారని పిలాతుకు తెలుసు. జనుల గుంపుకి క్రీస్తు అంటే ఇష్టం గనుక వాళ్లు అతన్ని విడుదల చేయమని అడుగుతారనీ, ఆ నెపంతో తాను క్రీస్తుని వదలివేయవచ్చుననీ పిలాతు ఉద్దేశం. కాని అతడు అనుకొన్నట్లుగా జరగలేదు. కథ అడ్డం తిరిగింది.

కాని దీనికిముందు మనం ఇంకో అంశం పరిశీలించాలి. ఈ యంశం మత్తయి గ్రంథంలో మాత్రమే వస్తుంది. పిలాతు క్రీస్తుకి తీర్పు తీరుస్తుండగా అతని భార్య అతనికొక కబురు పంపింది. "నేడు (గురువారం) కలలో ఆ యేసుని గూర్చి చాల బాధపడ్డాను. నీవు ఆ నీతిమంతుని గూర్చి ఎలాంటి జోక్యం కలిగించుకోవద్దు" అని చెప్పించింది - 27,19. ఈ సందేశం దేవుని నుండే వచ్చింది. మత్తయి సువిశేషంలో దేవుడు యోసేపు మొదలైన భక్తులతో చాలసార్లు కలల్లో మాటలాడుతుంటాడు. (1,20 . 2,12. 13. 19, 32) అందువల్ల ఈమెకు కలలో కన్పించిన సందేశం దేవుని సందేశం అనుకోవాలి. ఇంకా ఈమె క్రీస్తుని "నీతిమంతుడు" అని పేర్కొంది. అలాంటి నీతిమంతుని విడుదల చేయడం పిలాతు బాధ్యత. కాని అతడా పని చేయలేకపోయాడు. ఇక్కడ ఓ అన్యజాతి మహిళ క్రీస్తుని నీతిమంతునిగా గుర్తించింది. కాని స్వజాతివాళ్ళయిన యూదులు మాత్రం అతన్ని అలా గుర్తించలేకపోయారు.

పిలాతు మీకు యేసు కావాలా లేక బరబ్బా కావాలా అని జనుల గుంపుని అడిగాడు అన్నాం గదా! ప్రధానార్చకులు బరబ్బానే విడిపించమని అడగండని ప్రజల గుంపుని ఎగద్రోసారు. భార్య కబురు పంపిన తర్వాత పిలాతు అదే ప్రశ్నను మరల రెండవసారి అడిగాడు. వెంటనే ప్రజాసమూహం బరబ్బానే విడిపించమని కోరింది. ఈ జనులంతా పూర్వం క్రీస్తుకి సుముఖులే. వాళ్లలో క్రీస్తు బోధలు విన్నవాళ్ళూ అతని అద్భుతాల వల్ల లాభం పొందినవాళ్ళూ వున్నారు. ఐనా ఇప్పుడు తమ దుష్టనాయకుల మాట విని వీళ్ళంతా క్రీస్తుకి విరోధులయ్యారు.

పిలాతు కోర్కె నెరవేరలేదు కనుక కలతజెందాడు. బరబ్బాను విడిపించ మంటున్నారు. మరి క్రీస్తుని ఏమిచేయమంటారని అతడు ప్రజల నడిగాడు. అతన్ని సిలువ వేయించమని జనులు జవాబు చెప్పారు. రాళ్ళతో కొట్టి చంపడం యూదుల మరణశిక్ష. సిలువ వేయడం రోమనుల మరణశిక్ష. ఇది చాల బాధతో కూడన శిక్ష. గొప్ప నేరగాళ్ళకు విధించే శిక్ష. కనుక క్రీస్తు ఏమి గొప్పనేరం చేసాడని అతన్ని సిలువ వేయమంటారని పిలాతు మళ్లీ అడిగాడు. ప్రజలు అతన్ని సిలువ వేయించు అని బిగ్గరగా అరచి గల్లంతు చేసారు.

పిలాతు ప్రజల ముందు తాను నిస్సహాయుణ్ణనీ, ఏమీ చేయజాలననీ గుర్తించాడు. ప్రజలు విప్లవం లేవదీస్తారని భయపడ్డాడు. క్రీస్తుకి న్యాయం జరగవలసిందే. కాని యెరూషలేములో శాంతిని నెలకొల్పడం అతని పూచీ. లేకపోతే రోము అతన్ని శిక్షిస్తుంది. కనుక అతడు న్యాయాన్ని వదలివేసి పట్టణంలో శాంతిని స్థాపించడానికి పూనుకొన్నాడు. క్రీస్తుని సిలువ మరణానికి అప్పగించడానికి సంసిద్ధుడయ్యాడు.

కాని దానికి ముందు అతడు తన నిర్దోషత్వాన్ని నిరూపించుకోగోరాడు. కనుక ప్రజల ముందు చేతులు కడుగుకొని ఈ నీతిమంతుని సిలువ మరణానికి నేను బాధ్యుణ్ణి కాదు. మీరే దీనికి బాధ్యులు అని చెప్పాడు -27,24.

ఇక్కడ చేతులు కడుగుకోవడమంటే నేను నిర్దోషినని తెలియజేయడం. ద్వితీయోపదేశకాండ 21,6-8లో చేతులు కడుగుకొనే విధి వస్తుంది. పొలంలో ఏదైనా హత్య జరిగితే ఆ పొలానికి చేరువలో వున్న గ్రామప్రజలు తమ నిర్దోషత్వాన్ని తెలియజేయడానికి ఈలా చేయాలి. ఓ పెయ్యను చంపి దానిమీద తమ చేతులు కడుగుకోవాలి. తమ అపరాధాలను మన్నింపమని దేవుణ్ణి వేడుకోవాలి. ఇంకా కీర్తన 26,6. "నేను నిర్దోషినని రుజువు చేసికోవడానికి నా చేతులు కడుగుకొని నీ బలిపీఠం చట్టు ప్రదక్షిణం చేస్తాను" అని చెప్తుంది. ఈ యాలోకనాలను బట్టి చేతులు కడుగుకోవడం నిర్దోషత్వాన్ని నిరూపించడానికి గుర్తు. కనుక పిలాతు ఇక్కడ తాను నిర్దోషినని వెల్లడి చేసికొన్నాడు. క్రీస్తు మరణానికి నేను బాధ్యుణ్ణి కాను అని స్పష్టంగా చెప్పాడు. కాని ఇక్కడ ఒక చిక్కు వుంది. చేతులు కడుగుకోవడం యూదుల ఆచారం. రోమీయుల ఆచారం కాదు. మరి పిలాతు ఈ సందర్భంలో ఈ యూదుల ఆచారాన్ని ఏలా పాటించాడు? పైగా ఈ సంఘటనం మత్తయి సువిశేషంలో మాత్రమే వస్తుంది. కనుక దీని యాథార్థ్యాన్ని శంకింపవలసి వుంటుంది.

పిలాతు క్రీస్తు సిలువ మరణానికి నేను బాధ్యుణ్ణికాదు అనగానే అక్కడ గుమిగూడి వున్న యూద ప్రజలంతా క్రీస్తు రక్తం మా మీద మా బిడ్డల మీద పడును గాక అని కేకలు పెట్టారు - 27,25. ఇది యూదుల భాష. బైబుల్లో పలానా వాడి రక్తం నా మీద పడును గాక అంటే పలానా వాడికి నేను చేసిన కార్యానికి నేనే బాధ్యుణ్ణి అని భావం - 2సమూ 1,6. అనగా ఇక్కడ యూదప్రజలు క్రీస్తు సిలువ మరణానికి మేమే బాధ్యులమని ఒప్పుకొన్నారని భావం. పిలాతు క్రీస్తు సిలువ మరణానికి నేను బాధ్యుణ్ణి కాదని ప్రకటించాడు. ఐతే అతని మరణానికి మేము బాధ్యులమౌతామని యూదులు సాహసంతో పల్కారు. ఈ వాక్యం మత్తయి సువిశేషంలో మాత్రమే వస్తుంది.

ఇక్కడ ఈ వాక్యాన్ని ఉదాహరించడంలో మత్తయి ఉద్దేశం ఇది. యూదుల దేవుడు పంపిన ప్రవక్తలను చంపే ద్రోహులు. పూర్వం క్రీస్తు వారి నుద్దేశించి "నిర్దోషియైన హేబెలు హత్య మొదలుకొని జకరియ హత్య వరకు మీరు చిందించిన నీతిమంతుల రక్తాపరాధం మీపై పడుతుంది" అన్నాడు - 24,35. అనగా ప్రాచీన యూదులు ప్రాచీన ప్రవక్తలను చంపినట్లే ప్రస్తుత యూదులు క్రీస్తు ప్రవక్తను చంపారని మత్తయి భావం. వాళ్లు క్రీస్తు రక్తం తమపై పడాలని కోరుకొన్నారు కదా!

యూదుల ద్రాక్ష తోట యజమానుని కుమారునే చంపిన దుష్టులైన కౌలుదార్లు - 21,38-39. యెరూషలేము ప్రవక్తలను పట్టి చంపే నగరం. దేవుడు పంపిన ప్రతినిధులపై రాళ్లు రువ్వే పట్టణం. కోడి రెక్కలను చాపి తన పిల్లలను కాపాడుకొన్నట్లే క్రీస్తు యెరూషలేము పౌరులను కాపాడుగోరాడు. కాని వాళ్లు అతనిమాట వినలేదు - 23,37.

ఇంకా యూదులు క్రీస్తుని చంపుతున్నారంటే భావమేమిటి? అతడు కేవలం ప్రవక్త మాత్రమే కాదు. దేవుని కుమారుడు. దేవుడు పంపిన మెస్సీయా. అతని మరణోత్థానాలు చరిత్రగతినే మార్చాయి. అతని ఉత్థానంతో దైవరాజ్యం ఆవిర్భవించింది. పూర్వ దైవప్రజ పోయి నూత్న దైవప్రజ వచ్చింది. యూదులు పోయి క్రైస్తవులు వచ్చారు. యూదులు క్రీస్తుని నిరాకరించి దైవరాజ్యాన్ని కోల్పోయారు. తాము దైవప్రజగా వుండడం మానివేసారు. వాళ్ళ స్థానంలో క్రీస్తుని అంగీకరించిన క్రైస్తవ ప్రజలు వచ్చారు.

యెరూషలేము నాశమయ్యాకనే మత్తయి సువిశేషం వ్రాసాడు. క్రీ॥శ॥70లో రోమీయులు వచ్చి యెరూషలేముని ముట్టడించారు. నగరాన్ని కాల్చివేసారు. దేవాలయాన్ని ధ్వంసం చేసారు. యూదులను చిత్రవధ చేసారు. మత్తయి ఉద్దేశం ప్రకారం, ఇది క్రీస్తుని నిరాకరించినందుకు యూదులకు దేవుడు పంపిన శిక్ష. ద్రాక్ష తోట యజమానుడు దుష్టులైన కౌలుదార్లను నాశం చేసాడు. ఆ ద్రాక్షతోటను ఇతర కౌలుదార్లకు ఇచ్చివేసాడు - 21,40-41.

యూద సమాజానికి బదులు క్రైస్తవ సమాజం వచ్చింది. ఐతే దేవుడు యూదులను శాశ్వతంగా నిరాకరిస్తాడా? క్రీస్తుని త్రోసివేయడం వల్ల వాళ్లు ఎప్పటికి పరలోకభాగ్యాన్ని కోల్పోతారా? యూదులు ఏరోజో ఒక రోజు పరివర్తన చెందుతారని పౌలు నమ్మాడు. ప్రభువు తన సంకల్పాన్ని మార్చుకొని తానెన్నుకొనిన వారిని త్యజించడు అని చెప్పాడు - రోమా 11,29. ఈలా స్పష్టంగా చెప్పకపోయినా మత్తయి ఉద్దేశం కూడ ఇదేకావచ్చు. యూదులు ఎప్పుడో వొకప్పుడు క్రీస్తుని అంగీకరిస్తారని నమ్మి వుండవచ్చు.

యూదులు క్రీస్తుని నిరాకరించారు అన్నాం. కాని వాళ్ల నిరాకరణం మన అంగీకారానికి కారణమైంది. వాళ్లు నిరాకరించిన క్రీస్తుని మనం అంగీకరించాం. వాళ్లు కోల్పోయిన భాగ్యాన్ని మనం పొందాం. రాజ్యపు వారసులు వెలుపటి చీకటిలోనికి త్రోయబడ్డారు. తూర్పు, పడమరల నుండి అన్యులు అనేకులు వచ్చి పరలోక రాజ్యంలో భోజన పంక్తిలో కూర్చున్నారు - 8,11-12. మత్తయి సువిశేషంలో ఈలాంటి లోతయిన భావాలు వున్నాయి.

కడన పిలాతు బరబ్బాను విడుదల చేసాడు. యేసుని కొరడాలతో కొట్టించి ఆ పిమ్మట సిలువ మరణానికి అప్పగించాడు - 27,26. యూదులు బరబ్బాను ఎన్నుకొని క్రీస్తుని తిరస్కరించారు. రాజకీయ విప్లవకారుణ్ణి స్వీకరించి నీతిమంతుడైన మెస్సీయాను త్రోసివేసారు. అది వాళ్ళ తప్పు.

పిలాతు క్రీస్తుని కొరడాలతో కొట్టించాడు - 27,26. మామూలుగా సిలువ వేయడానికి ముందు ద్రోహులను కొరడాలతో కొట్టేవాళ్లు. సిలువ మరణం బహువేదనా భరితమైంది. అలాంటి మరణాన్ని ఎక్కువకాలం భరించకుండా వుండడానికి ద్రోహులను ముందుగానే కొరడాలతో కొట్టి బలహీనపరచేవాళ్లు. దీని వల్ల వాళ్లు త్వరగా చనిపోయేవాళ్లు. సిలువ వేదనలను ఎక్కువకాలం అనుభవించకుండా వుండేవాళ్లు.

సువిశేషం క్రీస్తు శారీరక బాధలను ఎక్కువగా వర్ణించదు. కనుక "అతన్ని కొరడాలతో కొట్టించి" అని సంగ్రహంగా చెప్పింది - 27,26.

రోమీయులు కొరడాలతో కొట్టగోరిన వ్యక్తి బట్టలు విప్పివేసేవాళ్లు. చేతులు వెనక్కులాగి కట్టేవాళ్లు. అతన్ని వంగివున్న గుంజకో లేక స్తంభానికో రొమ్మువైపుగా అంటగట్టేవాళ్లు. అతనివీపు వెలుపలి వైపున వంగి వుంటుంది. ఆ వీపుపై కొరడాలతో 40 దెబ్బలదాకా బాదేవాళ్లు. ఆ కొరడాలకు ఎముక ముక్కలూ సీసం ముక్కలూ తగిలించేవాళ్లు. ఇవి వీపునుండి మాంసపు ముక్కలను చీల్చుకొని వచ్చేవి. కొరడా దెబ్బలకు దోషి వీపు నజ్జునజ్జయ్యేది. నెత్తురు ధారలుగా కారేది. చాలమంది ఆ దెబ్బలకు తట్టుకోలేక అక్కడికక్కడే చనిపోయేవాళ్లు. లేదా స్పృహ కోల్పోయేవాళ్ళు. బ్రతికి బయటపడ్డవాళ్లు పిచ్చివాళ్ళయ్యే వాళ్లు. క్రీస్తు మన కొరకు ఈలాంటి శిక్షను అనుభవించాడు.

కడన పిలాతు క్రీస్తుని సిలువ వేయడానికి శత్రువులకు అప్పగించాడు. అతడు చేతులు కడుగుకోవడంతో తన బాధ్యత తీరిపోయిందనుకొన్నాడు. కాని నిజంగానే అలా తీరిపోయిందా? క్రీస్తుకి మరణశిక్ష విధించవద్దని పిలాతు భార్య అతన్ని హెచ్చరించింది. న్యాయం అతన్ని హెచ్చరించింది. అతని అంతరాత్మే అతన్ని హెచ్చరించింది. కాని పిలాతు జనానికి దడిసి న్యాయం చెప్పలేకపోయాడు. తన బాధ్యతను నెరవేర్చలేక పోయాడు. అతడు దుష్టుడు కాదు. స్వీయధర్మాన్ని నిర్వహించలేని దుర్బలుడు. దయనీయుడు. నేడు మనం మాత్రం ఎదుటివారి వత్తిడికి లొంగి మన బాధ్యతలను గాలికి వదలివేయడం లేదా? న్యాయాన్ని విడనాడి అన్యాయం కోపు తీసుకోవడం లేదా?

## 3. ప్రభుని పరిహసించడం - 27, 27-31

యూదుల న్యాయసభ యెదుట ఆసభ సభ్యులే క్రీస్తుని పరిహసించారు - 26,67-68. అక్కడ అతన్ని మెస్సియానుగా అవమానించారు. ఇక్కడ పిలాతు సైనికులు

క్రీస్తుని పరిహసించారు. వీళ్లు క్రీస్తుని రాజునిగా అపహసించారు. క్రీస్తు తన దగ్గరికి రాగానే పిలాతు అతన్ని నీవు యూదుల రాజువా అని అడిగాడు కదా! - 27,11. ఈ ప్రశ్నను ఆధారంగా జేసికొని సైనికులు ప్రభుని పరిహాసం చేసారు. ఈ పరిహాసమే ఈ ఘట్టంలోని ముఖ్యమైన అంశం.

సైనికులు క్రీస్తుని పిలాతు అంతర్భవనంలోకి తీసికొని వెళ్లారు. అక్కడ సైనిక బృందమంతా ప్రోగైంది. మామూలుగా ఓ బృందంలో 600 మంది సైనికులుంటారు. కాని అక్కడ అంతమంది వుండి వుండరు. అక్కడ వున్న వాళ్లంతా క్రీస్తు చుట్టూ ప్రోగయ్యారు. ఈ సైనికులు రకరకాల జాతులకు చెందినవాళ్లు. పిలాతుకి అంగరక్షకులు. అతడు మామూలుగా కైసరయలో వసించేవాడు. గలాట జరగకుండా చూడ్డానికి పండుగలకు మాత్రం యెరూషలేము వచ్చేవాడు. ఈ సైనికులు కూడ అతనితో పాటు కైసరయ నుండి ఇక్కడికి వచ్చారు. వాళ్ళకు క్రీస్తు ఎవరో అసలు తెలియదు. అతనిపై వాళ్ళకు ప్రత్యేకమైన ద్వేషమేమీ లేదు.

ఇక్కడ సైనికులు మొదట క్రీస్తుకి రాజు వేషం వేయించారు. అటుపిమ్మట అతనికి అభివందనం చేసారు. ఈ రెండు పనులు పరిహాసం కొరకే చేసారు.

వారు మొదట క్రీస్తు బట్టలను తొలగించి అతనికి ఎఱ్ఱని అంగీని తొడిగారు. ఇది రాజవస్త్రం అనుకోవాలి. అటుతరువాత అతని శిరస్సుపై ముండ్ల కిరీటం పెట్టారు. రాజుకి కిరీటం వుంటుంది కదా! ఈ కిరీటం క్రీస్తుని బాధించడానికి కాదు. గేలి చేయడానికి మాత్రమే. అతని చేతికి వెదురుకోల నిచ్చారు. ఇది రాజదండం అనుకోవాలి. ఇంతవరకు రాజు వేషం.

ఇక వాళ్లు అతనికి అభివందనం చేసిన తీరు. సైనికులు అతని ముందు మోకరిల్లి రాజా నీకు జయం అని పల్కుతూ ఎగతాళి చేసారు. ఆ మీదట హింసకు పూనుకొని అతని మీద ఉమ్మివేసారు. క్రీస్తు చేతిలోని కఱ్ఱను తీసికొని అతని తలపై మోదారు. ఈ చర్యలన్నీ క్రీస్తుని అవహేళనం చేయడానికే.

కీర్తన 22 ఓ భక్తుని శ్రమలను వర్ణిస్తుంది. సువిశేషకారులు ఈ కీర్తనను శ్రమలనుభవించే క్రీస్తుకి అన్వయించారు. దానిలో 16వ చరణంలో "దుష్టబృందం నా చుట్టు క్రమ్ముకొంది" అని వుంటుంది. ఈ దుష్టబృందం పైసైనికులే.

తర్వాత సైనికులు ఎఱ్ఱని అంగీని తొలగించి సొంత అంగీనే క్రీస్తుకు తొడిగారు. ఇది ప్రభువుని సిలువ వేసిందాకా అతని వంటిపై అలాగే వుంటుంది.

క్రీస్తు నేను యూదుల రాజునని చెప్పుకొన్నందుకు రోమను సైనికులు అతన్ని ఎగతాళి చేసారు. కాని అతడు యథార్థంగా రాజే. యూదులకు అన్యజాతులకూ కూడ

అతడు రాజే. కాని అతని రాజ్యం ఈలోక సంబంధమైనదికాదు. అతడు సేవలు చేయించుకొనే రాజు కాదు. సేవలు చేసే రాజు. అనేకుల కొరకు తన ప్రాణాలు ధారపోసే రాజు - 20,28. తన పునరుత్థానం తర్వాత అతడు ఈ విశ్వానికంతటికీ రాజవుతాడు. కడన సైనికులు క్రీస్తుని సిలువ వేయడానికి తీసికొనిపోయారు - 27,31.

సిలువ మరణం మహా క్రూరమైంది. దీన్ని మొదట పర్షియా దేశీయులు ప్రారంభించారు. అక్కడినుండి అది ఆఫ్రికాలోని కార్తేజీకి ప్రాకింది. అక్కడినుండి రోమను సామ్రాజ్యంలోకి వ్యాపించింది. కాని రోమీయులు తిరుగుబాటు చేసినవాళ్ళకూ బానిసలకూ మహా ద్రోహాలకూ మాత్రమే ఈ శిక్ష విధించేవాళ్లు. రోమను పౌరులను ఎవరినీ సిలువ వేయడానికి వీల్లేదు.

మామూలుగా కొరడాలతో కొట్టించిన పిదప దోషిని సిలువ మీదికి ఎక్కించేవాళ్లు. కొరడా దెబ్బలకు అతని దేహం ఓ మాంసపు ముద్దగా తయారయ్యేది. ఈముద్ద సిలువపై వేలాడేది. ఈగలు, దోమలు రోగిపై క్రమ్ముకునేవి. వాటిని తోలుకోవడానికి కూడ అతనికి వీలయ్యేది కాదు. ఆకలి దప్పులతో కృశించిపోతూ, ఘోరవ్యధ ననుభవిస్తూ సిలువపై వ్రేలాడేవాళ్లు అందరినీ శపించేవాళ్లు. తమకు జన్మనిచ్చిన తల్లిదండ్రులనుగూడ శపించేవాళ్లు. సిలువ దగ్గరికి వచ్చినవాళ్ళపై కోపంతో ఉమ్మివేసేవాళ్లు. క్రీస్తు మన కొరకు ఈలాంటి సిలువ మరణానికి గురయ్యాడు. తన మరణం ద్వారా మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసాడు.

## 6. క్రీస్తుని సిలువ వేయడం

ప్రధానార్చకులు పిలాతు మొదలైన వాళ్ళంతా క్రీస్తు మీద వచ్చిన నేరాలను పరిశీలించి చూచారు. అతన్ని సిలువ వేయాలని నిర్ణయించారు. క్రీస్తుని పిలాతు నివాసం నుండి వెలుపలికి తీసికొని వచ్చారు. అక్కడ గొల్గొత్తా కొండదగ్గర అతన్ని వధించారు. ఈ భాగంలో రెండంశాలున్నాయి. 1) క్రీస్తుని సిలువ వేసి హేళన చేయడం - 27,32-44. 2) క్రీస్తు మరణం - 27, 45-56. ఇక ఈ రెండంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

### 1. సిలువ వేసి హేళన చేయడం - 27,32-44.

పిలాతు సైనికులు క్రీస్తుని నగర ప్రాకారాల వెలుపలికి తీసికొని పోయారు - 27,32. దోషిని పవిత్ర నగరంలో వధించకూడదు. దుష్టులైన కౌలుదార్ల కథలో కౌలుదార్లు భూస్వామి కుమారుని ద్రాక్షతోట వెలుపల పడవేసి చంపారు - 21,39. ఈ కథలోని కుమారుడు క్రీస్తే. యూదులు మెస్సీయాను నిరాకరించి నగరం వెలుపలికి నెట్టివేసారు.

ప్రభువు గురువారం రాత్రి నుండి తీవ్రమైన వేదనలో వున్నాడు. కనుక అలసిపోయి వున్నాడు. సిలువను మోయలేని స్థితిలో వున్నాడు. కావున రోమను సైనికులు కురేనియా నుండి వచ్చిన సీమోనుని క్రీస్తు సిలువను మోయమని నిర్బంధం చేసారు. ఈ కురేనియా ఆఫ్రికా ఉత్తర భాగంలో వుంది. సీమోను అక్కడినుండి పాస్క తిరునాళ్ళకు యెరూషలేము వచ్చాడు. సిలువలో నిలువుమాను అడ్డమాను వుంటాయి కదా! నిలువుమాను గొల్గొతా కొండమీదనే వుంది. క్రీస్తుగాని సీమోనుగాని మోసికొని వెళ్ళింది అడ్డమాను మాత్రమే.

సీమోనుకి మొదటలో క్రీస్తు సిలువను మోయడం ఇష్టం లేదు. అది అవమానకరమైన కార్యం. ఆ రోజుల్లో సిలువ నీచవస్తువు. సైనికుల నిర్బంధానికి లొంగి అతడు సిలువమానుని భుజాల మీదికి ఎత్తుకొన్నాడు. కాని ప్రభువు వరప్రసాద ప్రభావం వల్ల తర్వాత అతని మనసు మారింది. అతడు ప్రభువుకి శిష్యుడయ్యాడు. అతని యిద్దరు కుమారులైన అలెగ్జాండర్, రూఫస్ తొలినాటి క్రైస్తవ సమాజంలో మంచిపేరు కలవాళ్లు - మార్కు 15,21. సీమోను లాగే కొందరు అనిష్టంతో దైవసేవలో చేరతారు. కాని తర్వాత గొప్ప దైవభక్తులౌతారు. ప్రభువు వరప్రసాదం మన హృదయాలను మార్చివేస్తుంది.

సీమోనులాగే నేడు మనం కూడ క్రీస్తు సిలువను మోయాలి. నన్ను అనుసరింపగోరేవాడు నా సిలువను మోసికొని నా వెంట రావాలని ప్రభువు నుడివాడు కదా! - మత్త 16,24. "క్రీస్తు వెంట మోసికొని రావడానికి సిలువను సీమోను భుజాల మీద పెట్టారు" అని చెప్తుంది లూకా సువిశేషం - 23,26. మన బాధ్యతలు, కష్టాలు, మరణం మొదలైనవన్నీ కూడ నేడు మనం మోసే సిలువలే.

సీమోను క్రీస్తు సిలువను మోసిన ఉదంతం తర్వాత పుణ్యస్త్రీల ఉదంతం వస్తుంది. ఈ యంశం లూకా సువిశేషంలో మాత్రమే కన్పిస్తుంది - లూకా 23,27-31. ఈ పుణ్యాంగనలు యెరూషలేము నివాసులు. వీళ్లు సిలువను మోసే క్రీస్తు పట్ల సంతాపం చూపుతూ విలపించారు. క్రీస్తు వారిని తన కొరకు కాక వారికొరకూ వారి బిడ్డల కొరకూ దుఃఖించమన్నాడు. ఎందుకు? క్రీ.శ.70లో రోమీయులు వచ్చి యెరూషలేం నగరాన్ని సర్వనాశం చేస్తారు. అప్పుడు యెరూషలేం నివాసులు చాలమంది చస్తారు. క్రీస్తుని నిరాకరించినందుకు తండ్రి వారిమీదికి పంపే శిక్ష అది. ఈ శిక్షను గూర్చి క్రీస్తు ముందుగానే హెచ్చరించాడు - లూకా 19,42-44.

యూదులు సంతానాన్ని దేవుని దీవెనగా భావించారు. వంధ్యత్వాన్ని శాపంగా ఎంచారు. కాని యెరూషలేము వినాశకాలంలో గొడ్రాళ్ళయిన స్త్రీలే ధన్యులని చెప్పుకొంటారు. ఎందుకు? బాలబాలికల చావును చూడలేక జనం అలా చెప్పుకొంటారు. ఆ కాలంలో ప్రజలు ప్రభువు శిక్షకు భయపడి దేవుని కంటబడకుండ తమ్ము కప్పివేయమని పర్వతాలను బతిమాలుకొంటారు - హోషేయ 10,8.

ఈ సందర్భంలో క్రీస్తు పచ్చి మ్రానుకే ఇంత ఆపద కలిగితే ఇక ఎండు మ్రానుకి ఎంత ఆపద కలుగుతుందో ఊహించండి అన్నాడు - 23,31. ఇది ఓ సామెత. ఇక్కడ దీని భావం ఇది. నిర్దోషియైన క్రీస్తునే రోమీయులు ఇంతగా బాధిస్తుంటే, ఇక దోషులైన యెరూషలేము పౌరులను వాళ్లు ఎంతగా బాధించరు? యూదులు తర్వాత రోమీయుల మీద తిరుగుబాటు చేసి దోషులౌతారు. కనుక రోమీయులు వారిని ఊచకోత కోస్తారు. ఇంకా, పచ్చికొయ్య కాలడానికి యోగ్యంగా వుండదు. క్రీస్తు దీనిలాంటివాడు. ఎండుకొయ్య కాలడానికి యోగ్యంగా వుంటుంది. యెరూషలేము పౌరులు దీనిలాంటివాళ్లు. ఇంకా, క్రీస్తు బ్రతికివున్న చెట్టులాంటివాడు. జీవమిచ్చేవాడు. యూదులు ఎండిపోయిన చెట్టులాంటివాళ్లు. దోషులు.

మొత్తం మీద పుణ్యస్త్రీలకు చెప్పిన ఈ మాటలు యెరూషలేము మీదికి రానున్న దైవశిక్షను తెలియజేస్తాయి. లూకా ఈ సువిశేషాన్ని వ్రాసేప్పటికే యెరూషలేము దాని లోని దేవాలయము పైశిక్షకు గురై ధ్వంసమయ్యాయి.

క్రీస్తుని సిలువ వేసింది నగర ప్రాకారాలకు వెలుపల, ఓ చిన్న కొండమీద. దానికి గొల్గొతా అని పేరు. ఆ పేరుకి కపాలం అని అర్థం. కాని ఆ పేరు దానికేలా వచ్చింది? ఆ కొండ తలపుర్రె ఆకారంలోనైనా వుండవచ్చు. లేదా ఆ ప్రాంతాని కంతటికి కలిపి పుర్రె అనే పేరైనా వుండవచ్చు. అది ద్రోహులను వధించేతావు కనుక వారి పుర్రెలు అస్థులు అక్కడ చిందరవందరగా పడివుండవచ్చు.

ఈ సందర్భంలో లూకా సువిశేషంన ప్రభువు సిలువపై నుండి శత్రువుల కొరకు చేసిన ప్రార్థనను వర్ణిస్తుంది. "తండ్రీ వీళ్ళేమి చేస్తున్నారో వీళ్ళకే తెలియదు. నీవు వీళ్ళను క్షమించు" అని క్రీస్తు ప్రార్థించాడు - లూకా 23,34. శత్రువులను ప్రేమించమని ప్రభువు ముందుగానే శిష్యులను ఆదేశించాడు. ఇక్కడ తన ఆదేశాన్ని తానే పాటించాడు. రోమను సైనికులు అజ్ఞానంతో తన్ను వధిస్తున్నారు గనుక వారిని క్షమించమని తండ్రికి మనవి చేసాడు. పరలోకంలోని తండ్రి కరుణామయుడు. నరుల అవివేకాన్ని పాపాన్ని మన్నించేవాడు. కనుక అతడు ఈ శత్రువులను గూడ క్షమిస్తాడు. క్రీస్తు శత్రువుల కొరకు చేసిన ఈ ప్రార్థన స్తెఫనుకు ఎంతో స్ఫూర్తి నిచ్చింది. అతడు కూడ చనిపోయేపుడు శత్రువుల కొరకు ఈలాంటి ప్రార్థనే చేసాడు. ప్రభూ! ఈ పాపాన్ని వీరిపై మోపకు" అని మనవిచేసి మరణించాడు - అచ 7,60. నేడు క్రీస్తు శిష్యులమైన మనం శత్రువుల మీద పగ తీర్చుకోవడానికి సిద్ధంగా వుంటాం. కాని ఇది ప్రభువు బోధలకు విరుద్ధం. ఆ గురువు మార్గాన్ని అనుసరించి మనం కూడ విరోధులను క్షమించాలి.

చనిపోకముందు ప్రభువుకి చేదు కలిపిన ద్రాక్ష రసాన్ని ఇచ్చారు - 27,34. ఇది మత్తుమందులా పనిచేస్తుంది. కొరతవేయబడేవాళ్లు దీన్ని త్రాగి తమ బాధను కొంతవరకు మర్చిపోయేవాళ్లు. యెరూషలేములోని సంపన్న మహిళలు దీన్ని తయారు చేసి సిల్వపై చనిపోయేవాళ్లకు ఉచితంగా యిచ్చేవాళ్లు. అది వో కరుణ కార్యం. క్రీస్తు ఆ రసాన్ని రుచి చూచి దాన్ని త్రాగడానికి ఇష్టపడలేదు. ఎందుకు? అతడు మనకొరకు సంపూర్ణంగా కష్టాలు అనుభవింపగోరాడు. కనుక ఆ కష్టాలను తగ్గించివేసే రసాన్ని ముట్టుకోలేదు. కీర్తన 69,21. "వాళ్లు నాకు భోజనానికి మారుగా విషాన్నిచ్చారు" అని చెప్తుంది. ఈ వాక్యంలోని విషం చేదు కలిపిన ద్రాక్ష రసమే. క్రీస్తు సిలువమరణంలో ఎదురయ్యే చాల సంఘటనలను పూర్వవేదం ముందుగానే పేర్కొంది. ఈలాంటి వాక్యాలను మత్తయి ప్రత్యేకంగా ఉదాహరిస్తుంటాడు. క్రీస్తు మరణం వల్ల పూర్వవేద లేఖనాలు నెరవేరాయని చెప్పడం అతని ఉద్దేశం. 69వ కీర్తన వ్రాసిన భక్తుడు ఆ గీతంలో తన సొంత శ్రమలను చెప్పుకొన్నాడు. ఆ శ్రమలు క్రీస్తునందు నెరవేరాయి. క్రీస్తు పూర్వవేదం లోని నీతిమంతుల శ్రమలను తన శ్రమలనుగా జేసికొన్నాడు. తానూ వారి కష్టాలను అనుభవించి వాటిని పునీతం చేసాడు.

క్రీస్తు సిలువ మీద నానాయాతనలూ ఘోరశ్రమలూ అనుభవించాడు. ఐనా సువిశేషాలు క్రీస్తు శారీరక బాధలను వర్ణించవు. సిలువ మరణం ఎంతో బాధాకరమైంది. దానితో సాటివచ్చే శ్రమ ప్రాచీనకాలంలో లేనేలేదు. ఐనా మత్తయి సువిశేషం "వారు ఆయనను సిలువ వేసారు" అనే చిన్న వాక్యం చెప్పి ముగించింది - 27,35. సువిశేషకారులు క్రీస్తు శారీరక శ్రమలను గాక అతని మరణం మనకేలా రక్షణం సాధించిపెట్టిందో తెలియజేసారు, అంతే. నేడు మనం కూడ ప్రభువు దైహిక శ్రమలకంటె అతని మరణ పరమార్థాన్ని అధికంగా ధ్యానం చేసికోవాలి. అతని ప్రేమనూ విధేయతా గుణాన్నీ ఎక్కువగా మననం చేసికోవాలి.

సైనికులు చీట్లు వేసికొని క్రీస్తు వస్త్రాలను పంచుకొన్నారు - 27,35. మామూలుగా నల్గురు సైనికులు ద్రోహిని తమ మధ్యన నడిపించుకొని పోయి సిలువ వేసేవాళ్ళు. ద్రోహి దుస్తులు వారికే ముట్టేవి. యూదుల దుస్తులు ఐదు. అవి చెప్పులు, నడికట్టు, తలపాగా, లోపలి వస్త్రం, వెలుపలి అంగీ. వీటిల్లో వెలుపలి అంగీ ఎక్కువ విలువైంది. దీన్ని మినహాయించి నల్గురు నాల్గు వస్తువులను తలావొకటి చొప్పున తీసికొన్నారు, ఐదవదీ విలువైనదీ ఐన వెలుపలి అంగికొరకు చీట్లు వేసికొన్నారు. ఈ సందర్భంలో

"వాళ్లు నా బట్టలను తమలోతాము పంచుకొన్నారు
నా దుస్తుల కొరకు చీట్లు వేసికొన్నారు"

అనే కీర్తన వాక్యం 22,18 నెరవేరింది. ఇది చాలగొప్ప కీర్తన. దీనిలో ఎవరో పూర్వవేద భక్తుడు తన సొంత శ్రమలను చెప్పుకొన్నాడు. ఈ శ్రమలన్నీ క్రీస్తునందు సార్థకమయ్యాయి. క్రీస్తు సిలువపై ఈ కీర్తనను జపించి వుండవచ్చు కూడ. సువిశేషకారులు ఈ కీర్తనలోని చాల వాక్యాలను క్రీస్తుకి అన్వయించి చూపించారు. అసలు సువిశేషాలను వ్రాయకముందే, ఆదిమ క్రైస్తవ సమాజమే ఈ కార్యాన్ని ప్రారంభించింది. ఈ కీర్తనలో చరణాలను కొన్నిటిని పరిశీలిస్తే యిది ఎంత భక్తిగల కీర్తనో తెలుస్తుంది.

"ప్రభూ! నేను పగలెల్ల మొరపెట్టినను నీవాలింపవు
రేయెల్ల నీకు మనవి చేసినను ఉపశాంతి లేదు
మా పితరులు నిన్ను నమ్మిరి
నిన్ను నమ్మగా నీవు వారిని రక్షించింతివి
తల్లి కడుపునుండి నన్ను సురక్షితముగా
బయటికి కొనివచ్చినది నీవే
నేను మాతృస్తన్యమును గ్రోలి
భద్రముగా మననట్లు చేసినది నీవే
మాతృగర్భము నుండి వెలువడినప్పటి నుండియు
నేను నీ మీదనే ఆధారపడితిని
నేను జన్మించినప్పటినుండియు నీవే నాకు దేవుడవు
నేనాపదలో ఉన్నాను
నీవు నాకు దవ్వుగా ఉండవలదు
నీవు తప్ప నన్నాదుకొనువాడు ఎవ్వడును లేడు
ప్రభూ! నీవు నాకు దవ్వుగా ఉండవలదు
నాకు బలమైన నీవు
నన్నాదుకొనుటకు శీఘ్రమే రమ్ము".

క్రీస్తుని సిలువ వేసి అతని వస్త్రాదులను పంచుకొన్న పిదప సైనికులు అతనిచెంత కూర్చుండి కావలి కాయడం మొదలెట్టారు - 27,36. ఈ కావలి కాయడం అతని అంతాన్ని, అనగా మరణాన్ని చూడ్డం కొరకు. మరణానంతరం ద్రోహి దేహాన్ని సిలువ మీదినుండి దించుతారు. సైనికుల పని ముగుస్తుంది. ఈ సైనికులకు ఇక్కడ ఓ ప్రాముఖ్యముంది. తర్వాత క్రీస్తు మరణ సమయంలో సంభవించే భూకంపం మొదలైన అద్భుత సంఘటనలను జూచి వీళ్లు "ఇతడు నిక్కంగా దేవుని కుమారుడే" అని సాక్ష్యం పలుకుతారు - 27,54.

సిలువ మీద వ్రేలాడే క్రీస్తు శిరస్సు మీద అతని నేరమేమిటో వ్రాసిపెట్టారు. "ఇతడు యూదుల రాజైన యేసు" అని లిఖించి వుంచారు – 27,37. క్రీస్తు శత్రువులు ఊహింపని రీతిలో ఈ పదాలు గూఢార్థాలను తెలియజేసాయి. ప్రభువు పేరు "యేసు". హీబ్రూభాషలో యెహోషువ. ప్రజలను వారి పాపాలనుండి రక్షించేవాడని ఆ పేరుకు అర్థం –1,21. అతని మరణం ద్వారానే మనకు రక్షణం కలిగేది. అతడు "రాజు" అనగా మెస్సీయా దైవప్రజలను పాపదాస్యం నుండి విడిపించే మెస్సీయా అతడే. కాని ఈ మాటల్లోని ఈ లోతైన భావాలను ఆనాటి యూద నాయకులు గుర్తించనే లేదు.

ప్రభువుకి ఈ ప్రక్కా ఆ ప్రక్కా ఇద్దరు దొంగలను సిలువ వేసారు. ఆ యిద్దరు క్రీస్తుకి పరివారం లాగ వున్నారు. అనగా క్రీస్తు తన పరివారం లాగే తాను కూడ దుష్టుడు అని యూదుల భావం. వాళ్లు అతన్ని పూర్వమే సుంకరులకు పాపాత్ములకు మిత్రుడు అని నిందించారు – 14,19.

సిలువ మీద వ్రేలాడే క్రీస్తుని మూడు వర్గాలవాళ్లు హేళనం చేసారు. వాళ్లు దారివెంట బోయేవాళ్లు, యూదుల మహాసభ సభ్యులు, ఇద్దరు దొంగలు.

దారివెంట బోయేవాళ్లు వహ్వా అని తలవూపుతూ ప్రభుని గేలిచేసారు. కీర్తన 22,7లో శత్రువులు బాధలనుభవించే నీతిమంతుని వైపు జూచి వెటకారంగా తలవూపారు. ఆ సంఘటనం ఇక్కడ క్రీస్తు పట్ల నెరవేరింది. పూర్వం శత్రువులు ప్రభువు మీద రెండు నేరాలు తెచ్చారు. అతడు దేవాలయాన్ని పడగొట్టి మూడురోజుల్లో మళ్లా నిర్మిస్తానన్నాడు – 26,61. తాను దైవసుతుణ్ణని చెప్పుకొన్నారు – 26,63. ఈ నేరాలనే దారివెంట బోయేవాళ్లు కూడ మళ్లా క్రీస్తు మీద మోపారు–27,40.

దేవాలయాన్ని కూలద్రోసి శక్తి మెస్సియాకుందని యూదులు నమ్మారు. వాళ్లు క్రీస్తు తనకా శక్తి వుందని చెప్పుకొన్నాడని అతని మీద నిందారోపణం చేసారు. అంతటి శక్తి కలవాడు తన్ను తాను రక్షించుకోలేక పోయాడు పాపం అని పరిహాసం చేసారు. కాని క్రీస్తు చనిపోయాక కొద్దియేండ్లలోనే రోమీయులు వచ్చి ఈ దేవళాన్ని ధ్వంసం చేస్తారు. ఆ సంగతిని ఇప్పుడు క్రీస్తుని ఎగతాళి చేసేవాళ్ళకు తెలియదు. ఇంకా శత్రువులు "నిన్ను నీవు రక్షించుకోచూద్దాం" అని దెప్పిపొడిచారు. కాని క్రీస్తు సిలువ మీది నుండి దిగివచ్చి తన్ను తాను రక్షించుకోడు. తన ప్రాణాలనర్పించే తన్ను తాను రక్షించుకొంటాడు. "తన ప్రాణాన్ని ధారపోసేవాడు దాన్ని దక్కించుకొంటాడు" అని అతడే బోధించాడు – యోహా10,15. సిలువ మీద ఆత్మార్పణం చేసికోవడం ద్వారా ప్రభువు తన్నూ మనలనూ గూడ రక్షిస్తాడు.

ప్రభువు తాను దేవుని కుమారుణ్ణని చెప్పుకొన్నాడని శత్రువులు అతని మీద నేరం తెచ్చారు. ఆ నేరాన్ని పురస్కరించుకొని ఇప్పుడు దారివెంట పోయేవాళ్లు అతని మళ్లా వేళాకోళం చేసారు. నీవు దేవుని కుమారుడవైతే సిలువ మీది నుండి దిగిరా చూద్దాం అన్నారు - 27,40. పూర్వం ఎడారిలో తపస్సు చేసికొనే క్రీస్తుని పిశాచం "నీవు దేవుని కుమారుడవైతే ఈ శిఖరం మీది నుండి క్రిందికి దూకు చూద్దాం అంది - 6,4. నీవు నీ తండ్రి చిత్తాన్ని పాటించవద్దు అని ప్రలోభపెట్టింది. ఇప్పుడు ఈ ప్రజలు కూడ పిశాచంతో చేతులు కలిపారు. అంతా ప్రభువుని సిలువమీది నుండి దిగిరమ్మనేవాళ్లే. సిలువమరణం నీకు వద్దు అని సలహా యిచ్చేవాళ్లే. కాని తాను సిలువపై మరణించందే మనకు రక్షణం లేదని ప్రభువుకి బాగా తెలుసు. కనుక అతడు తండ్రి చిత్తానికి లొంగి ఆ సిలువకు ఇంకా గట్టిగా అంటిపెట్టుకొని వుండిపోయాడు.

దారివెంట బోయేవాళ్ళ వేళాకోళం ముగిసిన పిదప యూదుల మహాసభ సభ్యులైన ప్రధానార్చకులు, ధర్మశాస్త్రబోధకులు పెద్దలు అతన్ని గేలిచేసారు. వీళ్లు క్రీస్తుకి ప్రబల శత్రువులు. "వీడు ఇతరులను రక్షించాడు గాని తన్ను తాను రక్షించుకోలేక పోయాడు" అన్నారు - 27,42. కాని ప్రభువు తన్ను తాను రక్షించుకొంటాడు, మనలను రక్షిస్తాడు. ఏలా? సిలువ మీది నుండి దిగిరావడం ద్వారా కాదు, దానిపై చనిపోవడం ద్వారానే.

వాళ్లు అతన్ని ఇంకా దెప్పి పొడిచారు. నీవు యిస్రాయేలుకి రాజువికదా, మెస్సీయావికదా, సర్వశక్తిమంతుడివి కదా, ఐతే సిలువ మీది నుండి దిగిరా మేము నిన్ను నమ్ముతాం అన్నారు. ఓ అద్భుతం చేసి సిలువ మీదినుండి దిగు అని ఎత్తిపొడిచారు. కాని క్రీస్తు ఇక్కడ ఏ యద్భుతం చేయడు. అతని సిలువ మరణమూ అటుపిమ్మట వచ్చే ఉత్థానమూ అన్నిటికంటె గొప్ప అద్భుతాలు ఔతాయి. కాని అతని శత్రువులు ఈ అద్భుతాలనను గ్రహించలేరు.

విరోధులు అతన్ని ఇంకా హేళనం చేసారు. ఇతడు దేవుణ్ణి నమ్మాడు. దేవుని కుమారుణ్ణని చెప్పుకొన్నాడు. కనుక ఆ దేవుణ్ణే వచ్చి ఇతన్ని రక్షించమనండి చూద్దాం అన్నారు - 27,43. కీర్తన 22,8లో విరోధులు నీతిమంతుణ్ణి అచ్చంగా ఈ వాక్యాలతోనే ఎగతాళి చేసారు. ఆ వాక్యాలు క్రీస్తుపట్ల పూర్తిగా నెరవేరాయి.

"ఇతడు ప్రభువుని నమ్మాడు
అతడు ఇతన్ని రక్షిస్తాడేమో చూద్దాం
ఇతడు ప్రభువుకి ఇష్టుడైతే
అతడు ఇతన్ని కాపాడతాడేమో చూద్దాం."

సొలోమోను జ్ఞానగ్రంథం రెండవ అధ్యాయం కూడ దుష్టులు నీతిమంతుని ఎగతాళి చేయడాన్ని గూర్చి చెప్తుంది. ఈ ఘట్టం పైన మనం పేర్కొన్న 22కీర్తన వాక్యానికి విపులీకరణం మాత్రమే. ఈ సందర్భంలోని వాక్యాలు ఇవి -

"తాను భగవంతుని
అనుభవమునకు తెచ్చుకొనెననియు,
తాను దేవుని బిడ్డడననియు
నీతిమంతుడు చెప్పుకొనుచున్నాడు
అతని పలుకులు యథార్థమేనేమో పరిశీలింతము
అతని మరణము ఏ తీరుననుండునో చూతము
నీతిమంతుడు దేవుని కుమారుడగునేని
దేవుడు అతని కోపు తీసికొనును
శత్రువులు బారినుండి అతనిని కాపాడును
కనుక అతనిని క్రూరముగా హింసించి
పరీక్షకు గురిచేయుదము
అతని శాంతభావము ఏపాటిదో,
సహనభావము ఎంతగొప్పదో, పరీక్షింతము
అతనిని నీచమైన చావునకు గురిచేయుదము
దేవుడే తన్ను రక్షించునని
అతడు చెప్పుకొనుచున్నాడు కదా!" - 2,17-20.

కనుక ఈ సందర్భంలో మత్తయి 22వ కీర్తన నుండీ, సొలోమోను జ్ఞానగ్రంథం నుండీ కూడ తన వాక్యాలను ఉదహరించి వుండవచ్చు.

క్రీస్తుని పరియాచకం చేసినవారిలో మూడవవర్గం వాళ్లు ఇరువైపులవున్న దొంగలు.

దారిన పోయేవాళ్ళూ ప్రధానార్చకులూ సైనికులూ సిలువ మీద వ్రేలాడే క్రీస్తుని దూషించారు. అటుతర్వాత ఈ యిద్దరు దొంగల వృత్తాంతం వస్తుంది. దీన్ని లూకా సువిశేషం సవిస్తరంగా వర్ణిస్తుంది - 23,39-42. చెడ్డదొంగ క్రీస్తు విరోధుల్లాగానే ఆ ప్రభువుని దూషించాడు. కాని మంచిదొంగ ఆ తోడిదొంగను చీవాట్లు పెట్టాడు. నీ తప్పుకు తగిన శిక్ష అనుభవిస్తున్నా కూడ నీకు బుద్ధిరాలేదని మందలించాడు.

అతడు తన పాపాలకు పశ్చాత్తాపపడ్డాడు. తమకు ప్రాప్తించిన శిక్షను అంగీకరించాడు. ప్రభువుని భక్తితో యేసూ! అని సంబోధించాడు. ఆ దివ్యనామం

మీదిగానే ఎల్లరికీ రక్షణం కలుగుతుంది - అ.చ. 4,12. కనుక అతడు ప్రభువు నుండి రక్షణాన్ని అడుగుకొన్నాడు. అతన్ని రాజును గాను తన్ను దోషినిగాను భావించుకొని తన తప్పిదాలకు మన్నింపు వేడుకొన్నాడు. భవిష్యత్తులో క్రీస్తు తనకు రక్షణాన్ని ప్రసాదిస్తాడని విశ్వసించాడు. అతని విశ్వాసాన్ని మెచ్చుకొని ప్రభువు నేడే నీకు పరలోక ప్రాప్తి కలుగుతుందని చెప్పాడు.

ఈ మంచిదొంగను చూచి మనం ఓ పాఠం నేర్చుకోవాలి. నరుడు చిట్టచివరి క్షణాల్లో కూడ పశ్చాత్తాపపడి దేవుని నుండి మన్నింపు పొందవచ్చు. ఆలస్యంగా పశ్చాత్తాపపడినా ఫలితం దక్కుతుంది.

మంచిదొంగ చనిపోతూ కూడ దొంగగానే చనిపోయాడు. అనగా అతడు చిట్టచివరి క్షణాల్లో మోక్షాన్ని కొల్లగొట్టాడు.

పైన మనం చూచిన వివరణంలో క్రీస్తు దేవుని కుమారుడా అన్న ప్రశ్న చాలసార్లు వచ్చింది. అతడు తప్పకుండా దేవుని కుమారుడే. అలాగే అతడు సిలువ మీది నుండి క్రిందికి దిగిరావచ్చు కదా అనే ప్రశ్నకూడ చాలసార్లు వచ్చింది. క్రీస్తు అలా ఎందుకు దిగిరాలేదు?

సిలువ మీది నుండి దిగిరావడం నరునికి తగుతుంది. సిలువమీద చనిపోవడం దేవునికి తగుతుంది. క్రీస్తు సిలువ మీద చనిపోవడం ద్వారా దేవుని చిత్తాన్ని పరిపూర్ణంగా నెరవేర్చాడు. పాపులమైన మనపట్ల తనకుగల గాఢమైన ప్రేమను గూడ నిరూపించాడు. సిలువ మీది నుండి దిగిరాలేదు కనుకనే క్రీస్తు నేడు మనకు ఆరాధ్యుడయ్యాడు. విశ్వసనీయుడయ్యాడు. యూదులు క్రీస్తులో భౌతికశక్తి గల మెస్సీయాను చూడగోరారు. అతడు తన భౌతిక బలంతో సిలువ మీది నుండి దిగిరావాలని కోరారు. కాని క్రీస్తు ప్రేమతో ఆత్మార్పణం చేసికొనే మెస్సీయా. కనుకనే అతడు సిలువపై చనిపోయాడు. అతని ప్రేమను అర్థం చేసికోనివారికి అతని సిలువమరణం అర్థం కాదు.

## 2. క్రీస్తు మరణం - 27,45-56

క్రీస్తు సిలువ మీద వ్రేలాడుతూండగా మట్టమధ్యాహ్నం నుండి చీకట్లు క్రమ్ముకొన్నాయి - 27,45. ఈ చీకట్లు రక్షణ చరిత్రలో ప్రాతయుగం గతించి క్రొత్తయుగం ప్రారంభమైందని తెలియజేస్తాయి. క్రీస్తు మరణంతో వరప్రసాద యుగం ఆరంభమౌతుంది. అంత్యదినం, అనగా మెస్సీయాకాలం, వచ్చినపుడు చీకట్లు క్రమ్ముకొంటాయని ఆమోసు ప్రవక్త చెప్పాడు - 8-9.

"ఆ దినం మట్ట మధ్యాహ్నమే ప్రొద్దు క్రుంకగా
పట్టపగలే నేలపై చీకట్లు అలముకొనేలా చేస్తాను".

ఇంకా, నిర్గమకాండం గూడ "మూడు రోజులపాటు ఐగుప్తు దేశం అంతటా కటిక చీకటి క్రమ్మింది" అంటుంది – 10,22. ఈలాంటి వాక్యాలు మత్తయి రచనను ప్రభావితం చేసి వుండవచ్చు. చీకటి దుఃఖానికి సంతాపానికీ గుర్తుకదా!

ప్రభువు సిలువపై 22వ కీర్తనను భక్తితో జపిస్తున్నాడు. ఈ కీర్తనకర్త ఎవరో ఓ పూర్వవేదపు నీతిమంతుడు. మహాభక్తుడు. ఘోరశ్రమలకు గురైనవాడు. అతడు ఈ కీర్తనం మొదటి భాగంలో తన శ్రమలనూ సంతాపాన్నీ వర్ణించుకొన్నాడు. రెండవభాగంలో యావే తన బాధలను తొలగించి తనకు విజయాన్ని ప్రసాదించాడని ఉల్లాసంతో చెప్పుకొన్నాడు. క్రీస్తు సిలువ మీద వ్రేలాడుతూ ఈ కీర్తనలోని మొదటి చరణాన్ని పెద్దగా ఉచ్చరించాడు. ఆ చరణం హీబ్రూలో "ఏలీ ఏలీ లెమా సబక్తాని" అనే మాటలతో ప్రారంభమౌతుంది. నా దేవా నా దేవా నన్నెందుకు చేయి విడిచావని ఈ మాటలకు అర్థం – 27,46. ప్రభువు శ్రమలు ఘోరమైనవి. అతనికి తన తండ్రే తన్ను చేయి విడచినట్లనిపించింది. మహాదుఃఖం కలిగింది. ఇక తనకు ఆశ్రయమేమీ లేదు అని తోచించిది. కాని అలాంటి ఆపత్సమయంలో కూడ క్రీస్తు నిరాశకు గురికాలేదు. తండ్రిని పూర్ణంగా నమ్మాడు. ఆ తండ్రిపట్ల తనకున్న విశ్వాసాన్ని అణుమాత్రం కూడ కోల్పోలేదు. ప్రభువు పూర్వవేద భక్తుల విశ్వాసానికి ప్రతీకగా వుంటాడు. తనకుముందు ఈలాంటి శ్రమలకు అనుభవించిన పూర్వవేద భక్తుని మాటలే జపిస్తూ తండ్రికి అంటిపెట్టుకొని వుండిపోయాడు.

"ఏలీ ఏలీ" అనే మాటలు విని సిలువ దగ్గరవున్న యూదులు, క్రీస్తు ఏలీయా ప్రవక్తను పిలుస్తున్నాడు గాబోలు అని భ్రాంతిపడ్డాడు. ఈ ప్రవక్త తన జీవిత కాలంలో యూదులను అన్నివిధాల ఆదుకొన్నవాడు. అతడు అంత్యకాలంలో, మళ్లా తిరిగి వస్తాడని యూదుల నమ్మకం. కనుక శత్రువులు క్రీస్తు ఈ యాపద్బాంధవుణ్ణి తనకు సహాయం చేయడానికి రమ్మని పిలుస్తున్నాడు గాబోలు అనుకొన్నారు. వారిలో ఒకడు స్పోంజిని పులియబారిన ద్రాక్షరసంలో ముంచి క్రీస్తుకి అందించాడు – 27,48. ఒకవేళ ఏలియా దిగివస్తాడేమో, అప్పటిదాకా క్రీస్తుని ప్రాణాలతో నిలబెడదామని అతని తలంపు. ప్రభువు ఈ రసాన్ని ముట్టుకోలేదు. ఇక్కడ కీర్తన 69,21వ చరణం నెరవేరింది. ఆ కీర్తన ఈలా చెప్తుంది. "నేను దప్పికగొని వున్నపుడు వాళ్లు నాకు సిర్కానిచ్చారు". సిర్కా అంటే పులిసిన ద్రాక్షరసం లేక వెనిగర్.

శత్రువులు క్రీస్తుని ఇంకా ఎగతాళి చేస్తూనే "ఆగండి ఏలీయావచ్చి ఇతన్ని రక్షిస్తాడేమో చూద్దాం. ఇతని భక్తి యేపాటిదో ఇప్పుడే తేలిపోతుంది" అని వెటకారంగా

పలికారు. దేవుడుకాని, ఏలీయాకాని క్రీస్తుని రక్షించడానికి రారని వాళ్ళ భావం. యిస్రాయేలునూ సకలమానవాళినీ రక్షించడానికి వచ్చిన ప్రభువు ఇప్పుడు తన రక్షణం కొరకు తండ్రికి మనవిచేస్తున్నాడు. యూదులు గ్రహింపలేని పద్ధతిలో తండ్రి తన కుమారుణ్ణి రక్షిస్తాడు. అతనిద్వారా సమస్తమానవాళిని కూడ రక్షిస్తాడు.

"యేసు తిరిగి బిగ్గరగా కేకవేసి ప్రాణాలు విడిచాడు"-27,50. మత్తయి ఈ చిన్నవాక్యంలో క్రీస్తు మరణాన్ని వర్ణించాడు. కాని ఇది యెంత చిన్న వాక్యమో అంతలోతైంది. ఉదయం తొమ్మిది నుండి సాయంకాలం మూడుదాకా - అనగా ఆరుగంటల దాకా ప్రభువు సిలువ మీద వ్రేలాడుతూ దారుణబాధలు అనుభవిస్తున్నాడు - మార్కు 15,25. తన చివరిగడియల్లో "ఏలీ ఏలీ" అనే 22వ కీర్తనను జపించడం ప్రారంభించాడు. ఆ కీర్తననే మళ్లామళ్లా జపిస్తూ ప్రాణాలు విడిచాడు. కనుక ఈ సందర్భంలో అతడు "బిగ్గరగా కేకవేసాడు" అంటే 22వ కీర్తనను పెద్దగా జపించాడనే అర్థం.

ఇక్కడ ప్రభువు బిగ్గరగా వేసిన కేకను అతని విజయ నాదాన్నిగా గూడ అర్థం జేసికోవాలి. శత్రువులు క్రీస్తు ఓడిపోయాడనుకొన్నారు. తండ్రి అతన్ని విడనాడాడు అని తలంచారు. అతడు నిరాశతో దిక్కులేని చావు చస్తాడు అని భావించారు. కాని క్రీస్తు సిలువ మీద నిరాశ చెందలేదు. తన బొందిలో శ్వాస వున్నంతకాలం తండ్రిని పూర్తిగా విశ్వసించాడు. తండ్రిగూడ కుమారుని ఆత్మార్పణను ప్రీతితో అంగీకరించాడు. కనుక క్రీస్తు విజయనాదం చేసి ధైర్యంగా ఉత్సాహంగా ప్రాణాలు విడిచాడు. ఈ పట్టున అతడు సిలువపై జపించిన 22వ కీర్తనం గూడ

"దీనులు తనకు మొరపెట్టినపుడు
దేవుడు వారి వేడుకోలును ఆలిస్తాడు"

అని చెప్తుంది 22,24. కనుక తండ్రి క్రీస్తు వేడుకోలును విన్నాడు అనుకోవాలి.

క్రీస్తు సిలువమీద "ప్రాణాలు విడిచాడు". అనగా దేవుడు తనకిచ్చిన ప్రాణాన్ని తిరిగి దేవుని చేతుల్లోకే సమర్పించాడు. మనం పుట్టినపుడే దేవుని శ్వాస మనలోనికి ప్రవేశిస్తుంది - ఆది 2,7. మనం చనిపోయినపుడు ఆ శ్వాసను మళ్లా దేవునికే అర్పిస్తాం - ఉపదేశ 12,7. ఈ శ్వాస మన ఆత్మే. క్రీస్తుకూడ తన ఆత్మను తండ్రి చేతుల్లో పెట్టాడు.

ప్రభువు తన ప్రాణాన్ని దేవునికి అర్పించడంలో అతని పరిపూర్ణ విధేయత వ్యక్తమౌతుంది. క్రీస్తు సిలువపై ఆత్మార్పణం చేసికోవాలని తండ్రి నిర్ణయించాడు. ఆ నిర్ణయాన్ని క్రీస్తు అంగీకరించాడు. దానికి బద్ధుడయ్యాడు. ఆ సిలువ మరణాన్ని గూర్చి ముందుగానే మూడుసార్లు శిష్యులను హెచ్చరించాడు. గురువారం రాత్రి జరిగిన కడపటి విందు నుండి ఆ గడియ కోసం ఎదురుచూస్తున్నాడు. కయిఫా పిలాతు మొదలైన అధికార్ల

ముందు తాను ఎందుకు ఈ లోకంలోకి వచ్చాడో ధైర్యంగా తెలియచేసాడు. కడన పూర్వవేద ప్రవచనాలు పరిపూర్ణంగా నెరవేరి ఆ యంతిమ గడియ రానేవచ్చింది. క్రీస్తు విధేయతతో, ఇష్టపూర్తిగా, ధైర్యంగా విజయనాదం చేస్తూ తన ప్రాణాన్ని తండ్రికి అర్పించాడు. ఆ యర్పణం ద్వారానే నేడు మనకు పాప విమోచనం కలిగింది.

లూకా సువిశేషం ప్రకారం క్రీస్తు "తండ్రీ! నా యాత్మను నీ చేతికి అప్పగిస్తున్నాను అని పల్కి ప్రాణం విడిచాడు - లూకా 23,46. ఈ వాక్యం 31వ కీర్తన 5వ చరణంలోనిది. అక్కడ కీర్తనకారుడు దేవునికి ఈలా మొరపెట్టాడు :

నా యాత్మను నీ చేతుల్లోనికి అర్పించుకొంటున్నాను
ప్రభూ! నీవు నన్ను కాపాడావు
నీవు నమ్మదగిన దేవుడివి.

లూకా గ్రంథం ప్రకారం మరణానికి ముందు క్రీస్తు ఈ వేదవాక్యాలను తనకు అన్వయించుకొన్నాడు. అనగా అతడు తండ్రిని పూర్తిగా నమ్మి తన ప్రాణాలను అతని చేతుల్లోనికి అర్పించుకొన్నాడు. అతడు జీవితాంతం తండ్రి చిత్త ప్రకారం జీవించాడు. కడన మరణం తన్ను కబళించడానికి వచ్చినపుడు కూడ ఏమీ జంకకుండా తండ్రి మీదనే భారం వేసి అతనికి తన అసువులను అర్పించాడు. కుమారుని విధేయాత్మకమైన మరణం తండ్రికి ప్రీతి కలిగించింది.

క్రీస్తు మొదటి వేదసాక్షి. తండ్రి తన కొప్పజెప్పిన కార్యాన్ని నెరవేర్చడానికి ప్రాణాలు కూడ అర్పించిన పుణ్యశీలుడు. ఈ వేదసాక్షిని అనుసరించి తర్వాత చాలమంది వేదసాక్షులు తమ ప్రాణాలను దేవునికి అర్పిస్తారు. స్తెఫను లాగే "యేసుప్రభూ! నా యాత్మను స్వీకరించు" అంటూ ఊపిరి విడుస్తారు - అచ 7,59. క్రీస్తు మరణం నేడు మన మరణానికి ఆదర్శంగా ఉంటుంది. ఈ లోకంలో దేవుడు మనకు ఒప్పుజెప్పిన పనిని ముగించి కట్టకడన మన ప్రాణాలను ఆ ప్రభువు చేతిలోనికి అర్పించాలి. మన జీవితంలాగే మన మరణం కూడ ఆదర్శప్రాయంగా ఉండాలి. అది మనం చేపట్టిన ఆధ్యాత్మిక విలువలకు లోకం ఎదుట సాక్ష్యం పలికేలా ఉండాలి.

క్రీస్తు చనిపోయినపుడు ప్రకృతి శక్తులు కంపించాయి. ఆ సమయంలో ఐదు అద్భుత సంఘటనలు జరిగాయి. 1. దేవాలయం తెర నిలువున చినగడం 2. భూమి కంపించడం 3. కొండ బండలు బద్దలు కావడం 4. సమాధులు తెరుచుకోవడం 5. మృతులు ఉత్థానం కావడం అనేవి - 27,51-53.

ఇవన్నీ దేవుడు కలిగించిన ఉత్పాతాలే. అతడు వాటికి కర్త. ఈ గుర్తులన్నీ తండ్రి క్రీస్తు ఆత్మార్పణాన్ని అంగీకరించాడనడానికీ, అతన్ని నీతిమంతునిగా ప్రకటించా

దనటానికీ, చిహ్నాలు. ఈ యైదింటిలో మొదటిదాన్ని మత్తయి మార్కు యింకా లూకా పేర్కొన్నారు. మిగతా నాల్గింటిని మత్తయి మాత్రమే పేర్కొన్నాడు. ఇక ఈ యైదు సంఘటనల భావాన్ని క్రమంగా పరిశీలిద్దాం.

1. దేవాలయం తెర చినగడం. దేవాలయంలో చాల తెరలుండేవి. ఇక్కడ చినిగిన తెర దేవళంలోని గర్భాగారానికి ముందుండేది. ఈ తెరవెనుక గర్భగృహంలో మందసం వుండేది. దానిలో ప్రభువు మోషేకి వ్రాసి యిచ్చిన రాతిపలకలుండేవి. ఈ స్థలంలో "షెకీనా" అనే పేరుతో దైవసాన్నిధ్యం నెలకొనివుండేది. ఈతావులోకి ప్రధానార్చకుడు మాత్రమే వెళ్ళేవాడు. అది కూడ ఏడాదికి ఒక్కసారి మాత్రమే, ప్రాయశ్చిత్త దినాన. కనుక ఇది సామాన్య జనులు పోగూడనితావు. దేవాలయంలోకెల్లా మహా పవిత్ర స్థలం.

ఇక్కడ ఈ తెర చినిగిపోవడంలో భావం ఏమిటి? పూర్వవేదంలోని ప్రజలు సులువుగా దేవుని దగ్గరికి వెళ్ళలేక పోయేవాళ్లు. దేవుడంటే వాళ్ళకు గౌరవమేకాని, మాలావు భయం కూడ. పైతెర దేవునికీ ప్రజలకీ మధ్య అడ్డుగోడగా నిల్చేది. క్రీస్తు మరణంతో ఈ యడ్డుగోడ తొలగిపోయింది. ఇక ప్రజలు సులువుగా దేవుని చెంతకు రావచ్చు. క్రీస్తు ద్వారా, అతడు సంపాదించి పెట్టిన రక్షణం ద్వారా, ఎల్లరూ సులభంగా తండ్రిని చేరవచ్చు.

ఇంకా, యీతెర చినిగిపోవడం పూర్వవేద దేవాలయ విధ్వంసాన్ని గూడ సూచిస్తుంది. మత్తయి సువిశేషం ప్రచారంలోకి వచ్చిన కాలంలో, అనగా క్రీ.శ.70లో రోమీయులు దండెత్తి వచ్చి యెరూషలేం పట్టణాన్నీ దేవళాన్నీ నాశం చేసారు. ఇక్కడ ఈ చినిగిన తెర నాశనమైన దేవళానికి గుర్తు. ఈ దేవాలయాన్ని రాతిమీద రాయి నిలువనీయకుండా పడగొడతారని క్రీస్తు ముందే చెప్పాడు – 24,2. యూదులు అవిశ్వాసులై క్రీస్తుని నిరాకరించారు. కనుక వాళ్ళూ, వాళ్ళ ఆరాధన స్థలమూ, ఆరాధనకాండా అంతా నాశమైపోతాయి. వాటిస్థానే నూత్నారాధనం వస్తుంది. అది క్రైస్తవారాధనం. ఉత్థాన క్రీస్తూ అతన్ని విశ్వసించే క్రైస్తవ ప్రజా కలసి నూత్న దేవాలయమౌతారు. ఇక ప్రాతయుగ దేవాలయం గతించి ఈ నూత్నయుగ దేవాలయం ఏర్పడుతుంది.

2-3. భూకంపమూ, కొండబండలు పగలడమూ. క్రీస్తు చనిపోయినప్పుడే ఉత్థానం కూడ చేసాడు. అతని ఉత్థాన ప్రభావానికి భూమి కంపించింది. దానివల్ల కొండబండలు కూడ పగిలాయి. అంత్యకాలంలో ఈలాంటి ఉత్పాతాలు కలుగుతాయని ప్రవక్తలు ముందుగానే తెలియజేసారు. కీర్తన 68,8 ప్రభువు రాకడను జూచి భూమి కంపించింది, ఆకాశం వర్షించింది అని చెప్తుంది. ఈ యంత్యకాలాన్ని గూర్చి చెప్తూ క్రీస్తు కూడ "ఆ కాలంలో అనేక ప్రదేశాల్లో కరవులూ భూకంపాలు కలుగుతాయి" అన్నాడు –

24,8. ఏలీయా హోరేబు కొండనెక్కగా ప్రభువు అతనికి దర్శనమిచ్చాడు. అప్పుడు పెనుగాలి వీచి కొండబండలను బ్రద్దలు చేసింది -1రాజు 19,11. ఈ యాలోకనాలన్నిటి భావమేమిటంటే, దైవ సాన్నిధ్యాన్ని చూచి ప్రకృతి గడగడ వణకి కంపించిపోయింది.

4. సమాధులు తెరచుకోవడం. యూదులు కొండల్లోనే సమాధులను తొలిపించి మృతులను పాతిపెట్టేవాళ్లు. క్రీస్తుని గూడ అలాంటి సమాధిలోనే పాతిపెట్టారు. ఇక్కడ కొండబండలు పగలగానే సహజంగానే వాటిలోని సమాధులు కూడ తెరచుకొన్నాయి. క్రీస్తు మరణంతో సమాధుల్లో వున్న పూర్వవేద భక్తులకు విమోచనం కలిగింది. కావున వాళ్లు సమాధులు తెరచుకొని బయటికి వచ్చేసారు.

పూర్వవేద ప్రవచనాలు కూడ అంత్యకాలంలో మృతులు ఉత్థానమౌతారని చెప్తాయి. దానియేలు ప్రవచనం 12,2 ఈలా వాకొంటుంది. "అప్పటికే చనిపోయి మట్టిలో నిద్రించే వారిలో చాలమంది సజీవులౌతారు. వారిలో కొందరు నిత్యజీవాన్ని పొందుతారు". ఇంకా, యెహెజ్కేలు గ్రంథం 37,12 ఈలా వాకొంటుంది. "నా ప్రజలారా! నేను మీ సమాధులను తెరచి మిమ్ము లేపుతాను. మిమ్ము మళ్లా యిస్రాయేలు దేశానికి తోడ్కొనివస్తాను". ఇక్కడ మన సందర్భంలో ఉత్థాన క్రీస్తు మృతులకు జీవాన్ని ప్రసాదించాడని భావం. ఆ ప్రభువు తాను జీవవంతుడై మృతులను గూడ జీవమయులను చేసాడని అర్థం.

5. ఉత్థానమైన మృతులు పవిత్ర నగరం ప్రవేశించి అనేకులకు కన్పించడం. జ్యేష్ఠ కుమారుడైన క్రీస్తు ఉత్థానం అతని సోదరులకు గూడ సోకుతుంది – రోమా 8,29. చనిపోయిన వారిలో నుండి క్రీస్తు ప్రథమ ఫలమో అన్నట్లుగా ఉత్థానమయ్యాడు. అతని ఉత్థాన మహిమ ఇతరులకూ సోకుతుంది – 1కొ 15,10. కనుక ప్రభువు ఉత్థానమైన పిమ్మట అతని ప్రభావం సోకి అప్పటిదాకా సమాధుల్లో వేచివున్న భక్తులు జీవంతో లేచారు. యెరూషలేములో చాలమందికి కన్పించారు. ఇక్కడ క్రీస్తు మరణమే అతని వుత్థానం అనుకోవాలి.

పైన మనం పేర్కొన్న ఐదు సంఘటనలూ చారిత్రకమైనవి కావు. ఇక్కడ క్రీస్తు మరణం ద్వారా ఎల్లరకి రక్షణం కలిగిందని తెలియజేయడమే మత్తయి ఉద్దేశం. ఈ సంఘటనాలు చారిత్రకమైనవి కాకపోయినా ఇవి బోధించే దైవశాస్త్రాంశాలు మాత్రం చాల విలువైనవి.

శతాధిపతీ సైనికులూ క్రీస్తు చుట్టూ కాపలా కాస్తున్నారు కదా! వాళ్లు భూకంపం మొదలైన పై అసాధారణ సంఘటనాలను జూచి భయపడ్డారు. అవి క్రీస్తు నీతిమంతుడని తెలియజేయడానికి దేవుడు కలిగించిన కార్యాలే. కనుక వాళ్ళు చనిపోయిన క్రీస్తులో ఏదో దైవశక్తి యిమిడివుందని గుర్తించారు. ఈ క్రీస్తు నిజంగా దైవకుమారుడేనని

ప్రకటించారు - 27,54. వీళ్లు రోమీయులు. కనుక అన్యజాతుల నుండి క్రీస్తుని దైవకుమారునిగా విశ్వసించినవారిలో వీళ్లే ప్రథములు. ప్రభువు సిలువపై చనిపోతూ జపించిన 22వ కీర్తన కూడ.

"లోకంలోని జాతులన్నీ ప్రభుని జ్ఞప్తికి తెచ్చుకొని
అతని వద్దకు మరలివస్తాయి
సకల జాతులు అతన్ని పూజిస్తాయి"

అని చెప్తుంది - 22,27.

క్రీస్తు చనిపోయినపుడు పుణ్యస్త్రీలు కూడ కల్వరిమీద ఉన్నారు. వాళ్లు కొంచెం దూరంగా నిల్చుండి క్రీస్తు మరణాన్ని తిలకించారు. ఇక్కడ వీళ్లు క్రీస్తు మరణానికి సాక్షులుగా నిలబడ్డారు అనుకోవాలి - 27,55. ఆ ప్రభువు చనిపోయినపుడు యోహాను తప్ప మిగతా శిష్యులెవరూ దగ్గరలేరు. వాళ్లంతా భయపడి పారిపోయారు. మగవాళ్లు అలా పారిపోతే ఈ స్త్రీలు మాత్రం ధైర్యంతో భక్తిభావంతో ప్రభువుకి అంటిపెట్టుకొని వుండిపోయారు. వాళ్ళ విశ్వాసం మనకు గూడ అలవడితే ఎంత బాగుంటుంది!

## 7. భూస్థాపనం, కాపలా

క్రీస్తు శుక్రవారం సాయంత్రం మూడుగంటల వేళ చనిపోయాడు. అదే రోజు సాయంత్రం అరుగంటల నుండి విశ్రాంతి దినమైన శనివారం ప్రారంభమౌతుంది. యూదులు శనివారం ఏపనీ చేయరు. కనుక ప్రభువు శవాన్ని త్వరగా భూస్థాపనం చేయాలి. పైగా ధర్మశాస్త్రం ప్రకారం, కోరతవేసిన ద్రోహుల్ని ఆరోజు పగలే పాతిపెట్టాలి. 'ఉరితీసిన శవాన్ని రేయి చెట్టు మీద ఉండనీయరాదు. ఆ దినమే పాతిపెట్టాలి" - ద్వితీ 21,22.

### యోసేపు - 27,57-61

కనుక క్రీస్తుని అన్ని విధాల త్వరగా పూడ్చిపెట్టాలి. కాని యెక్కడ? క్రీస్తు బంధువులు శిష్యులు అంతా గలిలయ నివాసులు. వాళ్ళకు యెరూషలేములో స్థలమేమీ లేదు. కనుక క్రీస్తుని ఎక్కడ పాతిపెట్టాలన్న సమస్య ఎదురైంది. అప్పుడు అరిమతయియ యోసేపు ముందుకివచ్చి క్రీస్తు భూస్థాపన బాధ్యతను చేపట్టాడు - 27,57.

ఈ యోసేపు ఉదంతం సువార్తలో ఇక్కడ మాత్రమే వస్తుంది. అతడు దిడీలున వచ్చి క్రీస్తుని పూడ్చిపెట్టి మళ్లా దిడీలున తెరమరుగైపోయాడు.

ఈ యోసేపు క్రీస్తు "శిష్యుడు". మత్తయి సువిశేషంలో శిష్యుడు అంటే కేవలం మాటలు మాత్రమే చెప్పక సత్క్రియలు చేసి చూపించేవాడు. ఇక్కడ యోసేపు చేసిన

సత్క్రియ క్రీస్తుని సమాధి చేయడమే. ఇంకా, యితడు "ధనికుడు". మత్తయి సువిశేషం ప్రచారంలోకి వచ్చిన క్రైస్తవ సమాజంలో చాలమంది ధనికులు కూడ వుండేవాళ్లు. మత్తయి గ్రంథంలో ధనాన్ని గూర్చి చాల అవలోకనాలు కన్పిస్తాయి.

యోసేపు ధైర్యంలో పిలాతు వద్దకు వెళ్ళి క్రీస్తు దేహాన్ని ఇప్పించమని అడిగాడు. పిలాతు ఆజ్ఞ ప్రకారమే రోమీయులు క్రీస్తుని సిలువ వేసారు. కనుక శవాన్ని ఇప్పించమంటే- అతనికి కోపం రావచ్చు. పైగా యూదనాయకులు క్రీస్తుకి శత్రువులు. అలాంటివాని శవాన్ని తీసికొని పాతిపెట్టడం ప్రమాదకరం. ఐనా యోసేపు సాహసంతో ఖనన క్రియకు పూనుకొన్నాడు. సైనికులు సిలువ మీది నుండి మృతదేహాన్ని దింపి అతనికిచ్చారు. అతడు దాన్ని శుభ్రమైన నారబట్టలో చుట్టాడు. తన కొరకు తొలిపించుకొన్న క్రొత్త సమాధిలో పాతిపెట్టాడు. ఈ క్రియలన్నీ అతని ఆర్థిక స్తోమతకు తగినట్లుగా ఉదాత్తంగానే వున్నాయి. అన్నిటికంటే ముఖ్యంగా అతడు భక్తుడు. భక్తిభావంతోనే ప్రభువు మృతదేహానికి సేవలు చేసాడు. ఎప్పుడు కూడ మన మంచితనాన్నీ భక్తినీ క్రియాపూర్వకంగా చూపాలి.

యోసేపూ తోడిభక్తులూ కలసి సమాధి ద్వారానికి అడ్డంగా రాతిబండను దొర్లించి వెడలిపోయారు. ఇద్దరు స్త్రీలు సమాధికెదురుగా జాగరణం చేస్తూ కూర్చున్నారు - 27,61. మృతుల కొరకు విలపించడం యూదుల సంప్రదాయం. కనుక ఇక్కడ వీళ్లు చనిపోయిన క్రీస్తు కొరకు ఏడుస్తూ కూర్చున్నారు అనుకోవాలి.

## సమాధికి కావలి - 27,62-65

శత్రువులు క్రీస్తు సమాధికి కావలివారిని నియమించారు అనే సంఘటనం మత్తయి సువిశేషంలో మాత్రమే వస్తుంది - 27,62-65. ఈ గ్రంథం ప్రచారంలోకి వచ్చిన రోజుల్లో యూదులు క్రైస్తవులకు బద్ధశత్రువులుగా వుండేవాళ్లు. వాళ్లు శిష్యులే మీ క్రీస్తు శవాన్ని సమాధినుండి ఎత్తుకొనిపోయారని దుష్ప్రచారం చేస్తుండేవాళ్లు. ఈ నీలివార్తలను ఖండించడానికే మత్తయి ఈ సంఘటనను తన గ్రంథంలో చేర్చాడు.

యోసేపు భక్తి భావంతో క్రీస్తు మృతదేహాన్ని రాతి సమాధిలో పాతిపెట్టించాడు. కాని యూదనాయకులు కుట్రబుద్ధితో క్రీస్తుదేహాన్ని సమాధిలో బంధించి వుంచాలను కొన్నారు. నరుల హృదయాలోచనలు ఎంత భిన్నంగా వుంటాయి!

శనివారం విశ్రాంతి దినమైనా యూదనాయకులు పిలాతు దగ్గరికి వెళ్లారు. ఇది విశ్రాంతి దినాన్ని గూర్చిన ఆజ్ఞలను మీరడమే. క్రీస్తు విశ్రాంతిదిన నియమాలను పాటించలేదని యూదులు అతని మీద తప్పు మోపారు. ఇప్పుడు వాళ్లుకూడ అదే తప్పు చేసారు. క్రీస్తు చనిపోయిన పిదపకూడ అతని పేరును అణచివేయాలని వాళ్లు ఎన్ని పాట్లు పడ్డారు!

ఆ నాయకులు సమాధికి సైనికులను కాపలా వుంచమని పిలాతుని వేడుకొన్నారు. దానికి ముద్రవేసి కట్టుదిట్టం చేయమని అడిగారు. లేకపోతే క్రీస్తు శిష్యులు వచ్చి గురువు శరీరాన్ని ఎత్తుకొనిపోయి అతడు జీవంతో లేచాడని పుకార్లు పుట్టిస్తారని చెప్పుకొన్నారు. క్రీస్తు జీవితకాలమంతా తాను మెస్సీయానని చెప్పి ప్రజలను మోసగించాడు. ఇప్పుడు ఈ ఉత్థాన మోసం ఆ మొదటి మోసం కంటే ఇంకా గొప్పదౌతుందని విన్నవించుకొన్నారు.

కాని పిలాతు వారితో కటువుగా మాట్లాడాడు. వాళ్ళ అసూయతో క్రీస్తుని పట్టియిచ్చారని అతనికి బాగా తెలుసు - 27,18. కనుక అతడు వారితో మీకు రోమను సైనికులెందుకు? మీ దేవాలయ భటులు ఉన్నారు కదా! వారితో ఆ సమాధికి కాపలా కాయించుకోండి అని చెప్పాడు. వాళ్ళ అలాగే దేవాలయ భటులను పంపి సమాధికి కాపలాపెట్టించారు. సమాధిపై ముద్రవేసి దాన్ని కట్టుదిట్టం చేయించారు. దానియేలు కథలో కూడ ఈ ముద్ర సంఘటనం వస్తుంది. దానియేలుని పడవేసిన సింహాలగుంట కన్నాన్ని బండతో పూడ్చి ఆ బండపై రాజముద్ర వేసారు - దాని 6,17.

ప్రభువు జీవితకాలంలోలాగే మరణానంతరం గూడ అతన్ని పురస్కరించుకొని ప్రజలు రెండు వర్గాలుగా చీలిపోయారు. ఓవైపు అరితమయియ యోసేపు, పుణ్యస్త్రీలు, యోహాను మొదలైనవాళ్ళు అతని మిత్రులు. మరోవైపు ప్రధానార్చకులు, పరిసయులు మొదలైన యూదనాయకులు అతని శత్రువులు.

యూదనాయకులు ప్రభువు జీవితకాలంలో కంటే అతడు చనిపోయిన తర్వాత అతనికెక్కువగా భయపడ్డారు. వాళ్ళ క్రీస్తుని సమాధిలో బంధించి వుంచుదామనుకొన్నారు. కాని వుత్థాన క్రీస్తుని సమాధిలో కట్టివుంచడం ఎవరితరం? దేవుడే క్రీస్తుకి ఉత్థానాన్ని దయచేసాడు. దానిద్వారా తన కుమారుడైన మెస్సీయా నీతిమంతుడని రుజువు చేసాడు. దేవుడు సంకల్పించుకున్న కార్యానికి ఎవరు అడ్డురాగలరు? ప్రభువు ఆదివారం వేకువజామున బంధాలన్నీ త్రెంచుకొని, సమాధిని బ్రద్దలు చేసికొని ఉత్థానమయ్యాడు. ఆ ఉత్థాన ప్రభువే నేడు మనకు జీవమిచ్చేది.

# 8. యోహాను వర్ణించిన క్రీస్తు శ్రమలు

## 1. పిలాతు తీర్పు - 18,28-19,16

యోహాను సువిశేషం పిలాతు తీర్పుని సవిస్తరంగా వర్ణిస్తుంది. ఈ తీర్పులో క్రీస్తు రాజు అనే భావం స్పష్టంగా కన్పిస్తుంది. ఈ తీర్పుని ఏడు భాగాలుగా విభజింపవచ్చు:

## 1. క్రీస్తుని పిలాతుకి అప్పగించడం - 18,28-32

యూద నాయకులు ఉదయాన్నే ప్రభువుని కయిఫా యింటి నుండి పిలాతు మందిరానికి తీసికొని వచ్చారు. యూదులు పిలాతు మందిరంలోనికి వెళ్ళడానికి ఇష్టపడలేదు. వాళ్లు అన్యజాతీవాళ్ళ దగ్గరికి వెళ్తే అంటుపడతామనీ పాస్కవిందును యోగ్యంగా భుజించలేమనీ భావించారు. కాని పాస్క గొర్రెపిల్లయైన క్రీస్తుని అన్యాయంగా చంపడానికి మాత్రం ఏమీ సంకోచించలేదు.

కనుక పిలాతు మందిరం నుండే బయటికి వచ్చి బయటనే యూదనాయకులను కలసికొన్నాడు. కావున ఈ సంఘటనం మందిరం వెలుపల జరిగింది.

పిలాతుకీ యూదులకు మధ్య జరిగిన సంభాషణ ఒకరిమీద ఒకరు తప్పులు పడుతూ విరుచుకొని పడినట్లుగా వుంటుంది. ఇతని నేరమేమిటి అని పిలాతు ప్రశ్న. ఏ నేరం లేకపోతే ఇతన్ని నీ దగ్గరికి ఎందుకు తీసుకొనివస్తాం అని యూదుల జవాబు. మీ చట్ట ప్రకారం మీరే ఇతనికి తీర్పు చెప్పండి అని పిలాతు ఆజ్ఞ. ద్రోహికి మరణశిక్ష విధించే అధికారం మాకు లేదు నీకే వుంది అని యూదుల ప్రత్యుత్తరం.

నేరం చేసినవాళ్ళకు యూదుల శిక్ష రాళ్ళతో కొట్టిగ చంపడం, రోమనుల శిక్ష సిలువ మరణం. కనుక రోమనుల చట్టప్రకారం ఇతన్ని సిలువవేయించమని పిలాతుని కోరారు యూదులు. ప్రభువు విరోధులు తనకు సిలువ మరణం విధిస్తారని ముందుగానే చెప్పాడు - 12,32. ప్రభువు శ్రమల్లోని సంఘటనలన్నీ అతడు ముందుగా చెప్పినట్లే నెరవేరాయి.

## 2. పిలాతు క్రీస్తుని ప్రశ్నించడం - 17,33-38

ఈ సంఘటనం పిలాతు మందిరం లోపల జరిగింది. పిలాతు తన మందిరంలోపల క్రీస్తుతో ఏకాంతంగా మాటలాడాడు. క్రీస్తు మీద వచ్చిన పెద్ద నేరం అతడు రాజునని చెప్పుకోవడం. యూదుల్లో ఒకడు రాజైతే పాలస్తీనా దేశం రోమను సామ్రాజ్యం మీద తిరగబడుతుంది. అప్పుడు పెద్ద ముప్పు వస్తుంది. కనుక పిలాతు క్రీస్తుని నీవు రాజువా అని ప్రశ్నించాడు.

క్రీస్తు నేను రాజునే. కాని ఈ లోకసంబంధమైన రాజుని కాదు. నా రాజ్యం పరలోకానికి చెందింది అని చెప్పాడు. ఈ లోకపు రాజులు దురాశ, అధర్మం, హింస, కుట్ర, మొదలైనవాటికి పాల్పడతారు. పరలోకరాజ్యం ధర్మం, సత్యం, శాంతి, ప్రేమ మొదలైన విలువలకు నిలయం. క్రీస్తు ఆధ్యాత్మిక విలువల కొరకు వచ్చాడు కాని లౌకిక విలువల కొరకు రాలేదు.

ఇంకా, నీవేమి చేసావు అని పిలాతు క్రీస్తుని అడిగాడు. ప్రభువు దుష్టకార్యాలేమీ చేయలేదు. అతడు చేసిన వన్నీ మంచిపనులే.

పిలాతు నీవు రాజువా అని రెండవ పర్యాయం అడిగాడు. క్రీస్తు నీవు అన్నట్లు నేను రాజునే. కాని నా రాజ్యం ఈ లోక సంబంధమైంది కాదు. నేను ఇహలోక రాజుని కాదు. సత్యానికి సాక్ష్యమీయడానికి వచ్చిన రాజుని అని చెప్పాడు. ఇక్కడ "సత్యం" అంటే తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళికను నెరవేర్చడం. అనగా సిలువమరణం ద్వారా నరుల పాపాలకు పరిహారం చేయడం. అసలు క్రీస్తే రక్షణమూ సత్యమూ కూడ.

క్రీస్తు వెలుగు. యూదనాయకులు చీకటిలో వుండేవాళ్లు. కనుక వాళ్లు క్రీస్తుని నిరాకరించి చంపగోరారు.

క్రీస్తు నేను సత్యానికి సాక్ష్యమీయడానికి వచ్చానని చెప్పగానే పిలాతు సత్యమంటే యేమిటి అని అడిగాడు. కాని అతడు నిరాదరణ భావంతో ఈ ప్రశ్న అడిగాడు. సత్యమంటే యేమిటో తెలిసికోవాలన్న కోరిక అతనికి లేదు. అసలు ఆధ్యాత్మిక విషయాల మీద అతనికి ప్రీతి లేదు.

ప్రభువు నేను సత్యానికి సాక్ష్యమిచ్చేవాణ్ణి. సత్య సంబంధులు నా మాట వింటారు అన్నాడు. కనుక ఇప్పుడు ప్రశ్న క్రీస్తు దోషా లేక నిర్దోషా అన్నది కాదు. పిలాతు సత్యాన్ని అంగీకరిస్తాడా లేదా అన్నది ప్రశ్న. ఇక్కడ పిలాతు క్రీస్తుకి తీర్పు తీరుస్తున్నాడు. కాని యథార్థంగా జరిగిందేమిటంటే, క్రీస్తే పిలాతుకి తీర్పు తీరుస్తున్నాడు. నీవు సత్యాన్ని అంగీకరిస్తున్నావా లేక నిరాకరిస్తున్నావా అని అడుగుతున్నాడు. పిలాతు మళ్ళీ వెలుపలకివచ్చి జనంతో మాట్లాడాడు.

## 3. పిలాతు క్రీస్తు నిర్దోషి అని చెప్పడం - 18,38-40

ఈ సంఘటనం భవనానికి వెలుపల జరిగింది. పిలాతు క్రీస్తుని ప్రశ్నించినపుడు అతనిలో ఏ దోషం కన్పించలేదు. కనుక అతడు క్రీస్తు నిర్దోషి అని ప్రజలందరి యెదుట ప్రకటించాడు. ఇక్కడ అన్యజాతి వాడొకడు క్రీస్తు నిర్దోషి అని ప్రకటిస్తుంటే స్వజాతి వాళ్లు అతని దోషి అని చెప్పడం విడ్డూరం.

పిలాతుకి ఓ ఆలోచన తట్టింది. పాస్కపండుగ సందర్భాన రాష్ట్ర పాలకుడు యూదులకు ఓ బందీని విడుదల చేయడం అలవాటు. ఈ నెపంతో నైనా క్రీస్తుని విడిపించవచ్చు కదా అనుకొన్నాడు పిలాతు. కాని యూదులు బరబ్బాను విడిపించి యేసుని సిలువ వేయమని అరిచారు. ఈ బరబ్బ బందిపోటు దొంగ. బహుశః రోమీయుల మీద విప్లవం లేవదీసేవాడు కూడా. క్రీస్తు నిర్దోషి, నీతిమంతుడు. ఐనా దుష్టులైన ప్రజలు

దుష్టుణ్ణి ఎన్నుకొని నీతిమంతుణ్ణి నిరాకరించారు. లోకంపోకడ ఈలా వుంటుంది. బరబ్బను గూర్చిన వివరాలేవీ మనకు తెలియవు. బరబ్బకు రావలసిన శిక్ష క్రీస్తుకి వచ్చింది. అతని కోసం ఇతడు సిలువ మీద చనిపోవలసి వచ్చింది.

## 4. క్రీస్తుని కొరడాలతో కొట్టి గేలిచేయడం - 19,1-3

ఈ కార్యం భవనం లోపల జరిగింది. పిలాతు క్రీస్తుని కొరడాలతో కొట్టించాడు. కొరడా దెబ్బలకు గురైన క్రీస్తుని చూచినప్పుడు యూదులకు జాలీ సానుభూతీ కలుగుతాయి. ఆపిమ్మట అతన్ని విడుదల చేయవచ్చు అనుకొన్నాడు పిలాతు. కాని అలా యేమీ జరుగలేదు. క్రీస్తు తాను రాజునని చెప్పుకొన్నందున సైనికులు ఇక్కడ క్రీస్తుని ఎగతాళి చేసారు. ఆ ప్రభువుకి ముళ్ళకిరీటం పెట్టడం, ఊదావస్త్రం తొడగడం, అతనికి నమస్కారం చేయడం ఇవన్నీ క్రీస్తు రాచరికాన్ని ఎగతాళి చేయడానికే. ఈ దుష్టులు ప్రభువు రాజత్వాన్ని అంగీకరించక పోయినా అతడు మాత్రం నిజమైన రాజే. క్రీస్తు ఉత్థానానంతరం అన్యజాతి ప్రజలు అతనికి శిష్యులై అతన్ని రాజునిగా అంగీకరిస్తారు.

## 5. పిలాతు క్రీస్తుని ప్రజలకు చూపించడం - 19,4-8

ఈ సంఘటనం భవనం వెలుపల జరిగింది. పిలాతు రెండవసారి క్రీస్తు నిర్దోషి అని ప్రకటించాడు. క్రీస్తుని వెలుపలికి తీసుకొనివచ్చి ప్రజలకు చూపించాడు. ప్రభువు ముళ్ళకిరీటం ధరించి ఊదా రంగు అంగీ తొడుగుకొని రక్తసిక్తమైన దేహంతో ప్రజల యెదుట నిలబడ్డాడు. అతన్ని చూచి ప్రజలు జాలిచెందుతారు అనుకొన్నాడు పిలాతు.

అతడు క్రీస్తుని ప్రజలకు చూపుతూ "ఇదిగో ఈ నరుడు" అని పల్కాడు. ఇక్కడ "ఈ నరుడు" అన్నమాట ముఖ్యం. ఈ మాటను వాడ్డంలో పిలాతు భావం ఇది. కొరడాలతో కొట్టబడిన ఈ జనుడు దీనుడు, దుర్బలుడు. ఇతడు రాజకీయ నాయకుడు కాదు. ఇతని వల్ల రోమను సామ్రాజ్యానికి ఏ ముప్పూ వాటిల్లదు. కనుక ఇతన్ని వదలివేయడం న్యాయం.

"ఇదిగో ఈ నరుడు" అన్న పిలాతు మాటలు శతాబ్దాల పొడుగున ఎందరో భక్తులకు ప్రేరణం పుట్టించాయి. కొరడా దెబ్బలకు దేహం నజ్జునజ్జు కాగా వేదనాభరితుడై యున్న ప్రభువుని ఎందరో నరులు భక్తి భావంతో ధ్యానం చేసికొన్నారు. ఎందరో చిత్రకారులు ఈ ఘట్టాన్ని చిత్రాలుగా గీసారు.

కాని పిలాతు భావం వేరు యూదుల భావాలు వేరు. వాళ్ళు ఈ క్రీస్తు తాను దేవుని కుమారుణ్ణని చెప్పుకొంటూన్నాడు. అది దేవదూషణం. కనుక ఇతన్ని సిలువ వేయాలని బిగ్గరగా అరిచారు. దేవదూషణకు శిక్ష మరణం. లేవీ 24,15-16. ఇక్కడ యూదులు మోపిన నేరం రాజకీయమైంది కాదు, మతపరమైంది.

యూదుల అరపులకు పిలాతు మరీ అదనంగా భయపడ్డాడు. ఈ ప్రజలు రోములోని కైజరు చక్రవర్తికి తన మీద ఫిర్యాదు చేయవచ్చు. అప్పుడు తన ఉద్యోగం ఊడిపోతుంది. కనుక అతడు క్రీస్తుని వదలిపెట్టడానికి వెనుదీసాడు.

## 6. నీవు ఎక్కడినుండి వచ్చావు? - 19,9-12

ఈ సంఘటనం మందిరం లోపల జరిగింది. పిలాతు క్రీస్తుని నీవెక్కడనుండి వచ్చావు అని ప్రశ్నించాడు. క్రీస్తు తాను మనుష్యకుమారుణ్ణనీ దేవుని కుమారుణ్ణనీ చెప్పుకొన్నాడు గదా! ఇతడు తాను చెప్పినట్లుగా దేవుని కుమారుడేనేమో అని పిలాతుకి భయం వేసింది. పిలాతు ప్రశ్నకు జవాబు చెప్పకుండా క్రీస్తు మౌనంగా ఉండిపోయాడు.

క్రీస్తు మౌనం వహించిన సందర్భాలు చాలా ఉన్నాయి. అతడు ప్రధాన యాజకుని ముందు మౌనంగా ఉండిపోయాడు - మత్త 26,63. హేరోదు ఎదుట మాటలాడలేదు - లూకా 23,9. యూదనాయకులు పిలాతు నెదుట తన మీద నేరాలు మోపినపుడు ఏమీ సమాధానం చెప్పలేదు - మత్త 27,14. పిలాతు నీవు ఎక్కడినుండి వచ్చావు అని అడిగినపుడు ఏమీ జవాబు చెప్పలేదు - యోహా 19,9. దుష్టులైన అధికారులు తన్ను ప్రశ్నించినపుడు ప్రభువు మామూలుగా మౌనంగా వహిస్తాడు. కాని ప్రభువు ఎవరిపట్ల మౌనంగా ఉండిపోతాడో అతనికి అనర్థం. అతడు మన సమస్యలకూ సందేహాలకూ బాధలకూ జవాబు చెప్పకపోతే ఇక మనలను ఓదార్చే నాథుడెవరు?

క్రీస్తు మౌనం వహించడం చూచి పిలాతు నీవు నాతో మాటలాడవా? నీ ప్రాణం మీదా మరణం మీదా కూడ నాకు అధికారముందని నీకు తెలియదా అన్నాడు. కాని క్రీస్తు నీకు నా పైన ఉన్న అధికారం పరలోకంలోని తండ్రివద్ద నుండి వచ్చింది సుమా అన్నాడు. తండ్రే క్రీస్తుని ఈ లోకంలోకి పంపాడు. అతనికి రక్షణ ప్రణాళికను ఒప్పజెప్పాడు. క్రీస్తు సిలువ మరణం ద్వారా ఆ ప్రణాళికను నెరవేర్చబోతున్నాడు. కనుక అధికారం తండ్రిదే. తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళిక వల్లనే క్రీస్తు పిలాతు చేతుల్లోకి వచ్చాడు. తండ్రే పిలాతు ద్వారా తన రక్షణ ప్రణాళికను నెరవేర్చుకొని పోతున్నాడు. క్రీస్తు మరణం యాదృచ్ఛికమైంది కాదు. తండ్రి ముందుగానే నిర్ణయించింది.

క్రీస్తుని పిలాతుకి అప్పగించినవాడు ఇంకా ఎక్కువ పాపము మూట గట్టుకొంటాడు. క్రీస్తుని అప్పగించింది ఒక యూదాయే కాదు, యూద నాయకులంతా కూడ. పిలాతుకి తెలియక క్రీస్తుకి మరణశిక్ష విధించి వుండవచ్చు. కాని యూదనాయకులు తెలిసే, బుద్ధిపూర్వకంగానే ప్రభువుని మరణానికి అప్పగించారు.

పిలాతు క్రీస్తుని విడిపిద్దామా వద్దా అని జంకుతూన్నాడు. "ఇతన్ని విడిచి పెట్టావంటే నీవు రోములోని చక్రవర్తికి స్నేహితుడివికావు" అని యూదులు అతన్ని బెదిరించారు. యూద నాయకులు తన మీద చక్రవర్తికి ఫిర్యాదు చేస్తే తన ఉద్యోగమే ఊడవచ్చు. కనుక పిలాతు మరి యెక్కువగా భయపడ్డాడు.

## 7. పిలాతు క్రీస్తుకి సిలువ మరణాన్ని విధించడం - 19,13-16

ఈ సంఘటనం మందిరం వెలుపల జరిగింది. పిలాతు మీద యూద నాయకుల వత్తిడి ఎక్కువైంది. అతడు తన ఉద్యోగం నిల్పుకోవడం కొరకు క్రీస్తుకి మరణశిక్ష విధించాలనుకొన్నాడు. కనుక తుదితీర్పు చెప్పడానికి న్యాయపీఠం మీద కూర్చున్నాడు. దానికి గబ్బతా అని పేరు. అప్పుడు మధ్యాహ్నం పండ్రెండు గంటల సమయం. ఆ సమయంలోనే యెరూషలేము దేవాలయంలో పాస్క గొర్రె పిల్లలను వధించడం మొదలుపెడతారు. ఆ సమయంలోనే మన పాస్క గొర్రెపిల్లయైన క్రీస్తుకి కూడ మరణశిక్ష విధిస్తారు. అసలు నిజమైన పాస్క గొర్రెపిల్ల అతడే.

పిలాతు రెండవసారి క్రీస్తుని ప్రజలు యెదుటికి తీసుకొని వచ్చాడు. మొదటిసారి కొరడాలతో కొట్టించి దీనుడుగా వున్న క్రీస్తుని ప్రజలకు చూపించాడు. ఇప్పుడు క్రీస్తుని రాజునిగా ప్రజలకు చూపిస్తున్నాడు. యూదులు క్రీస్తుని రాజునిగా అంగీకరించరని పిలాతుకు తెలుసు. ఐనా అతడు యూదులను గేలిచేస్తూ ఇదిగో మీ రాజు అని ప్రభువుని చూపించాడు. ఈ క్రీస్తులాంటి దుర్బలుడు మీ రాజు అని తెలియజేసి యూదులను అవమానపరచాలని అతని ఉద్దేశం.

కట్టకడన పిలాతు మీ రాజును సిలువ వేయమంటారా అని యూదులను అడిగాడు. వాళ్ళు దుష్టబుద్ధితో మాకు కైజరు తప్ప మరొక రాజు లేడు అని అరిచారు. ఈజిప్టు నిర్గమనకాలం నుండి యూదులకు యావే ప్రభువే రాజు. అన్యజాతి రాజులు ఎంతమంది, ఎన్నియేండ్లు, తమ్ము ఏలినా యూదులు మాత్రం యావే ప్రభువే మాకు రాజు అని చెప్పుకొనేవాళ్లు. ఆ ప్రభువు తన ప్రతినిధియైన మెస్సీయా రాజుని పంపుతాడనీ అతడు యిస్రాయేలీయుల తరపున యుద్ధాలు చేస్తాడనీ నమ్మారు. ఆ సంప్రదాయాన్ని గాలికి వదలి ఇప్పుడు రోమను చక్రవర్తి టిబేరియస్‌ను రాజుగా ఎన్నుకొన్నారు. మెస్సీయ రాజును తిరస్కరించారు. దీనితో దేవుడు పూర్వం సీనాయి కొండదగ్గర తమతో చేసికొన్న నిబంధనాన్ని కూడ తిరస్కరించారు. ఇంత ద్రోహం మరొకటిలేదు.

పిలాతు యూద నాయకుల వత్తిడికి లొంగిపోయి క్రీస్తుని వారికి అప్పగించాడు. కైజరే మా రాజు అన్న యూదనాయకులు కైజరు పనిని నిర్వహించడానికి, అనగా క్రీస్తుని సిలువ వేయడానికి, తీసికొనిపోయారు.

ఇక్కడ పిలాతు క్రీస్తు పట్ల మెలగిన తీరును సంగ్రహంగా పరిశీలించి చూడ్డం మంచిది. 1. మొదట, అతనికి క్రీస్తు విషయంలో జోక్యం కలిగించుకోవడం ఇష్టం లేదు. కనుక యూద నాయకులతో మీరు ఇతన్ని తీసికొని వెళ్ళి మీ చట్ట ప్రకారం విచారించండి అన్నాడు - యోహా 18,31. పిలాతుకి క్రీస్తుని కలసికోవడం ఇష్టం లేదు. కాని ప్రతి నరుడు వ్యక్తిగతంగా ప్రభువుని కలసికోవాలి. మన తరపున మరొకరు అతన్ని కలసికోలేరు.

2. పిలాతుకి క్రీస్తు నిర్దోషి అని తెలుసు. అతన్ని విడిచిపెట్టాలనే కోరిక కూడ ఉంది. కాని యూద నాయకులకు దడిసాడు. కనుక పాస్క పండుగ నాడు ఒక ద్రోహిని వదలిపెట్టవచ్చు అనే అవకాశాన్ని వినియోగించుకొని ప్రభువుని విడిపిద్దాం అని పన్నాగం వేసికొన్నాడు. కాని యీ పన్నాగం బెడిసికొట్టింది - 18,39. క్రీస్తుని అంగీరించాలా లేక నిరాకరించాలా అనే సమస్య మనందరి జీవితంలోను ఎదురౌతుంది. లోక ప్రయోజనాలకు ఆశపడి ప్రభువుని విడనాడనివాడు ధన్యుడు.

3. పిలాతు క్రీస్తుని కొరడాలతో కొట్టించాడు. కొరడాదెబ్బలు తిన్న క్రీస్తుని చూచినపుడు యూదులకు జాలి కలుగుతుంది. అప్పుడు తాను ప్రభువుని విడిపించవచ్చు గదా అనుకొన్నాడు. కొరడా శిక్ష ద్వారా సిలువ శిక్షను తొలగించవచ్చు అనుకొన్నాడు - 19,1. కాని యూదులు అతని చర్యను అంగీకరించలేదు. ఏ నరుడూ ఇద్దరు యజమానులను సేవించలేడు. ప్రభువునీ ఈ లోకాన్నీ రెండిటినీ సేవించలేడు. ఎన్నుకొంటే ప్రభువుని పూర్ణహృదయంతోనే ఎన్నుకోవాలి. లేకపోతే వదలివేయాలి.

4. పిలాతు ప్రభువుని నిజంగానే వదలిపెట్ట గోరాడు. ఐనా యూదులకు దడిసాడు. వాళ్లు "ఇతన్ని విడిచిపెడితే నీవు చక్రవర్తికి స్నేహితుడవు కావు. నేను రాజునని చెప్పుకొనేవాడు చక్రవర్తికి విరోధి కదా" అన్నారు - 19,12. యూదులు తన మీద ఎక్కడ ఫిర్యాదు చేస్తారో, తన ఉద్యోగం ఎక్కడ ఊడుతుందో అని పిలాతు జంకాడు. ఉద్యోగం పోతుందన్న భయంతోనే అతడు క్రీస్తుకి మరణశిక్ష విధించాడు. కాని క్రీస్తుకు బదులుగా మరొకదాన్ని ఎన్నుకొనేవాడు ప్రభువు భక్తుడే కాడు.

పిలాతు తీర్పు చెప్పేంతసేపు క్రీస్తు నిబ్బరంగా ఉండిపోయాడు. అసలు తానే న్యాయాధిపతి, పిలాతు దోషి అన్నట్లుగా ప్రవర్తించాడు ప్రభువు. క్రీస్తు సిలువ మీద శ్రమలు అనుభవించేపుడు కూడ తానే బుద్ధిపూర్వకంగా సిలువను ఎన్నుకొన్నట్లుగా కన్పిస్తుంది. ఇతరులు అతన్ని సిలువ వేసినట్లుగా కన్పించదు. సిలువ మరణం తండ్రి రక్షణ ప్రణాళికలో ఓ భాగం కదా!

# 2. సిలువ మరణం - 19,17-37

యోహాను వర్ణించిన క్రీస్తు శ్రమల ఘట్టంలో ఐదు ముఖ్యాంశాలు ఉన్నాయి. ఈ యంశాలు చాల వరకు యోహాను సువిశేషంలో మాత్రమే కన్పిస్తాయి. కనుక వీటిని శ్రద్ధతో పరిశీలిద్దాం.

## 1. పిలాతు వ్రాయించిన శాసనం - 19,17-22

యూద నాయకుల వత్తిడికి లొంగి పిలాతు క్రీస్తుకి మరణశిక్ష విధించాడు. సిలువ వేసే ద్రోహిని నల్గురు రోమను సైనికుల మధ్య వుంచి వధ్యస్థానానికి నడిపించుకొనిపోతారు. కనుక సైనికులు ప్రభువుని కూడ అలాగే తీసికొనిపోయి ఉండాలి.

క్రీస్తుని నగరం వెలుపల కొండపై సిలువ వేసారు. ఆ కొండకు గొల్గొతా లేక కపాలం అని పేరు. ఆ పేరు దానికెలా వచ్చింది? ఆ కొండ నరుని పుర్రె ఆకారంలో వుండవచ్చు. లేదా అక్కడ సిలువ వేసినవాళ్ళ పుర్రెలు చిందరవందరగా పడి ఉండవచ్చు. కనుక దాన్ని కపాలస్థలం అన్నారు.

క్రీస్తు తన సిలువను తానే మోసికొని పోయాడు-19,17. అనగా అతడు తన సిలువ మరణాన్ని తానే ఎన్నుకొన్నాడు. అతడు దిక్కులేనివాడై శత్రువులకు చిక్కి నిర్బంధంగా సిలువ మరణం అనుభవించలేదు. "ఎవడు నా ప్రాణాలను తీయలేడు. నాయంతట నేనే నా ప్రాణాన్ని ధారపోస్తాను. మళ్ళీ దాన్ని తీసికొంటాను" అని పలికాడు ప్రభువు. 10,18. కనుక అతడు సర్వతంత్ర స్వతంత్రుడు.

పూర్వం ఈసాకు దహనబలికి కావలసిన కట్టెల మోపును మోస్తూ కొండ యెక్కాడు. ఇక్కడ క్రీస్తు ఆ యీసాకుని తలపునకు తెస్తాడు. క్రీస్తుకి ఇరువైపుల ఇద్దరు దొంగలను కూడ సిలువ వేసారు. యోహాను దృష్టిలో క్రీస్తు రాజు. అతడు సిలువ సింహాసనమెక్కాడు. ఈ దొంగలు ఇద్దరు అతని పరివారం లాగ ఈ వైపున ఒకడు ఆ వైపున ఒకడు నిల్చివున్నారు.

మామూలుగా దోషి చేసిన అపరాధాన్ని ఒక రేకుపై వ్రాస్తారు. దాన్ని ఒక సైనికుడు చేతితో పట్టుకొని ఎల్లరికీ చూపిస్తూ ద్రోహికి ముందుగా నడుస్తాడు. తర్వాత దాన్ని సిలువ మీద అంటగొడతారు. ఇక్కడ క్రీస్తు విషయంలో పిలాతే స్వయంగా శాసనాన్ని వ్రాయించాడు. "నజరేయుడైన యేసు యూదుల రాజు" అని వ్రాయించాడు. కాని ఈ వాక్యం యూద నాయకులకు నచ్చలేదు. వాళ్ళు కైజరే మాకు రాజు అని అంతకుముందే నినాదాలు చేసారు - 19,15. ఇప్పుడు క్రీస్తుని తమ రాజునిగా ఒప్పుకోవడం అవమానకరమని యెంచారు. కనుక పిలాతు ఈ శాసన వాక్యాన్ని మార్చాలని వత్తిడి

చేసారు. తాను యూదుల రాజునని చెప్పుకొన్నాడు అని వ్రాయించమన్నారు. కాని పిలాతు వారి మాటలు వినలేదు. నేను వ్రాయించినదేదో వ్రాయించాను. ఇప్పుడు మీ మాటలు విని దాన్ని మార్పించను అన్నాడు. ఈ నాయకులు పూర్వం పిలాతుని నిర్బంధించి క్రీస్తుకి మరణశిక్ష విధింపజేసారు. కాని అతడు ఇప్పుడు మళ్లా వారి నిర్బంధానికి లొంగదలచుకోలేదు. ఇక్కడ విశేషమేమిటంటే అన్యజాతి వాడైన పిలాతు క్రీస్తుని రాజుగా అంగీకరిస్తున్నా స్వీయజాతివాళ్లు అలా అంగీకరించలేదు. వాళ్లు ద్రోహబుద్ధితో రోమను ప్రభువైన కైసరుని రాజునిగా ఎన్నుకొని క్రీస్తుని నిరాకరించారు. ఐనా ప్రభువు యూదులకూ విశ్వప్రపంచానికి గూడ రాజు. పిలాతు క్రీస్తు రాజని మూడుభాషల్లో వ్రాయించాడు. ఆనాడు ఆ మూడు భాషలు రోమను సామ్రాజ్యం లోని ప్రజలు వాడేవి. అనగా విశ్వప్రపంచం అతని రాజత్వాన్ని అంగీకరిస్తుందని భావం. యూదులు అంగీకరించకపోయినా నేడు మనం ప్రభువునికి రాజాధిరాజునుగా అంగీకరించాలి. అతనికి మ్రొక్కాలి. అతని నుండి రక్షణం పొందాలి. పిలాతు తాను చేసేదేమిటో గ్రహించకుండానే క్రీస్తు యూదుల రాజని వ్రాయించాడు. కాని మనం ప్రభువు రాజని గ్రహించి భక్తిభావంతో అతన్ని ఆరాధించాలి.

## 2. కుట్టులేని అంగీ - 19,23-24

సైనికులు క్రీస్తు వెలుపలి దుస్తులను పంచుకొన్నారు. అవినాల్గు - తలగుడ్డ, నడికట్టు, లోపలివస్త్రం, చెప్పులు. వీటిని నల్గురు తలా వొకటి చొప్పున తీసికొన్నారు. ఇక వెలుపలివస్త్రం మిగిలివుంది. అది కుట్టులేనిది. ఏకవస్త్రంగా నేయబడింది. నాల్గుముక్కలుగా చింపితే ఎందుకూ పనికిరాకుండా పోతుంది. కనుక దీనికోసం వాళ్లు చీట్లు వేసికొన్నారు. ఈ క్రియ ద్వారా పూర్వవేద ప్రవచనం నెరవేరింది. ఆ ప్రవచనం కీర్తన 22,18లో వస్తుంది.

"వాళ్లు నా బట్టలను తమలో తాము పంచుకొంటున్నారు
నా దుస్తుల కొరకు చీట్లు వేసికొంటున్నారు.

క్రీస్తు మరణమూ ఆ మరణ కాలంలోని సంఘటనలూ యాదృచ్ఛికంగా జరిగినవి కావు. తండ్రే వాటిని నిర్ణయించాడు. పూర్వవేద ప్రవక్తలు వాటిని గూర్చి ముందుగానే తెలియజేసారు. క్రీస్తుకి అంతా ముందే తెలుసు. అతడు బుద్ధిపూర్వకంగానే తన మరణాన్ని అంగీకరించాడు.

ఇక్కడ ఈ కుట్టులేని ఏకవస్త్రం లోతైన భావాలను కూడ సూచిస్తుంది. క్రీస్తులాగే యూదుల ప్రధాన యాజకులు కూడ కుట్టులేని ఏకవస్త్రాన్ని ధరించేవాళ్లు. కనుక ఇక్కడ

క్రీస్తు మన ప్రధాన యాజకుడు అనే భావం ధ్వనిస్తుంది. ఇంకా ఏకవస్త్రం ఐక్యతకు చిహ్నం. క్రీస్తు శిష్యుల్లో ఈ యేక వస్త్రంలో లాగే ఐక్యత వుండాలని భావం.

క్రీస్తు సిలువ మీద ఘోర వ్యధలు అనుభవిస్తుంటే క్రింద సైనికులు ఏమి పట్టనట్లుగా చీట్లు వేసికొంటున్నారు. ఈనాడు మనం మాత్రం లోకవిషయాల్లో మునిగిపోయి ప్రభువుని పట్టించుకోకుండా వుండిపోవడం లేదా? ఆ సైనికుల కంటె మనం ఏమి మెరుగు?

క్రీస్తు తండ్రి చిత్తానికి లొంగి సర్వస్వం, చివరికి కట్టుబట్టలను గూడ, వదులుకొన్నాడు. మనకు ప్రీతికరమైన వస్తువులను త్యాగం జేస్తేనే గాని ప్రభువుని సంపాదించుకోలేం.

సైనికులు ద్రోహబుద్ధితో క్రీస్తు వస్త్రాలు అపహరించారు. కాని సిలువ చెంత నిల్చి వున్న పుణ్యస్త్రీలు ప్రియశిష్యుడు అలాంటివాళ్లు కాదు. ఇక వాళ్ల చరిత్రను పరిశీలిద్దాం.

## 3. క్రీస్తు తల్లి, ప్రియశిష్యుడు - 19,25-27

తొలిమూడు సువిశేషాల్లో క్రీస్తు సిలువ మీద వ్రేలాడుతుండగా పుణ్యస్త్రీలు దూరంగా నిలబడి చూస్తుంటారు. క్రీస్తు చనిపోయిన తర్వాతనేగాని వాళ్లు క్రీస్తువైపు చూడరు. కాని యోహాను సువిశేషంలో పుణ్యస్త్రీలు క్రీస్తు సిలువకు దగ్గరగా సిలువ చెంతనే వుంటారు. క్రీస్తు చనిపోకముందే క్రీస్తువైపు చూస్తుంటారు.

క్రీస్తు చనిపోకముందు విధవ అనాథయైన తల్లిని ప్రియ శిష్యుడైన యోహాను అండదండల్లో వుంచాడు. మరియను యోహానుకి తల్లిగా అర్పించాడు. యోహానుని గూడ ఆమెకు కుమారునిగా సమర్పించాడు. ఇది సువిశేషం చదవగానే మనకు తట్టే భావం. కాని ఈ ఘట్టంలో ఇంకా యెంతో లోతైన భావాలు దాగి వున్నాయి.

సిలువ క్రింద నిలబడి వున్న మరియ తిరుసభకు గుర్తుగా వుంటుంది. మొదటి యేవను కూడ జ్ఞప్తికి తెస్తుంది. యోహాను క్రీస్తుని విశ్వసించే శిష్యులందరికీ గుర్తుగా వుంటాడు. క్రీస్తు బోధలను విశ్వసించిన మరియ క్రీస్తు మరణానంతరం ఆధ్యాత్మికంగా బిడ్డలను కంటుంది. ఈ బిడ్డలు క్రీస్తు శిష్యులే. యోహానూ అతనిచుట్టు ప్రోగైయున్న భక్త సమాజము మరియ ఆధ్యాత్మికంగా కన్నబిడ్డలే. యోహానులో శిష్యులమైన మనమందరం ఇమిడివున్నాం. కనుక ఆధ్యాత్మికంగా యోహానూ భక్తసమాజమూ మనమందరమూ కూడ మరియకు బిడ్డలమే. కనుక ఆ తల్లిపట్ల మనకు అపారమైన భక్తి వుండాలి. యోహానులాగే మనం కూడ క్రీస్తుకి నిజమైన సాక్షులంగా వుండాలి.

భౌతికంగా మరియ క్రీస్తుకి మాత్రమే తల్లి. కానీ ఆధ్యాత్మికంగా క్రీస్తుని విశ్వసించే వాళ్ళందరికీ తల్లి. అలాగే యోహాను వ్యక్తిగతంగా క్రీస్తుకి శిష్యుడు. కాని ఆధ్యాత్మికంగా శిష్యులమైన మనలందరిని తనలో ఇముడ్చుకొని క్రీస్తుకి ప్రియ శిష్యుడౌతాడు. క్రీస్తుకి ఆనాడు అతడు పల్కిన సాక్ష్యాన్నే నేడు మనమూ పల్కుతుండాలి. అనగా క్రీస్తుని భక్తితో విశ్వసిస్తుండాలి. అనగా క్రీస్తు స్థాపించిన తిరుసభా అతని శిష్యవర్గమూ లోకాంతం వరకు కొనసాగిపోతుండాలి.

కానావూరి అద్భుతంలోని మరియకూ ఇక్కడ సిలువ క్రింద నిలబడివున్న మరియకూ సంబంధం వుంది. కానావూరి వివాహంలో మరియ ద్రాక్షరసాన్ని సరఫరా చేయమని క్రీస్తుని అడిగింది. ఈ రసం రక్షణానికి చిహ్నంగా వుంటుంది. అక్కడ క్రీస్తు ఓ స్త్రీ నా గడియ ఇంకా రాలేదు అన్నాడు. ఆ గడియ అతని సిలువ మరణమే. క్రీస్తు సిలువ మీద వేలాడేప్పుడు ఆ గడియ వచ్చింది. కనుక అతడు సిలువ మీది నుండి మళ్ళీ "ఓ స్త్రీ ఇదిగో నీ కుమారుడు" అన్నాడు. ఇక్కడ "ఓస్త్రీ" అన్న మాట ముఖ్యం. ఇక్కడ ఈ పదం తొలి ఏవను సూచిస్తుంది. ప్రభువు అలా పల్కిన సమయంలోనే తన రక్షణాన్ని సమృద్ధిగా దయచేసాడు. ఆ రక్షణాన్ని పొంది రెండవ యేవ ఐన మరియ ఆధ్యాత్మికంగా క్రొత్త సంతానాన్ని కంటుంది. ఈ సంతానం యోహాను భక్తబృందమూ, మనమూ, ఇంకా భావికాలంలో క్రీస్తుని విశ్వసించే వాళ్ళంతా కూడ. కనుక ఈ ఘట్టంలో మరియ తిరుసభను, తొలి యేవనూ, కానావూరి మరియనూ సూచిస్తుంది. యోహాను తన్నూ తన చుట్టూ ప్రోగైన భక్త బృందాన్ని భావి కాలంలో రాబోయే శిష్యులనూ సూచిస్తాడు. ఈలాంటి లోతైన భావాలు ఎన్నో ఈ ఘట్టంలో ఇమిడి వున్నాయి.

## 4. క్రీస్తు మరణం - 19,28-30

సిలువ మీద వ్రేలాడే క్రీస్తు అంతా ముగిసిందని గ్రహించాడు. తల్లి మరియను రక్షణ కొరకు యోహానుకి అప్పగించాడు. యోహాను ఇంట భక్త బృందం ప్రోగవుతుంది. మరియ ఆ బృందంలో చేరుతుంది. క్రీస్తు తండ్రి తన కొప్పజెప్పిన పనులన్నీ చేసి ముగించాడు. తాను ఈ లోకాన్ని వీడి తండ్రి దగ్గరికి వెళ్ళవలసిన గడియ సమీపించింది. 13,1. మరణం ద్వారా అతడు తండ్రిని చేరుతాడు. కనుక అతడు సిలువ మరణానికి సిద్ధమయ్యాడు.

ఆ చివరి క్షణాల్లో అతడు "నాకు దాహమౌతుంది" అని పల్కాడు. సైనికులు సముద్రపు పాచిని పులిసిన ద్రాక్షరసంలో ముంచి హిస్సోపు మండమీద పెట్టి క్రీస్తుకి అందించారు. ప్రభువు ఆ రసాన్ని త్రాగాడు. తొలి మూడు సువిశేషాల్లో ప్రభువు ఈ

సమయంలో సిలువ మీద నుండి రసం త్రాగడు. నాల్గవ సువిశేషం మాత్రం త్రాగాడని చెప్తుంది. ఈలా త్రాగడం వల్ల కీర్తన 69,21 పేర్కొనే ప్రవచనం నెరవేరింది. అది యిది.

వాళ్లు నాకు భోజనానికి మారుగా విషాన్నిచ్చారు,
నేను దప్పికగొని వున్నపుడు
త్రాగడానికి సిరకా నిచ్చారు.

ఇక్కడ సువిశేషకారుడు క్రీస్తు దప్పిక గొన్నాడని చెప్పాడు. ప్రభువుకి భౌతికంగా దప్పిక వేసింది. నిజమే, కాని అతని దప్పిక కేవలం భౌతికమైంది మాత్రమే కాదు. ఆధ్యాత్మికమైంది కూడ. ప్రభువు దప్పికగొంది ప్రధానంగా తండ్రి నిర్ణయించినట్లుగా సిలువ మీద చనిపోవడానికే. అంతకుముందే అతడు పేత్రుతో "తండ్రి నాకిచ్చిన శ్రమల పాత్రను నేను పానం చేయవద్దా" అన్నాడు-18,11. ఈ పాత్ర సిలువ మరణమే. కనుక క్రీస్తు దప్పిక ప్రధానంగా సిలువ మరణానికే. తన్ను ప్రేమించినవాళ్ళ కొరకు ప్రాణాలను ధారపోయడానికే. తండ్రి దగ్గరికి తిరిగిపోవడానికే. అతడు ప్రధానంగా తండ్రి చిత్తాన్ని నెరవేర్చేవాడు.

ఈ ఘట్టంలో హిస్సోపు మండ ప్రస్తావనం వస్తుంది! పూర్వం యూదులు ఈజిప్టు నుండి బయలు దేరి రాకముందు హిస్సోపు మండతో పాస్క గొర్రెపిల్ల నెత్తుటిని తమ గోడలకు పూసికొన్నారు. దీనివల్ల వాళ్ళకు చావు తప్పింది - నిర్గ 12.22. ఇక్కడ హిస్సోపును అందుకొన్న క్రీస్తుగొర్రెపిల్ల నెత్తురు మనలను పాపం నుండి రక్షిస్తుంది.

ప్రభువు సిలువమీద పల్కిన తుదిపల్కు "సమాప్తమైనది" అనేది. ఆ మాట పల్కి అతడు ఊపిరి విడిచాడు. కాని ఇక్కడ ఏమి సమాప్తమైంది? క్రీస్తు తండ్రి తన కొప్పజెప్పిన రక్షణ ప్రణాళికను ముగించాడు. పరలోక రాజ్యాన్ని గూర్చి బోధించాడు. అద్భుతాలు చేసాడు. మెస్సియాను గూర్చిన పూర్వవేద ప్రవక్తల ప్రవచనాలన్నీ నెరవేరాయి. ప్రభువు గడియ, అనగా అతని మరణకాలం ఆసన్నమైంది. దానికోసమే అతడు ఉత్కంఠంతో నిరంతరం ఎదురు చూస్తున్నాడు. అతని సిలువ మరణం ద్వారా మనకు పాపపరిహారం జరుగుతుంది. ఈ విధంగా క్రీస్తు అన్నీ సమాప్తం చేసాడు. కనుకనే అతడు చిట్టచివరన ఈ మాటను పల్కాడు. ఇక్కడ "సమాప్తమైనది" అనే పల్కును క్రీస్తు చిట్టచివరి క్షణాల్లో చేసిన విజయనాదంగా భావించాలి. తండ్రి చిత్తాన్ని పరిపూర్ణంగా నెరవేర్చి అతడు విజయాన్ని సాధించాడు. మత్తయి మార్కు సువిశేషాల్లో ప్రభువు "నా దేవా నా దేవా! నన్నేల చేయివిడిచావు?" అంటూ చనిపోయాడు - 27,46. లూకా సువిశేషంలో "తండ్రీ! నా యాత్మను నీ చేతుల్లోకి అప్పగిస్తున్నాను" అంటూ మరణించాడు - 23,46. కాని యోహాను సువిశేషంలో అతడు "సమాప్తమైనది" అంటూ ప్రాణాలు విడిచాడు. నాల్గు

సువిశేషాల్లోను భావం ఒక్కటే. క్రీస్తు తండ్రి తన కొప్పజెప్పిన పనిని ముగించి విజయనాదం చేస్తూ ప్రశాంతంగా మరణించాడు.

క్రీస్తు తలవంచి ప్రాణం విడిచాడు - 19.30. కాని యిక్కడ గ్రీకు మూలంలో వున్న వాక్యాన్ని "తలవంచి ఆత్మను విడిచాడు" అని ఆంధ్రీకరించాలి. ఈ వాక్యానికి రెండు విధాలుగా అర్థం చెప్పవచ్చు. మొదటిది, క్రీస్తు తలవంచి తన ఆత్మను తండ్రిచేతుల్లోకి అప్పగించాడు అని చెప్పవచ్చు. రెండవది, అతడు తలవంచి తన పవిత్రాత్మను శిష్యుల మీదికి వదిలాడు అని కూడ చెప్పవచ్చు. క్రీస్తు మరణానంతరం అతని ఆత్మ శిష్యుల మీదికి దిగివస్తుంది. ఆయన తన్ను విశ్వసించేవాళ్లు పొందబోయే ఆత్మను గూర్చి జీవజల నదులు అనే మాట పల్కాడు. యేసు ఇంకా మహిమను పొందనందున ఆత్మ ఇంకా అనుగ్రహింపబడలేదు - 7,39.

## 5. నెత్తురు నీరు స్రవించడం - 19,31-37

తొలి మూడు సువిశేషాలు క్రీస్తు మరణించినపుడు చీకట్లు క్రమ్మాయనీ, భూమి కంపించిందనీ, దేవాలయం లోని తెర చినిగిందనీ చెప్తాయి. యోహాను సువిశేషం ఈ సంగతులేమీ ప్రస్తావించలేదు. వీటికి బదులుగా నాల్గవ సువిశేషం మృత క్రీస్తు ప్రక్కను బల్లెంతో పొడిచారనీ ఆ పోటుకి నెత్తురూ నీళ్ళూ కారాయనీ చెప్తుంది. ఈ సంఘటనను ఇక్కడ కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

క్రీస్తు శుక్రవారం సాయంత్రం చనిపోయాడు. ఆ మరుసటి దినమైన శనివారం పాస్కపండుగ, విశ్రాంతి దినం కూడ. కనుక అది గొప్ప పర్వదినం. అలాంటి ఉత్సవ దినాన యోరూషలేము దరిదాపుల్లో శవాలు సిలువపై వ్రేలాడుతుండకూడదు. పైగా ద్వితీయోపదేశ కాండం 21,23 సిలువ వేసిన నరుణ్ణి ఆ దినమే పూడ్చిపెట్టాలని ఆజ్ఞాపిస్తుంది. కనుక యూదనాయకులు సిలువ మీద వ్రేలాడే ముగ్గురిని కాళ్ళు విరగగొట్టి త్వరగా చనిపోయేలాచేసి శీఘ్రంగా పాతిపెట్టాలని నిశ్చయించుకొన్నారు. పిలాతు అనుమతిపై రోమను సైనికులు వెళ్ళి దొంగ కాళ్లు విరుగగొట్టారు. కాళ్ళకు ఆధారం లేదు కనుక వాళ్లు సిలువ మీద వ్రేలాడుతూ గాలి పీల్చుకోలేక త్వరగా చనిపోయారు.

కాని ఆ సైనికులు క్రీస్తు దగ్గరికి వచ్చి చూడగా అతడు అప్పటికే చనిపోయి వున్నాడు. కనుక వాళ్లు క్రీస్తు కాళ్లు విరగగొట్ట నక్కరలేదు అనుకొని అతన్ని అలాగే వదలివేసారు. ఈలా సైనికులు దొంగల కాళ్ళను విరగగొట్టి క్రీస్తు కాళ్ళను ముట్టుకోకపోవడమనేది కేవలం యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనం కాదు. ఇక్కడ పూర్వవేద ప్రవచనం నెరవేరింది. పూర్వం యూదులు ఈజిప్టు నుండి బయలుదేరి

వచ్చినపుడు పాస్క గొర్రెపిల్లను భుజించి వచ్చారు. ఆ గొర్రెపిల్ల ఎముకలను విరగగొట్టకూడదని ప్రభువు మోషేను ఆజ్ఞాపించాడు - ద్వితీ 12,46. ఈ ప్రవచనం ఇప్పుడు క్రీస్తు పట్ల నెరవేరింది. అతడు మన పాస్క గొర్రెపిల్ల కదా! ఇంకా, కీర్తన 34,20 ఈలా చెప్తుంది :

ప్రభువు అతన్ని సురక్షితంగా కాచికాపాడతాడు
అతని యెముక ఒక్కటి కూడ విరుగదు.

ఈ కీర్తన ఓ నీతిమంతుని గూర్చి చెప్తుంది. ప్రభువు నీతిమంతుని భద్రంగా కాపాడతాడని వాకొంటుంది. ఈ వాక్యం కూడ క్రీస్తుకి అన్వయిస్తుంది. అతడు మహా నీతిమంతుడు. కనుక తండ్రి అతన్ని భద్రంగా సంరక్షిస్తాడు. అతని యెముకను ఒక్కదాన్ని కూడ విరుగనీయడు.

సైనికులు క్రీస్తు కాళ్ళను విరగగొట్టకుండా వదలివేసారు. కాని వాళ్ళు క్రీస్తు నిజంగా చనిపోయాడని నిర్ధారణ చేసికోగోరారు. కనుక ఒక సైనికుడు అతని ప్రక్కను ఈటెతో పొడిచాడు. వెంటనే ఆ గాయం నుండి నెత్తురూ నీళ్ళూ స్రవించాయి. ఇది భౌతికంగా జరిగిన సంఘటనం. క్రీస్తు మృతదేహం నుండి ఈ రెండు ద్రవాలు వెలువడ్డంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని యోహాను ఇక్కడ ఈ రెండు సంఘటనల్లోను లోతైన భావాలను చూచాడు. ఆ భావాలను మనం కూడ జాగ్రత్తగా గమనించాలి.

క్రీస్తు ప్రక్కనుండి నీరు స్రవించింది. దీని భావమేమిటి? యోహాను గ్రంథంలో నీరు పవిత్రాత్మకు చిహ్నంగా వుంటుంది. ప్రభువే ఈలా నుడివాడు : "దప్పిక గొన్నవాడు నా యొద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు. నన్ను విశ్వసించేవాని అంతరంగం నుండి జీవజల నదులు పారతాయి. క్రీస్తు తన్ను విశ్వసించేవాళ్ళు పొందబోయే ఆత్మను గూర్చి ఈ జీవజల నదులు అన్నమాట వాడాడు" - 7,37-39. కనుక ఇక్కడ జీవజలనదులు క్రీస్తు హృదయంలో పుట్టి భక్తుల హృదయాల్లోకి పారతాయి. అనగా పవిత్రాత్మ క్రీస్తు నుండి బయలుదేరి భక్తుల హృదయాల్లోకి దిగివస్తుంది. కనుక ఇక్కడ క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నీళ్ళు పవిత్రాత్మను సూచిస్తాయి. ఇంకా ఈ నీళ్ళు జ్ఞానస్నానాన్ని వరప్రసాదాన్ని కూడ తెలియజేస్తాయి. ప్రభువు నుండి మనము వీటన్నిటిని పొందుతాం.

ఇక క్రీస్తు ప్రక్కలో నుండి నెత్తురు కూడ కారింది. దీని భావమేమిటి? ఈ నెత్తురు సత్ర్పసాదానికి చిహ్నం. యోహాను 6,53-56లో ప్రభువు మనం తన శరీరాన్ని భుజించి తన రక్తాన్ని పానం చేయాలని కోరాడు. అప్పుడే గాని మనలో జీవముండదని వాకొన్నాడు. ప్రభువు శరీరరక్తాలు అతని మరణానికి గుర్తుగా వుంటాయి. దివ్యసత్ర్పసాద రూపంలో మనకు ఆహారమౌతాయి. క్రీస్తు మనకొరకు బలియైన పాస్క గొర్రెపిల్ల కదా!

పూర్వం యూదులు పాస్క గొర్రెపిల్లను లాగ ఇప్పుడు మనం క్రీస్తుని భుజిస్తాం. ఇక పై వాక్యాలు పేర్కొనే క్రీస్తు రక్తం మనకు ఆహారమైనట్లే అతని ప్రక్కలో నుండి కారిన రక్తం కూడ మనకు ఆహారమౌతుంది. ఆ రక్తం ఈ రక్తం ఒకటే కదా! కనుక క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నెత్తురు దివ్యసత్ప్రసాదానికి చిహ్నంగా వుంటుంది.

ఈ సందర్భంలో ప్రాచీన వేదశాస్త్రులు ఇంకో సంగతి కూడ చెప్పారు. యావే ప్రభువు నిద్రపోతున్న తొలి ఆదాము ప్రక్కటెముకను తీసి దానినుండి తొలి ఏవను రూపొందించాడు. అలాగే ఇప్పుడు సిలువ మీద నిద్రపోయే మలి ఆదాము ప్రక్కలో నుండి కూడ రెండవ ఏవ పుట్టింది. ఆమే మన తల్లియైన తిరుసభ.

పురాతన క్రైస్తవులు క్రీస్తు ప్రక్కలోని గాయం పట్ల విశేష భక్తిని చూపారు. అది అన్ని దేవద్రవ్యానుమానాలకూ అన్ని వరప్రసాదాలకూ నిలయం. మనం కూడ క్రీస్తు గాయం పట్ల, క్రీస్తు హృదయం పట్ల అపార భక్తిని చూపాలి. క్రీస్తు హృదయం నుండే నీరూ నెత్తురూ కారి గాయం గుండా వెలుపలికి వచ్చాయి.

క్రీస్తు మరణంలో రెండు ప్రవచనాలు నెరవేరాయి. మొదటిది, అతని యెముకలు విరగకపోవడం. దీన్ని గూర్చి మీదచూచాం. ఇక రెండవది, "వాళ్లు తాము పొడిచినవాని వంక వీక్షిస్తారు" అనే ప్రవచనం. ఇది జకర్యా ప్రవచనం 12,10లో వస్తుంది. మూలంలో రాజు ప్రవక్త ఐన ఓ మహానుభావుణ్ణి కొందరు దుష్టులు వధిస్తారు. యెరూషలేము పౌరులు సానుభూతితో సంతాపంతో అతని వైపు చూస్తారు. యోహాను ఈ ప్రవచనాన్ని క్రీస్తుకి అన్వయింపజేసాడు. క్రీస్తు ప్రక్కను పొడిచింది రోమను సైనికులు ప్రధాన యాజకులు మొదలైన శత్రుజనమంతా కూడ. అతని వైపు సంతాపంతో చూచేది ప్రియశిష్యులు పుణ్యస్త్రీలు మొదలైన వాళ్ళంతా కూడ. అలా పొడవబడిన క్రీస్తు వైపు చూచి వీళ్లు రక్షణం పొందుతారు. నేడు మనం కూడ సిలువ వేయబడిన ప్రభువువైపు చూచి రక్షణం పొందాలి. మోషే యెడారిలో సర్పాన్ని ఎత్తినట్లుగా మనుష్యకుమారుని కూడ సిలువమీద ఎత్తుతారు. అతన్ని చూచి విశ్వసించే ప్రతివాడు నిత్యజీవం పొందుతాడు - 3,14-15. ఇంకా క్రీస్తుని భూమి మీది నుండి పైకెత్తినపుడు అతడు అందరినీ తనవైపు ఆకర్షించుకొంటాడు - 12,37. ఈలా ఆకర్షింపబడిన వారిలో మనం కూడ వుంటే ఎంత ధన్యంగా వుంటుంది.

క్రీస్తు ప్రక్కలో నుండి నీళ్ళూ నెత్తురూ కారాయనీ అవి పవిత్రాత్మనూ దివ్యసత్ప్రసాధాన్ని సూచిస్తాయనీ యోహాను సాక్ష్యం పలుకుతున్నాడు. ఆ సాక్ష్యం నిజమైంది. నాడు యోహాను చుట్టు ప్రోగైన భక్త సమాజం కూడ ఈ సాక్ష్యాన్ని నమ్మింది. నేడు మనం కూడ ఈ సాక్ష్యాన్ని విశ్వసించి రక్షణం పొందాలి - 19,35. క్రీస్తు నుండి లభించే దేవద్రవ్యానుమానాలూ వరప్రసాదాలు పవిత్రాత్మ తిరుసభ మనకు రక్షణ సాధనాలు.

## భూస్థాపనం - 19,38-42

శుక్రవారం సాయంత్రం ప్రొద్దు కుంకబోతూంది. విశ్రాంతి దినమైన శనివారం సమీపించబోతూంది. కనుక క్రీస్తు దేహాన్ని త్వరగా పాతిపెట్టాలి. క్రీస్తు బంధువులు పేదలు. వారికి ఇతరుల సహాయం కావాలి.

కనుక అరిమతయియా యోసేపు నికొదేము క్రీస్తు భూస్థాపనంలో తోడ్పడ్డారు. వీళ్ళిద్దరు క్రీస్తుకి శిష్యులే. కాని యూదులకు భయపడి పరోక్ష శిష్యులుగా మాత్రమే ఉండిపోయారు. క్రీస్తు మరణానంతరం వీళ్ళకు ధైర్యం వచ్చింది. "నేను భూమిమీది నుండి పైకెత్తబడినపుడు అందరినీ నా దగ్గరికి ఆకర్షించుకొంటాను" అన్న ప్రభువు వాక్యం వారిపట్ల నెరవేరింది - 12,32. పరోక్ష శిష్యులు ప్రత్యక్ష శిష్యులుగా మారిపోయారు. యోసేపు ధైర్యంగా పిలాతుని కలసికొని అతని అనుమతిని పొంది క్రీస్తు దేహాన్ని సిలువ మీదినుండి క్రిందికి దింపి తీసికొని వచ్చాడు. నికొదేము భక్తి భావంతో పరిమళ ద్రవ్యాలు విస్తారంగా తీసికొని వచ్చాడు. సమృద్ధిగా పరిమళ ద్రవ్యాలు వాడ్డం, క్రొత్త సమాధిలో పాతిపెట్టడం అనేవి రాజుల శవాలకు జరిగే మర్యాద. కనుక ఇక్కడ మృత క్రీస్తుని ఓ రాజుని లాగ గౌరవ మర్యాదలతో పాతిపెట్టారు అనుకోవాలి.

## మూడు సంప్రదాయాలు

సువిశేషాల్లో మూడు సంప్రదాయాలున్నాయి. మార్కు మత్తయిది ఒక పద్ధతి. లూకాది ఇంకొక పద్ధతి. యోహానుది మరొక పద్ధతి. క్రీస్తు శ్రమలను వర్ణించేపుడు ఈ మూడు సంప్రదాయాల వాళ్లు మూడు పద్ధతులను అవలంబించారు.

మార్కు మత్తయి సువిశేషాల పద్ధతి యిది. శిష్యుల బుద్ధి మంచిది కాదు. గెత్సెమని తోపులో ప్రభువు ప్రార్థిస్తుండగా వీళ్లు మూడుసార్లు నిద్రపోయారు. ఒక శిష్యుడు ప్రభువుని అప్పగించాడు. మరొకడు గురువుని ఎరుగనని బొంకాడు. చివరకు అందరు గురువును విడచి పారిపోయారు. క్రీస్తు సిలువ మీద ఆరు గంటల సేపు వ్రేలాడాడు. మూడవ గంట తర్వాత చనిపోయాడు. మరో మూడు గంటల కాలం అతని శవం చిమ్మచీకట్లలో సిలువ మీద వుండిపోయింది. క్రీస్తు సిలువ మీద వ్రేలాడుతూ నా దేవా నన్నేల చేయి విడిచావని దీనంగా విలపించాడు. క్రీస్తు మరణించిన పిమ్మటనే కాని తండ్రి జోక్యం జేసికొని కుమారుని నిజాయితీని వెల్లడి చేయలేదు. శత్రువులు క్రీస్తు మీద తెచ్చిన నేరాలు అతడు దేవుని కుమారుణ్ణని చెప్పుకొని దేవదూషణ పలకడం, దేవాలయాన్ని పడగొట్టి మళ్ళీ మూడు రోజుల్లో నిర్మిస్తానని చెప్పడం. క్రీస్తు చనిపోయేపుడు

శతాధిపతి ఇతడు నిజంగా దేవుని కుమారుడేనని సాక్ష్యం పలుకుతాడు. క్లుప్తంగా చెప్పాలంటే, చనిపోయిన పిదపనే గాని అతని గొప్పతనం, మంచితనం విదితం కావు.

ఇక లూకా పద్ధతి యిది. శిష్యులు మంచివాళ్లే. గెత్సెమని తోపులో నిద్రపోయినా శోకభారంతో నిద్రించారు. వాళ్ళు నిద్రించింది మూడుసార్లు కాదు, ఒక్కసారే. యేసు శత్రులు మీద కూడ లూక అంతగా తప్పుమోపడు. వాళ్ళు యేసుపై తప్పుడు సాక్ష్యాలు చెప్పించరు. నాకు క్రీస్తులో ఏ లోపం కన్పించలేదని పిలాతు మూడుసార్లు చెప్తాడు. లూకా పిలాతుని గూడ దుష్టునిగా చిత్రించడు. యూదుల దేవాలయమన్నా ధర్మశాస్త్రమన్నా లూకాకు పరమ గౌరవం. యేసు తన కష్టాలు మర్చిపోయి ఇతరుల బాధల్లో సానుభూతి చూపిస్తాడు. ఓలివు తోటలో పేత్రు శత్రువు చెవిని నరకగా క్రీస్తు దాన్ని మళ్లీ అంటిస్తాడు. తనకొరకు విలపించే పుణ్య స్త్రీలతో మీ బిడ్డల కొరకు ఏడ్వండని చెప్తాడు. క్రీస్తు అపారమైన కరుణ కలవాడు. కనుకనే తనతో పాటు సిలువపై వ్రేలాడే దొంగకు పాప క్షమాపణనూ మోక్షప్రాప్తీ దయచేస్తాడు. వీళ్లేమి చేస్తున్నారో వీళ్ళకే తెలియదు. కనుక శత్రువులను క్షమించమని తండ్రిని వేడుకొంటాడు. కడన తండ్రీ నీ చేతుల్లోకి నా ప్రాణాలను అర్పించుకొంటున్నాను అని పలికి ప్రశాంతంగా కన్ను మూసాడు.

కడన, యోహాను పద్ధతి యిది. క్రీస్తు ఠీవికల రాజు. అతని ప్రాణంపై అతనికొక్కనికే అధికారం వుంది. అతడే దాన్ని ధారపోస్తాడు. మళ్లా స్వీకరిస్తాడు కూడ. కనుక అతని జీవనమరణాలకు అతడే కర్త - 10,18. ఓలివు తోటలో క్రీస్తుని బంధించడానికి వచ్చిన రోమను సైనికులు అతనికి భయపడి నేలకొరిగారు. తొలి మూడు సువిశేషాల్లో లాగ ఇక్కడ క్రీస్తు తండ్రీ! ఈ గడియను తొలగించు అని ప్రార్థించడు. దాని కొరకు ఉత్సాహంతో ఎదురుచూస్తుంటాడు - 12,27. తండ్రి తనకిచ్చిన పాత్రను త్రాగగోరుతాడు - 18,11. సిలువ మరణం అతనికి అవమానాన్ని గాక మహిమను తెచ్చిపెడుతుంది. ప్రధానార్చకుడు క్రీస్తు బోధను గూర్చి ప్రశ్నింపగా ఠీవితో నా బోధలు విన్నవారిని అడిగి తెలుసుకొమ్మంటాడు. తనకు తీర్పు చెప్పే పిలాతుతో నామీద నీకు ఏ యధికారం లేదని ధైర్యంగా చెప్తాడు.

యోహాను గ్రంథంలో కురేనియ సీమోను కన్పింపడు. యేసు తన సిలువను తానే మోసికొని పోతాడు. యోహాను భావాల ప్రకారం అతడు రాజు. రాజని మూడు భాషల్లో శాసనం వ్రాసి సిలువపై పెట్టారు. యేసు మహారాజుగా సిలువ సింహాసనం ఎక్కాడు. అతనికి ఇరువైపుల ఇద్దరు దొంగలు పరివారంగా ఉన్నారు.

తొలి మూడు సువిశేషాల్లో క్రీస్తు సిలువపై ఒంటరిగా మరణిస్తాడు. కాని యోహాను గ్రంథంలో సిలువ క్రింద మరియ ప్రియశిష్యుడు నిల్చివుంటారు. క్రీస్తు శిష్యులందరికీ మరియను తల్లిని చేసాడు. శిష్యులందరినీ మరియు బిడ్డలను చేసాడు. సిలువ క్రిందనే యోహాను మరియలతో కూడిన భక్త సమాజం ఏర్పడుతుంది. ఇదే ఆదిమ క్రైస్తవ సమాజం.

చనిపోకముందు క్రీస్తు దేవా నన్నేల చేయి విడచావు అనడు. అంతా సమాప్తమైంది అంటాడు. అనగా తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళిక అతని ద్వారా పూర్తయిందని భావం. క్రీస్తు మరణం జీవనదాయకం. ఆయన మరణం నుండి జీవజల ప్రవాహాలు పుట్టి భక్తుల హృదయాల్లోకి పారతాయి.

క్రీస్తు మృతదేహానికి వందపౌన్ల సుగంధ ద్రవ్యం పూసి నారబట్టలు చుట్టి క్రొత్త సమాధిలో పాతిపెట్టారు. అనగా అతన్ని రాజమర్యాదలతో పాతిపెట్టారు. అతడు రాజాధిరాజు.

సంగ్రహంగా చెప్పాలంటే, మత్తయి మార్కులు వర్ణించిన క్రీస్తు ప్రజల నిరాదరణకు గురై చనిపోతాడు. కడన తండ్రివలన విజయాన్ని పొందుతాడు. లూకా చిత్రించిన క్రీస్తు ఇతరులపై కరుణ చూపేవాడు. యోహాను చిత్రించిన క్రీస్తు ఠీవితో సిలువ సింహాసన మెక్కి రాజ్యపాలనం చేసే ప్రభువు.

తపస్సు కాలంలో మ్రానికొమ్మల ఆదివారం నాడు క్రమంగా మొదటి సంవత్సరం మత్తయి, రెండవ సంవత్సరం మార్కు, మూడవ సంవత్సరం లూకా వ్రాసిన శ్రమల చరిత్రను చదువుతాం. పెద్ద శుక్రవారం నాడు ప్రతి యేట యోహాను వ్రాసిన శ్రమల చరిత్రను చదువుతాం.

# 3. దివ్యనామావళి

## మనవిమాట

ఈ పుస్తకాన్ని పూర్వమే "బైబులుభాష్యం" 79,80, 84-86 సంచికల్లో ప్రచురించాం. వాటినే ఇప్పుడు ఏకగ్రంథంగా అందిస్తున్నాం.

దివ్యనామావళి అంటే క్రీస్తు బిరుదాలు. నూత్నవేదం పేర్కొనే క్రీస్తు బిరుదాలు చాలా వున్నాయి. వాటన్నిటి మీదా వాఖ్య చెప్తే పుస్తకం అంతులేకుండా పెరిగిపోతుంది. కనుక ఇక్కడ ముఖ్యమైన బిరుదాలను పదిహేడింటిని మాత్రం ఎన్నుకొని వాటిమీద విపులమైన వివరణం చెప్పాం. పూర్వ నూత్నవేదాలనుండి ఈ బిరుదాలకు సంబంధించిన అంశాలను ఓ క్రమపద్ధతిలో వివరించాం.

క్రీస్తు బిరుదాలు ఆ ప్రభువు గుణగణాలనూ, అతని మరణోత్థానాలనూ, అతడు నేడు మనకు ప్రసాదించే రక్షణనూ వివరిస్తాయి. వీటిద్వారా మనం క్రీస్తుని అధికంగా అర్థంచేసికొని అతనిపట్ల భక్తిని పెంపొందించుకోవచ్చు.

అన్ని మతాల్లోను భగవంతుని దివ్యనామాలను కీర్తించడం అనే సంప్రదాయం వుంది. హిందూమతంలో "విష్ణు సహస్రనామావళి" మొదలైనవి వున్నాయి. క్రైస్తవులమైన మనం కూడ క్రీస్తు పవిత్రనామాలను క్షుణ్ణంగా అర్థంచేసికొని, భక్తితో మననం చేసికోవాలి. ఈ కార్యసాధనకు ఈ పుస్తకం కొంతవరకైనా తోడ్పడుతుందని ఆశిస్తున్నాం. ఇది మూడవ ముద్రణం.

## విషయసూచిక

# 1. విమోచకుడు

విమోచనం బైబుల్లో చాల పెద్ద భావం. ఇది ఐగుప్తున యూదుల బానిసంతో ప్రారంభమౌతుంది. పూర్వవేదమంతట కన్పిస్తుంది. నూత్నవేదంలోను గోచరిస్తుంది.

## 1. విమోచకుడు

విమోచకుడు అంటే ఆపదనుండి విడిపించేవాడు లేక రక్షించేవాడు అని అర్థం. హీబ్రూ ప్రజల సాంఘికజీవనంలో ఇతడు ఓ దగ్గరి చుట్టమైయుండి తన బంధువులకు మేలుచేస్తుంటాడు. హీబ్రూ భాషలో ఇతన్ని "గోయెల్" అనేవాళ్లు.

పూర్వవేదంలో విమోచకుడు మూడు పనులు చేసేవాడు.

1. యూదుల్లో ఎవరైనా పేదవాళ్ళయిపోయి తమ ఆస్తిని ఋణదాతలకు అమ్ముకొంటే వాళ్ళ దగ్గరి చుట్టమయిన విమోచకుడు మళ్ళా వాళ్ళకు ఆ యాస్తిని సంపాదించి పెట్టాలి. అనగా అతడు ఋణదాతనుండి ఆ పొలాన్ని కొని దాన్ని సొంతదారునికి ముట్టజెప్పాలి. "మీతోడి యిస్రాయేలీయుడు ఎవడైన పేదవాడై తన పొలాన్ని అమ్ముకొంటే అతని దగ్గరి చుట్టం దాన్ని మళ్ళా కొనిపెట్టాలి - లేవీ 25,25.

2. ఏ యూదుణ్ణయినా శత్రువులు చంపివేస్తే ఆ చంపబడినవాని దగ్గరి చుట్టం విమోచకుడుగా ప్రవర్తించి ఆ శత్రువులమీద పగతీర్చుకోవాలి. "హంతను చంపే బాధ్యత హతుడైనవాని దగ్గరి బంధువులది. అతడు కంటపడగానే వారతన్నిచంపివేయాలి" - లేవీ 35,19.

3. ఆలాగే యూదుల్లో ఎవడైనా పేదవాడై బానిసగా అమ్ముడుబోతే అతని దగ్గరి చుట్టయిన విమోచకుడు అతన్ని ఆ బానిసం నుండి విడిపించాలి - లేవీ 25, 47-49. యావే ప్రభువు ఈ మూడవ అర్థంలో యిస్రాయేలీయులకు విమోచకుడయ్యాడు. ఐగప్తులో

వారి కోపు తీసికొని వారిని బానిసంనుండి విడిపించాడు. కనుక ఇక్కడ మనకు ఇది ముఖ్యమైన భావం.

## 2. యావే విమోచకుడు

యావే ఐగుప్తులోని యిస్రాయేలీయులపట్ల విమోచకుడుగా మెలిగాడు. ఏలాగ? ఫరో యిస్రాయేలీయులను బానిసలనుగా ఏలుతూ ముప్పుతిప్పులు పెడుతున్నాడు. వాళ్ళచేత వెట్టిచాకిరి చేయించి బ్రహ్మాండమైన భవనాలు కట్టిస్తున్నాడు. ఆ బాధలు భరించలేక వాళ్ళు ప్రభువుకి మొరపెట్టారు. ఆ మొర హేబెలు మొరలాగ ప్రభువు సన్నిధిని చేరింది. అతనికి ఆ ప్రజలమీద జాలివేసింది. తాను వాళ్ళకి దగ్గరి చుట్టమయ్యాడు. వారి కోపు తీసికొని వాళ్ళను రక్షింపగోరాడు. మోషేతో "నేనే ప్రభువుని. నేను ఐగుప్తీయులు మీ నెత్తికెక్కించిన బరువుని తొలగిస్తాను. వారి దాస్యం నుండి మీకు విముక్తి కలిగిస్తాను. శక్తిగల నా చేతిని చాచి మీ శత్రువులను నిశితంగా శిక్షిస్తాను. మిమ్ము దాస్యం నుండి విడిపిస్తాను" అన్నాడు - నిర్గ 6,6.

మామూలుగా యిస్రాయేలు విమోచకులు బానిసలుగా అమ్ముడుబోయిన తమ బంధువులను విడిపించడానికి వాళ్ళ యజమానులకు సొమ్ము చెల్లించేవాళ్ళు. కాని యిస్రాయేలీయులను విడిపించడానికి యావే ఫరోకు సొమ్ము ఏమాత్రం చెల్లించలేదు. ఫరోకు ధనమిచ్చికాదు, అతన్ని సర్వనాశం చేసి ప్రభువు యిస్రాయేలీయులను విడిపించుకొనివచ్చాడు. కనుకనే అతడు మోషేతో "ఫరో రాజునీ అతని రథాలనూ అశ్వాలనూ సైన్యాలనూ నాశంచేసి నా మహిమను ప్రదర్శిస్తాను" అని చెప్పాడు - నిర్గ 14,18.

ఈ విమోచనంద్వారా యిస్రాయేలీయులు యావే భక్తులయ్యారు. వాళ్ళు ఐగుప్తునుండి బయలుదేరి రాగానే అతడు సీనాయి కొండదగ్గర వాళ్ళతో నిబంధనం చేసికొన్నాడు. దానితో వాళ్ళు అతనికి యాజకరూపమైన రాజ్యమూ, పవిత్ర ప్రజా, సొంత జనమూ అయ్యారు - నిర్గ 19, 5-6. ప్రభువు వాళ్ళను ప్రేమతో ఎన్నుకొని తనవారిని చేసుకొన్నాడు. "అతడు స్వయంగా మిమ్ము ప్రేమించాడు కనుక, మీ పితరులతో తాను చేసికొనిన వాగ్దానాన్ని నిలబెట్టుకోగోరాడు కనుక, మిమ్మే యెన్నుకొన్నాడు. కావుననే ప్రభువు మహాబలంతో మిమ్ము తోడుకొని వచ్చాడు. ఐగుప్తు రాజైన ఫరో దాస్యంనుండి మిమ్ము విడిపించాడు" - ద్వితీ 6,8. ఈవిధంగా ప్రభువు యిస్రాయేలీయులకు విమోచకుడయ్యాడు.

యూదులకు ఐగుప్తు మొదటి ప్రవాసమైతే బాబిలోనియా రెండవ ప్రవాసం. కనుక ప్రవక్తలు ఈ విమోచనాన్ని బాబిలోనియా ప్రవాసానికిగూడ అన్వయింపజేసారు.

ఐగుప్తు విమోచనం క్రీస్తుపూర్వం 13వ శతాబ్దంలో జరిగింది. బాబిలోనియా విమోచనం క్రీస్తుపూర్వం 539లో జరిగింది. ఈ బాబిలోనియా విమోచనాన్ని గూర్చి యెషయా చాలా ప్రవచనాలు చెప్పాడు. ప్రభువు యిస్రాయేలీయులను తన దత్తపుత్రులను జేసికొంటాడు. వారికి దగ్గరిచుట్టమైవాళ్ళను విడిపిస్తాడు. "యిస్రాయేలూ! నీవు నాకు సేవకుడవు. నీవు భయపడకు. నేను నీకు తోడై యుంటాను. నీవు వెరవకు. నేను నీకు దేవుణ్ణి. నేను నీకు బలాన్నిచ్చి నిన్నాదుకొంటాను. నా శక్తితో నిన్ను రక్షిస్తాను - 41, 10.

యిర్మీయా ఇంకా ఇతర ప్రవక్తలు ప్రభువు ప్రవచనాన్ని రాబోయే మెస్సీయాకు గూడ వర్తింపజేసారు. అనగా ప్రభువు మెస్సీయాద్వారా తన విమోచనాన్ని కొనసాగించుకొనిపోతాడు. ఈ సందర్భంలో యిర్మీయా ప్రవచనం "ఆ దినాలు కడచిన తర్వాత నేను నా యాజ్ఞలను ప్రజల హృదయాలమీదనే లిఖిస్తాను" అని చెప్తుంది - 31, 33-34. ఇది నూత్న నిబంధనాన్ని సూచించే వాక్యం. ఈ నూత్న నిబంధన కర్త క్రీస్తే. కనుక ఇక ఆ ప్రభువు కొనివచ్చిన విమోచనాన్ని పరిశీలిద్దాం.

## 3. క్రీస్తు విమోచకుడు

యిర్మీయాలాంటి ప్రవక్తల ప్రవచనాలు నెరవేరి యేసుప్రభువు రానేవచ్చాడు. యావే పూర్వవేద విమోచకుడైతే యేసు నూత్నవేద విమోచకుడు. కనుకనే అతడు "మనుష్య కుమారుడు సేవలు చేయించుకోడానికి రాలేదు. సేవలు చేయడానికే వచ్చాడు. అతడు అనేకుల రక్షణం కోసం తన ప్రాణాలను క్రయధనంగా వెచ్చిస్తాడు" అని చెప్పాడు- మార్కు 10,45. ఈ "క్రయధనం" పూర్వవేదంలో బానిసను విడిపించడానికి చెల్లించే సొమ్ము. నూత్నవేదంలో మనం పాపంద్వారా పిశాచానికి బానిసలమౌతాం. ఈ బానిసం నుండి మనలను విడిపించడానికి క్రీస్తు చెల్లించే సొమ్ము అతని సొంత ప్రాణాలే. అతడు తన ప్రాణాలొడ్డి మనలను పిశాచదాస్యం నుండి విడిపించాడు. ఇదే నూత్నవేదవిమోచనం.

పూర్వవేద విమోచనానికీ నూత్నవేద విమోచనానికీ చాలా పోలికలున్నాయి. అక్కడ ప్రజలు ఫరోకు దాసులు. ఇక్కడ మనం పాపానికీ పిశాచానికీ దాసులం. యూదులు రెల్లుసముద్రం దాటారు. మనం దాటే సముద్రం జ్ఞానస్నానం. ఆనాడు యావే ప్రభువు సీనాయికొండ దగ్గర యూదులతో నిబంధనం చేసికొన్నాడు. వాళ్ళు అతన్ని కొలిచే ప్రజలయ్యారు. ఈనాడు క్రీస్తు జ్ఞానస్నానం ద్వారా మనతో నిబంధనం చేసికొంటాడు. మనం ఇతన్ని కొలిచే ప్రజలమౌతాం. యూదులు వాగ్దత్తభూమిలో ప్రవేశించారు. మనం చేరుకొనే వాగ్దత్తభూమి మోక్షమే. అక్కడ ప్రజలను నడిపించిన నాయకుడు మోషే. నూత్నవేద ప్రజలను నడిపించే నాయకుడు క్రీస్తే. యావే ప్రభువు ఫరోకు డబ్బు చెల్లించి కాదు,

అతన్ని అణగద్రొక్కి, యూదులకు విముక్తి కలిగించాడు. అలాగే క్రీస్తుకూడ పిశాచానికి సొమ్ము చెల్లించలేదు. దాన్ని అణగద్రొక్కి మనకు పాపవిముక్తి కలిగించాడు. ఈలాంటి విమోచకుడైన క్రీస్తుకి మనం సదా కృతజ్ఞులమై యుండాలి.

## ప్రార్థనా భావాలు

1. బైబుల్లో విమోచనం వ్యక్తిపరమైంది మాత్రమే కాదు, సమాజపరమైందికూడ. పూర్వవేదంలో ప్రభువు యిస్రాయేలు జాతినంతటినీ యెన్నుకొని ఆ జాతినంతటినీ విమోచించాడు. నూత్నవేదంలో క్రీస్తు క్రైస్తవ సమాజాన్నంతటినీ, తిరుసభనంతటినీ విమోచిస్తాడు. కనుక మనం తిరుసభ అంతా, మానవజాతి అంతాగూడ రక్షణం పొందాలని ప్రార్థించాలి.

2. మనం ఇక్కడ పాక్షికంగా విమోచనం పొందుతాం. జ్ఞానస్నానంతోనే ఈ పాక్షిక విమోచనం ప్రారంభమౌతుంది. కాని పూర్తి విమోచనం మనం ఉత్థానమై మోక్షాన్ని చేరుకొన్నపుడుగాని లభించదు. ఆ గడియకోసం మనం ఆశాభావంతో ఎదురుచూస్తుండాలి – రోమా 8,23. మనమందరం కూడా ఇప్పటికే కొంతవరకు రక్షణం పొందినవాళ్ళం. ఇంకా పూర్తి రక్షణం పొందవలసినవాళ్ళం. ఈ పూర్తి రక్షణం కొరకు మనం నిరంతరం కృషి చేయాలి.

3. విమోచనం లేక రక్షణమనేది ఎప్పుడో పూర్వకాలంలో జరిగిన చారిత్రక సంఘటనంమాత్రమేకాదు. అది యిప్పుడుకూడ మనమధ్యలో మన హృదయాల్లో కొనసాగుతూంటుంది. యావే ప్రభువు ఈనాడుకూడ క్రీస్తు ద్వారా మనలను రక్షిస్తుంటాడు. దేవద్రవ్యానుమానాలు, సేవ, సోదరప్రేమ, ప్రార్థన మొదలైన వాటిద్వారా మనం ఈనాడు పొందేది ఈ రక్షణాన్నే. విశేషంగా పూజబలిలో ఈనాడు మనం క్రీస్తు రక్షణాన్ని స్వీకరిస్తుంటాం. ఈ బలిని పురస్కరించుకొనే ఆ ప్రభువు "ఇది అనేకుల పాపపరిహారార్థమై చిందింపబడనున్న నూత్ననిబంధనం యొక్క నా రక్తం" అన్నాడు – మత్త 26,28. కనుక ఈ పూజబలిలో మనం భక్తితో పాల్గొనాలి.

4. విమోచనం తండ్రికీ క్రీస్తుకీ మనపట్ల గాఢమైన ప్రేమ వుందని నిరూపిస్తుంది. ఆ తండ్రి మనందరి కొరకు తన సొంత కుమారుని సమర్పించడానికిగూడ వెనుదీయలేదు – రోమా 8,32. ఆ క్రీస్తు మన పాపాలకొరకు ఆత్మార్పణం

చేసికొన్నాడు - గల 1,4. మనం పాపాత్ములమై యుండగా క్రీస్తు మన కొరకు మరణించాడు - రోమా 5,7. ఈలాంటి వేదవాక్యాలనుబట్టి ఆ తండ్రీ కుమారులకు మన పట్ల ఎంత గాఢమైన ప్రేమ వుందో అర్థంచేసికోవాలి.

5. క్రైస్తవులమైన మనం ప్రధానంగా క్రీస్తునుండి రక్షణం పొందినవాళ్ళం. అతడు సమస్త దుర్నీతి నుండి మనలను విముక్తులను చేసాడు - తీతు 2,14. ఈ మహాభాగ్యానికి మనమెంతో సంతోషించాలి. చాలమంది ఈ లోకభాగ్యాలను చూచుకొని సంతోషిస్తారు. కాని పరలోక భాగ్యాలను చూచుకొని సంతోషించడం నిజమైన ఆనందం.

6. ఎంత చెట్టుకి అంత గాలి. ప్రభువు రక్షణాన్ని పొందిన మనం వొళ్ళు దగ్గరపెట్టుకొని జీవించాలి. పవిత్రంగా మనుగడ సాగించాలి. మన దేవుడు పవిత్రుడు. అతన్ని కొలిచే ప్రజలమైన మనంకూడ పవిత్రంగా జీవించాలి - లేవీ 20,26. ఎవడైన క్రీస్తులోవుంటే అతడు నూత్నసృష్టి ఔతాడు. అతనికి ప్రాతజీవితం గతించి క్రొత్తజీవితం ప్రారంభం కావాలి - 2 కొరి 5,17.

# 2. మధ్యవర్తి

రెండు పక్షాలకు సంధిచేసేవాడు మధ్యవర్తి. ఆదాము పాపంద్వారా నరజాతి దేవునికి శత్రువైంది. దేవుడు తన కుమారుడైన యేసుక్రీస్తుద్వారా ఈ నరజాతితో మళ్ళా సఖ్యత ఏర్పరచుకొన్నాడు. క్రీస్తు దేవునికీ నరులకూ మధ్య ప్రధాన మధ్యవర్తి. మొదట పూర్వవేద మధ్యవర్తులను పరిశీలిద్దాం.

## 1. పూర్వవేద మధ్యవర్తులు

*చారిత్రక మధ్యవర్తులు*

అబ్రాహాము దేవునికి ఆదిమ నరజాతికీ మధ్య మధ్యవర్తి. అతనిద్వారా సమస్త జాతిజనులూ దీవెనలు పొందుతారు - ఆది 12,3. అతని ద్వారానే యిస్రాయేలు ప్రజలు భూమినీ సంతానాన్ని పొందుతారు. ఇతడు అబీమెలెకు కొరకు దేవుని ప్రార్థించాడు. ఆ ప్రార్థనను ఆలించి దేవుడు అబీమెలెకును శిక్షింపకుండా వదలివేసాడు - ఆది 20,17. ఇంకా యితడు సొదొమగొమొఱ్ఱాలకొరకు గూడ ప్రార్థించాడు - ఆది 18, 22-32.

మోషే దేవునికీ యిస్రాయేలీయులకూ నడుమ మధ్యవర్తి. ప్రభువు అతనిద్వారా యిస్రాయేలీయులతో నిబంధనం చేసికొన్నాడు. వారికి ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు.

వారిని తన్ను గొలిచే ప్రజలనుగా తయారుచేసాడు. మోషే యెన్నో సారులు యిస్రాయేలు జనం కొరకు ప్రార్థన చేసాడు. ఆ ప్రజలు బంగారు దూడను కొల్చిన పిదప ప్రభువు వాళ్ళను నాశం జేయబోయాడు. కాని మోషేవాళ్ళ తరపున మనవిచేసి వాళ్ళను కాపాడాడు - నిర్గ 32, 11-14.

పూర్వవేదంలో యాజకులుగూడ మధ్యవర్తులుగా పనిజేసారు. వారిద్వారా ప్రజలు దేవుని దీవెన పొందారు - సంఖ్యా 6, 22-27. ఈలాగే రాజులుకూడ మధ్యవర్తులు. వాళ్లు దేవునిచే నియుక్తులై ప్రజలను పాలించారు.

ప్రవక్తలు గొప్ప మధ్యవర్తులు. వాళ్ళు దైవచిత్తాన్ని ప్రజలకు తెలియజేసేవాళ్ళు. యూదా మక్కబీయుడు ఓ దర్శనంలో యిర్మియా ప్రవక్త ప్రజలకొరకు ప్రార్థన చేయడం చూచాడు - 2 మక్క 15, 13-16.

ఈ రీతిగా ప్రభువు పూర్వవేదంలో నానా వ్యక్తులద్వారా తన ప్రజలకు సేవలు చేయించాడు. ఈ సేవల ద్వారా తాను యిస్రాయేలీయులతో చేసికొనిన నిబంధనాన్ని దృఢపరచాడు.

### అంత్యదినాల్లో వచ్చే మధ్యవర్తులు

ప్రవక్తల బోధల్లో అంత్యకాలపు మధ్యవర్తులు కొందరు తగులుతారు. వాళ్ళంతా నూత్నవేదంలో రాబోయే క్రీస్తు మధ్యవర్తినే సూచిస్తారు.

మెస్సీయారాజు ఈలాంటివాడు. అతడు ప్రజలను దేవుని చెంతకు చేర్చాడు. యెషయా పేర్కొన్న బాధామయ సేవకుడు ఈలాంటివాడు. అతడు ప్రజలకు దేవుణ్ణిగూర్చి బోధించాడు. వాళ్ళ తరపున ప్రార్థించాడు. వారి పాపాల పరిహారార్థం తన ప్రాణాలనే అర్పించాడు - యెష 53, 10. దానియేలు ప్రవక్త పేర్కొన్న నరపుత్రుడు ఈలాంటివాడు. అతడు ప్రభువు ప్రతినిధిగా ప్రజలను పరిపాలిస్తాడు.

"నేను ఆ రాత్రి చూచిన దృశ్యంలో
నరపుత్రుని వంటివాడు
మేఘారూఢుడై రావడం గమనించాను
అతన్ని ఆ శాశ్వతజీవి దగ్గరికి కొనిపోయారు
ఆ నరపుత్రుడు ఆయననుండి పరిపాలనాన్నీ కీర్తినీ
రాజ్యాధికారాన్నీ పొందాడు
అతని పరిపాలనం శాశ్వతమైంది.
అతని రాజ్యానికి అంతముండదు" - దాని 7,13-44

ఇంకా, ఈ నాయకులతోబాటు దేవదూతలుగూడ మధ్యవర్తులుగా పనిజేస్తారు.

వాళ్లు దేవుని భాగ్యాలను ప్రజల యొద్దకు తీసికొని వస్తారు. ప్రజల ప్రార్థనను దేవునికి అర్పిస్తారు. తోబీతు సారా ప్రార్థన చేసినపుడు రఫాయేలు అనే దేవదూత వారి మనవులను దేవుని సన్నిధిలో అర్పించాడు - తోబీ 12,12.

సంగ్రహంగా చెప్పాలంటే పూర్వవేద మధ్యవర్తులు మూడు పనులు చేసారు. వాళ్లు ప్రవక్తలుగా ప్రభువు సందేశాన్ని ప్రజలకు విన్పించారు. బాధామయ సేవకులుగా ప్రజల తరపున శ్రమలనుభవించారు. యాజకులుగా జనుల తరపున ప్రార్థనలు చేసారు. ఇక ఈ పూర్వవేద మధ్యవర్తులంతా నూత్నవేద మధ్యవర్తియైన క్రీస్తునే సూచిస్తారు.

## 2. నూత్నవేద మధ్యవర్తి క్రీస్తు

క్రీస్తు నూత్నవేద మధ్యవర్తి. "దేవుడు ఒక్కడే. దేవునికీ నరునికీ మధ్య మధ్యవర్తి కూడ ఒక్కడే, యేసుక్రీస్తు" - 1తిమొ 2,5. ఈక్రీస్తు ఓ వైపున దేవుడూ మరో వైపున నరుడూ. కనుక అతడు దేవునికీ మానవునికీ మధ్య సంధి గుదర్చడానికి అన్ని విధాల తగినవాడు. ఇతని ద్వారానే తండ్రిని చేరుకోవాలి - హెబ్రే 7:25.

ఈ క్రీస్తు నూత్న మోషే. పూర్వం మోషే యిస్రాయేలీయులకు మధ్యవర్తి. అతని ద్వారానే ఆనాడు ప్రభువు యిస్రాయేలీయులతో ఒడంబడిక చేసికొన్నాడు. అతని ద్వారా వాళ్ళకు ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. ఆ ప్రభువు నూత్నవేదకాలంలో క్రీస్తుద్వారా కొత్త ఒడంబడిక చేసికొన్నాడు. ఈ క్రీస్తు ద్వారా నూత్న ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. "దేవుడు మోషే ముఖాన ధర్మశాస్త్రాన్నిచ్చాడు. కాని యేసు క్రీస్తు మూలాన మనకు కృపాసత్యాలు లభించాయి - యోహా 1,17. ఇక్కడ "కృప" అంటే తండ్రికి మనమీద గల ప్రేమ. "సత్యం" అంటే ఆ తండ్రి క్రీస్తు ద్వారా మనలను రక్షిస్తానని వాగ్దానం చేయడం, రక్షించడం. క్రీస్తు మోషేకు మించిన వరప్రసాదాన్ని తీసికొనివచ్చాడు. అతని మధ్యవర్తిత్వం మోషే మధ్యవర్తిత్వం కంటె గొప్పది. మోషే యిస్రాయేలీయులకు నాయకుడై వారిని వాగ్దత్త భూమికి కొనిపోతే, క్రీస్తు మనకు నాయకుడై మనలను మోక్షానికి కొనిపోతాడు.

ఈ క్రీస్తు సిలువ మీద చనిపోతూ నూత్న నిబంధనం ఏర్పాటు చేసాడు. అతని మరణం ద్వారా నరులకు దోష విముక్తి కలిగింది. ఈ మరణం అతని నిబంధనమూ, వీలునామా కూడ. ఈ వీలునామా ద్వారా మనం దేవుడు వాగ్దానం చేసిన శాశ్వత మోక్షానికి హక్కుదారుల మౌతాం. అనగా క్రీస్తు సిలువ మరణం వలన ఏర్పాటైన నూత్న నిబంధనం ద్వారా మనకు మోక్ష ప్రాప్తి కలుగుతుంది - హెబ్రే 9,15.

మధ్యవర్తి తానెవరికోపు తీసికొంటాడో వాళ్ళ తరపున ప్రార్థన చేస్తాడు. కనుక ఉత్థాన క్రీస్తు మోక్షంలో మన పక్షాన నిరంతరం ప్రార్థన చేస్తుంటాడు. ఆ ప్రార్థన ద్వారా మనలను సదా రక్షిస్తుంటాడు - హెబ్రే 7,25.

క్రీస్తు మధ్యవర్తిత్వం ఈనాడు శ్రీసభ ద్వారా మన మీద సోకుతుంది. అతడు శిష్యులద్వారా శ్రీసభను ఏర్పాటు చేయించాడు. "మీరు వెళ్ళి సకలజాతి జనులను నా శిష్యులనుగా చేయండి. వారికి పిత పుత్ర పవిత్రాత్మ నామమున జ్ఞానస్నానమీయండి" అని ఆదేశించాడు - మత్త 28,18-19. ఈ శిష్యుల ద్వారానే ఈనాడు అతని మధ్యవర్తిత్వం మనమీద పనిచేస్తుంది. అతడు స్థాపించిన జ్ఞానస్నానం దివ్యసత్ప్రసాదం మొదలైన సంస్కారాలు ఈనాడు నరమాత్రుల ద్వారా మనమీద పనిచేస్తాయి.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు సర్వసంపూర్ణుడైన మధ్యవర్తి. పూర్వవేద మధ్యవర్తిత్వమంతా రాబోయే క్రీస్తు వలననే ఫలితాన్ని పొందుతుంది. అతడు స్వయంగా యాజకుడు, ప్రవక్త, రాజు. ఈ మూడు పదవులు ద్వారా అతని మధ్యవర్తిత్వం బహుముఖంగా విస్తరిల్లుతుంది.

2. హెబ్రేయుల జాబు ఈలా చెప్తుంది. క్రీస్తు దయానిధియైన దేవుని సింహాసనం లాంటివాడు. సింహాసనాసీనుడైన రాజు దగ్గరికి వెళ్ళి మన అక్కరలను విన్నవించుకొన్నట్లే ఆ క్రీస్తు దగ్గరికి గూడ వెళ్ళి మన అక్కరలను తెలుపుకోవాలి. ఆ ప్రభువు నుండి కృపను పొందుతాం. మన అక్కరల్లో మనలను ఆదుకొనే వరప్రసాదాన్ని అతని నుండి పొందుతాం - హెబ్రే 4,15-16.

3. ఈనాడు క్రీస్తు నరమాత్రుల ద్వారా తన మధ్యవర్తిత్వాన్ని కొనసాగించుకొని పోతాడని చెప్పాం. ఈ నరమాత్రుల్లో మరియమాత ప్రముఖురాలు. ఆ తల్లి క్రీస్తు ఆర్జించిన వరప్రసాదాన్ని మనకు పంచిపెడుతుంది. ఆమె బ్రతికివుండగా కానావూరి వివాహబృందానికి మేలు చేసింది - యోహా 2,5. క్రీస్తు మరణానంతరం శిష్యులమీదికి ఆత్మ దిగిరావాలని ప్రార్థన చేసింది - అచ 1,14. క్రీస్తు చనిపోతూ ఆమెను శిష్యులకు తల్లిగా దయచేసాడు - యోహాను 19,26-27. ఆ తల్లి ఈనాడు మోక్షంలో వుండి మన తరపున విజ్ఞాపనం చేస్తుంది. క్రీస్తు మధ్యవర్తిత్వం మన మీద సోకేలా చేస్తుంది. కనుక మనం ఆ తల్లికి ప్రార్థన చేసి ఆమె సహాయాన్ని అడుగుకోవాలి.

# 3. గొర్రెపిల్ల

క్రీస్తుకి గొర్రెపిల్ల అని పేరు. ఈ పేరు పూర్వ వేదంలోని రెండు సందర్భాల నుండి వచ్చింది. మొదటిది బాధామయ సేవకుడు, రెండవది పాస్క గొర్రెపిల్ల. కనుక ఈ రెండంశాలను పరిశీలిద్దాం.

## 1. బాధామయ సేవకుడు

యెషయా ప్రవక్త బాధామయ సేవకుణ్ణి వర్ణిస్తూ
"దౌర్జన్యానికి గురైనా అతడు వినయంతో సహించాడు. పలెత్తుమాట అనలేదు.
అతడు వధ్యస్థానానికి గొనిపోబడే గొర్రెపిల్లలాగ,
ఉన్ని కత్తిరింపబడే గొర్రెలాగ
మౌనంగా ఉన్నాడే గాని నోరు తెరవలేదు"

అని చెప్పాడు - 53,7. ఈ వాక్యాల్లో ప్రవక్త సేవకుని వినయాన్నీ, అతడు దైవచిత్తానికి లొంగివుండడాన్నీ వర్ణించాడు. నూత్నవేద రచయితలు ఈ సేవకుళ్ళో క్రీస్తుని చూచారు. సేవకునిలాగే క్రీస్తుకి కూడ గొర్రెపల్లి అని పేరు పెట్టారు. ఈ సేవకుడు క్రీస్తునే సూచిస్తాడని ఫిలిప్పు ఇతియోపీయునికి బోధించాడు - అచ 8,32-35. క్రీస్తుకు తీర్పు జరిగేప్పుడు ప్రధానార్చకుడు తన్ను ప్రశ్నించినా అతడు జవాబీయకుండా మౌనంగా వుండిపోయాడు - మత్త 26,62. అలాగే తన్ను ప్రశ్నించిన పిలాతుకి గూడ జవాబీయకుండా మౌనంగా వుండిపోయాడు - యోహా 19,9. ఈ మౌనం పై యెషయా వాక్యం లోని గొర్రెపిల్ల మౌనాన్ని జ్ఞప్తికి తెస్తుంది. స్నాపక యోహాను క్రీస్తుని తొలిసారిగా శిష్యులకు పరిచయం చేస్తూ "ఇదిగో లోకం పాపాలను పరిహరించే దేవుని గొర్రెపిల్ల" అన్నాడు - యోహా 1,29. ఈ వాక్యంలోని గొర్రెపిల్ల కూడ పై ప్రవచనం లోని గొర్రెపిల్లనే గుర్తుకి తెస్తుంది. కనుక ఈ నూత్నవేద వాక్యాలన్నీ ఆ బాధామయ సేవకుళ్ళాగే క్రీస్తుకూడ గొర్రెపిల్ల అని చెప్తాయి.

## 2. పాస్క గొర్రెపిల్ల

యూదులు ఐగుప్తు నుండి బయలుదేరక ముందు పాస్కగొర్రెపిల్లను వధించి భుజించారు. దాని నెత్తుటిని తమ యిండ్ల ద్వారబంధాలకు పూసికొన్నారు. కనుక దేవదూత ఆ యిండ్లలోని తొలిచూలు పిల్లలను చంపివేయలేదు - నిర్గ 12,21-27. యూదులు ఈ పాస్క గొర్రెపిల్ల నెత్తుటి ద్వారా తమకు దాస్యవిముక్తి కలిగిందని భావించారు. ఈ సంఘటనను సీనాయి కొండదగ్గర జరిగిన నిబంధనంతో జోడించారు. ఈ రెండు

సంఘటనల ద్వారా తాము యావే భక్తుల మయ్యామని యెంచారు. తాము ప్రభువుకి యాజకరూపమైన రాజ్యమూ పవిత్ర ప్రజా అయ్యామని భావించారు - 19,6.

నూత్నవేదం క్రీస్తు మన పాస్కగొర్రెపిల్ల అని చెప్తుంది. ఆ పాస్క గొర్రెపిల్లలాగే క్రీస్తు కూడ నిష్కళంకమైన గొర్రెపిల్ల - 1పేత్రు 1,19. పాస్క గొర్రెపిల్ల అవలక్షణాలు లేనిది - నిర్గ 12,5. అలాగే క్రీస్తు కూడ పాపం లేనివాడు. ఈ నిష్కళంకమైన గొర్రెపిల్ల ఆ పాస్క గొర్రెపిల్లలాగే మన కొరకు బలియై మనకు విముక్తి కలిగిస్తుంది. ఈ బలిద్వారానే మనం దేవునికి నివేదితులమౌతాం. ఎన్నుకొనబడిన జాతి, రాజ గురుకులం, పవిత్రప్రజ, దేవుని సొంతప్రజ ఔతాం - 1పేత్రు 2,9. యేసు క్రీస్తు ద్వారా దేవునికి ప్రీతికరమైన ఆధ్యాత్మిక బలులనర్పిస్తాం - 2,5. చీకటినుండి అద్భుతమైన వెలుగులోనికి ప్రయాణం చేస్తాం - 2,9. ఇది మన నిర్గమనం.

యెరూషలేములో యూదులు శుక్రవారం సాయంత్రం పాస్క గొర్రెపిల్లలను వధించేవాళ్ళు. వాటితో శనివారం పాస్కపండుగ జరుపుకొనేవాళ్ళు. వాళ్ళు శుక్రవారం సాయంత్రం దేవళంలో గొర్రెపిల్లలను వధించేపుడు మన గొర్రెపిల్లయైన క్రీస్తుని గూడ నగరం వెలుపల కొండ మీద వధించారు - యోహా 19,14-16.

క్రీస్తుని సిలువ వేసాక అతని కాళ్ళు విరుగగొట్టలేదు - యోహా 19,33. యూదులు పాస్క గొర్రెపిల్లను భుజించేపుడు దాని యెముకలు విరుగగొట్టగూడదు అనే నిషేధం వుంది - నిర్గ 12,46. ఈ నిషేధం ఇక్కడ క్రీస్తుపట్ల నెరవేరింది. ఈలా ఈ నూత్నవేద వాక్యాలన్నీ క్రీస్తు మన పాస్క గొర్రెపిల్ల అని సూచిస్తాయి.

## 3. మోక్షపు గొర్రెపిల్ల

బైబుల్లో చివరి పుస్తకమైన దర్శన గ్రంథం క్రీస్తుని మోక్షపు గొర్రెపిల్లనుగా వర్ణిస్తుంది. క్రీస్తు గొర్రెపిల్ల వధకు పూర్వం బలహీనమైంది. కాని వధింపబడి ఉత్థానమైనయనంతరం అది సింహం లాగ మహాబలసంపన్నమైన దవుతుంది. యూదా గోత్రపు సింహమైన క్రీస్తు మనలను దాస్యం నుండి విడిపిస్తాడు - దర్శ 5,5-6. ఆ మోక్షపు గొర్రెపిల్ల దేవుని సింహాసనాన్నెక్కుతుంది - 7,17. దుర్మార్గులు ఆ గొర్రెపిల్లను జూచి గడగడ వణకుతారు - 6,16. కడన ఆ గొర్రెపిల్ల మోక్ష వాసులందరికీ కాపరీ నాయకుడూ ఐ వారిని జీవజలాలకు నడిపించుకొనిపోతుంది - 7,17. ఈ వాక్యాలన్నింటిలోను గొర్రెపిల్ల క్రీస్తే. ఆ గొర్రెపిల్ల వధింపబడినట్లుగా కన్పిస్తుంది - 5,6. క్రీస్తుని సిలువమీద వధించారు కదా! ఇంకా ఆ గొర్రెపిల్ల జగదుత్పత్తికి ముందటినుండి వధింపబడివుంది - 13,8. అనగా జగదారంభం నుండే తండ్రి క్రీస్తు బలిని నిర్ణయించాడు. పూర్వవేద బలుల్లోకూడ క్రీస్తుబలి ప్రత్యక్షమై వుంది.

## ప్రార్థనా భావాలు

1. ఆనాడు యూదులు పాస్కగొర్రెపిల్ల మాంసాన్ని భుజించి సంతృప్తి చెందారు. దాని నెత్తుటిని గడప కమ్ములకు పూయగా అది ప్రమాదం నుండి వాళ్ళను కాపాడింది. ఈనాడు మన గొర్రెపిల్లయైన క్రీస్తు దివ్యసత్ప్రసాద రూపంలో మనకు అన్న పానీయాలౌతాడు. అతన్ని ఆరగించి మనం ఆధ్యాత్మికంగా పుష్టి చెందుతాం.

2. పూర్వం యూదులు ఐగుప్తులో గొర్రెపిల్లను బలిగా అర్పించారు. అది వాళ్ళ దాస్యవిముక్తికి కారణమైంది. అటుపిమ్మట వాళ్ళు కనాను దేశాన్ని చేరుకొని అక్కడ స్థిరపడిన పిమ్మట ఏటేట ఈ పాస్కబలిని జరుపుకొనేవాళ్ళు. ఈ వుత్సవం వాళ్ళకు వరప్రసాద కారణమైంది. నూత్నవేదంలో క్రీస్తు ఒకేవొకసారి కల్వరి కొండమీద బలిఅయ్యాడు. ఈ బలిని మనం రోజురోజు మన పీఠాలపై కొనసాగించు కొంటున్నాం. నిర్దోషమైన ఈ గొర్రెపిల్ల బలి ఈనాడు మనకు పాపపరిహారం చేసిపెడుతుంది. క్రీస్తు అనే గొర్రెపిల్ల నిరంతరం మనకొరకు బలిపశువుగా వుండిపోతుంది.

3. "గొర్రెపిల్ల వివాహ మహోత్సవానికి ఆహ్వానింపబడినవారు ధన్యులు" - దర్శ 19,9. యూదులు మోక్షాన్ని వివాహోత్సవం గాను విందుగాను భావించారు. మనమందరం ఓనాడు మోక్షంలో క్రీస్తు గొర్రెపిల్ల సన్నిధిలో వసిస్తాం. అతడు మనకు కాపరీ నాయకుడు ఐ మనలను జీవజలాల వద్దకు నడిపించుకొనిపోతాడు. మన దుఃఖాలన్నీ తొలగించి మనకు నిత్యానందం దయచేస్తాడు - దర్శ 7,17.

4. "మన పాస్క గొర్రెపిల్లయైన క్రీస్తు బలి అయ్యాడు. కనుక దుర్మార్గం దుష్టత్వం అనే పులిసిన పిండితో జేసిన రొట్టెను గాక, నిజాయితి సత్యం అనే పులియని పిండితో చేసిన రొట్టెను వాడుకొని పండుగ జేసికొందాం" - 1కొరి 5,7-8. యూదులు పాస్కపండుగనాడు పులిపిడి ద్రవ్యం కలపని రొట్టెలు తినేవాళ్ళు. వాళ్ళ ఆలోచన ప్రకారం పులిపిడి ద్రవ్యం పాపానికి చిహ్నం. ఇక నేడు క్రీస్తు పాస్కను జరుపుకొనే మనం కూడ పులిపిడి ద్రవ్యాన్ని విసర్జించాలి. అనగా పాపం సోకని పవిత్రమైన జీవితం జీవించాలి. మనకొరకు బలియైన క్రీస్తుగొర్రెపిల్ల నుండే మనకీ భాగ్యం లభిస్తుంది.

5. బోసువే అనే ఫ్రెంచి గురువు ఈలా వ్రాసాడు. "హేబెలులో నీతిమంతుడు బలి అయ్యాడు. అబ్రాహాము ఈసాకుని బలి యీయగోరినపుడు ఆ ఈసాకు రాబోయే క్రీస్తుబలినే సూచించాడు. యోసేపు అనుభవించిన శ్రమలు క్రీస్తు శ్రమలనే సూచిస్తాయి. సోదరులు యోసేపునిలాగే ప్రజలు క్రీస్తుని ద్వేషించారు, హింసించారు, చంపబోయారు. యోసేపునిలాగే అతన్ని కూడ బానిసనుగా అమ్మివేసారు. మృత్యువనే బావిలో పడద్రోసారు. బావిలోవున్న యిర్మియా, అగ్నిగుండంలో వున్న ముగ్గురు బాలకులు, సింహాల గుంటలో వున్న దానియేలు అతన్నే జ్ఞప్తికి దెస్తారు. ప్రతి బలిలోని బలిపశువు కూడ ఆ క్రీస్తునే సూచిస్తుంది. నోవా వోడనుండి బయటికి వచ్చాక అర్పించిన బలి అతన్నే సూచిస్తుంది. పితరులు కొండల మీద అర్పించిన బలులూ, మోషే గుడారంలో అర్పించిన బలులూ, యూదులు దేవళంలో అర్పించిన బలులూ అతన్నే జ్ఞప్తికి తెస్తాయి. ఈ విధంగా ఎల్లకాలాల్లోను సూచనమాత్రంగా బలియౌతూవచ్చిన ప్రభువు, ఇప్పుడు యథార్థంగా బలికావడానికి విచ్చేసాడు." ఇవి లోతైన వాక్యాలు.

# 4. కాపరి

## 1. యావే ప్రభువు కాపరి

పూర్వవేదం యావే ప్రభువును కాపరితో ఉపమిస్తుంది. "ప్రభువే నాకు కాపరి, ఇక యే కొదవా లేదు" అంటాడు కీర్తనకారుడు - 23,1. బాబిలోనియాకు బందీలుగా వెళ్ళిన యూదులు యెరూషలేముకు తిరిగిరావడాన్ని గూర్చి చెప్తూ యెషయా ప్రవక్త

"ప్రభువు కాపరివలె తన మందను మేపుతాడు
గొర్రెపిల్లలను చేతులలోనికి దీసికొని
రొమ్ముమీద బెట్టుకొని మోసికొనిపోతాడు
వాని తల్లులను మెల్లగా అదలిస్తాడు"

అన్నాడు-40,11. ఈ ప్రవచనంలో ప్రభువు మృదు హృదయాన్ని రమ్యంగా చిత్రించాడు ప్రవక్త. యావే ప్రభువు కాపరియైతే అతడు మేపే గొర్రెలు యిస్రాయేలు ప్రజలు. కనుకనే "నీ ప్రజలమూ, నీ మందా ఐన మేము నీకు సదా కృతజ్ఞతలు తెల్పుకొంటాం" అన్నాడు భక్తుడు - కీర్త 79,13. కాపరి గొర్రెలను కాచి కాపాడతాడు. అలాగే యావే కూడ యిస్రాయేలు ప్రజలను ఆదరించి సంరక్షిస్తాడు.

## 2. భావోత్పత్తి

యావే కాపరిలాంటివాడు తాము గొర్రెల లాంటివాళ్ళు అనే భావం యిస్రాయేలు ప్రజల్లో ఏలా ఉద్భవించింది? యిస్రాయేలీయులకు సమీప ప్రజలైన ఈజిప్టు బాబిలోనియా ప్రజల్లో గూడ ఈ భావాలు ప్రచారంలో వుండేవి. ఈ దేశాల జనులు తమ రాజును కాపరిగా భావించేవాళ్లు. తమ్ము గొర్రెల మందనుగా ఎంచుకొనేవాళ్లు. ఈ భావాలే యిస్రాయేలు ప్రజల్లో గూడ ప్రవేశించి వుండవచ్చు.

ప్రాచీన హీబ్రూ ప్రజలు ఓ స్థిరనివాసమంటూ లేకుండా అటూయిటూ తిరుగుతుండేవాళ్ళు. గొర్రెలమందలను గూడ తమతో తోలుకొని పోతుండేవాళ్లు. హేబెలు గొర్రెలకాపరి - ఆది 4,2. "మా ముత్తాతల్లాగే మేముకూడ గొర్రెల కాపరులం" అంటారు ఫరోతో యోసేపు సోదరులు - ఆది 47,3. బహు ప్రాచీన కాలంలోనే హీబ్రూ ప్రజలు గొర్రెలను మచ్చిక చేసారు. గొర్రె అనే పదం బైబుల్లో 500 సార్లు తగులుతుంది. ఇంత ప్రచురంగా వాడబడిన ఈ ప్రాణి యిస్రాయేలీయుల సామాన్య జంతువుల్లో వొకటి.

గొర్రె వారికి సామాన్య జంతువు కావడానికి కారణాల్లేకపోలేదు. హీబ్రూ ప్రజలకు బహువిధాల ఉపయోగపడింది గొర్రె. వారు దాన్ని మాంసాన్ని భుజించేవాళ్లు. పాలు త్రాగేవాళ్లు. ఉన్నిని బట్టలకు గుడారాలకు వాడుకొనేవాళ్లు. వ్యాపారంలో గొర్రె మారకపు ధనంగా ఉపయోగపడేది. గుడారాల కాలంలో నైతేనేం దేవాలయ కాలంలో నైతేనేం గొర్రెలను బలిపశువుగా అర్పించారు. పైగా గొర్రె సాధుజంతువు. విశ్వాసంతోను స్నేహభావంతోను కల్లాకపటం లేకుండా కాపరివెంట నడచిపోతుంటుంది. కాపరి తన్ను కాపాడితేనే గాని బ్రతకలేని బలహీనపు జంతువు. ఇన్ని కారణాల చేత గొర్రె యిస్రాయేలు ప్రజలకు అనురాగయోగ్యమైన ప్రాణి ఐంది. కావున వాళ్లు తమ్ము గొర్రెలమందతో పోల్చుకొన్నారు. తమ దేవుడైన యావేను కాపరితో పోల్చారు. ఇక్కడ కాపరి అంటే నాయకుడు అని భావం.

## 3. యూదుల నాయకులూ కాపరులే

యూదుల చరిత్రను పరికించినట్లయితే మరో విషయం కూడ స్పష్టమౌతుంది. వీళ్ళ నాయకుల్లో చాలమంది కాపరులు. మోషే గొర్రెల కాపరి. "మోషే అహరోనుల ద్వారా నీ జనులను మందవలె నడిపించుకొని పోయావు" అంటుంది కీర్తన 77,20. దావీదురాజు తొలిరోజుల్లో కాపరే. కనుక ప్రభువు అతనితో "గొర్రెలను గాసుకొంటూ పొలాల్లో తిరుగాడుతూన్న నిన్ను బిలిపించి నా ప్రజలమీద అధిపతిగా నియమించాను"

అన్నాడు -2సమూ 7,3. ప్రవక్తయైన ఆమోసు కాపరి -ఆమో 1:1. ఈ విషయాలనుబట్టి చూస్తే కాపరి-గొర్రె అనే భావం యిస్రాయేలీయులలో బాగా జీర్ణమైపోయినట్లు కన్పిస్తుంది. కాని యీ జనులు ఈ భావాన్ని తమకూ తమ దేవునికీ అన్వయించుకోవడం చాల ధైర్యసాహసాలతో గూడిన విషయం. ఈ ప్రజలకు తమ భగవంతుని పట్లగల చనువు అంత గొప్పది అనాలి.

## 4. మెస్సీయా కాపరి

యావే ప్రతినిధి, యావే తరపున ప్రజలను పరిపాలించేవాడు మెస్సీయా. యావేతోపాటు ఈ మెస్సీయాను గూడ కాపరితో ఉపమించారు హీబ్రూ రచయితలు. యావే యెన్నుకొన్న రాజులు దుష్టులూ అవిశ్వాసపరులూఐ ప్రజలను పీడిస్తూ వచ్చారు. "తమ లాభాన్ని తామే చూచుకొనే యిస్రాయేలు కాపరులంటే నాకు పరమ అసహ్యం. కాపరి మంద బాగోగులను విచారించి చూడవద్దా" అంటాడు ప్రభువు - యెహెజ్కేలు 34,2. ఈ దుష్టరాజులతో విసిగిపోయి "ఇక వీళ్ళతో, నా కవసరం లేదు. నా మందను నేనే మేపుకొంటాను" అంటాడు ప్రభువు - 34,15.

హీబ్రూ రచయితలు ఈ సందర్భంలోనే వో క్రొత్త భావాన్ని ప్రవేశపెట్టారు. యావే తన ప్రతినిధియైన మెస్సీయాను తనకు బదులుగా మందకు కాపరినిగా నియమిస్తాడు. అతడు దావీదు ప్రభువును తలపించే క్రొత్త దావీదు ఔతాడు - యెహెజ్కేలు 34,23-24

## 5. గాయాలు తగిలిన కాపరి

చివరి ప్రవక్తల్లో వొకడు జెకర్యా. అతని నాటికి మరో భావం ప్రచారంలోకి వచ్చింది. ఓగొప్ప కాపరి బయలు దేరాడు. అతనికి గాయాలు తగులుతాయి. శత్రువులు అతని వక్షస్సును వ్రయ్యలు చేస్తారు. అతడు సొంత ప్రాణాలొడ్డి మందను కాపాడతాడు. "వాళ్లు తాము కత్తితో పొడిచినవాని వైపు చూస్తారు. ఏకైక కుమారుని కోల్పోయినవారివలె అతని కొరకు విలపిస్తారు" - జెక 12,10.

ఈలా పూర్వవేదంలో కాపరిని గూర్చిన భావాలు కొండమీది సెలయేళ్ళలాగ బహుముఖాలుగా వెలుబడ్డాయి. ఈ భావాలన్నీ ఎవరియందు సార్థకం గావాలి? ఈ జీవ వాహినులన్నీ ఏ సముద్రంలో సమ్మేళనం గావాలి?

## 6. క్రీస్తు కాపరి

పూర్వవేద ప్రవక్తలు సూచించిన కాపరి రానే వచ్చాడు. "బేత్లెహేమూ! యిస్రాయేలు పాలకుడు నీనుండే ఉద్భవిస్తాడు" అన్న మీకా ప్రవచనం ప్రకారం అతడు బేత్లెహేం

నగరంలోనే జన్మించాడు - మీకా 5,2. ఈ కాపరిని దర్శించడానికి పొలాల్లోని కాపరులు పరుగుపరుగున వచ్చారు - లూకా 2,15-16.

ఈ క్రీస్తు యిస్రాయేలీయుల్లో చెదరిపోయిన గొర్రెల కోసం వచ్చాడు - మత్త 15,24. శిష్యులు అతని చిన్నమంద - లూకా 12,32.

ఈ కాపరి దయార్ద్ర హృదయుడు. తప్పిపోయిన గొర్రెను వెదక్కుంటూ వెళ్ళేవాడు - లూకా-15,4-7. ఈలాంటి దయాపరుడైన కాపరినే యిస్రాయేలీయులకు దయచేయమని పూర్వం మోషే యావేను ప్రార్థించాడు - సంఖ్యా 27,15. ఈ దయ క్రీస్తులో ఎల్లవేళలా కన్పించేది. కనుక అతడు నాయకుడు లేని తననాటి ప్రజలను చూచి ఎంతో చింతించాడు. "కాపరిలేని గొర్రెలవలె చెదరియున్న జనసమూహాన్ని చూచి ఆ కరుణామయుని కడుపు తరుక్కొని పోయింది" - మత్త 9,36.

ఆ ప్రభువు జీవితాంతమూ మంచి కాపరిలాగే వ్యవహరించాడు. కడన జకర్యా ప్రవచనం చెప్పినట్లుగానే యూదులు అతన్ని వధించారు. అతని రొమ్ము పొడిచారు, తెరిచారు కూడ - మత్త 26,31. కాని ఈ మందకోసం ప్రాణాలర్పించడం ద్వారానే అతడు "గొప్పకాపరి" కాగలిగాడు - హీబ్రూ 13,20 ; 1పేత్రు 2,25. కాపరియైన ఈ ప్రభువు చెంతకు మనమంతా నమ్మకంతో వెళ్ళాలి.

బైబుల్లోని చివరి పుస్తకమైన దర్శన గ్రంథం, ఉత్థాన క్రీస్తుని మోక్షంలోని పునీతుల మధ్య సంచరించే కాపరినిగా చిత్రిస్తుంది. "సింహాసనం మధ్యనున్న గొర్రెపిల్ల వారికి కాపరి ఔతుంది. వారిని జీవజలాల వద్దకు నడిపించుకొని పోతుంది" - 7,17. ఈలా క్రీస్తు ఈఆ లోకంలోను మరులోకంలోను గూడ కాపరిలా వ్యవహరిస్తాడు.

## 7. నాల్గవ సువార్త చిత్రించిన కాపరి

యెహెజ్కేలు ప్రవచనం 34వ అధ్యాయాన్ని ఆధారంగా తీసికొని నాల్గవ సువార్తాకారుడైన యోహాను తన సువిశేషం 10వ అధ్యాయంలో క్రీస్తుని మంచికాపరినిగా చిత్రించాడు. కాపరిని గూర్చిన తొలి మూడు సువార్తల్లోని భావాలకంటె యితని భావాలు కొంచెం విశిష్టంగా వుంటాయి. అంచేత వీటిని ప్రత్యేకంగా విచారించి చూడ్డం అవసరం.

క్రీస్తు గొర్రెలను గాసే "మంచి కాపరి" - 11. పూర్వం యావే పేరుమీదిగా ప్రజలను పాలించిన దుష్టరాజులు "చెడ్డ కాపరులు". వాళ్ళు ప్రజలను పీడించారు. వీళ్ళలా కాకుండా క్రీస్తు ప్రజలకు మేలు చేస్తాడు. గొర్రెలు పచ్చికబయళ్ళకు నడిపించుకొని పోయేవాడూ అతడే-4.

అతనికి గొర్రెల పేర్లు తెలుసు-15. పేరుపెట్టి పిలవగానే గొర్రెలన్నీ అతన్ననుసరిస్తాయి. అతడు గొర్రెల కోసం తన ప్రాణాలనే బలిగా అర్పిస్తాడు - 17.

ఒకేమంద ఒకేకాపరి వుండాలని అతని కోరిక-16. అనగా ప్రజలంతా తన్ననుసరించాలనీ, తనద్వారా నిత్యజీవం పొందాలనీ క్రీస్తు అభిమతం. ఆదర్శప్రాయుడైన కాపరి అంటే యీలా వుండాలి కదా!

ఈలా పూర్వవేదంనాటి కాపరిని గూర్చిన భావాలు ప్రచారంలోకి వచ్చాయి. ఇవి కొంతవరకు యావే ప్రభువుకీ కొంతవరకు భవిష్యత్తుల్లో రాబోయే మెస్సీయాకూ వర్తిస్తాయి. పూర్వవేదంలోని యావేకు మారుగా నూత్నవేదంలో క్రీస్తు విచ్చేసాడు. యావే పూర్వవేదం లోని ప్రజల పట్ల ఏలా కాపరిలా మెలిగాడో అలాగే క్రీస్తు నూత్నవేద ప్రజలమైన మనపట్ల కాపరిలా మెలిగాడు. ఆ ప్రభువుని అనుసరిస్తే మనకు క్షేమమూ భద్రతా కలుగుతాయి.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు దయామయుడైన కాపరి. పూర్వం హేబెలు ప్రాణాలు అర్పించాడు - ఆది 4,8. బాధామయుడైన సేవకుణ్ణి గొర్రెపిల్లను లాగ వధ్యస్థానానికి నడిపించుకొనిపోయారు, వధించారు - యెష 53,7. మందకు మేలుచేయాలనే కోరికగల మంచికాపరిని బట్టి రొమ్ములు బ్రయ్యలు చేసారు- జెక 12,10. వీళ్ళంతా క్రీస్తుకి సూచనగా వుండే మహానుభావులు. వీళ్ళందరి లక్షణాలు క్రీస్తునందు ఫలసిద్ధినొందుతాయి. కావుననే "నేను గొర్రెల కోసం ప్రాణాలు అర్పిస్తాను" అన్నాడు ప్రభువు - యోహా 10,15. తన మరణం ద్వారా మనకు జీవాన్ని చేకూర్చి పెట్టిన త్యాగమూర్తి అతడు. కావున మనం అతనికి ప్రణమిల్లాలి.

2. ఈ సందర్భంలో క్రీస్తు కాపరి లక్షణాలను గూడ పరిశీలిద్దాం. కాపరి గొర్రెలను మంద గూరుస్తాడు. అలాగే క్రీస్తు కాపరి దేవుని ప్రజలను ఒక్కమందగా ఐక్యపరుస్తాడు - యోహా 10,16. రోజురోజు ఈ గొర్రెలను లెక్కించి చూస్తాడు. ఏవైనా తప్పిపోతే వెంటనే జాగ్రత్తపడతాడు - లూకా 15,3-7. మేతకోసం గొర్రెలను పచ్చిక బయళ్ళకు తోలుకొనిపోతాడు. అక్కడ వన్యమృగాల నుండి వాటిని కాపాడతాడు. వాటికోసం ప్రాణాలు కూడ అర్పిస్తాడు - యోహా 10,11. చెడు గొర్రెలను నుండి మంచి గొర్రెలను వేరుజేస్తాడు. చెడ్డవానికి నరకశిక్షా మంచివానికి మోక్ష సంభావనా దయచేస్తాడు - మత్త 25,31-46. మనం ఈ మంచి గొర్రెల్లా ప్రవర్తించాలి.

3. ప్రభువు గొర్రెలకు ప్రభువు తెలుసు - యోహా 10,15. అవి ప్రభువు స్వరాన్ని వింటాయి - 10,3. ప్రభువు భక్తులూ శిష్యులూ అతని స్వరాన్ని తమ అంతరాత్మలోనే వింటారు. విని అతన్ని అనుసరిస్తారు. అతన్ని అనుభవపూర్వకంగా తెలిసికొంటారు. నిండు హృదయంతో ప్రేమిస్తారు. క్రీస్తుపట్ల వ్యక్తిగతానుభవం లేనివాడు అతని శిష్యుడు అనిపించుకోవడానికి యోగ్యుడు కాడు.

4. కాశ్మీర శైవశాఖకు చెందిన పాశుపత శైవులు శివుణ్ణి పశుపతి గాను తమ్ము వృషభంగాను భావించుకొనేవాళ్లు. భాగవత శాఖకు చెందిన వైష్ణవులు కృష్ణుని గోపాలుని గాను తమ్ము గోవుని గాను భావించుకొనేవాళ్లు. ప్రజల భక్తి భావాలు ఆయా సంస్కృతికి తగినట్లుగా బహువిధాలుగా వుంటాయి. బైబులు దేవుణ్ణి కాపరిని గాను భక్తుని గొర్రెగాను చిత్రిస్తుంది. ఇది పండితులకు పామరులకు గూడ అందుబాటులో వుండే సామాన్య భక్తిభావం. మనం ఈ భావాన్ని చక్కగా అర్థం చేసికొని ఆ ప్రభువు పట్ల వ్యక్తిగతమైన అనుభవాన్ని పెంపొందించుకోవాలి.

# 5. జగజ్జ్యోతి

వెల్తురు ఆహ్లాదాన్నీ ఉత్తేజాన్నీ కలిగిస్తుంది. ఈ భావాన్ని ఆధారంగా తీసికొని బైబులు దేవుణ్ణి, అతని కుమారుడైన క్రీస్తునీ వెలుగునుగా చిత్రిస్తుంది. ఆ క్రీస్తుని పూజించే భక్తులు కూడ వెలుగునకు సంబంధించిన వాళ్ళయి వుండాలని చెప్తుంది. ఈ యంశాలను విపులంగా పరిశీలిద్దాం.

## పూర్వవేదం

### 1. దేవుడే వెలుగును చేసాడు

సృష్ట్యాదిలో దేవుడు వెలుగును చేసాడు. అతడు వెలుగు కలగాలి అనగానే వెలుగు పుట్టింది - ఆది 1,3. వెల్తురికి ప్రత్యర్థియైన చీకటి ఆదిలో అగాధ జలాలమీద వ్యాపించివుంది - 1,2. భగవంతుడు ఈ చీకటిని తొలగించి వెలుగును కలిగించాడు. చీకటి వెలుగులను రెండింటినీ అతడే సృజించాడు - యెష 45,7. కనుక అవి రెండూ అతనికి లొంగివుంటాయి.

### 2. భగవంతుడు వెల్తురు

బైబులు చాల తావుల్లో భగవంతుడు తేజోమయుడని చెప్తుంది. అతడు వెల్తురిని వస్త్రంలాగ తాల్చాడు - కీర్త 104,2. మెరుపులను బాణాల్లాగ విసురుతాడు - 18,14.

అతని సింహాసనం స్ఫటిక ఫలకంలా మెరిసిపోతూంటుంది - నిర్గ 24,10. అతడు సీనాయి కొండమీద పొగల్లో సెగల్లో నిప్పుమంటల్లో ఉరుముల్లో మెరుపుల్లో భూకంపంలో మోషేకు దర్శనమిచ్చాడు - నిర్గ 19,18. అనగా అతడు జ్యోతిర్మూర్తి. దీనికి భిన్నంగా పాతాళ లోకం అంధకార బంధురమైంది - కీర్త 88,6. ప్రకాశమూర్తియైన ప్రభువు పాతాళలోకంలోని వాళ్ళను చూస్తాడు గాని వాళ్ళు అతన్ని చూడలేరు.

## 3. వెలుగు జీవాన్నిస్తుంది

బైబుల్లో వెలుగుకి చాలా అర్థాలున్నాయి. కాని అది ప్రధానంగా జీవానికి చిహ్నంగా వుంటుంది. "వెలుగు మనోజ్ఞమైంది. సూర్యుని చూచి మన నేత్రాలు ఆనందిస్తాయి - ఉపదే 11,7. కనుక వెల్తురంటే చూడ్డం, ఆనందించడం, జీవించడం. గ్రుడ్డివాడు వెల్తురును చూడలేడు. కనుక అతని బ్రతుకు చావుతో సమానం. ఐతే చావుని తెచ్చిపెట్టే రోగాన్ని తప్పించుకొని బ్రతికి బయటపడ్డవాడు మాత్రం మళ్లా సజీవుల మీద ప్రకాశించే వెలుగులో నడుస్తాడు - కీర్త 56,13. అనగా అతడు జీవాన్ని పొందుతాడు. ఈ సందర్భంలో ఓ కీర్తనకారుడు భగవంతుణ్ణి ఉద్దేశించి

"నీవు జీవపు చెలమవు
నీ వెలుగువలననే మేమూ వెలుగు చూస్తాం"

అని వాకొన్నాడు - 36,9. ఇక్కడ మనం చూచే "వెలుగు" ఆనందం, జీవం. ఈ జీవం మనకు దేవుని నుండే లభిస్తుంది.

బైబుల్లో వెలుగుకి చాల సాంకేతికార్థాలున్నాయి. జ్యోతి అంటే జీవం, ఆనందం, రక్షణం, భగవంతుడు. అలాగే తమస్సు అంటే దుఃఖం, వినాశం, పాతాళలోకం, చావు, పిశాచం.

ప్రభువు తేజస్సు అతని ఉపకారగుణాన్ని సూచిస్తుంది. కనుకనే కీర్తనలు వ్రాసిన భక్తులు చాలమంది "ప్రభూ! నీ ముఖకాంతిని ఈ దాసుని మీద ప్రసరింపజేయి" అని ప్రార్థించారు - 31,16. మరో భక్తుడు

"ప్రభువు నాకు దీపం, నాకు రక్షణం
ఇక నే నెవరికీ భయపడ నక్కరలేదు"

అని నమ్మాడు - 27,1.

ప్రభువులాగే అతని వాక్కుకూడ తేజోవంతమైంది.

"నీ వాక్యం నా పాదాలకు దీపం
నా త్రోవకు వెలుగు" - 119,105.

ప్రభువు తేజస్సు మన చీకట్లనూ ఇక్కట్టులనూ తొలగించి మనకు రక్షణాన్ని దయచేస్తుంది. కనుకనే భక్తుడు

"ప్రభూ! నీవు నాకు దీపం వెలిగిస్తావు
నా త్రోవలోని చీకటిని తొలగిస్తావు"

అని వాకొన్నాడు - 18,28. ఈ సందర్భంలో మీకా ప్రవక్త "మనమిపుడు చీకట్లో వున్నా ప్రభువు మనకు వెలుగును దయచేస్తాడు. మనమతని రక్షణాన్ని పొందితీరుతాం" అని నుడివాడు - 7,8-9. ప్రభువు అనుగ్రహాన్ని పొందినవాళ్ళకు

"చీకట్లో గూడ వెలుగు ప్రకాశిస్తుంది
వాళ్ళ చుట్టూగా వున్న అంధకారం
మట్టమధ్యాహ్నపు వెల్తురుగా మారిపోతుంది"

యెష 58,19. ఈ పట్టున సామెతల గ్రంథం కూడ

"సత్పురుషుల మార్గం వెలుగు వంటిది
దాని ప్రకాశం పట్టపగలు వరకు
క్రమంగా వృద్ధిచెందుతుంది"

అని చెప్తుంది - 4,18.

## 4. మెస్సీయా వెలుగు

"చీకటిలో నడచే జనులు పెద్ద వెలుగును చూచారు" అన్నాడు యెషయా - 9,2. ఏమిటి ఈ వెలుగు? మెస్సీయాయే. ఇంకా ఈ ప్రవక్త యెరూషలేమును గూర్చి చెప్తూ

"నీకిక పగలు సూర్యుని వెలుగక్కరలేదు
రేయి చంద్రుని వెన్నెల యక్కరలేదు
ప్రభువునైన నేను నీకు శాశ్వతజ్యోతి నౌతాను
నీ దేవుడనైన నేను నీకు తేజస్సు నౌతాను"

అని పల్కాడు 60,19. మెస్సీయా ద్వారానే ప్రభువు తనర ప్రజలకు శాశ్వతజ్యోతి ఔతాడు. యెషయా ప్రవచనంలో బాధామయ సేవకుడు అనే వ్యక్తి తగులుతాడు. ఇతడు నూత్నవేదంలో రాబోయే క్రీస్తుకి ప్రతీకగా వుంటాడు. దేవుడు ఈ సేవకునితో

"నేను నిన్ను జాతులకు జ్యోతినిగా నియమిస్తున్నాను" అని చెప్పాడు -49,6. ఈ వాక్యాలన్నీ గూడ నూత్నవేదంలో రాబోయే మెస్సీయా వెలుగు అని సూచిస్తాయి.

## 5. క్రీస్తు వెలుగుగా అవతరించాడు

పై పూర్వవేద ప్రవచనాలన్నీ నెరవేరి నూత్న వేదంలో క్రీస్తు వెలుగుగా జన్మించాడు. "చీకటిలో నడిచే ప్రజలు పెద్ద వెలుగుని చూచారు" అనే పై యెషయా ప్రవచనాన్ని క్రీస్తుకి అన్వయించాడు మత్తయి - 4,16. ఇంకా స్నాపక యోహాను జన్మించినపుడు జకరియా తన ప్రవచన గీతంలో "దయార్ధ్ర హృదయుడైన దేవుడు తన రక్షణపు వెలుగుని మనపై ప్రసరింపజేసాడు" అని నుడివాడు - లూకా 1,78. ఈ రక్షణపు వెలుగు క్రీస్తే. ఈ విధంగా క్రీస్తు ప్రకాశమూర్తిగా అవతరించాడు.

## 6. క్రీస్తు దివ్యరూపధారణం వెలుగు

క్రీస్తు తబోరుకొండమీద దివ్యరూపం ధరించాడు. అతని ముఖం సూర్యునివలె ప్రకాశించింది. వస్త్రాలు వెలుగు లాగ తెల్లనయ్యాయి - మత్త 17,2. అప్పుడు దేవుని తేజస్సు క్రీస్తు ముఖంలో ప్రకాశించిందో అన్నట్లు చూపట్టింది. వెలుగుకి ఆధారభూతుడూ, ఎవరూ చేరలేని దివ్యతేజస్సులో వసించేవాడూ ఐన తండ్రి, ఈ క్రీస్తుద్వారా మనమధ్య ప్రత్యక్షమయ్యాడు - 1తిమో 6,16. అసలు దేవుడు చీకటి ఏమాత్రమూలేని వెలుగు - 1యో 1,5. ఆ జ్యోతిర్మూర్తి కుమారుడు క్రీస్తు. కనుక క్రీస్తుకూడ సంపూర్ణ ప్రకాశమే.

## 7. తన వాక్క్రియలద్వారా క్రీస్తు వెలుగు

నూత్నవేదం క్రీస్తు జ్యోతి అని మాటిమాటికి చెప్తుంది. అతడు ప్రపంచానికి వెలుగు - యోహా 9,5. జగత్తుకి జ్యోతి అతడే. కనుక అతన్ని విశ్వసించేవాడు అంధకారంలో నడవక జీవపు వెలుగును పొందుతాడు - 8,12. క్రీస్తు గ్రుడ్డివారికి చూపును దయచేసిన అద్భుతాలు ఈ సత్యాన్ని మరింత ప్రస్ఫుటంగా వెల్లడి చేస్తాయి.

క్రీస్తు పలుకులు వెలుగు. అతడు లోకానికి వెలుగుగా విచ్చేసాడు. కనుక అతన్ని విశ్వసించేవాడు చీకటల్లో నడువడు - యోహా 12,46. అతని చేతలు కూడ వెలుగే. ఆ ప్రభువు వెల్తురుగా లోకంలోనికి వచ్చి ప్రతి మానవునికి వెలుగునిస్తుంటాడు - 1,9. అతనిలో చీకటి వెలుగులకు ఘర్షణం జరుగుతూంటుంది. సద్వర్తనలు ఆ వెలుగును సమీపిస్తారు. దుష్క్రియలు చేసేవాళ్ళు మాత్రం వెలుగుకంటే చీకటినే అధికంగా ఆశిస్తారు. వాళ్ళు ప్రభువు శిష్యులుకారు, అతని దగ్గరికి రారు - 3,19. అలాంటివాళ్ళల్లో యూదా వొకడు. అతడు ద్రోహియైకూడ తోడి శిష్యులతో పాటు ప్రభువును రొట్టెరూపంలో స్వీకరించాడు. ఆ పిమ్మట గది నుండి వెలుపలికి వెళ్ళిపోయాడు. అది రాత్రివేళ -

13,30. ఇక్కడ రేయి పిశాచానికి చిహ్నం గనుక యూదా పూర్తిగా పిశాచం వశంలో వుండిపోయాడని భావం. ఇంకా, అతడు క్రీస్తుని పట్టియిచ్చిన వేళకూడ అంధకార శక్తితో కూడింది - లూకా 22,53. కాని, క్రీస్తు మాత్రం మరణానంతరం సజీవుడై లేచి ఎల్లరికీ రక్షణ జ్యోతిని వెల్లడిచేస్తాడు - అచ 26,23.

## 8. క్రీస్తుని విశ్వసించేవాళ్ళు వెలుగు

ప్రభువు వెల్తురుగా లోకంలో అవతరించాడు. దుష్టవర్తనులు కాదుగాని సద్వర్తనులు ఆ పరంజ్యోతిని సమీపించి అతనిలాగే తామూ జ్యోతిర్మూర్తులుగా మారిపోతారు- యోహా 3,19. క్రీస్తుని విశ్వసించేవాళ్ళు ప్రకాశవంతులు, అతన్ని నిరాకరించేవాళ్లు తమోమయులు. ఇహలోక మానవులు. మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందగానే అతని వెల్తురు మనలో ప్రకాశించడం మొదలుపెడుతుంది. ఆ సమయంలోనే తండ్రి మనలను అంధకార శక్తినుండి విడిపించి తన ప్రియపుత్రునికి చెందిన వెలుగు సామ్రాజ్యం లోనికి పిలుస్తాడు - కొలో 1,12-13. జ్ఞానస్నానం ద్వారా తండ్రి మనలను చీకటిలో నుండి అద్భుతమైన వెలుగులోనికి పిలుస్తాడు - 1పే 2,9. జ్ఞానస్నానానికి పూర్వం మనమంతా చీకటిలో వుండేవాళ్ళమే. కాని ఈ సంస్కారానంతరం మనం దైవప్రజలమై వెలుగులో వుంటాం. కనుక మనం వెలుగునకు సంబంధించిన ప్రజల్లాగే జీవించాలి - ఎఫె 5,8.

## 9. మన నైతిక జీవితం వెలుగుతో నిండివుండాలి

వెలుగుకు సంబంధించిన మనం ఆ వెలుగునకు తగిన జీవితమే జీవించాలని చెప్పాం. ఎంతచెట్టుకి అంతగాలికదా! మనం చీకటికి చెందిన పనులను మానివేసి, వెలుతురులో జీవించే ప్రజలంగా సత్ప్రవర్తనం అలవర్చుకోవాలి - రోమా 13,12. పాపకార్యాలను వదలి పుణ్యకార్యాలను సాధించాలి. ఈ సాధనాన్నే యోహాను "వెలుగులో నడవడం" అని వాకొన్నాడు - 1యోహా 1,7. ఈలా వెలుగులో నడిచేవాళ్ళ ప్రధాన లక్షణం సోదర ప్రేమ. తోడి నరుణ్ణి ప్రేమించేవాళ్లు వెలుగులోను, అతన్ని ద్వేషించేవాళ్లు అంధకారంలోను ఉన్నారు అనుకోవాలి - 1యో 2,10-11.

మనతరపున మనం వెలుగు కలవాళ్ళమైతే ఇతరులకు కూడ వెలుగును చూపిస్తాం. కనుకనే క్రీస్తు "మీరు లోకానికి వెలుగై యున్నారు. మీ వెలుగుని ప్రజల యెదుట ప్రకాశింపనీయండి" అని చెప్పాడు - మత్త 5,14-16. ఈలా ఇతరులకు క్రీస్తు వెలుగుని చూపించడమే మన ప్రేషిత సేవ.

## 10. మోక్షపు వెలుగు

బైబుల్లో చివరిదైన దర్శన గ్రంథం మోక్షాన్ని వెల్తురుగా చిత్రిస్తుంది. "ఆ నగరానికి సూర్యచంద్రుల వెల్తురుతో అవసరంలేదు. గొర్రెపిల్లే ఆ నగరానికి దీపం. ప్రపంచపు జనులంతా ఆ దీపపు వెలుగులో నడుస్తారు" ప్రక 21,23-24. మోక్షంలో క్రీస్తే మనకు వెలుగు ఔతాడు - 22,5. ఆ కాంతివల్ల మనం మిలమిలా మెరిసిపోతాం. నీతిమంతులు తండ్రి రాజ్యంలో సూర్యునిలా ప్రకాశిస్తారు - మత్త 13,43. వెలుగునకు సంబంధించిన వారు సదా ఈ నమ్మకంతో జీవిస్తారు. మనతోపాటు విశ్వాసంతో జీవించి చనిపోయినవారికి గూడ ప్రభువు ఈ వెలుగును దయచేయాలని మనం నిరంతరం ప్రార్థిస్తూంటాం.

### ప్రార్థనా భావాలు

1. తండ్రి వెలుగు క్రీస్తు ముఖంలో ప్రకాశిస్తుంది. క్రీస్తు వెలుగు అతని శిష్యులమైన మన ముఖంలో ప్రకాశిస్తుంది. ఆ తండ్రి ఆదిలో చీకటినుండి వెలుగు ప్రకాశించుగాక అని పల్కాడు. అలాగే వెలుగు పుట్టింది. అతని తేజస్సు ఉత్థాన క్రీస్తుపై ప్రసరించింది. ఈనాడు ఆ ఉత్థానన క్రీస్తు వెల్తురు మన హృదయాల్లో ప్రకాశిస్తుంది. క్రీస్తుపట్ల మనకుండే విశ్వాసమే ఈ వెల్తురు - 2కొ 4,6. మన తరపున మనం ఈ క్రీస్తు వెల్తురుని అధికాధికంగా పొందాలని నిరంతరం ప్రార్థిస్తూండాలి. పూర్వవేద ప్రజలు "ప్రభువు తన ముఖకాంతిని మనపై ప్రసరింపజేసి మనలను ఆదరంతో జూచునుగాక" అని ప్రార్థించేవాళ్ళు - సంఖ్యా 6,25. "ఓ దేవా! నీ ముఖకాంతిని మామీద ప్రసరింజేయి" అని మనవిచేసే వాళ్లు - కీర్త 4,6. మనం కూడ ఈలాగే ప్రార్థించాలి.

2. ప్రభువు పౌలుని ప్రేషిత సేవకు పిల్చాడు. "నీవు అన్యులకు వెలుగువి కావాలి. ప్రపంచానికంతటికీ రక్షణ మార్గానివి కావాలి. నేను నిన్ను ఈ పనికి నియమించాను" అని చెప్పాడు - అచ 13,47. ఈనాడు అతడు మనకు కూడ ఇదే సేవను అప్పగిస్తాడు. మీ వెలుగుని ప్రజల యెదుట ప్రకాశింపనీయండి అని ఆదేశిస్తాడు - మత్త 5,16. క్రీస్తుపట్ల మనకుండే విశ్వాసమే ఈ వెల్తురు అని చెప్పాం. ఈ వెల్తురుని మనం కుంచం క్రింద పెట్టిన దీపంలాగ దాచివుంచ కూడదు. మన ఆదర్శవంతమైన జీవితం ద్వారానైతే నేమి, మన సత్కార్యాల ద్వారా

నైతేనేమి మన వెలుగు ఇరుగుపొరుగు వాళ్ళమీద ప్రసరించాలి. కనుక మనం ఉత్సాహంతో ప్రేషిత సేవకు పూనుకోవాలి.

3. వెలుగుకు సంబంధించినవాళ్ళ ప్రధాన లక్షణం సోదర ప్రేమ. తోడి నరులను ప్రేమించేవాడు వెలుగులోను, ప్రేమించనివాడు చీకటిలోను వుంటాడని రూఢిగా చెప్పవచ్చు - 1యోహా 2,9-11. ఈ సూత్రాన్ని ఆధారంగా తీసికొని మనలో వెలుగెంత వుందో, చీకటి యెంతవుందో నిరంతరం పరిశీలించి చూచుకొంటుండాలి.

4. బైబుల్లో చీకటి పాపానికీ పిశాచానికీ చిహ్నంగా వుంటుందని చెప్పాం. జ్యోతిర్మయుడైన ప్రభువుని అనుసరించే మనం ఈ పాపాన్నుండి పూర్తిగా వైదొలగాలి. "రేయి ముగియవచ్చింది. పగలు సమీపించింది. ఇక మనం చీకటికి సంబంధించిన పనులను మానివేద్దాం. పగటివేళ పోరాడ్డానికి ఆయుధాలు ధరిద్దాం" - రోమా 13,12.

నిద్రితుడా! మేలుకో
మృతులలో నుండి లే
క్రీస్తు నీపై ప్రకాశిస్తున్నాడు - ఎఫె 5,14.

# 6. జీవాహారం

మానవ జీవితంలో ఆహారం అతిముఖ్యమైంది. అదిలేందే మనకు జీవం లేదు. ఈ సత్యాన్ని మనసులో పెట్టుకొని క్రీస్తు కడపటి విందులో తన శరీరాన్నే మనకు ఆహారంగా దయచేసాడు. దివ్య సత్ప్రసాదం మనకు ఆ ప్రభువు జీవాన్ని ప్రసాదిస్తుంది. కాని మనం ఈ దివ్యసత్ప్రసాదంతోపాటు దైవవాక్యాన్ని గూడ భోజనంగా స్వీకరించాలి. ఈ యంశాలన్నిటినీ విపులంగా పరిశీలిద్దాం.

## 1. అనుదిన జీవితంలో ఆహారం

అనుదిన జీవితంలో ఆహారం అతి ప్రధానమైంది. బైబులు చాల తావుల్లో ఈ యంశాన్ని ప్రస్తావిస్తుంది.

### 1. ఆహారం మనలను పోషిస్తుంది

మనం ఆహారం తిని బ్రతుకుతాం. మన ప్రాణాన్ని నిలబెట్టేది అదే. సీరా గ్రంథం
"కూడు గుడ్డ నీళ్ళు నరునికి ప్రాథమికావసరాలు
గుట్టుగా మనుటకు కొంపగూడ అవసరం"

అని చెప్తుంది - 29,21. ఇంకా, ఆహారం మనకు పుష్టినిస్తుంది. కనుకనే భక్తుడు భగవంతుణ్ణుద్దేశించి

"నీవు నరుని సంతోషపెట్టడానికి ద్రాక్ష సారాయాన్ని, అతనికి ఆనందం కలిగించడానికి ఓలివు తైలాన్ని, అతన్ని బలాఢ్యుణ్ణి జేయడానికి ఆహారాన్ని దయచేస్తావు" అంటాడు - కీర్తన 104,15.

## 2. మన ఆహారాన్ని ఇతరులతో పంచుకోవాలి

మన భోజనాన్ని మనమే తిని సంతృప్తి చెందకూడదు. దాన్ని ఇతరులతో కూడ పంచుకోవాలి. పరస్పరం కలసి భుజించేవాళ్ళంతా స్నేహితులౌతారు. ఈ భావాన్ని మనసులో పెట్టుకొనే కీర్తనకారుడు

"నేను బాగా నమ్మిన ప్రాణస్నేహితుడే,
నా యింట భోజనం చేసినవాడే,
నా మీద తిరగబడ్డాడు"

అని విచారించాడు - 41,9. అతిథులకు ఆతిథ్యమీయడం పవిత్రకార్యం. అబ్రాహాము మమ్రే వద్ద వసిస్తుండగా దేవదూతలు అతిథుల రూపంలో అతని గుడారం చెంతకు వచ్చారు. అబ్రాహాము వారిని సాదరంగా తోడ్కొనివచ్చి వారికి భోజనం పెట్టాడు. వాళ్ళు నీకు కొడుకు పుడతాడని దీవించారు - ఆది 18. "ఆకలిగొనిన వారికి అన్నం పెట్టు, బట్టలు లేని వారికి బట్టలీయి. నీకు సమృద్ధిగా వున్న ప్రతి వస్తువు నుండి కొంతభాగం దానంగా ఈయి" అంటుంది తోబీతు గ్రంథం 4,16. ఇంకా,

"తన భోజనాన్ని పేదలకు గూడ
వడ్డించే కరుణామయుడు
దేవుని దీవెనలు పొందుతాడు"

అని నుడువుతుంది సామెతల గ్రంథం - 22,9.

## 3. ఆహారం దేవుని దీవెన

ఆహారం సమృద్ధిగా లభిస్తే అది దేవుని దీవెన అనుకోవాలి. చాలినంత తిండి దొరక్కపోతే అది దేవుని శాపం అనుకోవాలి.

"నేనిపుడు యౌవనం గతించిన వృద్ధుణ్ణి
కాని ప్రభువు నీతిమంతుణ్ణి పరిత్యజించడంగాని
అతని బిడ్డలు బిచ్చమెత్తుకోవడం గాని
నేనింతవరకు చూడలేదు"

అని చెప్తుంది కీర్తన 37,25. అనగా ప్రభువు సజ్జనుడికి కడుపునిండా కూడు పెడతాడని భావం. రాజులు రెండవ గ్రంథంలో ఎలీషా రొట్టెలను పంచిపెట్టిన ఉదంతం వస్తుంది. ఒకడు ఆ ప్రవక్తకు ఇరువది రొట్టెలూ, ధాన్యపు వెన్నులూ బహూకరించాడు. ఎలీషా వాటిని వందమంది ప్రవక్తలకు పంచిపెట్టాడు. వాళ్ళంతా భుజించిన పిదప కూడ ఇంకా కొన్ని రొట్టెలు మిగిలాయి - 2రాజు 4,42-44. దేవుడు తన భక్తులకు సమృద్ధిగా భోజనం దయచేస్తాడని ఈ కథ భావం. దీనికి భిన్నంగా దేవుడు శిక్షించేవారికి కూడు దొరకదు. కనుకనే యిర్మీయా యెరూషలేము పౌరుల నుద్దేశించి

"ప్రభువు దూర ప్రాంతం నుండి
శత్రుజాతులను మీ మీదికి గొనివస్తాడు
వాళ్ళు మీ పంటనూ మీ యన్నాన్నీ తినివేస్తారు
మీ కొమరులను కొమార్తలనూ చంపుతారు"

అని ప్రవచించాడు - 5,17.

ఆహారం దేవుని దీవెన గనుక నరుడు వినయంతోను నమ్మకంతోను ప్రభువు నుండి దాన్ని అడుక్కోవాలి. "ప్రభూ! మా అనుదినాహారాన్ని మాకు దయచేయి" అని వేడుకోవాలి - మత్త 6,11. ఈలా ప్రార్థించినవారికి భోజనం పుష్కలంగా లభిస్తుంది. కావుననే యిస్రాయేలీయులు ఎడారిలో తిన్నమన్నా నుద్దేశించి

"నరులు దేవదూతల భోజనాన్ని సాపడ్డారు
ప్రభువు వారికి సమృద్ధిగా ఆహారాన్ని దయచేసాడు"

అని చెప్తుంది కీర్తన 78,25. అలాగే క్రీస్తు ఐదువేల మందికి ఆహారం పెట్టినపుడు గూడ, వాళ్ళంతా భుజించి సంతృప్తి చెందిన పిమ్మట మిగిలిన రొట్టెముక్కలను పండ్రెండు గంపలకెత్తారు - మత్త 14,20. దేవుని దీవెనలకు ఏమి కొదవ?

## 4. కడపటి దినాల్లో లభించే మహాభాగ్యం

భోజనం కడపటిదినాల్లో దేవుడు నరులకు దయచేసే మహాభాగ్యానికి గుర్తుగా వుంటుంది. ఈ భాగ్యాన్ని మనసులో పెట్టుకొనే యిర్మీయా ప్రవక్త

"యిస్రాయేలీయులు ప్రవాసం నుండి తిరిగివచ్చి
సియోను కొండపై సంతసంతో పాటలు పాడతారు
నా ఔదార్యాన్ని గాంచి సంతసిస్తారు
నేను వారికి ధాన్యమూ ఓలీవుతైలమూ బహూకరిస్తాను
వాళ్ళిక విచారానికి గురికాక
నీరు కట్టిన తోటలా కలకల్లాడతారు"

అని ప్రవచించాడు - 31,12. నూత్నవేదంలో క్రీస్తు అప్పుడప్పుడు విందులారగింప బోయేవాడు. అందుకు శత్రువులైన పరిసయులు అతన్ని భోజనప్రియుణ్ణిగా లెక్కగట్టారు - మత్త 11,19. కాని ఈ విందులన్నీ, కడపటి దినాల్లో రాబోయే ఓ గొప్ప విందునకు సూచనంగా వుంటాయి. అదే దివ్యసత్ప్రసాద మహాభాగ్యం. ఆ పరమాహారం క్రీస్తు శరీరమే. ఆ యాహారం అతడు మనకిచ్చిన వరాలన్నిటిలోను శ్రేష్ఠమైంది. పరలోక జపంలో "ప్రభూ! మాకు కావలసిన అనుదినాహారాన్ని మాకు ప్రతిరోజు దయచేయి" అనే వాక్యం వస్తుంది - లూకా 11,3. యూదుల భావాల ప్రకారం ఈ "యనుదినాహారం" దేవుడు దయచేసే సమస్త వరాలకు సూచనంగా వుంటుంది. ఈ వరాల్లో దివ్యసత్ప్రసాద వరమేమీ తక్కువది కాదు. క్రీస్తు "నేనే జీవాహారాన్ని" అని చెప్పినపుడు ఆ వరాన్ని గూర్చి చెప్పిన పై భావాలన్నీ జ్ఞప్తికి వస్తాయి.

## 2. ఆరాధనంలో ఆహారం

యిస్రాయేలు ప్రజలు ఆరాధనలో ఆహారాన్ని సమర్పించేవాళ్ళు. ఈ యాహారం రొట్టెల రూపంలో వుండేది. ఈ యంశాన్ని విపులంగా పరిశీలిద్దాం.

### 5. సాన్నిధ్యపు రొట్టెలు

యూదులు మొదట గుడారంలోను, తర్వాత యెరూషలేం దేవళంలోను దేవుని సాన్నిధ్యంలో పండ్రెండు రొట్టెలు పెట్టేవాళ్ళు. "నిత్యం నాకు సమర్పించవలసిన రొట్టెలను బల్లమీద నా యెదుట వుంచాలి" - నిర్గ 25,30. ఈ పండ్రెండు రొట్టెలను జ్ఞప్తికి తెచ్చుకొని దేవుడు వారిని కాచి కాపాడుతుండేవాడు. తాను వారితో ఐక్యమైయుండేవాడు.

### 6. కొత్త ధాన్యంతో చేసిన రొట్టెలు

ఇంకా ప్రతి కుటుంబవాళ్ళు వారాల పండుగలో కొత్త ధాన్యంతో చేసిన రొట్టెలు రెండింటిని దేవుని యెదుట అర్పించేవాళ్లు. "ప్రతి కుటుంబం రెండు రొట్టెలు కొనివచ్చి ప్రభువు ఎదుట ఎత్తి అర్పించాలి. వీటిని ఆ యేటి పంటలోని తొలి ధాన్యం నుండే తయారుచేయాలి" - లేవీ 23,17. పంటను దయచేసినందుకు వందనపూర్వకంగా దేవునికి ఈ రొట్టెలు అర్పించేవాళ్ళు. యాజకుడూ రాజు ఐన మెల్కీ సెదెక్కుగూడ పూర్వం ఈలాగే సర్వోన్నతుడైన దేవునికి రొట్టె ద్రాక్షరసమూ అర్పించేవాడు - ఆది 14,18-20.

### 7. పొంగని రొట్టెలు

దేవళంలో బలులు అర్పించేపుడు పొంగని రొట్టెలు కూడ కానుక పెట్టేవాళ్ళు. "మీరు నాకు జంతుబలులు అర్పించేపుడు పొంగని రెట్టెలు అర్పించాలి" నిర్గ 23,18.

ఈ రొట్టెలు పులిపిడి ద్రవ్యం కలవనివి. పులియజేసే పదార్థం పాపానికి అపవిత్రతకీ చిహ్నం. కనుక ఆరాధనలో పులిపిడి పదార్థం కలిపన రొట్టెలను వాడేవాళ్ళు కాదు - 1కొ 5,7-8. యూదులు పాస్కపండుగ మొదలైన తిరునాళ్ళల్లో పొంగని రొట్టెలే తినేవాళ్ళు.

## 8. రొట్టె శ్రమలకు కూడ చిహ్నం

యిస్రాయేలీయులకు రొట్టె ప్రధానాహారం. ధాన్యాన్ని నలగగొట్టి పిండిచేసి రొట్టెను తయారుచేసేవాళ్ళు. భుజించేపుడు దాన్ని నమలి తినాలి. ఈలా రొట్టెలో నలిగిపోవడం అనే గుణం వుండడంచేత అది శ్రమలకు చిహ్నమైంది. కనుకనే క్రీస్తు "గోదుమగింజ భూమిలో పడి నశించినంత వరకు ఒంటిగానే వుంటుంది. కాని నశించిన పిదప అది విస్తారంగా ఫలిస్తుంది" అని చెప్పాడు - యోహా 12,24. ఈ వాక్యంలో క్రీస్తు శ్రమలనుభవిస్తాడు అనే భావం ఇమిడి వుంది.

## 9. కడపటి విందులోని రొట్టె

క్రీస్తు కడపటి విందులో వినియోగించింది ఈ రొట్టెనే. అతడు నా జ్ఞాపకార్థంగా దీన్ని మీ యారాధనంలో వినియోగించుకోండి అని చెప్పింది గూడ ఈ రొట్టెను గూర్చే. ఆ కడపటి విందులోలాగే నేటి మన యారాధనంలో గూడ ఈ రొట్టె క్రీస్తు శరీరంగా మారిపోతుంది - 1కొ 11,23-24. ఈ రొట్టె క్రీస్తు శిష్యుల కుండవలసిన ఐక్యతకూ సోదర ప్రేమకూ చిహ్నం. మనమంతా ఒకే రొట్టెలో పాలుపంచుకొంటాం. కనుక మనం అనేకులమైనా గూడ ఆ వొకే రొట్టె ద్వారా ఒకే శరీరమౌతాం - 1కొ 10,17. ఐనా రోజువారి జీవితంలో మనం ఈ సోదరప్రేమను ప్రదర్శించలేక పోతున్నామంటే అది కేవలం మన బలహీనతే.

## 10. క్రీస్తు జీవాహారం

ఈ సందర్భంలో యోహాను 6వ అధ్యాయాన్ని గూడ జ్ఞప్తికి తెచ్చుకోవాలి. ఈ యధ్యాయం క్రీస్తు శరీరం మనకు ముఖ్యాహారమని చెప్తుంది. క్రీస్తు మనకు జీవాహారం - 6,35. ఈ భోజనం మన్నాకంటె మెరుగైంది. పూర్వం మన్నాతిన్న పితరులు చనిపోయారు. కాని ఈ జీవాహారాన్ని భక్షించేవాడు చనిపోడు - 6,49-50. క్రీస్తు శరీరాన్ని భుజించి అతని రక్తాన్ని పానం జేసేవాడు నిత్యజీవాన్ని పొందుతాడు - 6,53. ఈ భోజనాన్ని ఆరగించేవాడు క్రీస్తులోను, క్రీస్తు అతనిలోను నెలకొంటారు - 6,56. ఇది ఉత్థానాన్ని గూడ ప్రసాదిస్తుంది 6,54. కాని ఇక్కడ అన్నిటికంటె ముఖ్యమైన వాక్యం 6,57. తండ్రి

పంపగా వచ్చిన క్రీస్తు ఆ తండ్రినుండి జీవం పొందినట్లే, క్రీస్తుని భుజించే భక్తుడు కూడ ఆ క్రీస్తు నుండి జీవం పొందుతాడు. ఒకే జీవవాహిని తండ్రి నుండి క్రీస్తునీ క్రీస్తునుండి భక్తుణ్ణీ చేరుతుంది. ఈ జీవవాహిని ప్రవిత్రాత్మే.

పై వాక్యాల్లో యోహాను క్రీస్తు శరీరాన్ని ఓ పవిత్రమైన విందుగా భావించాడు. అది మనకు జీవాన్నిచ్చే విందు. దాని ద్వారా మనం ఉత్థానక్రీస్తు దివ్యజీవనాన్ని పొంది అతనితో ఐక్యమౌతాం. ప్రభువు దివ్యశరీరాన్ని ఆరాధనంలో భుజించడంలో ఈ భావాలన్నీ గర్భితమై వున్నాయి.

# 3. ఆహారంగా దైవవాక్కు

ఇంతవరకు మామూలు రొట్టె లేక ఆహారం, పవిత్రమైన రొట్టె లేక క్రీస్తు శరీరం మనకు ఆహారమౌతాయనే భావాలు చూచాం. కాని బైబులు భావాల ప్రకారం దైవవాక్యం గూడ ఆహారమే. కనుక ఈ యంశాన్ని విపులంగా పరిశీలిద్దాం.

## 11. దైవవాక్యాన్ని గూడ భోజనంగా స్వీకరించాలి

కూటికి నీటికీ గాదు, ప్రభువు వాక్కుకే కరువు వస్తుంది అన్నాడు ఆమోసు ప్రవక్త - 8,11. ఇక్కడ ప్రవక్త వాక్యాన్ని ఆహారంతో పోల్చాడు. అలాగే యెషయా కూడ ప్రభువు నోటినుండి వెలువడే వాక్యాన్ని తిండితో ఉపమించాడు - 55,10-11. ఇంకా, జ్ఞానగ్రంథాల భావాల ప్రకారం, విజ్ఞాన బోధ వినడం భోజనం చేయడంతో సమానం. విజ్ఞానమనే స్త్రీమూర్తి వివేకహీనుడైనర నరునికి కబురు పంపి

"నీవు నేను తయారుచేసిన భోజనాన్ని ఆరగించు
నేను సిద్ధం చేసిన ద్రాక్షాసవాన్ని సేవించు"

అని చెప్పించింది - సామె 9,5. ఇక్కడ నరుడు ఆరగించే అన్నం విజ్ఞానమే. ఈలాగే సీరా గ్రంథంలో కూడ విజ్ఞానం నరులు నాహ్వానించి

"నన్నభిలషించేవాళ్ళంతా నా చెంతకు రండి
మీ యాకలిదీర నా ఫలాలను భుజించండి
నన్ను భుజించేవాళ్ళు
ఇంకా అధికంగా భుజింపగోరుతారు
నన్ను పానం జేసినవాళ్ళు
ఇంకా అధికంగా పానం జేయగోరుతారు"

అంటుంది - 24, 19-22. ఈ వాక్యాల ప్రకారం విజ్ఞాన వాక్కులు భోజనమే. క్రీస్తుకూడ తన బోధల్లో ఈ భావాన్ని సూచిస్తూ

"నరుడు కేవలం ఆహారం వలననే జీవింపడు
దేవుడు వచించే ప్రతి వాక్కు వలనా జీవిస్తాడు"

అని చెప్పాడు - మత్త 4,4.

మార్కు సువార్త 6వ అధ్యాయంలో క్రీస్తు ఐదువేల మందికి ఆహారం పెట్టిన అద్భుతం వస్తుంది. ఈ సందర్భంలో క్రీస్తు మొదట ప్రజలకు బోధ చేసాడు. కాపరిలేని మందలా వున్న జనాన్ని చూచి జాలిగొని వారికి అనేక విషయాలు బోధించాడు - 6,34. ఆ పిమ్మట ఐదు రొట్టెలను రెండు చేపలను త్రుంచి ఐదువేల మందికి పంచిపెట్టాడు- 6,41-42. కనుక ఈ యద్భుతంలో రొట్టె అంటే మొదట దేవుని వాక్కే. అటుపిమ్మట అది మాములు భోజనాన్నీ, క్రీస్తు మనకీయబోయే స్వీయదేహాన్ని గూడ సూచిస్తుంది.

ఇక యోహాను 6,35లో ప్రభువు "జీవాహారాన్ని నేనే. నా వద్దకు వచ్చేవాడు ఎన్నటికి ఆకలిగొనడు. నన్ను విశ్వసించేవాడు ఎన్నటికి దప్పిక గొనడు" అని చెప్పాడు. ఈ వాక్యాల్లో క్రీస్తు మన్నాకంటె శ్రేష్ఠమైన భోజనం అనే భావం వుంది. అతని వాక్యాన్ని మనం భక్తితో విశ్వసించాలనే భావమూ వుంది. అనగా అతడు భుజింపదగిన ఆహారమూ, విశ్వసింపదగిన వాక్కూ అని గూడ అర్థం. ఈ యధ్యాయం 35-50 వచనాలకు సర్వత్ర భోజనం, వాక్కుపట్ల విశ్వాసం అని రెండర్థాలు చెప్పవచ్చు. ఫలితార్థమేమిటంటే క్రీస్తు మనకు ఆహారమూ, దైవవాక్కు గూడ.

## ప్రార్థనా భావాలు

1. "మీరు మనుష్య కుమారుని శరీరాన్ని భుజించి అతని రక్తాన్ని త్రాగితేనే తప్ప మీలో జీవముండదు" యోహా 6,53. భౌతికమైన భోజనం మన శరీరానికి పుష్టినిచ్చినట్లే దివ్యసత్ప్రసాదం మన ఆత్మకు బలాన్నిస్తుంది. కనుక మనం ఈ యమృతాహారాన్ని పలుసారులు, వీలయితే ప్రతిరోజు, భక్తితో భుజించాలి.

2. "డిడాకే" అనే ఓ ప్రాచీన క్రైస్తవ ఆరాధన గ్రంథం ఈలా వాకొంటుంది."ఓ ప్రభూ! ఈ పూజలో మేము విరిచే రొట్టె మొదట కొండల్లో పండిన గోదుమ గింజలు. వాటినన్నిటినీ ఏకంచేసి ఇక్కడ ఒక్క రొట్టెగా తయారుచేసాం. ఇక్కడ మేము పానం చేసే ద్రాక్ష సారాయం గూడ చాల పండ్ల నుండి తీసినరసం. ఈ పదార్థాలను లాగే శ్రీసభలోని నీ ప్రజలను గూడ లోకం నాల్గుచెరగుల నుండి చేరదీసి ఇక్కడ ఒక్క సమాజంగా ఐక్యం చేయి." ఇది చాల అర్థవంతమైన ప్రార్థనం. చాల గోదుమ గింజలు కూడి ఒక్క అప్పమూ, చాల ద్రాక్షపండ్లు కలసి చేరెడు

రసమూ ఔతాయి. అలాగే చాలమంది ప్రజలు కలసి ఒక్క శ్రీసభ ఔతారు. దివ్యసత్ప్రసాదమే మనకు ఈ యైక్యతా భావాన్ని ప్రసాదిస్తుంది.

3. మనం పూజలో పాల్గొని దివ్యసత్ప్రసాదాన్ని భుజిస్తేనే చాలదు. సత్ప్రసాదాన్ని భుజించకముందు క్రీస్తు వాక్యాన్ని గూడ భుజించాలి. అనగా మనం మొదట కొంతసేపు దైవవాక్యాన్ని ధ్యానం చేసికొని అటుపిమ్మట దివ్య సత్ప్రసాద విందులో పాల్గొనాలి. క్రీస్తు మనకు ఆహారమూ వాక్కూ రెండూనని చెప్పాం.

4. గోదుమరొట్టె శ్రమలకు చిహ్నంగా వుంటుందన్నాం. రెండవ శతాబ్దంలో అంటియోకయ ఇన్యాసివారు అనే బిషప్పుగారిని వేదహింసకులు రోములో సింహాలకు మేతగా అర్పించారు. ఈ సందర్భంలో ఆ పునీతుడు చేసిన ప్రార్థన యిది. "నేను ప్రభువుకొరకు ఉద్దేశింపబడిన గోదుమ ధాన్యాన్ని. వన్యమృగాల కోరల్లో పిండిపిండిగా నలగినపిదప క్రీస్తుకి అర్పింపబడే అప్పంగా మారిపోతాను". తాను ప్రధానంగా దివ్యసత్ప్రసాద బలినర్పించే యాజకుణ్ణనీ కనుక తనకు శ్రమలు తప్పవనీ ఈ యిన్యాసివారి భావం. మనం కూడ ఈ సత్యాన్ని విస్మరించకుండా వుంటే బాగుంటుంది.

5. పౌలు కొరింతులోని క్రైస్తవులను హెచ్చరిస్తూ అయోగ్యంగా ప్రభువు రొట్టెను తిని అతని పాత్రంలోని రసం త్రాగేవాడు అతని శరీర రక్తాలకు ద్రోహంగా పాపం చేస్తాడు. కనుక నరుడు మొదట ఆత్మపరిశీలనం చేసికొని ఆ పిమ్మట ఈ పవిత్ర వస్తువులను స్వీకరించాలి. లేకపోతే అతడు తీర్పునకు గురౌతాడు అని చెప్పాడు - 1కొ 11,27-32. ఇవి ఖండితమైన వాక్యాలు. ఈ వేదవాక్యాలు సందర్భాన్ని బట్టి ఇక్కడ పౌలు ఉద్దేశించిన "అయోగ్యత" సోదర ప్రేమ లేకపోవడమే. కనుక సత్ప్రసాద స్వీకరణ సందర్భంలో ఆయా పాపాలను, విశేషంగా సోదర ప్రేమకు వ్యతిరేకమైన పాపాలను, తలంచుకొని పశ్చాత్తాపపడాలి. అవసరమనుకొంటే పాపసంకీర్తనం కూడ చేయాలి. నిర్మల హృదయంతో గాని ఆ ప్రభువుని స్వీకరించగూడదు.

# 7. నేనే మార్గాన్ని

ప్రాచీన కాలంలో యిస్రాయేలు ప్రజలు స్థిరనివాసం లేకుండా తావునుండి తావుకి కదలిపోతుండేవాళ్ళు. ప్రయాణం వాళ్ళకు నిత్యకృత్యంగా వుండేది. కావున వాళ్ళ భాషలో మార్గం అనేది ఓ ముఖ్య భావమూ, ఓ ప్రముఖ పదమూ ఐంది. ఈ పదం వాళ్ళ

దైవభక్తికీ నైతిక జీవితానికీ గూడ సూచనమైంది. బైబుల్లో మార్గం అంటే ప్రవర్తన విధానం, సంప్రదాయం, పథకం, శీలం, దైవాజ్ఞ అనే నానార్థాలున్నాయి. ఇక్కడ మార్గాన్ని గూర్చిన ప్రధాన భావాలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. చారిత్రక మార్గాలు

యూదుల నాయకులు నడచిపోయిన మార్గాలు చారిత్రక స్థాయి నందుకొన్నాయి. ఆ నాయకుల్లో అబ్రాహాము మొదటివాడు. ఇతడు ప్రభువు ఆజ్ఞపై కల్దీయుల నగరమైన ఊరు పట్టణం నుండి బయలుదేరివచ్చి కనాను మండలాన్ని చేరుకొన్నాడు. ప్రభువు ఇతడికి సంతానాన్నీ భూమినీ యిస్తానని మాట యిచ్చాడు. ఇతని ద్వారా సమస్త జాతులను దీవిస్తానని వాగ్దానం చేసాడు - ఆది 12,1-5. అబ్రాహాము దేవుని సన్నిధిలో, దేవుని మార్గంలో నడచి అతనికి ప్రీతిపాత్రుడయ్యాడు - 17,1.

యూదుల చరిత్రలో ఈజిప్టు నిర్గమనం చాల గొప్ప సంఘటనం. ఈ మహా ప్రయాణంలో ప్రజలు తమ దేవుడైన యావేతో నడచివెళ్ళారు. ప్రభువు వారికి ముందుగా సాగిపోతూ వారికి దారి చూపించేవాడు. అతడు పగటిపూట పొగ స్తంభంలాగాను, రాత్రిపూట నిప్పు స్తంభంలాగాను కన్పించేవాడు- నిర్గ 13,21. సముద్రం గూడ అతనికి అడ్డురాలేకపోయింది. కనుకనే

"నీవు సాగరంగుండ నడచావు
లోతైన సముద్రం గుండ సాగిపోయావు
కాని నీ యడుగుజాడలు మాత్రం కన్పించలేదు"

అంటుంది కీర్తన 17,20. ఈలా ప్రభుని సహాయం పొంది యిస్రాయేలీయులు ఐగుప్తు దాస్యం నుండి తప్పించుకొని వచ్చారు. నలభై యేండ్లకాలం ఎడారిలో ప్రయాణం చేసారు. ఈ కాలంలో ప్రభువు యిస్రాయేలీయుల పక్షాన పోరాడాడు. వారికి అన్న పానీయాలు దయచేసాడు. ఈ యన్నం మన్నా, ఈ పానీయం మెరీబావద్ద లభించిన జలం. తండ్రి కుమారుని వలె తాను వారిని ఆదుకొంటూ వచ్చాడు - ద్వితీ 1,30-33. అటుపిమ్మట సీనాయి కొండదగ్గర ఆ ప్రజలతో నిబంధనం చేసికొన్నాడు. ఆ వొడంబడిక ప్రకారం వారిని వాగ్దత్తభూమికి తీసికొనివచ్చాడు. అది వారికి విశ్రాంతిని దయచేసే దేశం. దాస్యగృహమైన ఐగుప్తునుండి ప్రభువు వారిని నడిపించుకొని వచ్చిన తీరునూ, తాము చేరుకొనిన దేశాన్నీ చూచి యిస్రాయేలీయులు మురిసిపోయి

"ప్రభువు మంచివాడు, ధర్మవర్తనుడు
అతడు పాపులకు తన త్రోవలను తెలియజేస్తాడు
వినయవంతులను సన్మార్గాన నడిపిస్తాడు

దీనాత్ములకు తన మార్గాన్ని బోధిస్తాడు
తన నిబంధనను ఆజ్ఞలను పాటించేవారిని
ప్రేమతోను నమ్మదగినతనంతోను నడిపిస్తాడు"

అని చెప్పుకొన్నారు - కీర్త 25,8-10. ఈ ఐగుప్తు ప్రయాణంలో యూదుల నాయకుడు మోషే.

యూదులు ఐగుప్తు నిర్గమనాన్ని మరచిపోలేక పోయారు. ఆ వృత్తాంతాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనేందుకై పాస్కపండుగను గుడారాల పండుగను ఏర్పాటు చేసికొన్నారు. వాటిని కనాను మండలంలో ఏటేట జరుపుకొనేవాళ్లు. తర్వాత షెకెం, షిలో, యెరూషలేం పట్టణాలకు యాత్ర చేసేపుడు గూడ పై ఐగుప్తు యాత్రను జ్ఞప్తికి దెచ్చుకొని పరమానందం చెందేవాళ్ళు.

అహాబురాజు యెసెబెలు రాణి పరిపాలించిన కాలంలో దేశంలో బాలు ఆరాధన పెచ్చుపెరిగింది. యేలీయా ప్రవక్త ఈ విగ్రహారాధనాన్ని అరికట్టగోరి కూడ విఫలుడయ్యాడు. అతడు ఓదార్పు కొరకు మళ్ళా హోరెబు కొండకు యాత్ర చేసాడు. పూర్వం మోషే ప్రభువు నుండి ధర్మశాస్త్రాదన్ని పొందింది ఈ కొండమీదనే. తర్వాత హోషేయ ప్రవక్త ఈ యెడారి ప్రయాణాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ఆ రోజుల్లో ప్రభువు తన బిడ్డడైన యిస్రాయేలుతో ప్రయాణం చేసాడు అని నుడివాడు - 11,1-3. ఈ వేదవాక్యాలను బట్టి యూదులకు ఐగుప్తు ప్రయాణం ఎంత ప్రీతిపాత్రమైందో అర్థం చేసికోవచ్చు.

## 2. ధర్మశాస్త్ర మార్గం

యూదుల ఆలోచనం ప్రకారం ధర్మశాస్త్రం గూడ ఓ ముఖ్యమైన మార్గం. ఈ ధర్మశాస్త్రం ద్వారానే ప్రభువు ఆదేశాలు హీబ్రూ ప్రజలకు విదితమయ్యాయి. కనుకనే ధర్మశాస్త్రం పట్ల తనకున్న గౌరవాన్ని సూచిస్తూ కీర్తనకారుడు.

"నిర్దోషులుగా జీవిస్తూ
ధర్మశాస్త్రాన్ని అనుసరించేవాళ్ళు ధన్యులు"

అని వాకొన్నాడు, - 119,1. బారూకు గ్రంథం కూడ

"జ్ఞానం భూమిపై ప్రత్యక్షమై నరుల మధ్య వసించింది
ఈ జ్ఞానం దేవుని ఆజ్ఞల గ్రంథం,
శాశ్వతంగా నిల్చే ధర్మశాస్త్రం,
దీన్ని పాటించేవాళ్ళు బ్రతుకుతారు
విడనాడేవాళ్ళు చస్తారు"

అని చెప్తుంది - 4,1. ఇంకా ఈ పుస్తకం ధర్మశాస్త్ర మార్గంలో నడచేవాళ్లు సంపూర్ణ శాంతి ననుభవిస్తారని గూడ వాకొంటుంది - 3,13. ఇతర జాతులకు ధర్మశాస్త్రం లేదు. కనుకనే మరో కీర్తనకారుడు

"ప్రభువు తన వాక్కుని తన ప్రజలకు విన్పిస్తాడు
తన కట్టడలను యిస్రాయేలీయుల కెరిగిస్తాడు
అతడు అన్యజాతులకు ఈ కార్యం చేయలేదు
అతని ధర్మవిధులు వారికి తెలియవు"

అని పల్కాడు - 147,19-20.

యూదులు ఈ ధర్మశాస్త్రాన్ని తుచ తప్పకుండ పాటించాలి. దానినుండి వైదొలగితే వారికి వినాశం తప్పదు. దానిని అనాదరం చేస్తే వారికి ప్రవాసం ధ్రువం. చివరికి యూదులు న్యాయశాస్త్రాన్ని మీరనూ మీరారు, బాబిలోనియా ప్రవాసానికి వెళ్ళనూ వెళ్ళారు. ఐనా ఆ ప్రవాసదేశంలో గూడ ప్రభువు వారిని పూర్తిగా విడనాడలేదు. అక్కడ కూడ తాను వారిని ఆదుకోడానికి సిద్ధమయ్యాడు. కనుకనే అతడే తన ప్రవక్త ద్వారా

"ఎడారిలో ప్రభువుకి మార్గం సిద్ధం జేయండి
మరుభూమిలో మన దేవునికి రాజపథం తయారుచేయండి"

అని చెప్పించాడు - యెష 40,3. తన ప్రజలను బాబిలోనియా ప్రవాసం నుండి మళ్ళా తీసికొనిరావడానికే ఈ మార్గం. ఈ సందర్భంలో ప్రభువే స్వయంగా

"ఎడారిలో బాటవేయిస్తాడు
కొండలగుండ మార్గం సిద్ధం చేయిస్తాడు" - 49,11.

## 3. రెండుమార్గాలు

బాబిలోనియా ప్రవాసానంతరం యూదుల్లో "రెండు మార్గాలు" అనే భావం ప్రచారంలోకి వచ్చింది. పూర్వవేదపు నైతికాంశాలు సంగ్రహంగా ఈ రెండు త్రోవల్లో యిమిడి వున్నాయి. కనుక ఈ యంశాన్ని విపులంగా పరిశీలిద్దాం.

రెండు మార్గాలంటే మంచి త్రోవా చెడు త్రోవానూ. మంచి త్రోవ తిన్నగా వుంటుంది. ఇది జీవన మార్గం. ఈ తెరువు వెంట నడచేవాళ్ళు శాంతికాములు. నీతినియమాలు పాటించేవాళ్ళు. సత్యసంధులు. కాని చెడుమార్గం వంకరటింకరగా వుంటుంది. ఇది వినాశమార్గం. ఈ బాటలో నడచేవాళ్ళు అవివేకులు, మూర్ఖులు, పాపాత్ములు. వీళ్ళు అపాయానికి గురై మృత్యువువాత పడతారు. ఈ రెండు పథాల నుద్దేశించి కీర్తనకారుడు

"సాధుపురుషుల మార్గాన్ని ప్రభువు ఆదరిస్తాడు
దుష్టుల మార్గం నాశానికి గురౌతుంది"

అని చెప్పాడు - 1,6. ఈలాగే సామెతల గ్రంథం కూడ

సత్పురుషుల మార్గం వేకువ వెలుగు వంటిది
పట్టపగలయ్యే వరకూ దాని ప్రకాశం
క్రమంగా వృద్ధి చెందుతుంది
కాని దుర్మార్గుల మార్గం రాత్రివలె
తమోమయంగా వుంటుంది
ఏది తగిలి పడిపోతారో ఆ పాపులకే తెలియదు"

అని చెప్తుంది - 4,18-19.

నరునికి ప్రతినిత్యం రెండు తెన్నులు ఎదురౌతూనే వుంటాయి. అతడు వాటిల్లో జీవన మార్గాన్ని ఎన్నుకోవాలి. "మేలునీ కీడునీ జీవాన్నీ మరణాన్నీ నేడు నేను మీముందట వుంచుతున్నాను. భూమ్యాకాశాలను సాక్ష్యంగా బిల్చి చెప్తున్నాను. జీవాన్నీ, మరణాన్నీ, ఆశీస్సునీ శాపాన్నీ మీ యెదుట నుంచుతున్నాను. మీరు జీవాన్ని ఎన్నుకొనండి. అప్పుడు మీరూ మీ సంతానమూ బాగుపడతారు" ద్వితీ 30,15-20.

ఈ రెండు తెరువులను గూర్చిన బోధ నూత్నవేదంలో గూడ తగులుతుంది. "మీరు ఇరుకైన ద్వారం గుండ ప్రవేశించండి. జీవానికి పోయే మార్గం ఇరుకైంది. అది కష్టమైంది కూడ. కొద్దిమంది మాత్రమే ఆ మార్గాన్ని కనుగొంటారు. విశాలమూ సులభమూ ఐన మార్గం మరొకటుంది. అది వినాశానికి చేర్చుతుంది. అనేకులు ఆ మార్గాన పయనిస్తారు" - మత్త 7,13-14. ఇక్కడ పూర్వవేదంలోని మంచి చెడు త్రోవలను మత్తయి ఇరుకైన, విశాలమైన త్రోవలనుగా వర్ణించాడు.

## 4. క్రీస్తు అనే సజీవమార్గం

క్రీస్తుకి నూరేండ్లకు పూర్వమే కొంతమంది యూదులు మృత సముద్రతీరంలోని కుమ్రాను కొండల్లో ప్రోగై సామూహికంగా సన్యాసజీవితం గడిపారు. వీళ్ళ గ్రంథాల్లో జ్యోతిర్మార్గం, తమోమార్గం అనే రెండు త్రోవల ప్రస్తావనం వుంది. సజ్జనులైన భగవంతుని ప్రజలు అనుసరించే జ్యోతిర్మార్గం. పిశాచ ప్రజలైన దుర్జనులు అనుసరించేది తమోమార్గం. తర్వాత ఈ బోధ నూత్న వేదంలోకి గూడ ప్రవేశించింది.

స్నాపక యోహాను బహుశః ఈ కుమ్రాను సమాజంలో పెరిగివుంటాడు. ఇతడు పూర్వం యెషయా బాబిలోనియా నిర్గమనాన్ని గూర్చి చెప్పిన వాక్యాలతోనే తన బోధ

ప్రారంభిస్తూ "ప్రభు మార్గాన్ని సిద్ధం చేయండి" అని బోధించాడు - లూకా 3,4. యెష 40,3. ఈ ప్రభువు మెస్సీయాయే. యోహాను ప్రభువు రాకడకు ప్రజలను సిద్ధం జేసాడు. పాపాలకు పశ్చాత్తాపపడే విధానాన్ని వారికి నేర్పాడు. ఓమారు అతడు యోర్దాను నదిలో ప్రజలచే తపోస్నానం చేయిస్తుండగా ప్రభువైన క్రీస్తు దిఢీలున రానే వచ్చాడు.

పూర్వం మోషే ప్రజలకు నాయకుడయ్యాడు. అతడూ అతడు స్వీకరించిన ధర్మశాస్త్రమూ ప్రజలను నడిపించాయి. కాని యిపుడు క్రీస్తు ప్రజలకు నూత్న మోషేగా విచ్చేసాడు. అతడు నూత్నవేద ప్రజలకు నాయకుడు - హెబ్రే 12,2. కనుక అతడు శిష్యులను పిలవగానే వాళ్ళు అతన్ని వెంబడించారు. పేత్రు అంద్రెయాలను ఆహ్వానింపగానే వాళ్ళు అతని వెంటబడిపోయారు - మత్త 4,18-20. ప్రజలు గూడ గుంపులు గుంపులుగా క్రీస్తు ననుసరించడం ప్రారంభించారు. అతడు తన తండ్రి మార్గాలనూ తన మార్గాలనూ గూడ వారికి బోధించాడు.

క్రీస్తు మార్గం ఈ లోకమనుసరించే సుఖ మార్గం కాదు, సిలువ మార్గం. అతడు మొదటగ శ్రమలనుభవించి అటుపిమ్మట మహిమలో ప్రవేశించాలి- లూకా 24,26. కావున అతడు ఏకాగ్రదృష్టితో యెరూషలేం వైపు నడచిపోయాడు- లూకా 9,51. ఆ నగరంలో సిలువపై అసువులు బాసాడు. నేడు అతని అనుయాయులైన క్రైస్తవులు కూడ ఈ సిలువ మార్గాన్ని అనుసరించవలసిందే.

"క్రీస్తు తన శరీరం అనే తెర ద్వారా సజీవమైన ఓ క్రొత్త మార్గాన్ని మన కొరకు తెరచాడు" అంటుంది హెబ్రేయుల లేఖ - 10,19. ఈ వాక్యంలో చాల భావాలున్నాయి. పూర్వవేద మార్గం ప్రాతమార్గం. నిర్జీవమార్గం. పూర్వవేద దేవాలయంలో యావే ప్రభువును ఆరాధించేవాళ్లు. నేడు క్రీస్తు వచ్చాక ఆ యారాధనం పోయింది. ఇప్పుడు క్రీస్తుద్వారా గాని తండ్రిని కొలవలేం. కనుక ఇది "నూత్న మార్గం". ఇంకా, యెరూషలేం దేవళంలో యావే ప్రభువును ఆరాధించడం మృతమార్గం. నేడు క్రీస్తుద్వారా ఆ తండ్రిని అర్పించడం "సజీవమార్గం".

పైగా, క్రీస్తు దేహమనే తెరగుండా ఈ సజీవమార్గం ఏర్పడింది అన్నాడు మన రచయిత. యెరూషలేం దేవాలయంలోని గర్భాగారంలో దైవసాన్నిధ్యం నెలకొనివుండేది. ఈ గర్భాలయానికి ముందు ఓ తెర వుండేది. ఈ తెరగుండా ప్రధాన యాజకుడు గర్భగృహంలో ప్రవేశించేవాడు. దైవ సాన్నిధ్యంలో నిలచి ధూపం వేసేవాడు. కాని క్రీస్తు మరణంతో ఈ పూర్వవేద ఆరాధనమంతా అడుగంటిపోయింది. యేసు సిలువపై

చనిపోయినపుడే ఈ తెరగూడ చినిగి రెండు ముక్కలైంది. నేడు నూత్నవేద ప్రజలమైన మనం నిలువవలసింది క్రీస్తు సాన్నిధ్యంలో. కాని ఈ క్రీస్తు సాన్నిధ్యాన్ని చేరాలన్నా ఓ తెర అడ్డుగా వుంటుంది. అదే క్రీస్తు మానుష దేహం. దేవాలయపు తెరలాగే సిలువపై కెక్కిన క్రీస్తు దేహం కూడ చినిగి ఛేదమైపోయింది. ఉత్థానానంతరం క్రీస్తు మానుష దేహం పరిశుద్ధాత్మతో నిండి ఆధ్యాత్మిక దేహంగా మారిపోయింది. నేడు మనం ఆరాధించేది పాలస్తీనా దేశపు మానుష క్రీస్తుని గాదు, ఆధ్యాత్మిక స్వరూపుడైన ఉత్థాన క్రీస్తుని. ఇప్పుడు మనం ఏ తెరా అడ్డులేకుండ ఉత్థాన క్రీస్తు సన్నిధిలోనికి వెళ్తాం. పూర్వవేదపు జనులు యావే సన్నిధిలో నిల్చినట్లే మనమూ క్రీస్తు సన్నిధిలో నిలుస్తాం.

ఈలా క్రీస్తు మనకు సజీవమూ నూత్నమూ ఐన మార్గం. కనుకనే అతడు తోమాతో "నేనే మార్గాన్ని" అని చెప్పాడు - యోహా 14,6. పూర్వవేదంలో మోషే, అతడు స్వీకరించిన ధర్మశాస్త్రమూ యూదులకు మార్గమయ్యాయి. ధర్మశాస్త్రాన్ని పాటించడం ద్వారా యూదులు రక్షణం పొందారు. కాని క్రీస్తు వచ్చాక ధర్మశాస్త్రం మనలనిక రక్షించలేదు. కనుక యూదులకువలె అది మనకు మార్గం కాలేదు. పితను చేరాలంటే ప్రస్తుతం మార్గం క్రీస్తు మాత్రమే. అతన్ననుసరిస్తేనే గాని మనం మోక్షాన్ని చేరలేం.

ఈ క్రీస్తు మరణానంతరం తండ్రిని చేరుకొన్నాడు. స్వర్గంలో మనకోసం ఓ తావును సిద్ధంచేసాడు. మళ్ళా మన చెంతకు తిరిగివచ్చి మనలను గూడ ఆ తావుకి తీసుకవెళ్తాడు. ఆ తావు మరేమోకాదు పితృసాన్నిధ్యం, మోక్షం - యోహా 14,23

## ప్రార్థనా భావాలు

1. ఈ జీవితంలో మనం సులభంగా త్రోవదప్పుతాం. పాపమార్గాల్లో పయనిస్తాం. కాని ప్రభువుకి మన మార్గాలన్నీ తెలుసు. "ప్రభువు కన్నులు మన పోకడలన్నీ గమనిస్తాయి, అతడు మన మార్గాలన్నీ గుర్తిస్తుంటాడు" - యోబు 34,21. అతనికి మన త్రోవలన్నీ బాగా తెలుసు - కీర్త 139,3. ఐనా అతడు మనలను శిక్షించదానికంటె రక్షించదానికే సిద్ధంగా వుంటాడు.

   "ప్రభువు మంచివాడు, ధర్మవర్తనుడు
   అతడు పాపులకు తన త్రోవలను తెలియజేస్తాడు
   వినయవంతుల్ని సన్మార్గంలో నడిపిస్తాడు
   దీనాత్ములకు తన మార్గాన్ని బోధిస్తాడు"

– కీర్త 25,8–9. ఆ ప్రభువు దయాళుడు. పాపాత్ముడు నాశమైపోవాలని అతడు ఏనాడూ కోరుకోడు. పాపి పరివర్తనం చెంది మళ్ళా బ్రతకాలనే అతని తలంపు – యేహె 33,11. కనుక మనం మన పాపాలకు పశ్చాత్తాపపడి మళ్లా ప్రభువు మార్గాల్లో నడవడానికి పూనుకొంటుండాలి.

2. కీర్తనకారులు తమకు ధర్మమార్గాన్ని చూపించమని ప్రభువుని వినయంతో అర్థించారు.

"ప్రభూ! నీ మార్గాలను నాకు తెలియజేయి
నేను నమ్మదగినతనంతో నీ త్రోవలో నడిచేలా చేయి
పూర్ణ హృదయంతో నిన్ననుసరించేలా చేయి" – 86,11
"ప్రభువుకి భయపడేవాళ్ళు
తాము నడువవలసిన త్రోవను
అతనినుండే తెలుసుకొంటారు" – 25,12.

కనుక మనం కూడ మంచిమార్గాన్ని చూపించమని ప్రభువుని నిరంతరం వేడుకొంటూండాలి.

3. దైవవాక్యం కూడ మనకు ప్రధాన మార్గాల్లో వొకటి. కావుననే కీర్తనకారుడు

"నీ వాక్యం నా పాదాలకు దీపం
నా త్రోవకు వెలుగు"

అని నుడివాడు – కీర్త 119,105. మనం రోజూ ఓ పావుగంట కాలం ఈ దైవవాక్కుని భక్తితో మననం చేసికోవాలి. అప్పుడు దేవుని మార్గాలు మనకు స్పష్టంగా తెలుస్తాయి.

4. క్రీస్తుని అనుసరించేవాళ్ళు క్రైస్తవులు. ప్రభువు ఉత్థానానంతరం అతని భక్తులను క్రైస్తవులు అని పిల్చారు. అంటియోకయలో శిష్యులను మొదటిసారిగా ఈ పేరుతో పిల్చారు – అ.చ. 11,26. అప్పటినుండి మనకీ పేరు చెల్లుతూ వస్తూంది. క్రీస్తు ప్రభువు మనకు మార్గమూ గురువూ ఐనందులకు మనమెంతో సంతోషించాలి. పూర్వవేద మార్గం ధర్మశాస్త్రం. కాని నూత్నవేద మార్గం నిర్జీవమైన ధర్మశాస్త్రం కాదు. సజీవ వ్యక్తియైన ఉత్థాన క్రీస్తే మనకు త్రోవ. అతడు తన ఆత్మ ద్వారా నేడు మనలను చైతన్యవంతులను చేస్తూంటాడు. యూదులు అన్యులూ క్రైస్తవులూ అందరూ కూడ ఈ క్రీస్తనే త్రోవగుండానే ఒకే ఆత్మద్వారా తండ్రిని చేరుకోవాలి – ఎఫె 2,18.

# 8. నూత్న ఆదాము

నూత్నవేదంలో క్రీస్తుకి నూత్న ఆదాము అని పేరు. అతడు తొలి ఆదాముకి పోలికగా ఉంటాడు. కనుక ఇక్కడ ఈ ఇద్దరు ఆదాముల చరిత్రలు పరిశీలిద్దాం.

## 1. తొలి ఆదాము

ఆదాము అనే పేరు "ఆద్మా" అనే హీబ్రూ మాట నుండి వచ్చింది. ఆ భాషలో ఈ శబ్దానికి మట్టి అని అర్థం. కనుక ఆదాము అనే పేరుకి దుర్బలప్రాణి, నాశమయ్యే వాడు, మట్టిలో కలసిపోయేవాడు అని అర్థం. కనుకనే దేవుడు ఆదాముతో "నీవు మట్టినుండి పుట్టావు, చివరకు మట్టిలోనే కలసిపోతావు" అని చెప్పాడు - ఆది 3,19.

ఆదాము అనే మాటకు నరుడు అనే అర్థమూ వుంది, మానవజాతి అనే అర్థమూ వుంది - ఆది 1,26. ఏవ భర్తయైన ఆదాము అనే ప్రత్యేక వ్యక్తి అనీ అర్థముంది - ఆది 3,21. మనం మొదట ఈ ప్రత్యేక వ్యక్తియైన ఆదాముని గూర్చి పరిశీలిద్దాం. ఇతడే ఏవ భర్త, కయీను ఆబేలుల తండ్రి, మానవజాతినంతటినీ తనలో ఇముడ్చుకొనినవాడు.

దేవుడు నేలమట్టిని తీసికొని దానిలోనికి తన ఊపిరిని ఊదగా ఆ మట్టి నరుడయింది. అతడే తొలి ఆదాము - ఆది 2,7. అతనికి తోడుగా, భార్యగా వుండడానికి దేవుడు ఏవను చేసాడు - 2,18. ఈ స్త్రీ పురుషులిద్దరిలోను దేవుని పోలిక వుంది - 1,27.

ఈ ఆదాము, అతని భార్యయైన ఏవ దేవుడు తినవద్దన్న చెట్టుపండు తిని పాపం చేసారు - 3,6. ఆదాములో మనమందరం ఇమిడివున్నాం. అతడు మానవజాతి కంతటికీ శిరస్సు. కనుక అతని పాపం మానవులందరికి సంక్రమించింది. దీనినే మనం నేడు "జన్మపాపం" అంటాం. ప్రాచీనకాలంలోనే కీర్తనాకారుడు ఈ పాపాన్ని గూర్చి చెప్తూ "నేను పుట్టినప్పటినుండీ పాపాత్ముడనే" అని వాకొన్నాడు - కీర్త 51,6. ఆదామునుండి మనకు పాపం సంక్రమించిందన్న భావం మానవజాతిలో ఆదిమకాలం నుండి వుంది. అలాగే ఆదిమకాలం నుండి గూడ ఒక రక్షకుడు వచ్చి మనలను ఈ పాపం నుండి కాపాడతాడనే భావం కూడ మానవలోకంలో ప్రచారంలో వుంది. తొలి పాపానంతరం ప్రభువు పాముఱూపంలో వున్న పిశాచంతో ఈలా అన్నాడు :

"నీకును స్త్రీకిని
నీ సంతతికిని స్త్రీ సంతతికిని
తీరని వైరం కలుగుతుంది
ఆమె సంతానం నీ తలను చితుకగొడతారు
నీవేమో వారి మడమలు కరుస్తావు"

– ఆది 3,15. మెస్సీయావచ్చి పిశాచాన్ని జయించి మానవులకు పాపవిముక్తి కలిగిస్తాడని ఈ ప్రవచనం భావం. ఇంకా యెషయా ప్రవచనం "ప్రభువైన యావే మృత్యువును సదా నాశం చేసి ఎల్లరి కన్నీళ్ళను తుడిచివేస్తాడు" అంటుంది - 25,8.

"నేను ఆ రాత్రి చూచిన దృశ్యంలో
నరపుత్రుని వంటివాడు
మేఘావృతుడై రావడం చూచాను
అతడు పరిపాలనను కీర్తిని
రాజ్యాధికారాన్ని పొందాడు"

అంటుంది దానియేలు ప్రవచనం - 7,13-14. ఈ నరపుత్రుడు మెస్సీయా. ఈలాంటి వేదవాక్యాలన్నిటి భావమేమిటంటే, తొలి ఆదాములో నరజాతి అంతా ఇమిడివుంది. కనుక అతని పాపం నరజాతికంతటికీ సంక్రమించింది. ఈ పాపం నుండి మనలను రక్షించడానికై ఒక నరపుత్రుడు, మెస్సియా, వేంచేస్తాడు. మనమందరం అతనిలో ఇమిడి వుంటాం. అతడు నూత్న మానవజాతికి శిరస్సు. కనుకనే అతని పరిహారం మనకందరికీ మేలు చేస్తుంది. అతడే రెండవ ఆదామైన క్రీస్తు. ఇక ఈ క్రీస్తుని గూర్చి విచారిద్దాం.

## 2. రెండవ ఆదాము

దానియేలు గ్రంథం క్రీస్తుని "నరపుత్రుడు" అని పిలుస్తుంది. ఈ మాటనే తర్వాత సువిశేషాలు మనుష్య కుమారుడు అని పేర్కొన్నాయి. ఇక్కడ నరపుత్రుడు అంటే నరజాతికి చెందినవాడని అర్థం. అతడు దేవుడై కూడ నరుడై జన్మించి వారిపట్ల సానుభూతి చూపాడు. వారి పాపానికి పరిహారం చేసాడు. నూత్నవేదం చాల తావుల్లో ప్రాత ఆదాముకీ నూత్న ఆదామైన క్రీస్తుకీ పోలికలు చూపుతుంది. ప్రస్తుతానికి ఈ పోలికల్లో రెండిటిని మాత్రం పరిశీలిద్దాం. మొదటిది - 1కొరి 15,45-49 వచనాలు. ఇక్కడ పౌలు మన ఉత్థానాన్ని గూర్చి మాట్లాడుతున్నాడు. "మొదటి మానవుడైన ఆదాము సజీవిగ సృష్టింపబడెను అని పరిశుద్ధ గ్రంథము పలుకుచున్నది. కాని చివరి ఆదాము జీవన ప్రదాతయగు ఆత్మ. మొదట వచ్చునది ఆధ్యాత్మికమైనది కాదు. మొదట భౌతికము, తదుపరి ఆధ్యాత్మికము. మొదటి ఆదాము భువియందలి మట్టితో చేయబడెను. రెండవ ఆదాము దివినుండి వచ్చెను. భువికి సంబంధించిన వారు భువినుండి చేయబడిన వానిని పోలియుందురు. దివికి సంబంధించిన వారు దివినుండి వచ్చినవానిని పోలియుందురు. భువినుండి పుట్టినవానిని పోలియుండిన మనము దివినుండి పుట్టినవానిని పోలగలము."

ఈ వాక్యాల్లో పౌలు ఇద్దరు ఆదాములను ఒకరితో ఒకరిని పోల్చి వారిలోని వ్యత్యాసాలను చూపించాడు. ఈ వ్యత్యాసాలను విపులంగా పరిశీలిద్దాం.

తొలి ఆదాము సజీవిగ సృజింపబడ్డాడు. అంటే తన కొరకు తాను ప్రాణం పొందాడు. మనకు గూడ భౌతిక ప్రాణం అందించాడు. కాని రెండవ ఆదాము మనకిచ్చింది ఇంకా గొప్ప జీవితం. అతడు ఉత్థానుడైన మనకు ఆత్మను దయచేసాడు. మనకు ఆధ్యాత్మిక జీవాన్ని వరప్రసాద జీవాన్ని ప్రసాదించాడు.

మొదటి ఆదాము భౌతిక సృష్టి. మట్టితో చేయబడినవాడు. బలహీనపు ప్రాణి. పాపం చేసేవాడు. నాశమైపోయేవాడు. రెండవ ఆదాము ఆధ్యాత్మిక సృష్టి. దివినుండి వచ్చేవాడు. నాశం లేనివాడు. అతడు ఉత్థానం చెంది తన ఆత్మను మనకు ప్రసాదించేవాడు.

తొలి ఆదాము మనకు భౌతిక జీవం మాత్రమే ఈయగలవాడు. కాని రెండవ ఆదాము మనకు ఆధ్యాత్మిక జీవం దయచేస్తాడు.

మొదటి ఆదామును పోలివుండే మనం నాశానికి గురౌతాం. కాని రెండవ ఆదామును పోలివుండే మనం రక్షణం పొందుతాం. ఫలితాంశమేమిటంటే, ఆదాము బిడ్డలమూ నాశానికి గురయ్యే వాళ్ళమూ ఐన మనం, క్రీస్తుని ధరించి దివ్యత్వాన్ని పొందుతాం.

రోమా 5,12-21లో గూడ పౌలు ఇద్దరు ఆదాములకు వ్యత్యాసాన్ని చూపించాడు. ఇక్కడ పౌలు క్రీస్తు ద్వారా మనకు రక్షణం లభిస్తుందనే అంశాన్ని గూర్చి మాట్లాడుతున్నాడు.

ఆదాము రానున్న వానికి, అంటే క్రీస్తుకి, చిహ్నంగా వుంటాడు. క్రీస్తు ఆదాములో ఇమిడే వున్నాడు. క్రీస్తు నరుడై జన్మించినపుడు ఈ చిహ్నం నెరవేరింది - 14.

ఆదాము పాపం అవిధేయత. దానివల్ల మనకందరికీ పాపమూ మృత్యువూ దాపురించాయి. క్రీస్తు విధేయత వల్ల ఆదాము పాపానికి పరిహారం చెల్లించినట్లయింది. అతని విధేయత మనలను నీతిమంతులనూ జీవమయులనూ చేసింది - 19.

ఆదాము ద్వారా పాపం లోకంలో ప్రవేశించింది. దానివలన మనకు మృత్యువు గూడ సిద్ధించింది. కాని క్రీస్తు నీతియుతమైన క్రియ మనకందరికీ విముక్తిని ప్రసాదించింది. ఆదాము ద్వారా మనం పోగొట్టుకొన్నదానికంటె క్రీస్తు ద్వారా మనం పొందిందే యెక్కువ. కావున ఒక విధంగా చెప్పాలంటే, ఆదాము పాపం చేయడమే మెరుగైంది - 18.

ఆదాము ఏవతో కలసి పాపం చేసాడు. క్రీస్తు తిరుసభను రక్షించి ఆమెను తన పత్నినిగా జేసికొన్నాడు. నేడు ఈ క్రీస్తు తిరుసభల పోలిక మన క్రైస్తవ వివాహంలో వధూవరులపై సోకుతుంది.

ఈలా ఆదాము పాపం వలన నాశమైపోయిన మానవజాతిని క్రీస్తు తన మరణం ద్వారా రక్షించాడు.

## 3. ఇద్దరూ ఆదాములూ, క్రైస్తవుడూ

మనం భౌతికంగా తొలి ఆదామునుండి జన్మిస్తాం. అధ్యాత్మికంగా రెండవ ఆదామునుండి నూత్న జన్మనొందుతాం. ఇది జ్ఞానస్నానం ద్వారా జరుగుతుంది. తొలి ఆదాము ద్వారా మనలో జీవించేవాడు నూత్న మానవుడు. పౌలు మనలోని ప్రాత స్వభావాన్ని తొలగించి నూత్న స్వభావాన్ని అలవర్చుకోవాలని బోధించాడు - ఎఫె 4,22-24. ప్రాత మనస్సును తొలగించి క్రొత్త మనస్సును పొందాలని చెప్పాడు - కొలో 3,9-10. నూత్న మానవుడైన క్రీస్తు మనలో నెలకొనాలని బోధించాడు. బైబుల్లో ప్రాతతనం పాపానికీ, క్రొత్తదనం పవిత్రతకీ చిహ్నంగా ఉంటాయి.

### ప్రార్థనా భావాలు

1. నరునికి మొదట చావులేదు. తన్ను చేసిన దేవుళ్లాగే అతడు కూడ అమరుడు. కాని పిశాచం నరుణ్ణి చూచి అసూయ పడి అతనికి మరణాన్ని తెచ్చిపెట్టింది.
"దేవుడు నరుణ్ణి అమరునిగా జేసాడు
అతనిని తనవలె నిత్యునిగా జేసాడు
కాని పిశాచం అసూయ వలన
మృత్యువు లోకంలోనికి ప్రవేశించింది"
అంటుంది సొలోమోను జ్ఞానగ్రంథం - 2,23-24. ఈ రీతిగా పిశాచం తొలిమానవుణ్ణి జయించింది. కాని నూత్న నరుడైన క్రీస్తు మనకొరకు ఈ పిశాచాన్ని జయించాడు. అతన్ని విశ్వసించినపుడు అతని విజయం మనమీద సోకుతుంది - యోహా 12,31. క్రీస్తు ద్వారా మనం నిత్యం పిశాచాన్ని జయిస్తుండాలి.

2. మొదట లోకంలో పాపం లేదు
"ఆది స్త్రీ నుండే పాపం వచ్చింది
ఆమె మూలంగా మనమందరం
చనిపోవలసి వచ్చింది"
అంటుంది సీరా జ్ఞాన గ్రంథం - 25,24. కాని నూత్న ఏవ తొలియేవ పాపానికి పరిహారం చేసిపెట్టింది. ఆదాము ఏవలు మన చావుకి కారణమైతే రెండవ ఆదాము క్రీస్తు, రెండవ ఏవ మరియ మన జీవానికి కారకులు.

3. భువినుండి పుట్టిన ఆదామును పోలిన మనం, దివినుండి వచ్చిన రెండవ ఆదామును గూడ పోలుతాం - 1కొరి 15,49. జ్ఞానస్నాన సమయం నుండే మనం క్రీస్తుని పోలివుంటాం. ఈ పోలిక మన ఉత్థానంతో పరిపూర్ణమౌతుంది. కనుక మనం నిత్యం మన మనస్సులను పరలోక వస్తువులు మీద నిల్పుకోవాలి - కొలో 3,1. అనగా మనకు లౌకిక జీవితం చాలదు. పరలోక జీవితం కూడ కావాలి.

4. ఆదాము ప్రాత మానవుడు. క్రీస్తు నూత్న మానవుడు. ఈ క్రీస్తు ద్వారా మనం నూత్న మానవులం కావాలి. యూదులవలె మనకు సున్నతి ముఖ్యం గాదు, నూత్నసృష్టి కావడం ముఖ్యం - గల 6,15. మనం ప్రాత మనస్సుని తొలగించుకొని క్రొత్త మనస్సుని అలవర్చుకోవాలి. దేవుడు మనలను తనకు ప్రతిబింబంగా తీర్చిదిద్ది మనలను నూత్ననరులను చేస్తాడు - కోలో 3,8-10. క్రీస్తు యూదులను అన్యజాతులకు చెందిన మనలను ఏకం చేస్తాడు. అతడు ఈ రెండు జాతుల నుండి తనతో ఐక్యమయ్యే నూత్న జాతిని కలిగిస్తాడు- ఎఫె 2,14. నేడు మనమంతా ఆ నూత్న ఆదాములో మెదులుతూంటాం.

5. ఆదాము గర్వంతో దేవుడంతటివాణ్ణి కావాలనుకొని జ్ఞానవృక్షఫలం ఆరగించాడు. నూత్న ఆదామైన క్రీస్తు వినయంతో నీచమైన సిలువ మరణానికి గూడ సంసిద్ధుడయ్యాడు. అతడు ఎల్లప్పుడు దైవస్వభావం కలవాడే ఐనా, స్వార్థబుద్ధితో దేవునితో తనకున్న సమానత్వాన్ని పట్టుకొని వ్రేలాడలేదు. తన్ను తాను రిక్తుని చేసికొని సేవకుని రూపంలో నరుడై జన్మించాడు. నేడు ప్రాత స్వభావం, గర్వం వదలుకొని నూత్న స్వభావమూ వినయమూ అలవర్చుకోవడంలో ఈ క్రీస్తు మనకు ఆదర్శం - ఫిలి 2,6.

6. ఆదాముకి వచ్చిన శోధనలు ఎడారిలో నూత్న ఆదాముకి గూడ వచ్చాయి. కాని క్రీస్తు ఈ శోధనలను జయించాడు. అతని విజయం నేడు మనమీద సోకుతుంది. క్రీస్తు ద్వారా మనం నిరంతరం పిశాచాన్ని జయించి నూత్నత్వాన్ని పొందుతూండాలి - లూకా 4,1-13.

7. ఆదాము దేవుని కుమారుడు - లూకా 3,38. కాని దేవునికి ఆదాముకంటె ప్రీతిపాత్రుడైన కుమారుడు ఇంకొకడున్నాడు. అతడే క్రీస్తు. ఆ క్రీస్తు వరప్రసాదం ద్వారా మనం నిరంతరం క్రొత్త ఆదాములం ఔతూండాలి.

# 9. శిల

పాలస్తీనా దేశం రాతిమయం. ఎక్కడ చూచినా కొండలూ బండలూ గుట్టలు కన్పిస్తుంటాయి. రాయి గట్టిది, బలమైంది, దీర్ఘకాలం మనేది. కనుక దాన్ని నమ్మవచ్చు. రాతితో కట్టిన ఇల్లు, గోడ, కోట నరులకు రక్షణనిస్తుంది. యిస్రాయేలీయులు ఈ రాతి గుణాలన్నీ దేవునికి అన్వయింపజేసారు. అతడు రాయిలాగ బలమైనవాడు, నమ్మదగినవాడు, రక్షణనిచ్చేవాడు అన్నారు. బైబులు దేవుణ్ణి రాతితో పోల్చి చెప్పే భావాలు చాలా వున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

## 1. పవిత్ర స్థంభాలుగా రాళ్ళు

బైబులు రాతి విగ్రహాలను ఆరాధించవద్దని రూఢిగా చెప్తుంది. చెక్కిన శిలలను ఆరాధన స్తంభాలుగా నెలకొల్పి వాటికి పూజలు చేయవద్దని చెప్తుంది - లేవీ 26,1. ఐనా యిస్రాయేలు ప్రజలు రాళ్ళనూ రాతి స్తంభాలను నెలకొల్పి వాటికి పూజలు చేసారు. అవి దేవుళ్ళనో లేక దేవునిగుళ్ళనో భావించారు. యాకోబు బేతేలువద్ద ఒక శిలను పవిత్ర స్తంభంగా నాటి దాని మీద తైలం పోసాడు. అనగా అది దేవునికీ దేవుని గుడికీ చిహ్నంగా వుంటుంది. అతడు దాన్ని బేతేలు - దేవుని యిల్లు అని పిల్చాడు - ఆది 28,18. మోషే సీనాయి కొండదగ్గర పండ్రెండు తెగల యిస్రాయేలీయుల పేర్లమీదిగా పండ్రెండు రాళ్ళు తీసికొని బలిపీఠం కట్టాడు - నిర్గ 24,4. రెండు మణుల మీద 12 తెగల పేర్లు చెక్కించి వాటిని ప్రధాన యాజకుని వస్త్రం మీద కుట్టించాడు. ఆ పేర్లను చూచి ప్రభువు యిస్రాయేలీయులను జ్ఞాపకం చేసికొంటాడని చెప్పాడు - నిర్గ 28,10. యేషువా నిబంధనానికి జ్ఞాపకార్థంగా రాళ్ళను పాతించాడు - యోషు 4,5-7. ఈ శిలలన్నీ గూడ దైవసాన్నిధ్యాన్ని సూచిస్తాయి. నూత్నవేదంలో క్రీస్తు అనే శిల మన బలిపీఠమౌతాడు - హెబ్రే 13,10.

## 2. ఆశ్రయంగా రాయి

రాతితో నిర్మింపబడిన యిల్లు లేక కోట నరులకు ఆశ్రయంగా వుంటుంది. ప్రాచీన మానవులకు కొండ గుహలు కూడ ఆశ్రయాలే. రాయి గట్టిగా వుంటుంది. చాల కాలం నిలుస్తుంది. దాన్ని నమ్మవచ్చు. ఈ భావాలను మనసులో పెట్టుకొని యిస్రాయేలీయులు దేవుణ్ణి నమ్మదగిన వాడు, రక్షణ శిల, కోట, దుర్గం అని పిల్చారు. ఈ సందర్భంలో కీర్తనకారుడు ఈలా అన్నాడు :

"ప్రభువు నాకు శైలము, కోట
నా దేవుడు నన్నాపదనుండి రక్షించేవాడు
నేనతని మరుగు జొత్తును
ఆ ప్రభువు నాకు దుర్గం, డాలు
రక్షణసాధనం, ఆశ్రయ సాధనం" - 18,2.

## 3. పునాది రాయి

శిల గట్టిగా వుండడం వల్ల పునాదిరాయిగా ఉపయోగపడుతుంది.
"నేను సియోనున ఒక పునాదిరాయి వేస్తున్నాను
ఆ మూలరాయి విలువ కలది, పటిష్ఠమైనది
విశ్వాసం కలవాడు చలింపడు"

అంటాడు యెషయా - 28,16. ఇక్కడ పునాదిరాయి మెస్సీయాయే. యూదా యిస్రాయేలు పౌరులంతా ఈ మెస్సీయా అనే మూలరాతి మీద నిలబడవలసిందే. అతన్ని నమ్మవలసిందే.

నూత్న వేదంలో మొదటి పేత్రు జాబు ఈ ప్రవచనాన్ని క్రీస్తుకి అన్వయిస్తుంది - 2,6. విశ్వాసులు క్రీస్తుని నమ్మాలని చెప్తుంది. ఆ క్రీస్తు బోధనలను నమ్మేవాడు రాతి పునాది మీద యిల్లు కట్టుకొన్న వానితో సమానం - మత్త 7,24. క్రీస్తులాగే అతని ప్రధాన శిష్యుడైన పేత్రు కూడ శిలే. అరమాయిక్ భాషలో అతని పేరు కేఫా. రాయి అనే ఈ మాటకు అర్థం. కనుకనే క్రీస్తు పేత్రుతో "పేత్రూ! నీ పేరు రాయి. ఈ రాతి మీద నా సమాజాన్ని నిర్మిస్తాను. నరకశక్తులు దాన్ని జయించలేవు" అని అన్నాడు - మత్త 16,18. కాని నూత్న వేదంలో రాయి అనే పేరు తరచుగా మెస్సీయాకే వర్తిస్తుంది.

## 4. రాతినుండి నీళ్ళు

రాయి కఠినమైంది. ఎండిపోయి వుండేది. కాని దేవుని హస్తాలు సోకినపుడు అది మెత్తబడుతుంది. దాని నుండి నీళ్లు స్రవిస్తాయి కూడ. మోషే యిస్రాయేలీయులను గూర్చి చెప్తూ

"పర్వతాల పంట వారికి భోజనమైంది
కొండ చరియల్లోని తేనె వారికి ఆహారమైంది
రాతినేలలో వారి ఓలివు చెట్లు పెరిగాయి"

అంటాడు - ద్వితీ 32,13. అనగా దేవుని అనుగ్రహం వలన రాళ్ళు గూడ ప్రజలకు ఉపయోగపడ్డాయని భావం.

ఇంకా మెరీబాచెంత మోషే కొండబండను బెత్తంతో కొట్టగా దానినుండి నీళ్లు వెలువడ్డాయి - నిర్గ 17,6. రాతి బండనుండి నీళ్లు పుట్టడం ఆశ్చర్యం కదా! అది దేవుని కరుణ. పూర్వవేద రబ్బయిలు ఈ రాయి ఎడారిలో యిస్రాయేలీయులతో పయనించిందన్నారు. కాని నూత్న వేదంలో పౌలు ఆ బండ క్రీస్తేనని చెప్పాడు. ఆ బండ నుండి కారే నీళ్ళతో మనం దాహం తీర్చుకోవాలి - 1కొరి 10,4. క్రీస్తు నుండి జీవజల నదులు పుడతాయి. అవి తన్ను విశ్వసించేవారి అంతరంగంలోనికి పారతాయి - యోహా 7,37-39. ఇంకా సిలువ మీద తెరువబడిన క్రీస్తు హృదయం అనే బండనుండి కూడ నీళ్లూ నెత్తురూ ఊరతాయి - యోహా 19,34. ఈ నీళ్లు నేటి జ్ఞానస్నానానికీ, ఈ రక్తం నేటి దివ్య సత్ప్రసాదానికి చిహ్నంగా ఉంటాయి. యీలా రాయి తానిచ్చే నీటిద్వారా జీవనసాధన మౌతుంది.

## 5. నాశం చేసే రాయి

బైబుల్లో రాయి జీవాన్నిచ్చేది మాత్రమే కాదు, నాశం చేసేది కూడ. యెషయా ప్రవచనంలో ప్రభువు

"నా పావిత్ర్యం వలన నేను
ప్రజలు తట్టుకొని పడిపోయే
రాయివంటివాడ నౌతాను"

అంటాడు - 8-14. యూదా యిస్రాయేలు ప్రజలుకూడ యావే అనే రాతిని తట్టుకొని పడిపోతారు. అనగా వాళ్ళు అతన్ని నమ్మనందున అతని నుండి శిక్షను కొనితెచ్చుకొంటారు. నూత్నవేదంలో పౌలు యీ అడ్డురాయి క్రీస్తేనన్నాడు - రోమా 9,33. లూకా కూడా క్రీస్తుని యీ వినాశ శిలతో పోల్చాడు. "ఎవడు ఈ రాతిమీద పడతాడో వాడు తునాతునకలౌతాడు. ఎవనిపై యీ రాయి పడుతుందో వాడు నలిగి నుగ్గవుతాడు - 20,18. కనుక యీ వాక్యాల్లో క్రీస్తు మనం తట్టుకొని పడేరాయి, మనమీద పడి మనలను నుగ్గుచేసే రాయి అని చెప్పబడింది. అనగా అతడు మనకు శిక్షకుడు ఔతాడని భావం. ఈలాంటి రాతినొక దానిని దానియేలు ప్రవచనం కూడ పేర్కొంటుంది - 2,34-35.

## 6. మూలరాయి, సజీవ శిలలు

"ఇల్లు కట్టేవారు పనికిరాదని నిరాకరించిన రాయే
మూలరాయి అయింది"

అంటుంది కీర్తన 118,22. ఇక్కడ యీ వాక్యం బాబిలోనియా ప్రవాసం నుండి తిరిగివచ్చిన యిస్రాయేలీయులకు వర్తిస్తుంది. బాబిలోనియాలో అవమానాలకు గురైనవాళ్ళే ఇప్పుడు పాలస్తీనా దేశంలో గౌరవాన్ని పొందుతున్నారని కీర్తనకారుని భావం. నూత్నవేదంలో క్రీస్తు యీ వాక్యాన్ని తనకే అన్వయించుకొన్నాడు - మత్త 21,42. యూదులు నిరాకరించిన క్రీస్తే నూత్న క్రైస్తవ సమాజానికి నాయకుడౌతాడని అతని భావం.

పూర్వవేదంలో ప్రభువు మెస్సీయాను గూర్చి చెప్తూ "నేను సియోనున ఒక మూలరాతిని వేస్తున్నాను" అంటాడు- యెష 28,16. ఈ మూలరాయి మెస్సీయాయే. మెస్సీయాను నమ్మే భక్తసమాజం ఈ మూలరాతి మీదనే నిలుస్తుంది. పేత్రు మొదటిజాబు ఈ మూలరాయి క్రీస్తేనని చెప్తుంది- 2,4-8. ఈ జాబు భావాల ప్రకారం క్రీస్తనే మూలరాతి మీద క్రైస్తవులను సజీవ శిలలనుగా పేరుస్తారు. క్రీస్తూ క్రైస్తవ సమాజమూ కలసి ఓ దేవాలయ మౌతుంది. ఈ దేవళంలో యెరూషలేం దేవళంలో వలె జంతు బలులను గాక ఆధ్యాత్మిక బలులను అర్పిస్తారు. అనగా క్రైస్తవ సమాజం క్రీస్తుతో ఏకమై తండ్రికి సిలువబలి నర్పిస్తుందని భావం - 2,5.

ఈలా శిలలను గూర్చి పూర్వ నూత్న వేదాల్లో చాలా భావాలున్నాయి. ఇవి యావే ప్రభువుకీ క్రీస్తుకీ వర్తిస్తాయి. ఈ భావాలను భక్తులు నిష్ఠతో ధ్యానం చేసికోవాలి.

## ప్రార్థనా భావాలు

1. దేవుడు నమ్మదగినవాడు కనుక మనకు పునాది రాయి ఔతాడు. మనం అతని మీదనే ఆధారపడాలి. "ఈ బాలుడు యిస్రాయేలీయుల్లో అనేకుల పతనానికీ ఈ ఉద్ధరణకూ కారకుడౌతాడు" - లూకా 2,34. "యేసుక్రీస్తు అనే దేవుడు వేసిన పునాదిని తప్ప వేరొక పునాదిని ఎవడూ వేయలేడు" - 1కొరి 3,11. ఈ క్రీస్తుని నిండు హృదయంతో నమ్మి మనం రక్షణం పొందాలి.

2. క్రీస్తు హృదయం నుండి నీళ్లూ నెత్తురూ స్రవించాయి. ఆ నెత్తురు దివ్యసత్ప్రసాదాన్నీ, ఆ నీళ్ళు జ్ఞానస్నానాన్నీ సూచిస్తాయని చెప్పాం. కనుక అతడు మనకెప్పుడూ రక్షణ శిలగానే వుంటాడు.

3. పేత్రు మొదటిజాబు వాకొన్నట్లు క్రీస్తూ మనమూ కలసి ఒక్క దేవాలయంగా నిర్మింపబడతాం. అతనితో కలసి మనం పితను ఆరాధిస్తాం. కనుక మనం ఆరాధన సమాజానిమి.

# 10. రక్షకుడు

రక్షకుడు అనేది క్రీస్తు ప్రధాన నామాల్లో ఒకటి. ఈ యధ్యాయంలో అతడు మనకు ఏలా రక్షకుడౌతాడో చూద్దాం.

## 1. శత్రువుల నుండి రక్షణం

నరుడు దుర్బల ప్రాణి. అంటురోగాలు, యుద్ధం, కరువు, మృత్యువు మొదలైనవాటి నుండి అతనికి రక్షణం అవసరం. పూర్వవేద ప్రజలు యావే ప్రభువుకి మొరపెట్టుకొంటే ప్రభువే వారిని కాపాడేవాడు. పూర్వవేదంలో రక్షణం ప్రధానంగా భౌతికమైంది గాని ఆధ్యాత్మికమైంది కాదు.

పూర్వవేదపు రక్షణలన్నిటిలోను పెద్దది, యిస్రాయేలీయులను ఫరో చక్రవర్తి బానిసం నుండి విడిపించడం. కనుకనే ప్రభువు మోషేతో "నేను ఐగుప్తు దేశీయులు మీ నెత్తికెత్తిన బరువును తొలగిస్తాను. వారి దాస్యం నుండి మీకు విముక్తి కలిగిస్తాను. శక్తిగల నా చేతిని చాచి, మీ శత్రువులను నిశితంగా శిక్షించి మిమ్ము దాస్యంనుండి విడిపిస్తాను" అని చెప్పాడు - నిర్గ 6,6. యావే తప్ప రక్షించేవా డెవడూ లేడని యిస్రాయేలీయుల నమ్మకం - యెష 43,11.

## 2. భావికాలంలో రాబోయే రక్షకుడు

యావే ప్రభువు భావికాలంలో ఒక గొప్ప రక్షకుడు వచ్చి ప్రజలను ఉద్ధరిస్తాడని వాగ్దానం చేసాడు. అప్పుడు యిస్రాయేలీయులు బాబిలోనియా ప్రవాసంలో బాధలనుభ

విస్తున్నారు. ప్రభువు దావీదు వంశం నుండి రాబోయే మెస్సీయా ద్వారా ప్రజలకు రక్షణం కలుగుతుందని చెప్పాడు. ఆ మెస్సీయా ప్రజలకు కాపరి ఔతాడని వాగ్దానం చేసాడు. "నా సేవకుడైన దావీదుని నా మందకు ఒకేవొక కాపరినిగా నియమిస్తాను. అతడు వాటిని పోషిస్తాడు. నా సేవకుడైన దావీదు వాటికి పాలకుడౌతాడు" అని నుడివాడు - యెహెజ్కేలు 34,22-24. ఈ దావీదు మెస్సీయాయే.

ఈ రక్షణం వలన ప్రజలకు పాపపరిహారమూ, నూత్నాత్మా, నూత్న హృదయమూ లభిస్తాయి. ప్రభువు ఈలా పలికాడు. "నేను మీపై శుభ్రమైన జలాలను చల్లి మిమ్ము శుద్ధిచేస్తాను. మీకు నూత్న హృదయాన్ని దయచేస్తాను. నూత్నాత్మను మీలో వుంచుతాను. మీనుండి రాతిగుండెను తొలగించి మీకు మాంసపు గుండెను దయచేస్తాను. నా యాత్మను మీలోవుంచి మీరు నా చట్టాలను అనుసరించేలాను, నా విధులను పాటించేలాను చేస్తాను" - యెహె 36,25-28. ఈ రక్షణం అన్ని జాతులకూ లభిస్తుంది.

"ఎల్లజాతులూ చూస్తుండగా
ప్రభువు తన దివ్యశక్తిని ప్రదర్శిస్తాడు
భూమియెల్ల మన దేవుని రక్షణాన్ని చూస్తుంది"

- యెష 52,10. ప్రజల తరపున ప్రజల ఈ రక్షణానికై వేయి కండ్లతో ఎదురు చూచారు.

"ఆకాశమా! పైనుండి విజయాన్ని వర్షించు
భూమి విచ్చుకొని ఆ విజయాన్ని స్వీకరించి
రక్షణాన్ని మొలకెత్తించుగాక,
విమోచననాన్ని అంకురింపజేయునుగాక".

ఆరోజుల్లో కొందరు భక్తులు కుమ్రాను ఎడారిసీమల్లో వసిస్తూండేవాళ్ళు. వాళ్ళూ, గ్రీకు రోమను భక్తులు కూడ ఆ రక్షకునికై గంపెడాశతో ఎదురుచూచారు.

## 3. రక్షకుడు క్రీస్తే

పై భక్తుల కోర్కెలన్నీ క్రీస్తునందు నెరవేరాయి. అతని పేరు యేసు. కాని యిది తెలుగుమాట. హీబ్రూ భాషలో అతని పేరు యెహోషువా. అనగా తండ్రి రక్షణాన్ని కొనివచ్చేవాడు. తన ప్రజలను వారి పాపాల నుండి రక్షించేవాడు - మత్త 1,21. "ప్రభువు తన సేవకుడైన దావీదు వంశాన మన కొరకు శక్తిసంపన్నుడైన రక్షకుణ్ణి ఏర్పరచాడు" అంటూ జకరియా అతని ఆగమనాన్ని సూచించాడు - లూకా 1,69. "ప్రజలందరి యెదుట నీవు ఏర్పరచిన రక్షణాన్ని నేను కనులారా చూచాను" అంటూ సిమియోను అతని రాకడను స్తుతించాడు - లూకా 2,30.

ఈ ప్రభువు తన బోధలద్వారా, అద్భుతాల ద్వారా జక్కయలాంటి పాపులకు రక్షణం దయచేసాడు - లూకా 19,9. త్రోవ తప్పిన గొర్రెను వెదకి మందలోనికి చేర్చాడు - లూకా 15,6. ఈ వుదాహరణలన్నీ పాపులు రక్షణాన్ని పొందుతారు అనడానికి నిదర్శనంగా వుంటాయి.

క్రీస్తు పాపం నుండి మనలను రక్షించడానికే తన ప్రాణాలను బలిగా అర్పించాడు. అతడు "నేను నా గొర్రెల కొరకు నా ప్రాణాన్ని బలిగా అర్పిస్తాను" అన్నాడు - యోహా 10,15. పెంతెకోస్తు అనంతరం పేత్రు క్రీస్తు నుద్దేశించి మాట్లాడుతూ "ఈ నామం వలననే మనకు రక్షణం కలగాలి గాని మరి యే నామం వలనా రక్షణం కలుగదు" అని బోధించాడు - అచ 4,12.

## 4. క్రైస్తవుడు రక్షణం పొందే తీరు

క్రైస్తవుడు క్రీస్తుని నమ్మడం ద్వారా రక్షణం పొందుతాడు. కనుకనే పౌలు ఫిలిప్పి చెరసాల అధిపతితో "ప్రభువైన యేసునందు విశ్వాసముంచితే నీవూ నీ కుటుంబమూ రక్షణం పొందుతారు" అని చెప్పాడు - అచ 16,31. ఇంకా జ్ఞానస్నానం ద్వారా క్రైస్తవుడు రక్షణం పొందుతాడు - 1పేత్రు 3,21. రక్షణమనేది కేవలం దేవుని దయ. దానిమీద మనకు ఏ హక్కులేదు - ఎఫె 2,5. ఐనా మనం దేవుని దయతో సహకరించాలి. భయంతో గడగగ వణకుతూ మన రక్షణ కార్యాన్ని కొనసాగించుకోవాలి - ఫిలి 2,12. సత్క్రియలు చేసి పాపాన్ని విసర్జించాలి. మనం రక్షణం పొందడానికి అనుకూలమైన సమయం ఇదే. ఇదే రక్షణ దినం - 2కొరి 6,2. అనగా మనం క్రీస్తుని నమ్మి ఇప్పుడే, ఇక్కడే రక్షణం పొందాలని భావం.

## 5. పూర్తి రక్షణం పరలోకంలోనే

క్రీస్తుద్వారా మనకు రక్షణం లభిస్తుంది. కాని ఈ లోకంలో వుండగా మనకు పూర్తి రక్షణం లేదు. ఇక్కడ మనది పాపంతో గూడిన అపరిపూర్ణ జీవితం. పరలోకంలో గాని మనకు పరిపూర్ణ రక్షణం లభించదు. దాని కొరకే మనం ఎదురుచూస్తూంటాం - రోమా 8,23. ఉత్థానక్రీస్తు పరలోకం నుండి దిగివచ్చి మన మర్త్య శరీరాలను దివ్యమైన వాటినిగా చేసేవరకూ - అనగా మన వుత్థానం వరకూ - మనం అపరిపూర్ణులంగానే వుండిపోతాం - ఫిలి 3,20-21.

## ప్రార్థనా భావాలు

1. ఈ లోకంలో మనకు పూర్తి రక్షణం లేదు, పరలోకంలోనే గాని అది పూర్తిగా లభించదని చెప్పాం. ఆ రక్షణర కొరకు మనం వేచివుండాలి. క్రీస్తు రెండవసారి వేంచేసి తన కొరకు భక్తితో వేచివుండే వాళ్ళను సంపూర్ణంగా రక్షిస్తాడు - హెబ్రే 9,28.

2. మనకు రక్షణం లభించే సమయం దగ్గరలోనే వుంది - రోమా 12,11. అది ప్రస్తుతకాలమే. ఈ వర్తమాన కాలంలో భక్తితో జీవించేవాళ్ళకు మోక్షం దానంతట అదే లభిస్తుంది. మనం ఈలోక జీవితంతో పరలోక జీవితాన్ని కొనుక్కోవాలి. కనుక ఇక్కడ, యిప్పుడు, భక్తితో జీవిద్దాం.

3. క్రీస్తు మరణోత్థానాలతో ఐక్యం కావడంలోనే మన రక్షణం ఇమిడివుంది. ఈ కార్యం జ్ఞానస్నానంతో ప్రారంభమౌతుంది. రోజురోజు పూజబలిలో కొనసాగుతుంది. కనుక తరచుగా పూజబలిలో పాల్గొనేవాళ్ళు రక్షణాన్ని మరింత ధ్రువంగా పొందుతారు.

4. దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి దాన్ని రక్షించడానికి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఆ క్రీస్తుని విశ్వసించి అతని ఆజ్ఞల ప్రకారం జీవించేవాళ్ళకు రక్షణమే గాని ఖండనం లేదు - యోహా 3,16-17. కనుక ఆ ప్రభుని నమ్ముదాం.

# 11. మెస్సీయా

మెస్సీయా అనే మాట "మషీహా" అనే హీబ్రూ పదం నుండి వస్తుంది. దీనికి తుల్యమైన గ్రీకుమాట క్రీస్తోస్. ఈ మాటలన్నిటికి అభిషిక్తుడు - అనగా అభిషేకం పొందినవాడు అని భావం. పూర్వవేదంలో రాజులు, ప్రవక్తలు, యాజకులు అభిషేకం పొందారు. ఈ మూడు రకాల అభిషేకాలను పరిశీలిద్దాం.

## 1. మూడు రకాల అభిషేకాలు

### 1. రాజులు

సమూవేలే సౌలుని తొలి రాజునిగా అభిషేకించాడు - 1సమూ 10,1. అతడు దేవునిమాట వినకపోతే తర్వాత దావీదుని రెండవ రాజునిగా అభిషేకించాడు - 1సమూ 16,13. గీహోను చెలమవద్ద సాదోకు సొలోమోనును రాజుగా అభిషేకించాడు - 1రాజు 1,39. దేవునినుండి అభిషేకం పొందినవాడు పవిత్రవ్యక్తి. దేవుడు అతని ద్వారా తన ప్రణాళికలను నిర్వహిస్తాడు. అతడు దేవునిన ప్రతినిధి. కాని దేవుడు కాదు.

### 2. యాజకులు

ప్రధాన యాజకునికి సాధారణ యాజకునికి గూడ అభిషేకం చేసేవాళ్ళు - నిర్గ 29,9. అలా అభిషేకం పొందినవాళ్ళు పవిత్రులు.

### 3. ప్రవక్తలు

మామూలుగా ప్రవక్తలకు అభిషేకం లేదు. ఒక్క ప్రవక్త మాత్రం తాను అభిషేకం పొందినట్లుగా చెప్పుకొన్నాడు. అతడు మూడవ యెషయా. ఇతడు "ప్రభువైన యావే నన్ను అభిషేకించి తన యాత్మతో నింపాడు. అదీ, పేదలకు సువార్తను ప్రకటించడానికి" అని చెప్పుకొన్నాడు - యెష 61,1. నూత్నవేదంలో క్రీస్తు ఈ ప్రవచనాన్ని తనకు అన్వయించుకొన్నాడు - లూకా 4,18. పూర్వవేదంలో మోషే తనలాంటి ప్రవక్త వొకడు మళ్ళా ఉద్భవిస్తాడని చెప్పాడు - ద్వితీ 18,15.

## 2. మెస్సీయా మూడు పనులు

పూర్వవేదంలో మొదట మెస్సీయా అనే మాటకు స్పష్టమైన భావాలు లేవు. కాలక్రమేణ ఆ పదం పరిణామం చెందుతూ వచ్చింది. క్రమేణ అతడు దేవుని ప్రతినిధిగా వచ్చి ఆ దేవుని కార్యాలు నిర్వహిస్తాడనే భావం ప్రచారంలోకి వచ్చింది. అతడు రాజు, ప్రవక్త, యాజకుడు అనే మూడు భావాలు పూర్వవేదంలో తగులుతాయి. వీటిల్లో రాజు అనే భావానికి పూర్వవేదం ఎక్కువ ప్రాముఖ్యమిస్తుంది. కుమ్రాను భక్తులు ఇద్దరు మెస్సీయాలు వస్తారని భావించారు. వీరిలో ఒకడు రాజు, మరియొకడు ప్రవక్త.

నాతాను ప్రవచనం ప్రకారం మెస్సీయా దావీదు వంశంలో పుడతాడు - 2సమూ 7,12-16. యెషయా అతని రాకడను ముందుగా ఎరిగించాడు. "యువతి గర్భవతియై వుంది. ఆమె కుమారుని కని అతనికి ఇమ్మానువేలు అని పేరు పెడుతుంది" అన్నాడు - 7,14. జెకర్యా అతడు దీనుడుగా వస్తాడు అని చెప్పాడు.

"సియోను కుమారీ! సంతసించు
ఇదిగో నీ రాజు నీ చెంతకు వస్తాడు
గాడిదపై ఎక్కి వస్తాడు
గాడిద పిల్లపై ఎక్కి వస్తాడు"

అని నుడివాడు 9,9-10. కడన అతడు నూత్న వేదంలో యేసుక్రీస్తుగా అవతరించాడు.

క్రీస్తునాడు పాలస్తీనా దేశం రోమనుల అధీనంలో వుంది. వారినుండి స్వాతంత్ర్యం పొందాలని యూదులు ఉబలాటపడుతుండేవాళ్ళు. కనుక మెస్సీయా, ప్రవక్త రాజు యాజకుడు ఐనా అతన్ని ప్రధానంగా రాజునిగానే భావించేవాళ్ళు. అతడు రోమను ప్రభుత్వాన్ని కూలద్రోసి తమకు స్వాతంత్ర్యం సంపాదించిపెడతాడని యెంచేవాళ్ళు. కనుక క్రీస్తునాడు మెస్సీయా అనే పదం రాజకీయ భావాలతో నిండివుండేది.

## 3. యేసే మెస్సీయా

యేసు పవిత్రతను బోధను అద్భుతాలను జూచి అతని సమకాలికులు అతన్ని క్రీస్తు అని పిలవడం మొదలెట్టారు. మెస్సీయావి నీవేనా అని అడిగారు- యోహా 10,24.

కాని యూదుల్లో అతన్ని గూర్చి భేదాభిప్రాయాలు ఏర్పడ్డాయి. యూదుల అధికారులు అతన్ని మెస్సీయాగా అంగీకరించలేదు. అలా అంగీకరించిన వారిని ప్రార్థనా సమాజం నుండి వెలివేస్తామని గూడ బెదిరించారు - యోహా 9,22. ఐనా శిష్యులు మరికొందరు సామాన్య ప్రజలు మాత్రం అతన్ని మెస్సీయాగా గుర్తించారు - మార్కు 8,29.

యేసునాడు మెస్సీయా పదం రాజకీయ భావాలతోను, తిరుగుబాటు భావాలతోను నిండివుండేదని చెప్పాం. మెస్సీయా రోమను ప్రభుత్వంతో యుద్ధం చేస్తాడని యూదులు నమ్ముతూ వచ్చారని చెప్పాం. ఈ కారణాల వల్ల యేసు ఈ పదాన్ని తనకు వాడుకోలేదు. యోహాను 4, 25 -26 లో మాత్రం ఈ పదాన్ని తనకు వాడుకొన్నట్లు కన్పిస్తుంది. ఇక్కడ సమరయ స్త్రీ క్రీస్తు అనబడే మెస్సీయా రానున్నాడు, అతడు వచ్చినపుడు అన్ని విషయాలు తెలియజేస్తాడు అంటుంది. ఆ క్రీస్తుని నేనే అంటాడు ప్రభువు.

ఈవొక్క సందర్భంలోనే దప్పితే ఇతర తావుల్లో యేసు తనకీ పేరు వాడుకోలేదు. ఇతరులను గూడ తనకీ పేరు వాడవద్దని శాసించాడు. దయ్యాలు తన్ను క్రీస్తునిగా తెలియజేయరాదని ఆజ్ఞాపించాడు - లూకా 4,41. శిష్యులను గూడ తన్ను క్రీస్తునిగా తెలియజేయవద్దని ఆదేశించాడు - మత్త 16,20.

ఆ ప్రభువు స్వయంగా కోరుకొంది యాజకుడైన మెస్సీయా బిరుదం. యాజక మెస్సీయాగా తన ప్రాణాలు అర్పించడం అతని కిష్టం - మార్కు 8,31.

ప్రధాన యాజకుడు అతన్ని నీవు దేవుని కుమారుడవైన మెస్సీయావా అని అడిగాడు. క్రీస్తు "నీవన్నట్టే. ఇక మీదట మనుష్య కుమారుడు సర్వశక్తిమంతుని కుడిప్రక్కన కూర్చుండి వుండటం మీరు చూస్తారు" అని జవాబు చెప్పాడు. ఈ వాక్యం దానియేలు గ్రంథం 7,11 నుండి గ్రహింపబడింది. ఈ దానియేలు గ్రంథం పేర్కొనే మనుష్య కుమారుడు మెస్సీయాయే. ఈలా తాను మెస్సీయానని చెప్పుకొన్నందుకే యాజకులు యేసుకి మరణశిక్ష విధించారు - మత్త 26,63-65.

కాని ఉత్థానానంతరం ప్రభువు ఈ క్రీస్తు అనే బిరుదాన్ని మళ్లా తనకు వాడుకొన్నాడు. ఎందుకంటే అప్పుడిక ఆ పదం వల్ల రాజకీయభావాలు ధ్వనింపవు - లూకా 24,26.

## 4. తొలినాటి తిరుసభలో

యేసు ఉత్థానమై పవిత్రాత్మ దిగిరాగానే శిష్యులు యేసే పూర్వవేదం వాకొన్న క్రీస్తు అని బోధించడం మొదలెట్టారు. కాని యీ బోధ యేసుని సిలువ వేసిన యూదులకు గిట్టలేదు. కనుక శిష్యులకూ యూదనాయకులకూ మధ్య వాదోపవాదాలు జరుగుతుండేవి. "మీరు సిలువపై చంపిన ఈ యేసునే దేవుడు ప్రభువుగాను క్రీస్తుగాను నియమించాడు"

అని పేత్రు బోధించాడు - అ.చ.2,36. ఈ వాదోపవాదాల సందర్భంలో "క్రీస్తు" అనే పేరు బాగా ప్రచారం లోకి వచ్చింది. అది యేసు సొంత నామమైపోయింది. అతనికున్న ఇతర నామాలను కూడ తనలో కలుపుకొని తానొక్కటే అతని ముఖ్య నామమైపోయింది. అటుపిమ్మట క్రీస్తు అంటే నజరేత్తూరి యేసు అనే అర్థం వచ్చింది. అంతకుముందు ఆ శబ్దానికి ఆ యర్థముండేది కాదు. క్రీస్తు అంటే రాజు, యాజకుడు ఎవరైనా కావచ్చు. పైగా క్రీస్తుని అనుసరించేవాళ్ళనీ అతని శిష్యులనూ "క్రైస్తవులు" అని పిలవడం మొదలెట్టారు. ఈ పలుకుబడి మొదట అంతియోకయలో ప్రారంభమైంది. తర్వాత లోకమంతటా వ్యాపించింది - అచ 11,26.

## ప్రార్థనాభావాలు

1. క్రీస్తంటే అభిషేకం పొందినవాడని చెప్పాంగదా! కాని అతడు ఎప్పుడు అభిషేకం పొందాడు? యోర్దానులో జ్ఞానస్నానం పొందినపుడు ఆత్మ పావురం రూపంలో తన మీదికి దిగిరావడం ద్వారా ఈ యభిషేకం జరిగింది. ఈ యాత్మాభిషేకం అతడు ప్రవక్తగా బోధ చేయడానికి - లూకా 3,21-22. ఈలా అభిషిక్తుడైన క్రీస్తు నేడు మనలను కూడ బోధనా కార్యక్రమానికి ఆహ్వానిస్తూంటాడు.

2. క్రీస్తులాగే మనం కూడ అభిషేకం పొందుతాం. "ఆయన వలన మీరు పొందిన అభిషేకం మీయందు నిల్చివుంది. కనుక ఎవడును మీకు బోధింప నక్కరలేదు" - 1యోహా 2,27. ఇక్కడ అభిషేకం అంటే క్రీస్తుని గూర్చిన బోధను విని అతన్ని విశ్వసించడం. ఈ క్రియ ఆత్మద్వారా జరుగుతుంది. కనుక ఆత్మ మనం క్రీస్తుని నమ్మేలాగ చేయడమే ఇక్కడ అభిషేకం. ఈ యభిషేకాన్ని అధికాధికంగా దయచేయమని ఆ యాత్మనే అడుగుకొందాం.

3. క్రీస్తుని అనుసరించేవాడు క్రైస్తవుడు. కనుక మన ప్రవర్తనం యోగ్యంగా వుండాలి. మనం గురువుకు తగిన శిష్యులంగా జీవించాలి. అనగా క్రీస్తుపట్ల భక్తి విశ్వాసాలతో జీవించాలి. "నాంకేవాస్తే" క్రైస్తవులంగా వుండిపోగూడదు.

# 12. యేసు

## 1. యేసు నామం అర్థం

ప్రభువు బిరుదం క్రీస్తు. ఐతే సొంతపేరు యేసు. ఈ యేసు అనేది "ఇయేసుస్" అనే గ్రీకు నామం నుండి వచ్చింది. హీబ్రూ భాషలో అతని పేరు "యెహోషువా." దీని సంగ్రహరూపం యోషువా. ఈ పేరుకి యావే ప్రభువు దయచేసే రక్షణం అని అర్థం.

అనగా యావే ఈ వ్యక్తి ద్వారా ప్రజలను రక్షిస్తాడు అని భావం. ఈ యెహోషువా పదమే గ్రీకు నూత్నవేదంలో ఇయేసుస్‌గా మారి, తెలుగులో యేసుగా వ్యవహరింపబడుతూంది.

పూర్వవేదంలో చాలమందికి యెహోషువా పేరుంది. మోషే అనుచరుడైన యోషువా పేరు ఇదే. చాలమంది ప్రధాన యాజకులు కూడ ఈ పేరు పెట్టుకొన్నారు. క్రీస్తు తర్వాత కూడ యూదుల్లో చాలమంది ఈ పేరును స్వీకరించారు. పౌలు శిష్యుల్లో ఓ అతని పేరు యేసు యూస్తు - కొలో 4,11. కాని రెండవ శతాబ్దం తర్వాత యూదులు క్రీస్తుపట్ల గల అనాదరభావంచే ఈ పేరును తిరస్కరించారు. క్రైస్తవులు ప్రభువు పట్లగల గౌరవభావంచే ఈ పేరును పెట్టుకోడానికి సాహసింపలేదు.

## 2. బైబులు ఈ పేరుకి అర్థంచెప్పే తీరు

దేవదూత యోసేపుతో "నీవు ఆ శిశువుకి యేసు అని పేరు పెట్టు. అతడు ప్రజలను వారి పాపాల నుండి రక్షిస్తాడు" అని చెప్పాడు - మత్త 1,21. యోసేపు అతనికి అలాగే పేరు పెట్టాడు. యేసు అనే పేరుకి "తండ్రి ఈ వ్యక్తిద్వారా ప్రజలను రక్షిస్తాడు" అని అర్థం చెప్పాం గదా. క్రీస్తు శిశువుకి సున్నతి చేసినపుడు యేసు అని పేరు పెట్టారు అని చెప్తుంది లూకా సువిశేషం - 2,21. అతడు యూదుల బిడ్డడు. అతని పేరుకూడ యూదుల పేరే. యూదుల సంప్రదాయం ప్రకారం తండ్రే కుమారునికి పేరు పెడతాడు. ఉదాహరణకు జకరియ తన కుమారునికి యోహాను అని పేరు పెట్టాడు - లూకా 1,63. అలాగే యోసేపు కూడ తన కుమారునికి యేసు అని నామకరణం చేసాడు. ఈ శిశువు తన ప్రజలను రోమీయుల క్రూర పరిపాలనం నుండి రక్షింపడు, పాపం నుండి రక్షిస్తాడు. అతని పేరు ప్రధానంగా ఈ రక్షణాన్ని సూచిస్తుంది.

## 3. చారిత్రకంగా యేసు అనే వ్యక్తి

యేసు రక్తమాంసాలతో గూడిన నిజమైన నరుడు. చారిత్రకంగా ఈ మంటిమీద నడచినవాడు. అతడు రోమను ప్రభువైన అగస్తు చక్రవర్తికాలంలో, కురేనియా సిరియాకు మండలాధిపతిగా వున్న రోజుల్లో, బేత్లెహేములో జన్మించాడు - లూకా 2,1-2. అతనికి నజరేత్తూరి యేసు అని పేరుండెడిది - మార్కు 1,24. గలిలయుడైన యేసు అని కూడ పేరుండెడిది - మార్కు 6,3. పేత్రు యూదులకు అతన్ని గూర్చి బోధిస్తూ "మీరు సిలువపై చంపిన ఈ యేసు" అని అంటాడు - అచ 2,36. కావున యేసు చారిత్రక వ్యక్తి గాని ఊహామాత్రపు నరుడు కాదు.

## 4. యేసు బ్రతికివుండగా అతని నామ ప్రభావం

యేసు యెరూషలేము ప్రవేశించినపుడు నగరంలో కలకలం పుట్టింది. ప్రజలు "ఇతరు ఎవరు? గలిలయలోని నజరేతు అనే వూరి ప్రవక్తయైన యేసు కాదా?" అని

చెప్పుకొన్నారు - మత్త 21,10. యూదా సైనికులతో అతన్ని బంధించడానికి వచ్చినపుడు క్రీస్తు మీరు ఎవరిని వెతుకుతున్నారని అడిగాడు. వాళ్లు నజరేయుడైన యేసుని అని సమాధానం చెప్పారు. ప్రభువు నేనే అతన్ని అని పల్కాడు. ఆ మాటలు చెప్పగానే ఆ సైనికులు వెనుకకు తగ్గి నేలమీద పడిపోయారు - యోహా 18,3-6. పూర్వం కీర్తనకారుడు "నేను నీకు ప్రార్థన చేయగానే నా శత్రువులు వెనక్కు తిరిగి పారిపోతారు" అని జపించాడు - 56,9.

శిష్యులు క్రీస్తుతో "ప్రభూ! నీ పేరిట పిశాచాలు కూడ మాకు లోబడ్డాయి" అని చెప్పారు - లూకా 10,17. శిష్యులు కానివాళ్ళు కూడ యేసు అనే దివ్యనామ బలాన్ని వినియోగించుకొన్నారు. కనుకనే యోహాను క్రీస్తుతో "బోధకుడా! మనలను అనుసరింపని వాడొకడు నీ పేరిట దయ్యాలను పారదోలుతుంటే చూచి మేము వానిని నిషేధించాం" అన్నాడు - మార్కు 9,38. "మీరు తండ్రిని నా పేరిట ఏమి అడిగినా ఆయన మీకు అనుగ్రహిస్తాడు" అని క్రీస్తే స్వయంగా శిష్యులతో చెప్పాడు - యోహా 16,23.

## 5. యేసు చనిపోయాక అతని నామ ప్రభావం

యేసు బ్రతికివుండగానే అతని పేరు శక్తితో నిండివుండేది. అతడు చనిపోయాక ఆ పేరు ప్రభావం ఇంకా యెక్కువైంది. యెరూషలేం దేవాలయం గుమ్మం దగ్గర కుంటివాడు పేత్రుని భిక్షమడిగాడు. అతడు వెండిబంగారాలేవీ నా దగ్గరలేవు. నాకు ఉన్న దానిని నీకిస్తాను. నజరేయుడైన యేసుక్రీస్తు పేరిట నీవు నడువు అని చెప్పాడు - అ.చ. 3-6. తర్వాత పేత్రు దేవళంలో ప్రసంగిస్తూ "ఆ యేసు నామమే ఈ కుంటివానికి బలమిచ్చింది" అని చెప్పాడు - 3,16. పిమ్మట అతడు యూదుల విచారణ సభ యెదుట కూడ మాట్లాడుతూ "నజరేయుడైన యేసుక్రీస్తు నామం వల్లనే ఈ కుంటివానికి ఆరోగ్యం కలిగింది" అని వాకొన్నాడు - 4,10. ఆ దివ్యనామ ప్రభావం అలాంటిది. పూర్వం కీర్తనకారుడు "ప్రభూ! నీ పేరుతో నన్ను రక్షించు" అని ప్రార్థించాడు - 54,1. పేత్రూ ఇతర శిష్యులూ తండ్రికి ప్రార్థన చేస్తూ "దేవా! నీ పావన సేవకుడైన యేసు పేరిట అద్భుతాలనూ ఆశ్చర్య కార్యాలనూ చేయి అని జపించారు - అ.చ.4-30. కాని యేసుని నమ్మితేనే అతని నామం పనిచేసేది. పైన పేర్కొన్న కుంటివాడు ప్రభుని నమ్మాడు. కనుక అతని కాలు నయమైంది - 3,16. యూదుల ప్రధానార్చకుడైన స్కెవ అనే వాని కుమారులు "పౌలు బోధిస్తున్న యేసు పేరిట నిన్ను వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తున్నాం" అంటూ ఓ దయ్యాన్ని వెళ్ళగొట్టబోయారు. కాని వారికి యేసునందు విశ్వాసం లేదు. కనుక ఆ దయ్యం "యేసునీ పౌలునీ నేనెరుగుదును. కాని మీరెవరు?" అంటూ వారిమీద తిరగబడింది. కనుక భక్తివిశ్వాసాలు లేనిచోట యేసు నామం పనిచేయదు - 19,13-16.

క్రీస్తునందు విశ్వాసం గలవాళ్ళు కనుక పేత్రు పౌలు ప్రభువు పేరు మీదుగా అద్భుతాలు చేసారు. పేత్రు లిద్దా అనే వూరిలో ఎన్మిదేండ్ల నుండి పక్షవాతంతో బాధపడుతూన్న ఐనెయ అనే అతన్ని చూచి "యేసుక్రీస్తు నిన్ను బాగుచేసాడు. నీవు లేచి నీ పడక నెత్తుకొనిపో" అనగానే అతడు లేచాడు - అ.చ.9,34. పౌలు ఫిలిప్పిలో భూతావేశురాలై సోదెచెప్పే బాలికను జూచి "యేసుక్రీస్తు నామాన నీవు ఈమె నుండి వెడలిపో" అని చెప్పగానే దయ్యం ఆమెనుండి వెళ్ళిపోయింది - 16,18.

ప్రజలు యేసుక్రీస్తు నామాన పాపపరిహారం పొంది జ్ఞానస్నానాన్ని స్వీకరించాలి - 2,38. యేసు అనే నామం మీదిగానేగాని మనకు రక్షణం లేదు - 4,12. సంగ్రహంగా చెప్పాలంటే, తొలినాటి క్రైస్తవులు "యేసుక్రీస్తు ప్రభువు" అని విశ్వసించారు - ఫిలి 2,11. ఇక్కడ ప్రభువు అంటే దేవుడు. పూర్వవేదంలో ప్రభువు నామం తండ్రికి చెల్లుతుంది. నూత్నవేదంలో ఈ నామం క్రీస్తుకి చెందుతుంది. అనగా తండ్రి యెంతటివాడో అతని కుమారుడైన క్రీస్తు కూడ అంతటివాడని బావం.

## ప్రార్థనా భావాలు

1. మనది ల్యాటిన్ శ్రీసభ. గ్రీకు శ్రీసభకు చెందిన క్రైస్తవులు "ప్రభువైన యేసూ! పాపినైన నామీద దయగా వుండు" అనే మంత్రాన్ని సుకృతజపంగా వాడుకొంటారు. ఈ వాక్యాన్ని ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో జోడించి నిదానంగా జపిస్తాం. దీనికే "యేసునామజపం" అని పేరు. ఈ ప్రార్థనం మనం కూడ జపించదగ్గది. మన దేశంలో నామజపం అనే సంప్రదాయం వుంది. అనగా భగవంతుని నామాన్ని భక్తితో జపించడం. యేసు నామాన్ని గూడ నామ జపంగా వాడుకోవచ్చు. ఆ నామాన్ని భక్తితో ఉచ్చరించడమే గొప్ప జపం. ఇంకా మనం "యేసూ! నీవు నాకు యేసువుగానుండు" అని చెప్పుకోవచ్చు. అనగా అతడు మనకు రక్షకుడుగా వుండాలని భావం. హెబ్రేయుల జాబు చెప్పినట్లు "యేసుక్రీస్తు నిన్న, నేడు, ఎల్లప్పుడు ఒకేరీతిగా వుంటాడు" - 13,8. అతడు ఎల్లవేళలా రక్షకుడే.

2. యేసు అంటే రక్షకుడు అన్ని చెప్పాం. అతనిద్వారా తండ్రి మనకు కట్టకడపటి రక్షణాన్ని దయచేస్తాడు. తండ్రి పూర్వవేదంలో చాలసార్లు ప్రవక్తల ద్వారా మాట్లాడాడు. నూత్నవేదంలో ఈ క్రీస్తు ద్వారా కట్టకడపటి సారిగా తన సందేశాన్ని మనకు విన్పించాడు. ఆ సందేశాన్ని భక్తితో ఆలించి అంగీకరించేవాళ్ళను క్రీస్తు తప్పక రక్షిస్తాడు - హెబ్రే 1,1-2. అతడు సిమియోను ఎదురుచూచిన యిస్రాయేలీయుల రక్షణం - లూకా 2,25. నేడు మన రక్షణం కూడ.

3. బెర్నార్డ్ భక్తుడు యేసు నామాన్ని స్తుతిస్తూ ల్యాటిన్ భాషలో పెద్ద గేయం వ్రాసాడు. ఆపాట "ప్రభూ! మాధురీమయమైన నీ నామాన్ని స్మరించుకొన్నంత మాత్రన్నే నా హృదయంలో ఆనందం పెల్లుబుకుతూంటుంది" అనే మాటలతో ప్రారంభ మౌతుంది. మనదేశంలో కూడ భగవంతుని సహస్రనామాలను (వేయి పేర్లను) జపించడం సంప్రదాయం. మనంకూడ యేసు అనే తిరునామాన్ని భక్తితో జపించవచ్చు. విశేషంగా భయాల్లో ఈ నామాన్ని జపిస్తే ఆ భయాలు తీరిపోతాయి. గండాల్లో ప్రమాదాల్లో ఈ నామాన్ని జపిస్తే భద్రత కలుగుతుంది. శోధనల్లో ఈ నామాన్ని జపిస్తే వరప్రసాదబలం చేకూరుతుంది. ఇంత శక్తి కలది ఈ పవిత్ర నామం.

4. యేసు క్రీస్తు సేవకు మన జీవితాన్ని అర్పించుకోవడం మహాభాగ్యం – అ.చ. 15,26. యేసు నామం కొరకు ప్రాణాలను గూడ త్యాగం చేయడం ఇంకా దొడ్డ భాగ్యం – 21,13.

# 13. వరుడు – వధువు

పూర్వవేదంలో యావే ప్రభువు అబ్రాహాము, ఈసాకు, యాకోబు, మోషే మొదలయినవాళ్ళతో నిబంధనం చేసికొన్నాడు. ఈ నిబంధనం ద్వారా అతడు యిస్రాయేలీయుల దేవుడూ, వాళ్ళు అతన్ని పూజించే ప్రజలూ అయ్యారు. ఆ జనులు అతనితో దగ్గరసంబంధం పెట్టుకొని జీవించారు. ఈలా నిబంధనం ద్వారా ఆ భగవంతునికీ ప్రజలకీ యేర్పడిన సంబంధాన్ని సూచిస్తూ పూర్వవేదం ఐదు పెద్ద ఉపమానాలు వాడింది. అవి యివి. భగవంతుడు గొర్రెల కాపరి, ఆ ప్రజలు అతడు మేపే గొర్రెలు. అతడు తోటకాపు, వాళ్ళు అతడు నాటిన ద్రాక్షతోట. అతడు గృహ నిర్మాత, వాళ్ళు అతడు కట్టినయిల్లు. అతడు వరుడు లేక పెండ్లికుమారుడు, వాళ్ళు అతడు పెండ్లాడిన వధువు. అతడు తండ్రి, వాళ్ళు అతడు కన్నసంతానం. వీటిల్లో ఇప్పుడు మనం చదవబోయేది పెండ్లికుమారుడు – వధువు అనే అంశం.

ఈ యంశంలో మళ్లా మూడు భాగాలున్నాయి. ఎడారి కాలంలో యిస్రాయేలీయులు ప్రభువుపట్ల భక్తిభావంతో జీవించారు. కనుక ఆ కాలంలో వాళ్ళు అనురాగంగల వధువులాంటివాళ్ళు. కనాను మండలంలో స్థిరపడిన పిమ్మట వాళ్ళు చంచలబుద్ధితో బాలు ఆరాధనకు పూనుకొన్నారు. కనుక ఈ కాలంలో వాళ్ళు వ్యభిచారానికి పాల్పడిన పాపపు వధువులాంటివాళ్ళు. బాబిలోను ప్రవాసంలో కష్టాలు అనుభవించిన పిదప ప్రభువు వాళ్ళ పాపాలను మన్నించాడు. వాళ్ళను బాబిలోనియానుండి మళ్ళా కనాను దేశానికి తోడ్కొని వచ్చాడు. ఇది రెండవ నిర్గమనం లాంటిది. మొదటి నిర్గమనం

ఐగుప్తు ప్రవాసం నుండి. రెండవ నిర్గమనం బాబిలోనియా ప్రవాసం నుండి. ఈ రెండవ నిర్గమనంలో వాళ్లు క్షాంతవధువు లాంటివాళ్లు. ఇక, యీ మూడంశాలను క్రమంగా పరీశిలిద్దాం.

## 1. అనురాగంగల వధువు

ప్రభువు ఎడారిలో సీనాయి కొండ దగ్గర యిస్రాయే లీయులతో ఒడంబడిక చేసికొన్నాడు. దీనిద్వారా వాళ్ళకూ అతనికీ సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఈ సంబంధం ద్వారా ఆ ప్రభువు వరుని లాంటివాడూ, ఆ ప్రజలు వధువు లాంటివాళ్లూ అయ్యారని చెప్పాం. ఈ యెడారి కాలం యిస్రాయేలీయుల చరిత్రలో పరమ పవిత్రమైంది. ఆకాలంలో వాళ్లు ప్రభువుపట్ల గాఢమైన భక్తితో జీవించారు.

ఈ కాలాన్ని మనసులో పెట్టుకొనే 800 యేండ్ల తర్వాత యిర్మీయా ప్రవక్త
"ప్రభువు వాక్కిది
నీవు యువతివిగా వున్నప్పుడు
నాపట్ల చూపిన అనురాగాన్నీ,
నా వధువు వైనపుడు నాపట్ల చూపిన ప్రేమనీ,
నేను జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాను
నీవు పైరు వేయని తావగు ఎడారిగుండ
నన్ననుసరించి వచ్చావు"

అని నుడివాడు - 2,2. ఇక్కడ యిర్మీయా ప్రవక్త యిస్రాయేలును లేబ్రాయపు యువతినిగా భావించాడు. ఎందుకంటే అప్పుడే వాళ్ళు ఎడారిలో నిబంధనం ద్వారా యావే ప్రజలయ్యారు. ఈలా ఐ కొన్ని నెలలు మాత్రమే ఐంది. ఆ తొలి రోజుల్లో యిస్రాయేలు కన్యకు తన వరుడైన యావేపట్ల గాఢమైన ప్రేమానురాగాలు వుండేవి. ఆమె హృదయంలో అన్యప్రేమలు లేవు. ప్రభువును అనుసరిస్తూ ఎడారిగుండ నలబై యేండ్లు ప్రయాణం చేసింది.

45వ కీర్తన మొదట ఒకానొక యిస్రాయేలు రాజు వివాహాన్ని వర్ణించడానికి వ్రాయబడింది. కీర్తనకారుడు ఈ పాటలో రాజునీ రాణినీ వర్ణించాడు. కాని ఇది క్రమేణ మెస్సీయాకు వర్తించే కీర్తనగా మారిపోయింది. మెస్సీయా భర్త, ప్రజలు అతని వధువు అనే భావం ఈ కీర్తనలోకి ప్రవేశించింది. కీర్తనకారుడు ఈ పాటలో రాణి నుద్దేశించి
"కుమారీ! నీవు నా పలుకులు సావధానంగా విను
మీ ప్రజలను మీ పుట్టింటిని ఇక మరచిపో
ఈ రాజు నీ సౌందర్యానికి మురిసిపోతాడు
ఇతడు నీ కధిపతి కనుక నీ వితనికి నమస్కరించు"

అంటాడు. ఈ రాణి యిస్రాయేలు ప్రజే. ఆ వధువు తన భర్తయైన ప్రభువుకి భక్తివిశ్వాసాలతో ప్రేమానురాగాలతో నమస్కరించాలని భావం.

## 2. వ్యభిచారిణియైన వధువు

యిస్రాయేలీయులు ఎడారియాత్ర ముగించుకొని కనాను మండలం ప్రవేశించి అక్కడ స్థిరపడ్డారు. కొంత కాలంపాటు గిద్యోను, సంసోను మొదలైన న్యాయాధిపతులు వారిని పరిపాలించారు. అటుపిమ్మట సౌలు దావీదు సొలోమోను మొదలైన రాజులు ఏలారు. యిస్రాయేలీయులు ఆ గడ్డమీద కాలుమోపినప్పటినుండి వాళ్ళకో పెద్ద ప్రలోభం ఎదురైంది. కనాను దేశంలోని స్థానికి ప్రజలు బాలు దేవతను కొల్చేవాళ్ళు. వాళ్ళను చూచి యిస్రాయేలీయులుకూడ ఈ దేవతను కొలవడం మొదలెట్టారు. విగ్రహారాధనకు పాల్పడ్డారు. ఈ పాపాన్నే పూర్వవేదం చాల తావుల్లో "వ్యభిచారం" అని పిలుస్తుంది. వ్యభిచారంలో భార్య తన భర్తను విడనాడి అన్యపురుషుని సమీపిస్తుంది. అలాగే యిస్రాయేలీయులు తమ దేవుడైన ప్రభువును విడనాడి అన్యదైవమైన బాలు దగ్గరికి వెళ్ళేవాళ్లు. ఈ యర్థంలో ఈ విగ్రహారాధనం వ్యభిచారమైంది. ఆ ప్రజలకు యావే పట్ల భక్తి సన్నగిల్లిపోవడం వల్ల ఈ పాపకార్యానికి తెగించారు.

మొట్టమొదటిసారిగా విగ్రహారాధనను వ్యభిచారంతో పోల్చిన ప్రవక్త హోషేయ. ఇతని భార్యయైన గోమెరు పెనిమిటిని విడనాడి ఓ కనానీయుల దేవళంలో వ్యభిచారిణిగా కుదిరింది. ఈమెను హోషేయ చాల అనురాగంతో చూచుకొనేవాడు. కనుక గోమెరు చేసిన ఈ యపరాధానికి ప్రవక్త చాల నొచ్చుకొన్నాడు. దైవప్రేరణంపై అతడు తన జీవితంలోని విషాద సంఘటననే యిస్రాయేలు ప్రజలకుగూడ అన్వయించాడు. గోమెరు భర్తను విడనాడి వ్యభిచారిణియైనట్లే యిస్రాయేలు ప్రజ అనే వధువు తన భర్తయైన యావేను విడనాడి బాలు అనే మరో భర్త దగ్గరికి పోతూంది. అతనితో వ్యభిచరిస్తూంది. హోషేయ ప్రవచనం అంతా యీ భావంతోనే నిండివుంటుంది. అతని ప్రవచనంలో ప్రభువు "ఈ దేశప్రజలు నన్ను విడనాడి వ్యభిచారిణిలా ప్రవర్తిస్తున్నారు" అంటాడు - 1,2. అతడు యిస్రాయేలు అనే వధువు నుద్దేశించి

"ఆమె నేను నా ప్రేమికుల వద్దకు వెళ్తాను
వారు నాకు అన్నపానీయాలు ఉన్ని నార
ఓలివు తైలం ద్రాక్షసారాయం ఇస్తారు
అని పల్కుతుంది" అంటాడు - 2,7.

ఈ వ్యభిచార భావాన్ని విపులంగా వర్ణించిన ప్రవక్త యెహెజ్కేలు. యిస్రాయేలు దేశం సమరియ యూదా అని రెండు రాష్ట్రాలుగా వుండేది. ప్రవక్త ఈ రెండు రాజ్యాలను

ఒహోలా, ఒహోలీబా అనే అక్కా చెల్లెళ్ళనుగా భావించాడు. వాళ్ళిద్దరూ యావే వధువులన్నాడు. కాని ఆ యిద్దరు ఒకరిని మించి ఒకరు వ్యభిచారానికి పాల్పడి ప్రభువుకి ద్రోహం చేసారని వాక్రుచ్చాడు. అతని ప్రవచనం 23వ అధ్యాయమంతా ఈ యంశాన్నే చెప్తుంది.

ప్రభువు యిస్రాయేలు వధువు పాపానికి ఆమె మీద తీవ్రంగా కోపించాడు. ఆ ప్రజలతో "మీరు నా జనులు కాదు, నేను మీ దేవుణ్ణికాదు" అని పలికాడు - హోషే 1,9.

## 3. క్షాంతవధువు

ప్రభువు యిస్రాయేలీయుల విగ్రహారాధనం మొదలైన పాపాలకు వాళ్ళమీద కోపించాడు. బాబిలోనియా రాజైన నెబుకద్నెనరును వాళ్ళమీదికి పంపాడు. ఆ రాజు క్రీ॥పూ॥ 586లో యెరూషలేమును నాశంజేసి యూదులను బాబిలోనియాకు ప్రవాసులనుగా తీసుకవెళ్ళాడు. మొదటి ప్రవాసం మోషే కాలంలో, ఐగుప్తు దేశంలో. అది 400 యేండ్లు కొనసాగింది. ఈ రెండవ ప్రవాసం బాబిలోనియాలో. ఇది 70 యేండ్లు కొనసాగింది. ఈ రెండవ ప్రవాస కాలంలో యూదులు తమ పాపాలకు పశ్చాత్తాపపడ్డారు. అందుచే ప్రభువు వాళ్ళ నేరాలను మన్నించి వాళ్ళను మళ్ళా యెరూషలేముకు తీసికొని వచ్చాడు. కనుక వాళ్ళు క్షాంత (క్షమింపబడిన) వధువులాంటివాళ్ళు అయ్యారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని హోషేయ ప్రవచనంలో ప్రభువు

"నేనామెను ఆకర్షించి ఎడారిలోకి కొనిపోతాను
అచట ఆమెతో ప్రేమసంభాషణలు నడుపుతాను"

అంటాడు - 2,14. అనగా యిస్రాయేలీయులు పూర్వం ఐగుప్తు నిర్గమనకాలంలో ఎడారి ప్రయాణమందు ప్రభువుపట్ల ప్రేమ జూపినట్లే, ఈ ద్వితీయ నిర్గమనకాలంలో ఎడారి ప్రయాణ మందు మళ్ళా అతనిపట్ల ప్రేమ జూపుతారని అర్థం. ఈ ప్రేమ యిస్రాయేలీయులు ప్రభువుతో నూత్ననిబంధనం చేసికోవడంలాంటిది. అతన్ని నూత్నంగా వివాహం చేసి కోవడం లాంటిది. కనుకనే అతడు హోషేయ ప్రవచనంలో

"యిస్రాయేలూ! నేను నిన్ను
నా భార్యనుగా జేసికొంటాను
నీతితో న్యాయంతో కరుణతో కృపతో
నిన్ను కలకాలం నాదానినిగా జేసికొంటాను
నీవు నేను ప్రభువునని గ్రహిస్తావు"

అంటాడు - 2, 19-20.

ఇదే భావాన్ని మహా ప్రవక్తయైన యెషయా ఇంకా సుందరంగా వర్ణించాడు. అతడు తన ప్రవచనం 54, 5-10లో ప్రభువు వధువైన యిస్రాయేలు నుద్దేశించి ఈలా పల్కాడు

"నిన్ను సృజించినవాడే నీకు భర్త
సర్వశక్తిమంతుడైన ప్రభువని అతనికి పేరు
యిస్రాయేలు పవిత్ర దేవుడు నిన్ను రక్షిస్తాడు
విశ్వధాత్రికి దేవుడని అతనికి పేరు
నీవు భర్తచే పరిత్యక్తయై
దుఃఖాక్రాంతురాలైన పడుచుభార్యలాంటిదానివి
కాని ప్రభువిపుడు నిన్ను మరల చేపడతాడు
అతడు నీతో ఈలా పల్కుతాడు-
నేను నిన్నొక క్షణకాలం విస్మరించాను
గాఢానురాగంతో నిన్నిపుడు మరల స్వీకరిస్తాను
కోపం వలన ఒక్క క్షణకాలం
నా మొగం నీ నుండి మరుగుజేసికొన్నాను
కాని యిపుడు శాశ్వత కృపతో నిన్ను కరుణిస్తాను
అని నీ రక్షకుడైన ప్రభువు పల్కుతున్నాడు
పర్వతాలు గతిస్తే గతించవచ్చుగాక,
తిప్పలు చలిస్తే చలించవచ్చుగాక
నా కరుణ మాత్రం నిన్ను విడనాడదు
సమాధాన పూర్వకమైన నా నిబంధనం తొలగిపోదు
అని నీమీద నెనరుజూపే ప్రభువు పల్కుతున్నాడు."

ఇవి చాల గొప్ప వాక్యాలు. బాబిలోనియా ప్రవాసంలో అలమటిస్తున్న యిస్రాయేలీయులు భర్త విడనాడితే దుఃఖిస్తూన్న పడుచు భార్యలా వున్నారు. ప్రభువు తన వధువు పాపాలకు ఆమెను ఒక్క క్షణకాలం విడనాడాడు. అదే 70 యేండ్ల బాబిలోనియా ప్రవాసం. కాని యావే యిస్రాయేలు వధువు దుఃఖాన్ని చూచి ఆమెను మరల స్వీకరిస్తాడు. ఆమెతో మళ్ళా నిబంధనం చేసికొంటాడు. కొండలు కదిలితే కదులుతాయేమోగాని తన వధువుపట్ల అతనికున్న ప్రేమ మాత్రం చలించదు. ఇది ప్రవక్త భావం.

ఇంతవరకు మనం పేర్కొన్న పూర్వవేద భావాలు ఇవి. 1. యిస్రాయేలీయులు ప్రభువుని ప్రేమించినంతకాలం భర్తపట్ల అనురాగంజూపే భార్యలాంటి వాళ్ళు. 2. అతన్ని విడనాడి అన్య దైవాలను కొలిచినంతకాలం వ్యభిచారిణియైన భార్యలాంటివాళ్ళు. 3. ప్రభువు ఆమె పశ్చాత్తాపాన్ని జూచి ఆమె పాపాలను మన్నిస్తాడు. ఆ మీదట ఆమె అతనిపట్ల విశ్వాసయోగ్యంగా మెలుగుతుంది.

ఇవన్నీ ప్రభువు యిస్రాయేలుతో చేసికొన్న నింధనను విపులీకరించి చెప్పే భావాలు.

ఇంతవరకు మనం వరుని, లేక పెండ్లికుమారుని గూర్చిన పూర్వవేద భావాలను చూచాం. ఇక నూత్న వేదంలో తండ్రికి మారుగా కుమారుడు కన్పిస్తాడు. యావే స్థానాన్ని క్రీస్తు పొందుతాడు. క్రొత్త యిస్రాయేలనే వధువుకి అతడే వరుడు లేక పెండ్లికుమారుడు. కనుకనే అతడు తన్ను గూర్చి చెప్పుకొంటూ "పెండ్లికుమారుడు ఉన్నంతకాలం పెండ్లికి వచ్చినవాళ్లు చింతించరుకదా? పెండ్లికుమారుడు వారివద్దనుండి వెళ్ళిపోయేరోజులు వస్తాయి. అప్పుడు వాళ్లు ఉపవాసం చేస్తారు" అని నుడివాడు- మత్త 9,15. ఇక్కడ పెండ్లికుమారుడు క్రీస్తే. ఇతని వధువు నూత్నవేద ప్రజలు. పెండ్లికుమారుడు తన ప్రజలనుండి వెళ్లిపోవడం అంటే క్రీస్తు సిలువమరణం.

స్నాపక యోహాను క్రీస్తుని చూచి "పెండ్లికొమార్తె పెండ్లికుమారుని సొత్తు. పెండ్లికుమారుని మిత్రుడు అతని చెంతనుండి అతడు చెప్పినట్లు చేస్తాడు. అతని స్వరం విని మిక్కిలి ఆనందిస్తాడు. అంటాడు - యోహా 3,29. ఈ వాక్యంలో పెండ్లికుమారుడు క్రీస్తు. అతని వధువు నూత్నవేద ప్రజలు. అతని మిత్రుడు స్నాపక యోహానే.

ప్రభువు మత్తయి 22, 1-14లో వివాహపు విందును గూర్చిన సామెతను చెప్పాడు. ఇక్కడ వివాహం జరిగింది దేవుని కుమారుడైన క్రీస్తుకే. ఈ వివాహంలో క్రీస్తు పూర్వవేద ప్రజయైన యిస్రాయేలు అనే వధువుని తిరస్కరిస్తాడు. తిరుసభ అనే నూత్న వధువును స్వీకరిస్తాడు. అనగా మెస్సీయా పూర్వవేదపు యూదులను విడినాడి నూత్నవేద ప్రజలను స్వీకరిస్తాడని భావం.

ఇంకా ప్రభువు పదిమంది కన్నెల సామెత కూడ చెప్పాడు - మత్త 25, 1-15. ఈ సామెతలోని పెండ్లి కుమారుడు గూడ క్రీస్తే. అతని వధువు తిరుసభే.

ఈ వుదాహరణలన్నింటినిబట్టి పూర్వవేదంలో యావేలాగ, నూత్నవేదంలో క్రీస్తు వరుడు, లేక పెండ్లికుమారుడు అనుకోవాలి. పూర్వవేదంలో యిస్రాయేలు యావే వధువైతే నూత్నవేదంలో క్రైస్తవులు క్రీస్తు వధువు ఔతారు. పూర్వవేదంలో లాగే ఇక్కడకూడ మళ్ళా మూడంశాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

## 4. జ్ఞానస్నానపు వధువు

పూర్వవేదంలోని నిబంధనకు తుల్యమైంది నూత్న వేదంలోని మన జ్ఞానస్నానం. అక్కడ నిబంధనం ద్వారా యిస్రాయేలీయులు దేవుని ప్రజలై అతని వధువయ్యారు. ఇక్కడ జ్ఞానస్నానం ద్వారా మనం క్రీస్తు ప్రజలమై అతని వధువుమౌతాం. కనుకనే పౌలు క్రీస్తుని విశ్వసించిన కోరింతు క్రైస్తవుల నుద్దేశించి మాట్లాడుతూ "మీరు నేను ఏకైక వరునికి,

అనగా క్రీస్తుకి, ప్రధానంచేసిన నిష్కళంకమైన కన్యలాంటివాళ్లు" అని చెప్పాడు - 2కొ 11,3. జ్ఞానస్నానం ద్వారా కొరింతులోని క్రైస్తవులు ఓ కన్యలాగ క్రీస్తుకి ప్రధానం చేయబడ్డారు. అనగా జ్ఞానస్నానంద్వారా వాళ్లు క్రీస్తనే వరునికి వధువయ్యారని భావం. ఇక్కడ పౌలు కొరింతులోని క్రైస్తవ స్త్రీపురుషులందరినీ ఉద్దేశించి మాట్లాడుతున్నాడు. కనుక క్రైస్తవ స్త్రీపురుషులందరూ ప్రభువు వధువే. పూర్వవేదంలోని యిస్రాయేలు సమాజమంతా యావే వధువు. అలాగే నూత్నవేదంలోని క్రైస్త సమాజమంతా క్రీస్తు వధువు. ఈ భాగ్యం మనకు జ్ఞానస్నానంద్వారా సిద్ధిస్తుంది. ఆ సంస్కారంద్వారా మనం క్రీస్తుతో ఐక్యమౌతాం.

## 5. పాపపు వధువు

పూర్వవేద ప్రజలైన యిస్రాయేలీయులు పాపంజేసి వ్యభిచారిణియైన వధువులాంటివాళ్లు అయ్యారని చెప్పాం. అలాగే నూత్నవేద ప్రజలుకూడ పాపంజేస్తుంటారు. అది మన బలహీనత. కాని క్రీస్తు తన వధువైన శ్రీసభ పాపాలను మన్నించాడు. అతడు శ్రీసభను ప్రేమించి ఆ వధువు కొరకు సిలువమీద తన ప్రాణాలను అర్పించాడు. ఆమెను వాక్యబోధతో కడిగి శుద్ధిచేసి పవిత్రురాలిని చేసాడు - ఎఫె 5,25-28. అనగా క్రీస్తునిగూర్చి బోధించడంవల్ల ప్రజలు ఆ ప్రభువుని విశ్వసించి అతని పేరుమీదిగా జ్ఞానస్నానం పొందుతారని భావం.

పై వాక్యాలనుబట్టి మనం పాపంజేసినపుడల్లా పాపపు వధువులా తయారౌతాం అనుకోవాలి. కాని యావే ప్రభువు లాగే క్రీస్తుకూడ దయామయుడు. మన తరపున మనం పశ్చాత్తాపపడితే చాలు, క్రీస్తు మనలను క్షమిస్తాడు.

## 6. భావికాలపు వధువు

పూర్వవేదం నూత్న వేదంలో జరగబోయే సంఘటనలను సూచిస్తుంది. నూత్నవేదం భావికాలంలో జరగబోయే సంఘటనలను సూచిస్తుంది. భావికాలమంటే పరలోకం, మోక్షం. క్రీస్తు వధువు భావికాలంలో ఏలా వుంటుంది?

నూత్నవేదంలో చివరి పుస్తకమైన దర్శన గ్రంథం ఈ భావికాలపు వధువును ఈలా వర్ణిస్తుంది. "అనంతరం నేను స్వర్గంలోని దేవుని వద్దనుండి దిగివస్తూన్న పవిత్ర నగరమైన నూత్న యెరూషలేమును చూచాను. ఆమె తన భర్తను చేరుకోవడానికి అలంకరించుకొని సిద్ధంగా వున్న వధువులా వుంది" - 21,2. ఇక్కడ మోక్షాన్ని చేరుకొన్న విశ్వాసులే పరలోకపు యెరూషలేము అనే వధువు. ఆమె భర్త క్రీస్తే. కనుక పరలోకంలోని మోక్షవాసులు కూడ క్రీస్తు వధువౌతారు.

ఇంకా ఈ గ్రంథం ఈలా చెప్తుంది. "ఒక దేవదూత నన్ను సమీపించి గొర్రెపిల్లకు భార్యగావుండే వధువును నీకు చూపిస్తాను రమ్మన్నాడు" - 21, 9. ఇక్కడ ఈ గొర్రెపిల్ల ఉత్థానక్రీస్తే. అతని భార్య, లేక పరలోకపు యెరూషలేము మోక్షవాసులు.

ఈ విధంగా ఈ లోకంలోను పరలోకంలోనుగూడ మనం క్రీస్తు వధువుగానే చలామణి ఔతాం. ఆ ప్రభువు మనకందరికీ వరుడుగానే వుంటాడు.

ఇంతవరకు నూత్నవేదంలో మనం చూచిన భావాల సారాంశమిది. 1. జ్ఞానస్నానం ద్వారా మనం క్రీస్తు వధువౌతాం. 2. తప్పులు చేసినపుడు పాపపు వధువౌతాం. ఐనా క్రీస్తు దయతో మనలను మన్నిస్తాడు. 3. పరలోకంలో గూడ మనం క్రీస్తు వధువుగానే చలామణి ఔతాం.

నూత్నవేదంలో ప్రధానంగా శ్రీసభ క్రీస్తు వధువు. అనగా దైవప్రజలందరూ కలసి అతని వధువౌతారు. ఐనా ఒక్కొక్క వ్యక్తిగూడ క్రీస్తు వధువనే చెప్పవచ్చు. ఈ వ్యక్తిగత భావాన్నిగూడ నూత్నవేదం అంగీకరిస్తుంది. బైబులు కాదుగాని, క్రైస్తవ ఆధ్యాత్మిక గ్రంథాలు ఈ వ్యక్తిగత వధువు అనే భావాన్ని విపులంగా వర్ణిస్తాయి.

## ప్రార్థనా భావాలు

1. ఈ వ్యాసంలో భగవంతుడు మనకు వరునిలాంటి వాడనీ, అతన్ని భక్తితో కొలిచే మనం ఆ ప్రభువు వధువులాంటి వాళ్ళమనీ చెప్పాం. బైబులు మనుష్యభాషలో, మనుష్యుల భావాలతో మాట్లాడుతుంది. మనుష్యలోకంలో భార్యాభర్తలమధ్య సన్నిహితసంబంధమూ గాఢ ప్రేమావుంటాయి. భక్తులకూ దేవునికీ మధ్యకూడ ఈలాంటి సంబంధమూ అనురాగమూ వుండాలని ఈ వుపమానం భావం. పైగా ఈ భావం ప్రపంచంలోని పెద్ద మతాలన్నిటిలోను కన్పిస్తుంది. మహ్మదీయ మతంలో, విశేషంగా సూఫీ శాఖలో, ఈ భావం వుంది. హిందూ మతంలో ఈ యంశాన్ని మధురభక్తి అంటారు. మనం మీదట చూచినట్లు యూదక్రైస్తవ మతాల్లోను ఈ భావం వుంది. ఇన్ని మాతాలు పేర్కొన్నాయంటే ఈ భావం ప్రశస్తమైందై వుండాలి. కనుక భగవంతుడు భర్తలాంటివాడు మనం అతని భార్యలాంటివాళ్ళం అనే ఈ భావాన్ని చూచి మనం సందేహించనూకూడదు, సిగ్గుపడనూ కూడదు. ఆ ప్రభువుపట్ల మనకుండవలసిన ప్రేమను నొక్కి చెప్పడం మాత్రమే ఈ భావం ఉద్దేశం. అందుచే ఈ భావాన్ని మనం విలువతో చూడాలి.

2. ఈ సందర్భంలో మన ప్రభువైన క్రీస్తుపట్ల మనకున్న ప్రేమ ఏపాటిదా అనికూడ చిత్తశుద్ధితో పరిశీలించి చూచుకోవాలి. ప్రభువు ఆనాడు పేత్రుని అడిగినట్లే ఈనాడు మనలను కూడ నీవు నన్ను ప్రేమిస్తున్నావా అని అడుగుతాడు – యోహా 20,15. ఈ ప్రశ్నకు మనమేమి సమాధానం చెప్తాం?

3. పందిరిమీదికి అల్లుకోకపోతే తీగ చక్కగా పూలు పూయదు, కాయలు కాయదు. మన పందిరి క్రీస్తే. మన హృదయం అతనిమీదికి అల్లుకోవాలి. అతన్ని ప్రేమించాలి. లేకపోతే మన క్రైస్తవ జీవితానికి అర్థమేలేదు. ఐతే మన హృదయం క్రీస్తనే పందిరిమీదికి అల్లుకొంటూందా లేక ఈ లోకవస్తువులమీదికి అల్లుకొంటూందా? చాలమంది ప్రపంచ వస్తువ్యామోహాల్లో చిక్కుకొని క్రీస్తుని విస్మరిస్తూంటారు. ఇది పెద్ద పొరపాటు. క్రీస్తుతో పోల్చి చూస్తే ఈ లోకంలోని వస్తువులన్నీ చెత్తాచెదారంలాగ విలువ లేనివి అన్నాడు పౌలు - ఫిలి 3,8. మనకుకూడ ఈలాంటి పవిత్ర భావం కలిగితే ఎంత బాగుంటుంది!

# 14. ద్రాక్షలత

ద్రాక్షలు ఓలివులు గోదుమలు పాలాస్తీనా దేశంలో ప్రధాన పంటలు. పాలస్తీనాలోను దాని యిరుగుపొరుగు దేశాల్లోను ద్రాక్షసారాయాన్ని విరివిగా వాడేవాళ్లు. సుమేరియనులు బాబిలోనీయులు ద్రాక్షసారాయాన్ని జీవనదాయకంగా భావించారు. యూదులు దాన్ని ద్రాక్షపండ్ల నెత్తురుగా భావించారు. వాళ్ళ భావాల ప్రకారం ప్రాణిప్రాణం దాని నెత్తుటిలో వుంటుంది. కావున ద్రాక్షసారాయంలోగూడ ప్రాణముంటుంది. అనగా అది మనకు జీవాన్నిస్తుంది. కొందరు రబ్బయుల ప్రకారం ఏదెను తోటలోని జీవవృక్షం ద్రాక్షతీగే. నూత్నవేదంలో క్రొత్త ద్రాక్షరసం మెస్సీయా కాలానికి చిహ్నం. పాత ద్రాక్షరసం పూర్వవేద కాలానికి చిహ్నం.

## 1. ఆనందాన్నిచ్చే ద్రాక్ష లత

నోవా మొట్టమొదటిసారిగా ద్రాక్షలను నాటాడు - ఆది 9,20. అనగా జలప్రళయం తర్వాత ప్రభువు నూత్న నరజాతికి దయచేసిన ఆనందాల్లో ద్రాక్షరసంకూడ ఒకటని భావం. యావే తన ప్రజలకు గోదుమలు యవలు అంజూరాలు దానిమ్మలు ఓలివులు ద్రాక్షలు పండే సారవంతమైన గడ్డ నిస్తానని మాటయిచ్చాడు. అలాగే ప్రశస్తమైన కనాను దేశాన్ని వాళ్లకిచ్చాడు - ద్వితీ 8,8. సొలోమోనురాజు కాలంలో ప్రజలు వాళ్ల అంజూరాల క్రిందా ద్రాక్షపందిళ్ల క్రిందా విశ్రమించారు. అది శాంతికి నిలయం - 1 రాజు 4,25. సజ్జనుని లోగిలిలో అతని భార్య ఫలించిన ద్రాక్షలతలా వొప్పుతుంది. అనగా గుత్తులుగుత్తులుగా కాయలుకాచే ద్రాక్ష తీగలాగ ఆమె బహు సంతానవతి ఔతుందని భావం. అహాబురాజు పేదవాడైన నాబోతును చంపించి అతని ద్రాక్ష తోటను దొంగిలించాడు. అలా దొంగిలించడమంటే అతని భార్యను అపహరించడంతో సమానం. కనుక ఏలీయా ప్రవక్త అతన్ని చెడబడతిట్టి శపించాడు - 1 రాజు 21, 1-16. సంగ్రహంగా

చెప్పాలంటే, కీర్తనకారుడు వాకొన్నట్లు ద్రాక్షరసం నరునికి ఆనందాన్ని కలిగిస్తుంది - 104,15. ఇది ద్రాక్షరసాన్ని గూర్చిన బైబులు సంప్రదాయం.

## 2. యిస్రాయేలు పాడు ద్రాక్షతోటలాంటివాళ్ళు

యిస్రాయేలీయులు ఎప్పుడూ పెడసరపుబుద్ధికలవాళ్లే. వాళ్లు ఏనాడూ దేవుని ఆజ్ఞలు పాటించి యెరుగరు. ఈ యంశాన్నే యెషయా ప్రవక్త తన సుప్రసిద్ధమైన ద్రాక్షతోట పాటలో వివరించాడు :

"నేను నా స్నేహితునికి ఓ పాట పాడతాను
నా చెలికానిని, అతని ద్రాక్షతోటనుగూర్చి గానంచేస్తాను
సారవంతమైన కొండపై
నా మిత్రునికి ఓ ద్రాక్షతోట వుంది
అతడు ఆ తోటను త్రవ్వి రాళ్లేరివేసి
మేలైన ద్రాక్షతీగలు నాటాడు
తోట నడుమ బురుజుకట్టి
రసం తీయడానికి తొట్టిని తొలిపించాడు
అతడు ద్రాక్షపండ్ల కొరకు ఎదురుచూచాడు
కాని ఆ ద్రాక్షతోట పుల్లని కాయలు కాచింది
కనుక యెరూషలేము పౌరులారా! యూదావాసులారా!
మీరు నాకూ నా తోటకూ తీర్పు చెప్పండి
నేను నా తోటకు చేయవలసిన
సేవలన్నీ చేసానుగదా!
మంచి పండ్లు ఫలిస్తుందని నేను కాచుకొని వుండగా
అది పుల్లని కాయలు కాయనేల?
యిస్రాయేలు ప్రజలు సర్వశక్తిమంతుడైన ప్రభువు ద్రాక్షతోట,
యూదా ప్రజలు అతనికి ప్రీతిగొల్పే వనం
అతడు న్యాయాన్ని అపేక్షించాడుగాని
ప్రజలు హత్యకు పాల్పడ్డారు
అతడు నీతిని కాంక్షించాడుగాని
అన్యాయానికి బలియైనవారి యేడ్పులు విన్పించాయి"

-5,1-7.యావే తోటకాపు ఐతే యిస్రాయేలీయులు అతడు నాటిన ద్రాక్షతోట. అతడు మంచిపండ్లు ఆశిస్తే అది వెర్రేసి పుల్లని కాయలు కాచింది. దేవుడు ప్రజలనుండి న్యాయాన్ని

గోరితే వాళ్ళు దుండగులై హత్యకు పూనుకొన్నారు. ఆ దుష్టుల అన్యాయానికి గురైన పేదల యేడ్పులు వీథుల్లో విన్పించాయి. కనుక ప్రభువు ఆ ద్రాక్షతోటను సర్వనాశం చేస్తాడు. ఇది ప్రవక్త భావం.

యిస్రాయేలీయుల దుష్టత్వాన్నివర్ణిస్తూ యిర్మియాకూడ వారిని పాడు ద్రాక్షతోటతో పోల్చాడు :

"మంచి విత్తనాన్నుండి మొలకెత్తిన
శ్రేష్ఠమైన ద్రాక్షతీగనుగా నేను మిమ్ము నాటాను
కాని మీరిపుడు నిష్ప్రయోజకమైన
భ్రష్టజాతి ద్రాక్షలుగా మారిపోయారు" - 2,21.

యెహెజ్కేలు ప్రవచనం ప్రకారం యిస్రాయేలనే పాడు ద్రాక్షతోటను పెరికివేస్తారు, కాల్చివేస్తారు - 19,10-14.

## 2. అంత్య కాలంలో

ప్రవక్తలు మెస్సీయా కాలంలో యిస్రాయేలీయుల బుద్ధులు మారతాయని చెప్పారు. వాళ్ళు మంచి ద్రాక్షతోటలా చక్కని పండ్లు ఫలిస్తారని నుడివాదరు. యెషయా ఈలా వాకొన్నాడు.

"ఆ దినాన ప్రభువు ఆనందప్రదమైన
తన ద్రాక్షతోటనుగూర్చి యీలా పాడతాడు
ప్రభువునైన నేను ఆ తోటను సంరక్షిస్తాను
నిరంతరం దానికి నీరు కడతాను
రేయింబవళ్ళు దాన్ని కాపాడుతూ
ఎవరూ దానికి కీడు చేయకుండా వుండేలా చూస్తాను
ఆ తోటమీద నాకిపుడు ఏలాంటి కోపమూ లేదు"

-27,2-4. అనగా ప్రభువు యిస్రాయేలు తప్పులను మన్నించి దాన్ని సంరక్షిస్తాడని భావం.

80వ కీర్తనను వ్రాసిన భక్తుడు యిస్రాయేలును ఐగుప్తునుండి తీసికొనివచ్చి పాలస్తీనా దేశంలో నాటిన ద్రాక్షతీగనుగా వర్ణించాడు. దాన్ని శత్రువులబారినుండి రక్షించమని ప్రభువుకి మనవి చేసాడు.

"ఐగుప్తునుండి నీ వొక ద్రాక్షతీగను తీసుకవచ్చావు
అన్యజాతులను వెళ్ళగొట్టి వాళ్ళ దేశంలో దాన్ని నాటావు
ఆ తీగ పెరగడానికి నేలను సరిచేసావు

అది వేరుపారి నేలయందంతటా అల్లుకొంది
సర్వశక్తిమంతుడవైన దేవా!
నీవు మావైపు మొగం త్రిప్పు
స్వర్గంనుండి మావైపు పారజూడు
ఈ ద్రాక్షతీగ వద్దకు వచ్చి దాన్ని కాపాడు
నీవు స్వయంగా నాటిన యీ తీగను,
నీవు బలసంపన్నుని చేసిన నీయీ పుత్రుని, సంరక్షించు".

పైన మనం పేర్కొన్న ఆయా పూర్వవేద వాక్యాల భావాలివి. యావే ప్రభువు తోటకాపు. యిస్రాయేలీయులు అతడు నాటిన ద్రాక్షతోట. ఆ తోట పుల్లని కాయలుకాచింది. అనగా ఆ ప్రజలు దుష్టులయ్యారు. కనుక ప్రభువు వారిని శిక్షిస్తాడు. ఈ శిక్షణే బాబిలోనియా ప్రవాసం. కాని ప్రభువు మంచివాడు కనుక ఆ ప్రజలపై దయజూపుతాడు. వారిని మరల స్వీయదేశానికి గొనివచ్చి వృద్ధిలోనికి తీసుకవస్తాడు.

పూర్వవ్యాసంలో చెప్పినట్లు తోటకాపు - ద్రాక్షతోట అనేది పూర్వవేదం దేవునికి వాడే ఐదు ప్రధానోపమానాల్లో వొకటి.

ఇక నూత్నవేదంలోని భావాలను చూద్దాం. ఇక్కడ తొలిమూడు సువిశేషాల ధోరణి వేరు, నాల్గవ సువిశేషం ధోరణి వేరు. కనుక వీటిని వేరువేరు అంశాలుగా విభజించి చూడాలి.

## 3. మొదటి మూడు సువిశేషాల భావాలు

పూర్వవేదంలో యూదులు దేవుని ద్రాక్షతోట ఐతే నూత్నవేదంలో మెస్సీయా సమాజమే ఆ తోట ఔతుంది. ఈ సమాజం క్రైస్తవ ప్రజలే. ఈ సమాజం దేవుని వనం. కనుకనే ప్రభువు "నా పరమపిత నాటని ప్రతి మొక్కను వేళ్లతోపెల్లగిస్తారు" అన్నాడు - మత్త 15,13. అనగా పిత నాటిన తోట ఒకటుంది. అదే మెస్సీయా సమాజం. యెషయా ప్రవచనంలో పాపపు యిస్రాయేలు నాశమైపోగా మిగిలిన "శేషజనం" ఆ ప్రభువు తోట ఔతుంది :

"తన కీర్తి కొరకు ప్రభువే స్వయంగా నాటిన
నీతివృక్షాలని ఆ దుఃఖార్తులకు పేరు పెడతారు"

-61,3. ఈ శేషజనమే నూత్నవేదంలో మెస్సీయా ప్రజ, క్రైస్తవ ప్రజ ఔతుంది. కుమ్రానులో వసించిన యూద భక్తులుకూడ తమ్ము శాశ్వతమైన దేవుని తోటగా పోల్చుకొన్నారు.

నూత్నవేద ప్రజలు దేవుని ద్రాక్షతోట అని చెప్పే సామెతలు కూడ కొన్ని వున్నాయి. క్రీస్తు దుష్టులైన ద్రాక్షతోట కౌలుదార్లను గూర్చిన సామెతను చెప్పాడు. దీనిలో కౌలుదార్లు

ఆ తోటకాపు కొడుకునే చంపివేస్తారు - మార్కు 12, 1-12. ఇంకా అతడు ద్రాక్షతోటలో పనిచేసిన కూలీల కథ చెప్పాడు - మత్త 20,1-16. తండ్రి ద్రాక్షతోటకు పంపగోరిన ఇద్దరు కుమారుల కథ చెప్పాడు. ఇక్కడ పెద్దవాడు తోటకు వెళ్ళి పనిజేసాడు, చిన్నవాడు వెళ్ళనేలేదు - మత్త 21, 28-32. ఈ వుపమానాలన్నిటిలోను ద్రాక్షతోట నూత్నవేద ప్రజలను తలపుకు తెస్తుంది.

తొలి మూడు సువిశేషాల భావాలు పూర్వవేద భావాల వంటివే. అనగా పూర్వవేద ప్రజల్లాగ నూత్నవేద ప్రజలు కూడ దేవుని తోటే. అతడు ఆ తోటను ఆదరంతో జూస్తాడు.

## 4. నాల్గవ సువిశేషం భావాలు

యోహాను సువిశేషంలోని భావాలు తొలి మూడు సువిశేషాల భావాలకంటె భిన్నంగా వుంటాయి. అతడు ద్రాక్షతీగ - దానిలోనికి అతుక్కొన్న కొమ్మలు అనే వుపమానం చెప్పాడు. క్రైస్తవులు క్రీస్తు శరీరంలోకి అతుక్కొన్న అవయవాల్లాంటివాళ్ళని దీని భావం. ఇది బైబుల్లో నూత్నభావం. కనుక ఇక్కడ యోహాను భావాలను జాగ్రత్తగా పరిశీలిద్దాం.

యోహాను మొదటి భావం ఇది. తండ్రి నాటిన ద్రాక్షతోట క్రీస్తే. అతడు నిజమైన యిస్రాయేలు. పూర్వపు యిస్రాయేలు అనే తోట చెడ్డది కనుక మంచి పండ్లు పండలేదు. కాని క్రీస్తనే తోట తండ్రికి మంచి పండ్లు పండుతుంది. దానికిగాను తండ్రి క్రీస్తనే ద్రాక్షతోటను కత్తిరించి సరిచేస్తాడు. ఈ కత్తిరింపే క్రీస్తు సిలువ మరణం. అతడు తన మరణోత్థానాలద్వారా మనకు పాపపరిహారాన్నీ వరప్రసాదాన్నీ సంపాదించి పెట్టాడు. ఇవే క్రీస్తులత కాచిన మంచి ఫలాలు - యోహా 15,1-2. ఇంతవరకు యోహానుగూడ పూర్వవేద భావాలనే అనుసరించాడు. అనగా తండ్రి తోట కాపు. ప్రజలకు మారుగా క్రీస్తే అతడు నాటిన నిజమైన తోట.

ఇక, యోహాను రెండవ భావం ఇది. బైబుల్లో ఇంతవరకు కన్పింపని క్రొత్తభావం ఇక్కడే కన్పిస్తుంది. కనుక ఇది చాల ముఖ్యమైంది. క్రీస్తు ద్రాక్షలతలాంటివాడు. మన ఆ లతలోనికి అతుక్కొన్న చిన్నచిన్న రెమ్మల్లాంటివాళ్లం. విశ్వాస జ్ఞానస్నానాలద్వారా మనం క్రీస్తులోనికి ఐక్యమై, అతని అవయవాలమౌతాం. క్రీస్తనే తీగలోనికి రెమ్మల్లాగ అతుక్కొని పోవడమంటే యిదే. ఈ భావాన్నే పౌలు క్రీస్తు దేహంలాంటివాడు, మనం అతని అవయవాల్లాంటి వాళ్ళం అన్న వుపమానంలో వివరించాడు.

ఈలా క్రీస్తనే తీగలోనికి రెమ్మల్లాగ అతుక్కొని పోవడంవల్ల, తల్లి చెట్టులోనిసారం కొమ్మల్లోనికి వచ్చినట్లుగా, క్రీస్తు సారం మనలోకి ప్రసరిస్తుంది. ఈ సారమే క్రీస్తు వరప్రసాదం. ఈ వరప్రసాదాన్ని పొంది మనం దివ్యజీవితం గడుపుతాం.

చెట్టునుండి కొమ్మలను నరికివేస్తే ఇక తల్లిచెట్టు సారం వాటిల్లోనికి రాదు. అవి యెండిపోతాయి. అలాగే పాపంవల్ల మనం క్రీస్తునుండి విడివడిపోతే ఇక అతని వరప్రసాదం మనలోనికి రాదు. కనుక మనం భౌతికంగా గాకపోయినా ఆధ్యాత్మికంగా చస్తాం. ఈ భావాలన్ని యోహాను 15, 5-6లో కన్పిస్తాయి. మనం క్రీస్తుతో ఐక్యమైయుండి అతని వరప్రసాదబలంతో చక్కగా ఫలిస్తే తండ్రిని కీర్తిస్తాం 15,8. మన యీ సత్ఫలితాన్ని చూచి మనమే సంతోషించవచ్చు. క్రీస్తుకూడ సంతోషిస్తాడు - 15,11.

ఈలా యోహాను ద్రాక్షలత రెమ్మలు అనే వుపమానంతో మనం క్రీస్తులోనికి ఐక్యమై దివ్యజీవనం జీవిస్తామనే భావాన్ని నూత్నంగాను సుందరంగాను చెప్పాడు. నూత్న వేదంలో మరెక్కడా ఈ భావం తగలదు.

## ప్రార్థనా భావాలు

1. ద్రాక్షరసానికి బైబుల్లో చాల సాంకేతిక భావాలున్నాయి. ఇక్కడ కొన్నిటిని పరిశీలిద్దాం. ఇది శ్రమలకూ, నెత్తురు కార్చడానికీ చిహ్నంగా వుంటుంది. ప్రభువు కోపంతో తన శత్రువులను శిక్షించి శ్రమపెట్టడాన్ని ద్రాక్షపండ్లను తొక్కి, రసం తీయడంతో పోలుస్తుంది పూర్వవేదం

"ద్రాక్షపండ్లను నలగతొక్కి రసంతీసేవానివలె
నీ దుస్తులు ఎర్రగా వున్నాయేల?
నేనొక్కడనే జాతులను ద్రాక్షపండ్లలా నలగద్రొక్కాను
నేను కోపంతో జాతులను నలగద్రొక్కాను
వారి నెత్తురు నా బట్టలమీద చిందిపడగా
నా దుస్తులకు మరకలయ్యాయి" - యెష 63, 2-3.

ఇక్కడ యావే శత్రువులు అతని శిక్షవల్ల నలిగిపోయి ద్రాక్షపండ్లు రసాన్ని కార్చినట్లుగా నెత్తురు కార్చారని భావం.

ద్రాక్షరసం నెత్తురులా ఎర్రగా వుంటుంది. కనుక అది నెత్తురు కార్చడానికికూడ చిహ్నమైంది. క్రీస్తు అంత్యభోజన సమయంలో శిష్యులకు ద్రాక్షరసాన్ని ఇచ్చాడు. ఆ రసం అతడు కార్చబోయే నెత్తురుకే చిహ్నం. కనుకనే అతడు శిష్యులకు ద్రాక్షరసం పాత్రను ఇచ్చి మీరందరు దీనిలోనిది త్రాగండి. ఇది అనేకుల పాపపరిహారార్థమై చిందబడనున్న నూతన నిబంధనం యొక్క నా రక్తం" అన్నాడు - మత్త 26,27-28. నేడు మనం ఆ పాత్రంలోని దివ్యరక్తాన్ని త్రాగినపుడల్లా క్రీస్తు శ్రమలనూ మరణాన్నీ గుర్తుతెచ్చుకొంటాం. అందుకే అతడు "ఈ పాత్రం నా రక్తంద్వారా నెలకొన్న దేవుని నూత్న నిబంధనం. మీరు దీన్ని

త్రాగేపుడల్లా నా జ్ఞాపకార్థంగా త్రాగండి" అన్నాడు. కనుక మనం ఆ ప్రభువు రొట్టెను తిన్నపుడూ, ఆ పాత్రంనుండి త్రాగినపుడూ, ప్రభువు మళ్లా రెండవసారి వచ్చేవరకూ అతని మరణాన్ని ప్రకటిస్తూంటాం - 1 కొరి 11, 25-26. దివ్య సత్ప్రసాదవిధిలో ఈలాంటి నిగూఢభావాలు వున్నాయి.

2. ద్రాక్షరసం నిబంధనాన్నిగూడ సూచిస్తుంది. నిబంధన సమయంలో బలినర్పించాలి. జంతువు నెత్తురు కార్చాలి. ఈ బలిలో ద్రాక్షరసాన్ని పానీయార్పణంగా పోస్తారు. జంతువు రక్తానికి బదులుగాగాని, ఆ రక్తంతోపాటు గాని రసాన్ని కుమ్మరిస్తారు - ద్వితీ 32,28. ఇక క్రీస్తు మనతో నూత్ననిబంధనం చేసికొంటూ సిలువపై తన సొంత నెత్తురునే కార్చాడు. అతడు ఆ నెత్తురికి సంకేతంగా కడపటి విందులో ద్రాక్షసారాయాన్ని వాడాడు. కనుకనే "ఈ పాత్రం మీ కొరకు చిందబడే నా రక్తంతోనైన క్రొత్త నిబంధనం" అన్నాడు - లూకా 22,20. కనుక ద్రాక్ష సారాయరూపంలో వున్న అతని రక్తం నూత్న నిబంధనానికి చిహ్నమౌతుంది. క్రొత్త రసాన్ని క్రొత్త తిత్తుల్లో పోస్తారనే క్రీస్తువాక్యంగూడ ఈ నూత్నవేద నిబంధననే సూచిస్తుంది - మత్త 9,17.

3. ద్రాక్షరసం విందుకీ, దివ్యసత్ప్రసాదానికీ మోక్షానికీ గూడ చిహ్నంగా వుంటుంది. యూదులు విందుల్లో ఈ రసాన్ని తనివితీర త్రాగేవాళ్లు. కనుక అది విందుకి చిహ్నమైంది. ఇంకా యూదులు స్వర్గాన్ని కూడ గొప్ప విందుతో పోల్చేవాళ్లు. ఈ భావాలన్నీ మనసులో పెట్టుకొనే క్రీస్తు "ఇది మొదలుకొని మీతో కలసి నూత్నంగా నా తండ్రి రాజ్యంలో ద్రాక్షరసాన్ని పానంచేసేవరకూ దాన్ని మళ్లా ముట్టుకోను" అన్నాడు - మత్త 26,29. అనగా మోక్షపు విందులో మనం క్రీస్తుతోపాటు మళ్లా ద్రాక్షరసాన్ని పానం చేస్తాం. అనగా క్రీస్తుతోపాటు మనంకూడ మోక్షభాగ్యాన్ని అనుభవిస్తామని భావం.

ద్రాక్షరసానికి బైబుల్లో ఇన్ని సాంకేతికార్థాలున్నాయి. ఒక విధంగా చెప్పాంటే అది యూదులకు పవిత్రమైంది. వాళ్ళకు అది రోజువారి పానీయం. భోజనంలో వో భాగం. కనుకనే పరిసయులు తన్ను "మద్యపాన ప్రియుడు" అని నిందించినా లెక్క చేయకుండా క్రీస్తువిందుల్లో ద్రాక్షరసాన్ని పుచ్చుకొన్నాడు - మత్త 11,9. ఆరోగ్యం కొరకు కొంచెం ద్రాక్షరసం త్రాగుతూండమని పౌలు తన శిష్యుడైన తిమోతికి సలహా యిచ్చాడు - 1తి మొ 5,23.

కాని మన దేశంలో ద్రాక్షరసానికి ఈ పవిత్రభావాలు లేవు. ద్రాక్షరసం త్రాగడమంటే మనకు మద్యపానం క్రిందే లెక్క. బైబుల్లోని కొన్ని భావాలను మన

దేశ సంస్కృతికీ భాషకీ తగినట్లుగా అనువదించలేం. వాటిల్లో ఈ ద్రాక్షరస పానీయంకూడ వొకటి. కొందరు అన్యమతస్థులు మనం పూజలో పుచ్చుకొనే దివ్యరక్తాన్ని కూడ సరిగా అర్థం చేసికోలేరు. అది మద్యపానం అంటారు. ఇది శోచనీయం.

4. ద్రాక్షరసం ఆనందానికిగూడ చిహ్నం. కీర్తనకారుడు చెప్పినట్లు, ద్రాక్షరసం మనకు ఆనందాన్ని కలిగిస్తుంది - 104, 15. నిజమైన ద్రాక్షలతా, ద్రాక్షరసమూ ఐన క్రీస్తు నూత్నవేద ప్రజలకు ఆనందాన్ని కలిగిస్తాడు. అతడు "నా యానందం మీయందు వుండాలనీ, మీ యానందం పరిపూర్ణం కావాలనీ నేను ఈ సంగతులను మీకు చెప్తున్నాను" అన్నాడు - యోహా 15,11.

5. కొమ్మల గొప్ప తల్లిచెట్టుతో ఐక్యమైయుండడంలోనే వుంది. అలాగే మన గొప్ప క్రీస్తుతో ఐక్యమై యుండడంలోనే వుంది. పాపాన్ని కట్టుకొని క్రీస్తునుండి విడివడిపోతే మనం చిల్లిగవ్వకుగూడ పనికిరాం. మన పరిస్థితి ఎండిపోయిన కొమ్మలను తగలబెట్టినట్లుగానే వుంటుంది. కనుక ఈ భావాన్ని తెలియజేసే యోహాను 15,5-6 వాక్యాలు పలుసార్లు భక్తితో మననం చేసికోదగ్గవి.

# 15. జీవమయుడు

బైబులు భగవంతుడు, సజీవుడూ, జీవమయుడూ. అతడు నరులకు జీవాన్ని ప్రసాదిస్తాడు. అదేలాగో చూద్దాం.

## 1. సజీవుడైన దేవుడు

బైబులు పేర్కొనే దేవుడు సజీవుడు. కనుకనే కీర్తనకారుడు "సజీవుడవగు దేవుడవైన నీ కొరకు నేను ఆరాటపడుతున్నాను" అంటాడు - 42,2. ఆ దేవునితో పోలిస్తే విగ్రహాలు నిర్జీవాలు, శక్తిరహితాలు. కీర్తనకారుడు వాటిని ఈలా వర్ణించాడు

"వారి విగ్రహాలను వెండిబంగారాలతో జేసారు
నరుల హస్తాలే వాటిని మలచాయి
వాటికి నోళ్లున్నాయి కాని మట్లాడలేవు
కన్నులున్నాయి కాని చూడలేవు
చెవులున్నాయి కాని వినలేవు
ముక్కులున్నాయి కాని వాసన చూడలేవు
చేతులున్నాయి కాని స్పృశించలేవు
కాళ్లున్నాయి కాని నడువలేవు

వాటి గొంతునుండి ఒక్క మాటకూడ రాదు
ఆ బొమ్మలను మలచినవాళ్ళూ వాటిని నమ్మేవాళ్ళూ
వాటివంటివాళ్ళే ఔతారు" - 115, 5-8.

దేవుడు సజీవుడు అంటే అతనిలో జీవం పరిపూర్ణంగా వుందని భావం. అతడు లోకాన్ని సృజించి ప్రాణులన్నిటికీ జీవమిస్తాడు. అతడు నరులతో మాట్లాడతాడు, వారిని నడిపిస్తాడు, శిక్షిస్తాడు, రక్షిస్తాడు. అతడు ప్రధానంగా క్రియాపరుడు. పూర్వవేదంలోని దేవునికి యావే (యాహ్వే) అని పేరు. ఈ పేరు "హయ్యా" అనే హీబ్రూ మూలపదం నుండి వస్తుంది. ఉనికిలో వున్నవాడు, క్రియను చేసేవాడు అని ఈ మూలపదానికి అర్థం. అతడు ప్రధానంగా రక్షణ క్రియను నిర్వహించేవాడు. దానియేలు గ్రంథం వచించినట్లు

"అతడు సజీవుడైన దేవుడు
కలకాలం పరిపాలించేవాడు
అతని రాజ్యం ఎన్నడూ నాశంకాదు
అతని పరిపాలనానికి అంతం వుండదు
అతడు ప్రజలను రక్షించి కాపాడతాడు
భూమ్యాకాశాల్లోను అద్భుతకార్యాలు చేస్తాడు
అతడు దానియేలుని సింహాల గుంటనుండి విడపించాడు"

6,26-27. పై వుదాహరణలనుబట్టి బైబులు భగవంతునికి జీవమంటే ఎంత యిష్టమో, రక్షణకార్యం నిర్వహించడమంటే యెంత ప్రీతో అర్థంచేసికోవచ్చు.

## 2. జీవం అమూల్యమైంది

### 1. ప్రాణం ఎంతో విలువైంది

ఆదికాండంలోని సృష్టికథలో ప్రాణమున్న జీవులు కట్టకడన సృజింపబడ్డాయి. సృష్టివారంలో ఐదవరోజున గాని దేవుడు ప్రాణులను కలిగించలేదు - ఆది 1,20. ఈ జీవులన్నిటిలోను ఉన్నతులైన నరులను ఆరవరోజునగాని సృజింపలేదు - 1, 24. పైగా, అలా వున్నత జీవులైన నరులను సృజించిన తర్వాత దేవుడు వారిని దీవించాడు. "మీరు చాలమంది బిడ్డలను కని వృద్ధిచెందండి. భూమండల మంతట నివసించి దానిని వశంజేసికొనండి" అని పల్కాడు - ఆది 1,28. కనుక ప్రాణిసృష్టి, అందులోను నరులసృష్టి సృష్టికంతటికీ మకుటాయమానమైంది అనుకోవాలి. నరుడు దేవునికి పోలికగా వుండేవాడు కదా!

ప్రాణం విలువైంది. కనుక యిస్రాయేలు ప్రజలు భూమిమీద దీర్ఘకాలం బ్రతకడం మహాభాగ్యమను కొన్నారు. అబ్రాహాములాగ పండుముసలితనంలో రాలిపోవాలని

కోరుకొన్నారు - ఆది 25,8. కీర్తనకారుడు "సజీవుల లోకంలో ప్రభువు వుపకారానికి పాత్రుడనౌతానని నా నమ్మకం" అన్నాడు - 27,13. ఈ సజీవులలోకం భూలోకమే.

బిడ్డలు క్రొత్తజీవానికి సూచనం. ఒక విధంగా చెప్పాలంటే, తల్లిదండ్రులజీవం బిడ్డల్లో కొనసాగుతుంది - ఆది 15,2-3. కనుక తల్లిదండ్రులు తమకు చాలమంది బిడ్డలు కలగాలని కోరుకొన్నారు. వృద్ధులూ పసిపిల్లలూ కూడ వీధుల్లో గుంపులు గుంపులుగా కనిపించాలని కోరుకొన్నాడు జెకర్యా ప్రవక్త. "పండుముదుసళ్ళు మరల ఊతకర్ర పట్టుకొని నగర వీధుల్లో కూర్చుంటారు. పురవీధులు మళ్లా ఆటలాడుకొనే బాలబాలికలతో నిండివుంటాయి" అన్నాడు -8,4-5.

## 2. ప్రాణం నశ్వరమైంది

ప్రాణం ఎంత విలువైందైనాసరే మృత్యువు దాన్ని నిరంతరం కబళింప జూస్తూంటుంది. కనుక జీవానికి అపాయం మెండు. కీర్తనకారుడు దేవుణ్ణి సంబోధిస్తూ

"నీవు ప్రాణుల ఊపిరితీస్తే అవి చస్తాయి
తాము పుట్టిన మట్టిలోనే కలసిపోయతాయి"

అంటాడు- 104,29. ఇంకా, యీ జీవితం క్షణికమైంది. కనుకనే యోబు గ్రంథం

"నారికి జన్మించిన నరులు అల్పాయుష్కులు
బహు వేదనలకు గురయ్యేవాళ్ళు"

అంటుంది - 14,1. ఇంకా "నరుడు స్వప్నంవలె మరుగైపోతాడు" అనికూడ చెప్తుంది - 20,8. 103వ కీర్తన నరులను వర్ణిస్తూ

"నరుల జీవితం గడ్డిపరకలాంటిది
పిచ్చి మొక్కలు పూచే పూవులాంటిది
ఆ పూవుమీద గాలి తోలితే రాలిపోతుంది
అది యిక ఎవరికంటా బడదు"

అని చెప్తుంది - 103, 15-16. సొలోమోను జ్ఞానగ్రంథం "మన ఊపిరి పొగవంటిది" అంటుంది - 2,2. 144వ కీర్తన

"నరుడు అల్పమైన శ్వాసంవంటివాడు
అతని రోజులు నీడలాగ సాగిపోతాయి"

అని నుడువుతుంది - 144,4. ఇంకా 39వ కీర్తన

"నీవు నాకు క్షణభంగురమైన ఆయువు నిచ్చావు"

అని చెప్తుంది - 39,5. నరుడు మట్టినుండి పుట్టాడు కనుక మట్టిలోనే కలసిపోతాడు - ఆది 3,19. కాలం గడచేకొద్దీ అతని యేండ్లు 120కీ, 80 లేక 70 కీ గూడ దిగజారిపోతాయి - ఆది 6,3. కీర్త 90,10. ఇది నరుని దుర్బలత్వం.

### 3. ప్రాణం పవిత్రమైంది

క్షణభంగురమైనదైనా కూడా నరుని ప్రాణం పవిత్రమైంది. ప్రతి జీవి జీవంకూడ పవిత్రమైందే. నరుని ప్రాణం ఇంకా యెక్కువ పవిత్రమైంది. ఎందుకంటే అతని ప్రాణం దేవుని శ్వాసే. దేవుడు నరుని ముక్కుగోళ్ళలోనికి ప్రాణవాయువును ఊదితే అతడు సజీవి అయ్యాడు - ఆది 2,7.

"అతడు ప్రాణుల కొసగిన ఊపిరి తీసికొంటే,
తానిచ్చిన ప్రాణాన్ని తాను మరల చేకొంటే,
జీవులన్నీ నశిస్తాయి
నరుడు మట్టిలో కలసిపోతాడు"

-యోబు 34,14-15. దేవుని ఊపిరి కలవాడు కనుక నరుణ్ణి హత్యచేయకూడదు -నిర్గ 20,13. ప్రభువు కయీనులాంటి దుర్మార్గుణ్ణికూడ అప్పటికప్పుడే చంపలేదు. ప్రాణంమీద అతనికుండే గౌరవం అలాంటిది - ఆది 15,4.

జీవులకు దేవుడిచ్చిన ప్రాణం వాటి రక్తంలో వుంటుంది. కనుక నరుడు జంతువును తినవచ్చునుగాని దాని రక్తాన్ని ఆరగించకూడదు. ఈ రక్తాన్ని బలిపీఠంమీద చిలికించి పాపాలకు ప్రాయశ్చిత్తం చేయవచ్చు. కాని దాన్ని భుజించకూడదు - లేవీ 17, 11-12.

## 3. దేవుడు జీవాన్నిస్తానని వాగ్దానం చేసాడు

### 1) జీవమూ కట్టడలూ

ఎవని మరణం వలనా దేవునికి సంతోషం కలుగదు. నరులు తమ పాపాలనుండి వైదొలగి మళ్ళా బ్రతకాలనే అతని కోరిక - యెహెజ్కేలు 18,32. దేవుడు నరుణ్ణి చావడానికిగాదు బ్రతకడానికే చేసాడు.

"దేవుడు నరుణ్ణి అమరుణ్ణిగా జేసాడు"

-సొలో 2,23. నరునికి శాశ్వత జీవమీయడానికి ఏదెను తోటలో జీవమిచ్చే పండ్ల చెట్టునుగూడ నాటాడు. కాని నరుడు దేవుని ఆజ్ఞ మీరాక అతనికి ఆ చెట్టుదగ్గరికి వెళ్ళే హక్కుపోయింది - ఆది 2,22-23. ఆ పాపదశలో గూడ నరుడు దేవుని ప్రాణాన్ని తీసివేయలేదు. అతని అమరత్వాన్ని మాత్రం తొలగించాడు. అతన్ని నిత్యుని నుండి అనిత్యుణ్ణిగా మార్చాడు. ఐతే జీవానికి చేరే మార్గాన్ని మాత్రం అతనికి చూపించాడు - కీర్త 16,11. ఈ మార్గం ధర్మశాస్త్ర మార్గమే. మోషే కట్టడలను అనుసరిస్తే చాలు నరునికి జీవం కలుగుతుంది. కనుకనే ప్రభువు "మీరు నా యాజ్ఞలను అనుసరిస్తే చాలు జీవాన్ని పొందుతారు" అని చెప్పాడు - లేవీ 18,5. ఆజ్ఞలను పాటించేవాళ్ళకు ధన్యతలు సిద్ధిస్తాయి. వాళ్ళు పూర్ణాయుష్కులౌతారు - నిర్గ 23,26. ఇంకా, బరూకు గ్రంథం ఈలా చెప్తుంది

"జ్ఞానం వివేకం బలం ఎచట దొరుకుతాయో తెలిసికోండి
అపుడు మీకు దీర్ఘాయువూ వెలుగూ శాంతీ లభిస్తాయి"

-3,14. ఈ జ్ఞానం ధర్మశాస్త్రమే. ఫలితాంశమేమిటంటే, ధర్మశాస్త్రంలోని కట్టడలను పాటిస్తేయూదులకు పూర్ణజీవం సిద్ధిస్తుంది.

## 2) జీవానికి ఆధారం దేవుడే

నరుడు భూమిమీద జీవిస్తాడు. ఐనా అతని జీవం ఈ లోక వస్తువులమీదకాక దేవునిమీద ఆధారపడివుంది. దేవుడు అతనికి జీవజలాలబుగ్గ - యిర్మి 2,13. జీవపు చెలమ - కీర్త 36,9. ప్రభువు ప్రేమ ప్రాణంకంటె మెరుగైంది - కీర్త 63,3. కనుకనే భక్తిగల యిస్రాయేలీయుడు దేవుని సన్నిధిలో, ప్రభువు మందిరంలో జీవింపగోరుతాడు. అందుకే భక్తుడు

"అన్యుల యిండ్లలో వేయిదినాలు గడిపిందానికంటె
నీ మందిరంలో ఒక్కరోజు వసించడం మేలు"

అన్నాడు - 84,10 మరో భక్తుడు

"నేను కలకాలం ప్రభు మందిరంలోనే వసిస్తాను" అని వాకొన్నాడు - 23,6. ప్రవక్త ఆమోసు కూడ

"ప్రభువు యిస్రాయేలీయులతో ఈలా చెప్తున్నాడు మీరు నా చెంతకురండి, జీవాన్ని బడయండి"

అని నుడివాడు - 5,14. ఈ వాక్యాలన్నిటినిబట్టి నరుని జీవం భగవంతుడేనని అర్థమౌతుంది కదా!

## 3. మృత్యువు తర్వాత మళ్ళీ జీవం

దేవుడెప్పుడుకూడ పాపి చావాలని కోరుకోడు. అతడు పరివర్తనం చెంది మళ్ళా బ్రతకాలనే కోరుతాడు - యెహె 33,11. ప్రభువు తన ఆత్మద్వారా ఎండిపోయిన ఎముకలకు గూడ జీవమిస్తాడు - యెహె 37,13-14. బాధామయ సేవకుడు ప్రజలకోసం చనిపోయాడు. కాని అతడు తన అనుయాయుల్లో మళ్ళా జీవిస్తాడు. కనుకనే యెషయా ప్రవక్త

"అతని మరణం పాపపరిహారబలి ఐంది
కనుక అతడు దీర్ఘాయువును బడసి
పుత్ర పౌత్రులను జూస్తాడు"

అని చెప్పాడు - 53,10. అనగా భక్తులు దేవుని కరుణచే మరణం తర్వాత మళ్ళా జీవిస్తారు. పూర్వవేదాంతంలో ఈ భావం మూడునాల్గు తావుల్లో తగుల్తుంది. రెండవ

మక్కబీయుల గ్రంథంలో, వేదహింసలో ఏడ్గురు కుమారులను కోల్పోయిన తల్లి ఆ కుమారులనుద్దేశించి "మీరు మీ ప్రాణాలకంటెగూడ ఆ ప్రభువు ఆజ్ఞలను అధికంగా గౌరవించారు. కనుక ఆ కరుణామయుడైన దేవుడు మీకు మరలజీవాన్నీ ఊపిరినీ దయచేస్తాడు" అంటుంది - 7,23. ఆ కుమారుల్లో వొకడు తమ్ము హింసించి చంపే అంటియోకసు రాజునుద్దేశించి "నా సోదరులు ప్రభువు నిబంధనానికి బద్ధులై క్షణకాలం మాత్రం బాధలనుభవించారు. కాని యిప్పుడు వాళ్ళు నిత్యజీవితాన్ని చూరగొన్నారు" అంటాడు -7,36.

దానియేలు గ్రంథం కూడ "అప్పటికే చనిపోయి మట్టిలో నిద్రించేవారిలో చాలమంది సజీవులౌతారు. వాళ్ళల్లో కొందరు నిత్యజీవాన్ని పొందుతారు. మరికొందరు శాశ్వతావమానానికి గురౌతారు" అంటుంది-12,2. ఈ వాక్యం ఉత్థానాన్నీ మోక్షనరకాలనూ సూచిస్తుంది. సొలోమోను జ్ఞానగ్రంథం.

"పుణ్యపురుషులు శాశ్వతంగా మనుతారు
ప్రభువు వారిని బహూకరిస్తాడు
మహోన్నతుడు వారిని కాపాడతాడు"

అని చెప్తుంది - 5,15. కనుక మృత్యువు నరజీవితానికి అంతంకాదు. మరణం తర్వాత నరులు భగవంతుని కరుణవల్ల నూత్నజీవాన్ని పొందుతారు.

# 4. నేనే జీవాన్ని

## 1. క్రీస్తు జీవాన్ని గూర్చి బోధించాడు

ఇంతవరకు జీవాన్ని గూర్చిన పూర్వవేద బోధలను చూచాం. ఇక నూత్నవేద బోధలను తిలకిద్దాం. క్రీస్తు జీవాన్ని విలువతో చూచాడు. కావుననే అతడు మీ యాహారం కంటె మీ జీవితం విలువైందని వాకొన్నాడు - మత్త 6,25. విశ్రాంతి దినాన్ని పాటించడంకంటె ప్రాణాన్ని రక్షించడం మేలని పల్కాడు - మార్కు 3,4. దేవుడు సజీవుల దేవుడు కాని మృతుల దేవుడు కాడని చెప్పాడు - మార్కు 12, 27. అతడు అనేక పర్యాయాలు వ్యాధినుండీ మృత్యువునుండీ ప్రజలను కాపాడాడు. అతడు చేరువలో వున్నట్లయితే తన సోదరుడు మరణించి వుండేవాడు కాదని మొత్తుకుంది మార్త - యోహా 11,21. అతడు తన్ననుసరించేవారికి నిత్యజీవాన్ని దయచేస్తాడు - మత్త 19,29. కాని ఈ నిత్యజీవాన్ని పొందాలంటే నరుడు స్వార్థత్యాగం చేయాలి. "తన ప్రాణాన్ని కాపాడుకోగోరేవాడు దాన్ని పోగొట్టుకొంటాడు. నా నిమిత్తమై తన ప్రాణాన్ని ధారపోసేవాడు దాన్ని దక్కించుకొంటాడు" - మత్త 16,26.

## 2. క్రీస్తు మనకు జీవం

అనాది కాలంనుండీ అతనియందు జీవం వుంది - యోహా 1,4. తండ్రిలాగే కుమారుడుకూడ తనంతటతాను జీవం కలవాడు - 5,26. అతడు తన్ననుసరించేవాళ్ళకు జీవాన్నిస్తాడు. దాన్ని సమృద్ధిగా గూడ దయచేస్తాడు -10, 10. మనకు అతడే మార్గం, సత్యం, జీవం -14,6. అతన్ని అనుసరించే భక్తుడు చీకటిని తప్పించుకొని జీవమిచ్చే వెలుగులో నడుస్తాడు - 8,12. అతడు మనకు జీవజలమిస్తాడు. ఆ జలం మనలో నిత్యజీవమిచ్చే నీటిబుగ్గ ఔతుంది - 4,14. అతడు మనకు జీవాహారం. ఆ యాహారాన్ని తిని మనం నిరంతరం జీవిస్తాం - 6,51. యోహాను సువిశేషంలోని పై వాక్యాలన్నీ క్రీస్తు మనకు జీవనదాయకుడని చెప్తాయి.

## 3. క్రీస్తు జీవంమీద అధికారం కలవాడు

క్రీస్తు తండ్రి ఆజ్ఞకు బద్ధుడై గొర్రెల కొరకు ప్రాణాలను అర్పించాడు -యోహా 10,15. కాని ఎవడూ బలవంతంగా అతని ప్రాణాలను తీయలేదు. అతడు తనంతట తానే తన ప్రాణాన్ని ధారపోసాడు. ఈ హక్కు అతనికి తండ్రినుండే లభించింది - 10,18. ఉత్థానానంతరం క్రీస్తు జీవమిచ్చే ఆత్మ అయ్యాడు - 1కొ 15,45. దేవుడు తన్ను కలిగించినపుడు మొదటి ఆదాము తన కొరకు తాను జీవాన్ని పొందాడు. దీనికి భిన్నంగా రెండవ ఆదాము మన కొరకు జీవాన్నిస్తాడు. మృతులలోనుండి లేచిన క్రీస్తు జీవానికి కర్త - అ.చ. 3,15. ఈ జీవాధిపతిని గూర్చి ప్రజలకు బోధించడం తొలినాటి శిష్యుల పూచీ - అ.చ. 5,20. ఈ వాక్యాలన్నిటిని బట్టి క్రీస్తు కేవలం జీవమిచ్చేవాడు మాత్రమే కాదు, జీవానికి అధిపతి అని కూడ అర్థం చేసికోవాలి.

## 4. మనకు జీవించడమంటే క్రీస్తుని జీవించడమే

జ్ఞానస్నానంలోనే క్రీస్తు మరణోత్థానాలు మనమీద సోకుతాయి. ఈ పవిత్ర సంస్కారం వలన మనం పాపానికి చనిపోతాం, పుణ్యానికి ఉత్థానమౌతాం - రోమా 6,4. అటుపిమ్మట మనం పాపాన్ని విడనాడి దేవుని కొరకు జీవించాలి - 6,10-11. జ్ఞానస్నానం పొందిన క్రైస్తవుని జీవితం క్రీస్తుతోపాటు దేవునియందు గుప్తమైవుంటుంది - కొలో 3,3. అట్టి క్రైస్తవునిలో దేవుడు ఓ దేవాలయంలో లాగ వసిస్తూంటాడు - 1 కొ 6,19. అతడు దైవస్వభావంలో పాలుపొందుతాడు. అనగా దివ్యుడౌతాడు - 1 పేత్రు 1,4. అటుపిమ్మట అతడు తన కొరకు కాక క్రీస్తు కొరకే జీవించాలి - 2కొ 5,15. సంగ్రహంగా జెప్పాలంటే క్రైస్తవునికి జీవించడమంటే క్రీస్తు జీవితం జీవించడమే ఔతుంది - ఫిలి 1,21. అలాకాకుండ అతడు తన సొంత జీవితం తాను జీవిస్తే అది పాపజీవితమే ఔతుంది.

## 5. మరణం తర్వాత జీవం

మనం ఎంత అధికంగా క్రీస్తుమరణాన్ని మరణిస్తామో అంత అధికంగానే అతని జీవాన్ని జీవిస్తాం - 2 కొ 4,10. అందరమూ మరణానికి లొంగవలసిందే. కాని అటుపిమ్మట మళ్లా జీవాన్ని పొందుతాం. మనకు చనిపోవడమంటే క్రీస్తుని చేరుకొని అతనితో వుండిపోవడమే - ఫిలి 1, 23. ఉత్థానానంతరం క్రీస్తుని ఉన్నవాణ్ణి ఉన్నట్లుగా దర్శించి అతనిలాంటివాళ్ళ మౌతాం - 1 యోహా 3,2. ఇదే దివ్యదర్శనం, మోక్షజీవితం. ఆ దివ్యజీవితంలో దేవుడు మానవులతో కలసి వసిస్తాడు. వాళ్లు అతని ప్రజలూ, అతడు వారికి దేవుడూ ఔతారు - దర్శ 21,3. ఆ మోక్షంలో దేవునినుండీ, క్రీస్తు నుండీ బయలుదేరి ఒక జీవనది ప్రవహిస్తూంటుంది - 22,1. దాని వొడ్డున మరల జీవవృక్షం తగులుతుంది. దాని ఫలాలను మనం ఆరగిస్తాం - 22,14.

ఆ మోక్షజీవితంలో దేవుడు మృత్యువుని నాశంచేస్తాడు - 21,4. అక్కడ సింహాసనంపై కూర్చుండివున్న గొర్రెపిల్ల మోక్షవాసులకు కాపరి ఔతుంది. వారిని జీవజలాల వద్దకు నడిపించుకొని పోతుంది - 7,17. అనగా మోక్ష వాసులకు క్రీస్తు శాశ్వతంగా దివ్యజీవాన్ని ప్రసాదిస్తాడని భావం.

## ప్రార్థనా భావాలు

1. పౌలు ఇప్పుడు నేనుకాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అనిచెప్పుకొన్నాడు - గల 2,20. ఇంకా అతడు నాకు జీవించడమంటే క్రీస్తుని జీవించడమే అనికూడ వచించాడు - ఫిలి 1,21. ఈ వాక్యాలు క్రైస్తవులమైన మనకందరికీ ప్రేరణం పుట్టించాలి. మనం క్రీస్తునే సర్వస్వంగా భావించేలా చేయాలి.

2. ఇప్పుడు మనం పవిత్రాత్మ సహాయంతో క్రీస్తు జీవితం జీవిస్తాం. కాని మనం ఆ యాత్మకు లొంగితేనేగాని ఈ క్రీస్తు జీవితం జీవించలేం - గల 5,25.

3. క్రీస్తు వాక్కు మనకు నిత్యజీవమిస్తుంది - యోహా 6,68. కనుక ఆ వాక్కుని బైబులు గ్రంథంనుండి రోజురోజు భక్తితో ధ్యానం చేసికోవాలి.

4. మనలో దివ్యజీవం వుంది అనడానికి గుర్తు సోదరప్రేమే. మనం సోదరులను ప్రేమిస్తున్నాం గనుక మృత్యువును వదలించుకొని జీవంలో వసిస్తాం - 1 యోహా 3,14. కనుక సోదరప్రేమ లేందే దివ్యజీవనం లేదు.

5. లోకంలోని జనం ఎప్పుడూ జీవం కొరకూ, సుఖజీవం కొరకూ తపించి పోతూంటారు. వాళ్లు దీనికొరకు లోక వస్తువులను ఆశ్రయిస్తారు. కాని మనకు యథార్థమైన జీవమిచ్చేది దేవుడు చేసిన వస్తువులు కాదు, దేవుడే. అతడు జీవపు చలమ. కనుక భక్తుడు అతన్ని పూజించుకొని పూర్ణజీవాన్ని పొందాలి.

# 16. గృహ నిర్మాత

## 1. ప్రభువు యిస్రాయేలును ఇంటినిలాగ నిర్మించాడు

ప్రథమంలో యిస్రాయేలీయులు గూడారాలూ ఇళ్ళూ నగరాలూ నిర్మించుకొని వాటిల్లో జీవించారు. ఈ యనుభవంనుండి ప్రభువు యిస్రాయేలు ప్రజనే ఒక జాతిగా నిర్మించాడు అనే భావం ప్రచారంలోకి వచ్చింది. దాని పుట్టుపూర్వోత్తరాలను పరిశీలిద్దాం.

### 1. దేవుడు ప్రజలను నిర్మించాడు

యాకోబు సుక్కోతులో తనకొక యిల్లు కట్టుకొన్నాడు. పశువులకు పాకలు వేయించాడు - ఆది 33,17. కయీను ఒక నగరాన్ని నిర్మించి దానికి హానోకు అని పేరు పెట్టాడు - ఆది 4,17. కాని దేవుని దీవెనలేందే ఏ నరుని కృషీ ఫలించదు. ప్రభువు ఇల్లు కట్టకపోతే బేలుదారుల శ్రమ వ్యర్థమే ఔతుంది - కీర్త 127,1. కనుక ప్రభువు యిస్రాయేలీయులకు ఇండ్లూ నగరాలూ నిర్మించుకొనే సామర్థ్యం దయచేసాడు అనుకోవాలి. ఐతే, యిస్రాయేలీయుల కట్టడాలన్నిటిలోను గొప్పది వారి దేవాలయం.

ఈలా యిస్రాయేలీయులు ఇండ్లు నిర్మించుకొంటూంటే, ప్రభువు వారిని ఒక ప్రజగా నిర్మించాడు. అతడు మొదట ఆదాము ప్రక్కటెముకను తీసికొని దాన్ని స్త్రీనిగా మార్చాడు. ఇక్కడ ప్రభువు ఏవను సృజించాడు, నిర్మించాడు అని రెండర్థాలూ చెప్పవచ్చు. ఏవ పుట్టుక వలన ఆదాముకి ఒక కుటుంబం ఏర్పడింది. వాళ్లు దేవునికి దీవెనతో బిడ్డలను కని కొన్ని కుటుంబాలనూ తెగలనూ, ఒక జాతినీ ఉత్పత్తి చేసారు. ఈలా మానవజాతి పెరిగిపోయింది.

దావీదు దేవుని మందసానికి ఓ భవనం కట్టబోయాడు. ప్రభువు దావీదు భక్తికి మెచ్చుకొని తానే అతనికొక భవనాన్ని కట్టిపెట్టాడు. ఆ భవనం ఏమోకాదు, అతని రాజవంశమే. ఈ రాజవంశంనుండే తర్వాత మెస్సీయా ఉద్భవిస్తాడు - 2 సమూ 7,11. ప్రభువు యిర్మీయా ప్రవక్త ద్వారా "నేను యిస్రాయేలును భవనంగా నిర్మిస్తానుగాని పడగొట్టను. మొక్కవలె నాటుతానుగాని పెల్లగింపను" అని చెప్పించాడు - 24,6. ఇక్కడ ప్రభువు యిస్రాయేలును నిరంతరమూ ఓ యింటినిలాగ కట్టుకొని పోతుంటాడని భావం.

### 2. ప్రభువు నిర్మించేవాడూ పడగొట్టేవాడూ కూడ

ప్రభువు జాతులను ఇంటిలా కట్టగలడు. ఇంటిని పడగొట్టినట్లుగా పడగొట్టగలడు. కనుకనే అతడు యిర్మీయా ప్రవక్తతో

"ఈ దినం జాతులమీదా రాజ్యాలమీదా
నేను నీకు అధికారం ఇస్తున్నాను
నీవు వాటిని పెల్లగించడానికీ కూలద్రోయడానికీ

నాశం చేయడానికీ పడగొట్టడానికీ
పునర్నిర్మించడానికీ నాటడానికీ సమర్థుడ వౌతావు"

అని చెప్పాడు - 1,10. ప్రజలు తన కెదురు తిరిగి బాబెలు గోపురాన్ని కట్టబోతే అతడు దాన్ని ఆపుజేయించాడు - ఆది 11,1-9. అది ధ్వంసమైపోయింది. ఐనా ప్రభువు పడగొట్టడానికంటె నిర్మించడానికి సిద్ధంగా వుంటాడు. కనుకనే ఆమోసు ద్వారా

"నేను కూలిపోయిన కుటీరంలా వున్న
దావీదు రాజవంశాన్ని పునర్నిర్మిస్తాను
ఆ యింటి గోడలను బాగుచేసి
దానిని తిరగి కట్టి పూర్వస్థితికి కొనివస్తాను"

అని చెప్పించాడు - 9,11. ఇంకా అతడు యెషయా ముఖాన

"ప్రభువైన యావే యీలా అంటున్నాడు
నేను సియోనున ఒక పునాదిరాయి వేస్తున్నాను
ఆ మూలరాయి విలువకలది, పటిష్ఠమైంది
విశ్వాసం కలవాడు చలింపడు"

అని పలికించాడు - 28,16. ఈ పునాదిరాయి మెస్సీయాయే. ఆ మెస్సీయా చుట్టూ అతని శిష్యులైన "శేషజనం" ప్రోగౌతుంది. వాళ్లు ప్రభువు ప్రజలుగా వ్యాప్తిజెందుతారు. దేవుని కృపవలన యిస్రాయేలీయులు బాబిలోనియా ప్రవాసం నుండి తిరిగివచ్చి పాడువడివున్న తమ నగరాన్నీ దేవాలయాన్నీ పునర్నిర్మించుకొంటారు. ఆలాగే ప్రభువు కూడ తమ పాపాలవలన ప్రపంచం నలుమూలలా చెల్లాచెదరైయున్న యిస్రాయేలీయులను మళ్ళా యెరూషలేములో ప్రోగుజేసి వారి జాతిని పునర్నిర్మిస్తాడు. ఈ "పునర్నిర్మాణం" అనేది పూర్వవేదంలో చాలతావుల్లో యిస్రాయేలీయులు భవనాలకీ వారి జాతికీగూడ వర్తిస్తుంది. వారి యిండ్లూ నగరాలూ పెరిగినట్లే వారి జనసంఖ్యకూడ పెరుగుతూంటుంది.

## 3. పునాదిరాయి మెస్సీయాయే

కీర్తనకారుడు "ఇల్లుకట్టేవాళ్లు పనికిరాదని నిరాకరించిన రాయే చివరకు మూలరాయి ఐంది" అన్నాడు-118,22. ఇక్కడ ఈ కీర్తనకారుని దృష్టిలో "నిరాకరింపబడినరాయి" బాబిలోనియా ప్రవాసంనుండి తిరిగి వచ్చిన యిస్రాయేలీయులే. వీళ్ళే "శేషజనం". అనగా ప్రభువు ఎన్నుకొన్నవారిలో మిగిలివున్నవాళ్ళు. ఐతే, నూత్నవేదంలో మొదటి పేత్రు జాబు ఈ మూలరాయి క్రీస్తేనని చెప్తుంది - 2,7. పూర్వవేదంలోని శేషజనమే నూత్నవేదంలో మెస్సీయాగా అతని ప్రజలుగా మారిపోతారు. మెస్సీయా బైబుల్లో సామూహిక వ్యక్తి. అతడు కొన్ని తావుల్లో ఏక వ్యక్తిగాను, కొన్ని తావుల్లో ఒక సమూహంగాను కన్పిస్తాడు. కనుక క్రీస్తూ శేషజనమూ కలసిపోతారు.

పౌలుకూడ "యేసుక్రీస్తు అనే దేవుడు వేసిన పునాది తప్ప వేరొక పునాదిని ఎవడూ వేయలేడు" అని వాకొన్నాడు 1కొ 3,11. ఈ పునాదిరాతిమీదనే తర్వాత క్రైస్తవ సమాజం నిర్మింపబడుతుంది. క్రీస్తు పునాదిరాయీ, దానిమీద కట్టిన మందిరంకూడ. అనగా అతడు భవనమూ, భవన నిర్మాతాకూడ.

పూర్వవేద దేవాలయం నాశమౌతుంది. దానికి బదులుగా నూత్నదేవాలయం నెలకొంటుంది. క్రీస్తు మీరు "ఈ యాలయాన్ని పడగొట్టండి. నేను దాన్ని మూడు రోజుల్లో లేపుతాను" అన్నాడు. అతడు తన శరీరాన్ని గూర్చే యిలా చెప్పాడు. ఉత్థానక్రీస్తు అతని అనుయాయులు కలసి ఈ యాలయమౌతారు- యోహా 2,19-22. ఈలా అతడు దేవాలయ నిర్మాత, నూత్న వేదప్రజల నిర్మాత.

## 2. క్రీస్తు శరీర నిర్మాణం

పౌలు శ్రీసభను, అనగా నూత్నవేద ప్రజను, క్రీస్తు శరీరం అని పిల్చాడు. యావే పూర్వవేద ప్రజను నిర్మించినట్లే క్రీస్తు నూత్నవేద ప్రజను నిర్మిస్తాడు.

### 1. నేను నా శ్రీసభను నిర్మిస్తాను

ప్రభువు పేత్రుతో "నీ పేరు కయిఫా, లేక రాయి. ఈ రాతిమీద నా సమాజాన్ని నిర్మిస్తాను. నరక శక్తులు దాన్ని జయించలేవు" అని చెప్పాడు - మత్త 16,18. యావే ప్రభువు పూర్వవేద ప్రజను అబ్రాహామనే శిలమీద నిర్మించాడు. ఆలాగే క్రీస్తుకూడ నూత్నవేదప్రజను పేత్రు అనే శిలమీద నిర్మిస్తాడు. ఈ ప్రజ క్రీస్తు శరీరం, శ్రీసభ. అది భవనం లేక శరీరంగా ప్రేమద్వారా నిర్మింపబడుతుంది. "ప్రతి అవయవం సక్రమంగా పనిచేస్తే దేహమంతా ప్రేమద్వారా పెంపొందుతుంది" - ఎఫె 4,16.

### 2. భవన నిర్మాతలు అపోస్తలులు

అపోస్తలులు శ్రీసభ అనే భవనానికి పునాదులు - ఎఫె 2,20. వాళ్ళు రకరకాల క్రైస్తవ సమాజాలను తయారుచేసి శ్రీసభ అనే భవనాన్ని పెద్దదిగా కట్టారు. పౌలు తన్ను క్రీస్తుకి తోడిపనివానినిగా ఎంచుకొన్నాడు - క్రీస్తూ తానూ కలసి దైవప్రజ అనే భవనాన్ని నిర్మిస్తామని పల్కాడు - 1 కొ 3,9-10. కాని ఈ భవనానికి మూలరాయి లేక పునాదిరాయి ఎప్పుడూ క్రీస్తే. ఇక్కడ అపోస్తలులు భవన నిర్మాణంలో క్రీస్తుకి సాయపడినా ప్రధాన నిర్మాతేమో ఎప్పుడూ క్రీస్తే.

### 3. నిర్మింపబడే భవనం శ్రీ సభే

"ఆధ్యాత్మిక దేవాలయాన్ని నిర్మించడంలో మీరు సజీవులైన శిలలుగా ఉపయోగపడండి" అంటుంది మొదటి పేత్రు జాబు - 2,3-5. అనగా క్రీస్తు అనే పునాదిరాతిమీద నిర్మింపబడిన భవనం క్రైస్తవ సమాజం. ఈ భవనంలోని రాళ్లు క్రైస్తవులమైన

మనమే. మనం క్రీస్తుతో ఐక్యమై ఆరాధన సమాజంగా, ఆరాధన మందిరంగా నిర్మితులమౌతాం. ఆ సమాజంలో, ఆ మందిరంలో, క్రీస్తూ మనమూ కలసి తండ్రిని అర్చిస్తాం. ఈలా పూర్వవేదారాధనకు బదులుగా ఈ నూత్నవేదారాధనం కొనసాగిపోతుంది.

అంతేకాదు, క్రీస్తుతో ఐక్యమై ఓ భవనంలా, ఓ సమాజంలా వున్న మనం, ఒకరికొకరం సాయపడాలి. ఒకరినొకరం నిర్మించుకోవాలి. మనం పరస్పర క్షేమాభివృద్ధిని కలిగించుకోవాలి - రోమా 14,19.

ఫలితాంశమేమిటంటే, క్రీస్తూ అపోస్తలులూ మనమూ అందరం కలసి శ్రీసభ అనే భవనాన్ని నిర్మిస్తాం. ఈ నిర్మాణంలో ఎవరిపాత్ర, బాధ్యత వాళ్ళకుంటుంది. మనంకూడ మనవంతు పనిని చేయాలి. యావే ప్రభువు పూర్వవేదంలో యిస్రాయేలు సమాజాన్ని నిర్మించాడు. ఆ యిస్రాయేలు సమాజం పొడిగింపే నేటి క్రైస్తవ సమాజం.

## ప్రార్థనా భావాలు

1. ఈ యధ్యాయంలో దేవుడు గృహనిర్మాత, దేవుని ప్రజలు అతడు నిర్మించిన గృహం అని చెప్పాం. ఈ గృహం దేనికి? దేవుడు ఈ గృహంలో వసిస్తాడు. మన మందరం క్రీస్తుతో గలసి ఒక్క గృహమౌతాం. దానిలో దేవుడు తన ఆత్మద్వారా నివసిస్తాడు- ఎఫే 2,32. కనుక అది పవిత్ర గృహం, అదే క్రైస్తవ సమాజం.

2. ఏయే శక్తులు ఈ గృహాన్ని నిర్మిస్తాయి? సోదరప్రేమ ఈ గృహాన్ని నిర్మిస్తుంది - 1కొ. 8,1. ఈనాటివరకు కొనసాగుతున్న అపోస్తలుల బోధ ఈ భవనాన్ని నిర్మిస్తుంది -2,7. ప్రార్థన ఈ మందిరాన్ని నిర్మిస్తుంది - యూదా జాబు 20. కనుక మనం సోదరప్రేమ, అపోస్తలుల బోధ, ప్రార్థనం మొదలైన వాటన్నిటిద్వారా ఈ గృహాన్ని పెద్దదిగా చేసికొంటూపోవాలి.

3. ఏయే శక్తులు ఈ గృహాన్ని నాశంచేస్తాయి? క్రీస్తు నుండీ అపోస్తలులనుండీ వచ్చిన పవిత్ర బోధను తారుమారుచేస్తే ఈ భవనం నాశమౌతుంది. కనుకనే యూదా జాబు "మీరు పరమ పవిత్రమైన మీ విశ్వాసాన్ని అభివృద్ధి చేసికొనండి" అని చెప్తుంది -2. "మీకు బోధించిన విధంగా మీ విశ్వాసాన్ని నానాటికి పెంపొందించుకోండి" అని హెచ్చరించాడు పౌలు - కొలో 2,7. అతడు మనకందరికీ విశ్వాస విషయంలో ఐక్యత వుండాలి" అనికూడ చెప్పాడు - ఎఫె 4,13.

   ఇంకా అనైతిక ప్రవర్తనం ఈ భవనాన్ని నాశం చేస్తుంది. అనగా మనలో ఐక్యత పరస్పర ప్రేమ మొదలైనవి కుంటుపడి పోకూడదు. కనుక ఈ యంశాలన్నిటిలోను మనం జాగ్రత్తగా మెలగాలి. "మనలో ప్రతి వ్యక్తియు తన సోదరుని ప్రేమనీ క్షేమాభివృద్ధినీ పెంపొందించాలి" అన్న పౌలు వాక్యం మనకు ఆదర్శం కావాలి - రోమా 15,2. మన వ్యక్తిగత జీవితంలోగూడ మనమెప్పుడూ ధ్వంసాత్మకంగా గాక నిర్మాణాత్మకంగా ప్రవర్తిస్తుండాలి.

# 17. నిబంధనకారుడు

## 1. నిబంధనం అంటే యేమిటి?

దేవుడు నరులకు తన దివ్యజీవనంలో పాలు ఇవ్వాలని కోరుకొన్నాడు. అందుకే వారితో నిబంధనం చేసికొన్నాడు. పూర్వ నూత్న వేదాల్లోకూడ ఈ నిబంధనభావం చాల ముఖ్యమైంది. అసలు పూర్వవేదాన్ని ప్రాతనిబంధనమనీ, నూత్నవేదాన్ని క్రొత్త నిబంధనమనీ పిలుస్తాంగదా! నిబంధనమంటే రెండుపక్షాలమధ్య జరిగే ఒడంబడిక, ఒప్పందం, ఒడబాటు, ఒప్పుకోలు. బైబుల్లో వందలకొలది నిబంధనలున్నాయి. వీటన్నిటిలోను ప్రభువు మోషేద్వారా చేసిన నిబంధనం, క్రీస్తుద్వారా చేసిన నిబంధనం ముఖ్యాతి ముఖ్యమైనవి. బైబుల్లో నిబంధనం జరిగినప్పుడు "నేను వారి దేవుడనౌతాను, వారు నా ప్రజలౌతారు" అనే సాంకేతిక వాక్యం విన్పిస్తుంది. ఈ వాక్యం దేవుని సాన్నిధ్యాన్ని సూచిస్తుంది.

దేవుడు యిస్రాయేలీయులతో నిబంధనం చేసికోకముందే వారి చుట్టూ వసించే వివిధ జాతి ప్రజల్లో నిబంధనాచారం వుండేది. మామూలుగా రక్షణకోసం ఓ చిన్న రాజు ఓ పెద్దరాజుతో ఒడంబడిక చేసికొనేవాడు. దానికి కొన్ని తంతులుండేవి. ఒడంబడిక చేసికొనేవాళ్లు జంతువులను చంపి వాటి మాంసఖండాల మధ్యగా నడచేవాళ్ళు. ఒడబాటును మీరినవాడిని ఆ మాంసఖండాలలాగే ముక్కముక్కలుగా కోయాలని దీని భావం. చిన్నరాజు పెద్దరాజుపట్ల స్వామిభక్తి కలిగి అతని ఆజ్ఞలను పాటిస్తుండాలి. చిన్నరాజు మీదికి ఎవడైనా యుద్ధానికివస్తే పెద్దరాజు అతన్ని కాపాడాలి. ఒడబాటును ధ్రువపరుస్తూ ఇరుపక్షాలవాళ్ళు కలసి భోజనం చేసేవాళ్ళు. ఒప్పుకోలు జరిగిన తావుల్లో జ్ఞాపకార్థంగా ఓ రాతి స్తంభాన్ని నిలిపేవాళ్లు. లేదా ఓ చెట్టును నాటేవాళ్లు. కొన్ని సార్లు వివాహాన్నిగూడ భార్యాభర్తల మధ్య ఒడంబడికగా భావించారు. ఉభయపక్షాలు పరస్పర సహాయం పొందడం ఈ నిబంధనం యొక్క ప్రయోజనం. మామూలుగా చిన్నరాజే తనతో నిబంధనం చేసికొమ్మని పెద్దరాజుని వేడుకొనేవాడు. బైబుల్లో భగవంతుడు తన భక్తులతో చేసికొన్న నిబంధనల్లోకూడ ఈ లక్షణాలు చాల వరకు కన్పిస్తాయి.

పూర్వవేదంలో మోషే నిబంధనకుముందే రెండు పెద్ద నిబంధనలున్నాయి. మొదటిది, దేవుడు నోవాతో చేసికొన్న నిబంధనం. ఆదికాండం 9,8-16 వచనాలు ఈ యంశాన్ని వర్ణిస్తాయి. ఇక్కడ దేవుడు నోవాద్వారా సృష్టి అంతటితోను నిబంధనం చేసికొన్నాడు. ఈ వొడంబడికకు గుర్తు ఆకాశంలో కన్పించే వర్ణగుడి. ఈ వొడబాటు ఫలితం, నీటిముంపువల్ల ప్రపంచం మరల నాశంగాకుండా వుండడం.

రెండవది, ప్రభువు అబ్రాహాముతో చేసికొన్న నిబంధనం. ఆదికాండం 15వ అధ్యాయం ఈ యంశాన్ని పేర్కొంటుంది. దీన్ని ప్రభువు అబ్రాహాముతోను అతని అనుయాయులతోను మాత్రమే చేసికొన్నాడు. దీనికి గురుతు అబ్రాహామూ అతని

సంతతివారూ సున్నతిని పొందడం. ఈ వొడబాటు ఫలితాలు రెండు. మొదటిది, అబ్రాహాము సంతతి ఆకాశంలోని చుక్కల్లాగ లెక్కలకందనిరీతిగా విస్తరిల్లుతుంది. రెండవది, వాళ్లు కనాను దేశాన్ని తరతరాలవరకు వారసంగా స్వీకరిస్తారు.

## 2. సీనాయి నిబంధనం

ఇది నిర్గమకాండంలో వస్తుంది. ఈ నిబంధనం పూర్వవేదానికంతటికీ పునాదిలాంటిది. ఇది మామూలు నిబంధనల్లాంటిదికాదు. ఇక్కడ ఉభయపక్షాలు సరిసమానమైనవికావు. దేవుడు గొప్పవాడు, యిస్రాయేలీయులు అల్పులు. పైగా గొప్పవాడైన దేవుడే నిబంధనాన్ని తలపెట్టాడు. అల్పులైన యిస్రాయేలీయులు దానికి సమ్మతించారు. కనుక ఈ వొప్పందానికి దేవుడే కారకుడు.

నిర్గమకాండం 19,16-20లో ప్రభువు సీనాయి కొండ మీదికి దిగివస్తాడు. అతడు కారుమబ్బుల్లో పొగల్లో సెగల్లో భూకంపంలో ఉరుముల్లో దర్శనమిస్తాడు. మోషే మాత్రమే కొండమీద అతన్ని దర్శిస్తాడు. ప్రజలంతా కొండక్రిందనే వుంటారు.

అదే పుస్తకం 24,3-11 ఒడంబడికను వర్ణిస్తుంది. మోషే యావే నియమించిన నిబంధన నియమాలన్నిటినీ ప్రజలకు వివరించాడు. వాళ్లు వాటిని పాటిస్తామని ప్రతిజ్ఞ చేసారు. తర్వాత మోషే సీనాయికొండ దగ్గర బలిపీఠాన్ని నిర్మించాడు. పండ్రెండు తెగల యిస్రాయేలీయులకు గుర్తుగా పన్నెండు రాళ్లు పాతాడు. అటుపిమ్మట కోడెను వధించారు. మోషే దాని నెత్తుటిలో సగం పీఠంమీదా, సగం ప్రజలమీదా చల్లాడు. "ప్రభువు మీతో చేసికొన్న నిబంధనకు సంబంధించిన రక్తం ఇదే" అని చెప్పాడు- 24,8. ఇక్కడ ఈ నెత్తురుద్వారానే నిబంధనం జరిగింది. బలిపీఠం దేవునికి గుర్తు. ఆ పీఠంద్వారా ప్రజలమీద పడిన నెత్తురు ఆ ఉభయ పక్షాలను ఐక్యపరచింది. నెత్తురులో ప్రాణముంటుంది. ఆ ప్రాణం దేవునిదే - లేవీ 17,11. కనుక ఈ నెత్తుటి చిలకరింపుద్వారా దేవుడు యిస్రాయేలీయులను తనతో ఐక్యపరచుకొన్నాడు. కట్టకడన మోషే 70 మంది యిస్రాయేలు పెద్దలు కొండమీద దేవుని యెదుట భోజనం చేసారు. సీనాయి నిబంధనం సంగ్రహంగా యిదే. ఇక, ఈ నిబంధన భావాలు జాగ్రత్తగా గుర్తించాలి.

### 1. దేవుని రక్షణ ప్రణాళికలో నిబంధనం

ప్రభువు యిస్రాయేలీయులతో ఎందుకు ఒడంబడిక చేసికొన్నాడు? వాళ్ళను తన ప్రజలనుగా జేసికోడానికీ, వాళ్ళకు తన రక్షణను ప్రసాదించడానికీని. కనుకనే అతడు యిస్రాయేలీయులతో "మీరు నా మాట విని నా నిబంధనాన్ని శ్రద్ధగా పాటిస్తే సకల జాతుల్లోను మీరే నావాళ్ళూ, నా సొంత ప్రజలూ ఔతారు. భూమండలమెల్ల నాదే. మీరేనాకు యాజక రూపరాజ్యమూ, నా పవిత్రప్రజ ఔతారు" అని చెప్పాడు - 19,5-6. అనగా భూమిమీది జాతులన్నిటిలోను ప్రభువు యిస్రాయేలునే తన జాతిగా ఎన్నుకొన్నాడు. వాళ్లు

అతన్ని కొలిచి అతనిద్వారా పవిత్రులౌతారు. నిబంధనాన్ని అతడే కరుణతో ప్రారంభించాడు. ఆ ప్రజలకు అతనితో ఒడంబడిక చేసికొనే యోగ్యత ఏమీలేదు.

ఒకమారు యిస్రాయేలీయులు ఆ ప్రభువు ప్రజలయ్యాక అతడే వాళ్ళను కాచి కాపాడాడు. అంతకుముందే అతడు వాళ్ళను గరుడపక్షి తన పిల్లలను రెక్కలమీద మోసికొని వచ్చినట్లుగా ఐగుప్తునుండి మోసికొనివచ్చాడు- 19,4. ఇప్పుడు ప్రభువు తన దూతను వారికి ముందుగా పంపుతాడు. అతడు వాళ్ళను సురక్షితంగా వాగ్దత్తభూమికి తీసుకవెళ్తాడు - 23, 20-21.

## 2. నిబంధన షరతులు

నిబంధనలన్నిటిలోను ఉభయపక్షాల తరపున షరతులుంటాయి. ప్రభువు తన తరపున తాను యిస్రాయేలుకు కనాను మండలాన్ని శాశ్వతంగా భుక్తం చేస్తాడు. వాళ్ళను ఒక జాతిగా తీర్చిదిద్ది శత్రుజాతులనుండి కాపాడతాడు. ప్రజలు తమ తరపున తాము యావే ప్రభువును మాత్రమే కొలవాలి, అన్యదైవాలను పూజింపకూడదు. ఇంకా అతడు మోషేద్వారా దయచేసిన ధర్మశాస్త్రాన్ని ఖండితంగా పాటించాలి - నిర్గ 20,3. వీటిల్లో యావే తన షరతులను ఎల్లవేళలా పాటించాడు. కాని ప్రజలుమాత్రం తమ షరతులను పాటించేవాళ్లు కాదు. కనుకనే వాళ్లు బాబిలోనియా ప్రవాసశిక్షకు గురయ్యారు.

## 3. ఒప్పందం ముగింపు

ఒప్పందం ముగింపునుగూర్చి రెండు సంప్రదాయాలున్నాయి. మొదటి సంప్రదాయం ప్రకారం మోషే 70మంది పెద్దలతో కొండమీద దేవుని యెదుట భోజనం చేయడంతో నిబంధనం ముగిసింది - 24,9-11. రెండవ సంప్రదాయం ప్రకారం, మోషే బలిపీఠం మీదా ప్రజలమీదా నెత్తురు చిలకరించడంతోనే నిబంధన ముగిసింది - 24, 3-8.

ప్రజలు నిబంధనాన్ని గుర్తుంచుకోవాలి కదా! అందుకొరకు ప్రభువు తాను దయచేసిన పదియాజ్ఞలను మందసంలో పెట్టి వుంచుకొమ్మని మోషేను ఆజ్ఞాపించాడు. ఆ పెట్టెమీదినుండే దేవుడు తన ప్రజలతో మాట్లాడతాడు - 25, 21-22. ఇంకా ఈ మందసాన్ని గుడారంలో పెట్టించమని కూడ దేవుడు ఆజ్ఞాపించాడు. ఈ గుడారం రాబోయే దేవాలయానికి సూచనగా వుంటుంది. ఈ గుడారంలోనే యిస్రాయేలీయులు ప్రభువును సంప్రతించేవాళ్ళు -33, 7-11. కనుక మందసమూ గుడారమూ ప్రజలు ప్రభువును పూజించే తావులు. అతని ఆజ్ఞలను స్వీకరించే తావులు. అవి రెండు కలసి యెడారి కాలంలో యిస్రాయేలీయులకు దేవాలయమయ్యాయి.

## 4. నిబంధనం భావం, దాని లోపాలు

సీనాయి నిబంధనం పరమార్థమేమిటి? యిస్రాయేలీయులు ప్రభువుని భక్తితో పూజించాలి. అతని ఆజ్ఞలను తుచ తప్పకుండా పాటించాలి. "యిస్రాయేలీయులారా

వినండి! మన ప్రభువైన దేవుడు ఏకైక ప్రభువు. మీ ప్రభువైన దేవుణ్ణి పూర్ణహృదయంతో పూర్ణమనస్సుతో పూర్ణశక్తితో ప్రేమించండి. నేడు నేను మీకు ఉపదేశించిన ఈ యాజ్ఞలను ఏనాడూ విస్మరించకండి" - ద్వితీ 6, 4-5. యిస్రాయేలీయులు ఈలా భక్తి చూపిస్తే ప్రభువు వారికి చేసిన వాగ్దానాలన్నిటినీ నిలబెట్టుకొంటాడు. అనగా వారిని మహా జాతినిగా అభివృద్ధి చేస్తాడు. కనాను దేశాన్ని వారికి శాశ్వతంగా భుక్తంచేస్తాడు. ఈలా దేవుడూ ప్రజలూ కలసి వుండడమే నిబంధనం ప్రయోజనం.

కాని ఈ సీనాయి వొడంబడికలో కొన్ని లోపాలు కూడ వున్నాయి. 1. ప్రభువు యిస్రాయేలు జాతితో మాత్రమే వొప్పందం చేసికొన్నాడు. మరి ఆనాడున్న ఇతర జాతుల సంగతియేమిటి? రక్షణం అన్ని జాతులకూ అవసరం కాదా? అతడు అన్ని జాతులకూ ప్రభువు కాడా? 2. నిబంధనం యిస్రాయేలీయుల నమ్మదగినతనం మీదనే ఆధారపడి వుంటుంది. కాని వాళ్ళు విశ్వసనీయంగా ప్రవర్తించలేదు. కనుకనే సీనాయి నిబంధనం కోరుకొన్న ఫలితాన్నీయలేక పోయింది. 3. ఈ నిబంధనం యూదుల భూలోక రాజ్యాన్నిగూర్చి మాట్లాడుతుందేగాని పరలోక రాజ్యాన్నిగూర్చి మాట్లాడదు. ఇక్కడ రక్షణమంటే ప్రధానంగా ఇహలోక సౌఖ్యాలు. మోక్షరాజ్యంకాదు. ఆలాంటప్పుడు ఈ నిబంధనం విలువ ఏపాటిది? ఈలాంటి లోపాలు కొన్ని వున్నా సీనాయి నిబంధనం చాల ప్రాముఖ్యమైంది. యూదుల భావి చరిత్ర అంతా దీనిమీదనే ఆధారపడి వుంటుంది. దీనిని పాటించినంతకాలం వాళ్ళకు మేళ్ళు కలుగుతాయి. పాటించనంతకాలం వినాశం దాపురిస్తుంది.

## 3. యిస్రాయేలు జీవిత చరిత్రలో నిబంధనం ప్రాముఖ్యం

### 1. నిబంధన నూత్నీకరణం

నిబంధనను చేసికొన్న ఉభయపక్షాలవాళ్ళు దాన్ని చాలసార్లు నూత్నీకరించుకొనేవాళ్ళు. కావున యిస్రాయేలీయుల చరిత్రలోకూడ నిబంధన నూత్నీకరణలు చాల కన్పిస్తాయి. దావీదుని హెబ్రోనున యిస్రాయేలీయులందరికీ రాజునుగా అభిషేకించారు. ఆ సమయంలో రాజూ, ప్రజల పెద్దలూ ఒడంబడికను నూత్నీకరించుకొన్నారు- 2సమూ 5,3. సొలోమోనురాజు దేవాలయాన్ని కట్టి దానికి ప్రతిష్ఠ చేసినపుడుకూడ నిబంధనాన్ని నూత్నీకరించాడు- 1రాజు 8,22-30. యోషీయారాజు గొప్ప మతసంస్కరణలను ప్రారంభించినవాడు. అతడు కూడ నిబంధన నూత్నీకరించాడు-2 రాజు 23,1-3. ఈ నూత్నీకరణాల భావమేమిటంటే ప్రజలు నిబంధన షరతులను అధికాధికంగా పాటించడమే.

### 2. ప్రవక్తల హెచ్చరికలు

యిస్రాయేలీయుల చరిత్రలో ప్రవక్తలు చాల పెద్దపాత్ర నిర్వహించారు. వాళ్ళు ప్రజలను నిబంధన షరతులను పాటించండని నిరంతరం హెచ్చరిస్తుండేవాళ్ళు. అసలు

వాళ్ల బోధంతా నిబంధన నియమాలను గూర్చే. వాళ్ళ ఉపదేశాల ప్రకారం, నిబంధనద్వారా దేవునికీ ప్రజలకీ మధ్య సఖ్యసంబంధాలు ఏర్పడ్డాయి. ఆ ప్రజలు గొర్రెల మందయితే, ప్రభువు వారిని కాచి కాపాడే కాపరి. వాళ్లు ద్రాక్షతోటయితే, అతడు ఆ తోటకాపు. వాళ్లు ఇల్లయితే, అతడు ఆ యింటిని కట్టినవాడు. వాళ్లు వధువైతే అతడు ఆ కన్నెను పరిణయమాడిన వరుడు. వాళ్లు బిడ్డలైతే, అతడు వాళ్ళకు తండ్రి. ఈలాంటి ఉపమానాల ద్వారా ప్రవక్తలు ఒప్పందం భావాన్ని లోతుగా విశదీకరించి చెప్పారు. ఒడంబడిక వలన ఏర్పడిన సఖ్యసంబంధాలను ప్రజలు జాగ్రత్తగా నిలబెట్టుకోవాలి. అనగా దైవభక్తితో జీవిస్తూ ప్రభువు ఆజ్ఞలను ఖండితంగా పాటించాలి.

ఒప్పుకోలునుగూర్చి మాట్లాడిన ప్రవక్తల్లో యిర్మీయాను విశేషంగా స్మరించుకోవాలి. ఈ ప్రవక్త ప్రజల పాపాలవలన సీనాయి నిబంధనం రద్దయిపోయిందని బోధించాడు. ఐనా ప్రభువు మంచివాడు కనుక భావికాలంలో ప్రజలతో నూత్ననిబంధనం చేసికొంటాడని వాకొన్నాడు. యిర్మీయా పలుకులను అతని ప్రవచనం 31, 31-34 వచనాల్లో చూడవచ్చు. ఇవి పూర్వవేదంలోని అతి ప్రశస్త వచనాలకు చెందినవి. ఈ వాక్యాల ప్రకారం 1. ప్రభువు యిస్రాయేలీయుల పాపాలను మన్నిస్తాడు (34). 2. ప్రజలు తమ పాపాలకు తామే వ్యక్తిగతంగా బాధ్యులౌతారు (29). 3. ఇకమీదట వట్టి కర్మకాండతో గూడిన మతంగాక హృదయగతమైన మతం ప్రారంభమౌతుంది. "నేను నా ధర్మశాస్త్రాన్ని వాళ్ళ అంతరంగంలో వుంచుతాను. వాళ్ళ హృదయాలపై లిఖిస్తాను" అన్నాడు ప్రభువు-31,33. ప్రభువు మోషే ధర్మశాస్త్రాన్ని కేవలం రాతిపలకలపై వ్రాసి యిచ్చాడు కదా! క్రీస్తు సిలువపై మరణించి నూత్ననిబంధనాన్ని నెలకొల్పడంతో ఈ యిర్మియా ప్రవచనం నెరవేరింది. క్రీస్తు "ఇది అనేకుల పాపపరిహారార్థమై చిందబడనున్న నూత్న నిబంధనంయొక్క నా రక్తం అన్నాడు- మత్త 26,28. ఈ "నూత్న నిబంధనం" యిర్మీయా పేర్కొన్నదే.

నిబంధనాన్ని పాటించడానికి ప్రధాన కారణం దేవునికి ప్రజలపైవున్న ప్రేమేనని చెప్తుంది ద్వితీయోపదేశకాండ. ఆనాడు అన్ని జాతులుండగా ప్రభువు యిస్రాయేలుని మాత్రమే ఎందుకెన్నుకొన్నాడు? వారి యోగ్యతను బట్టి కాదు. తనకు వారిపైగల ప్రేమచేతనే - 7, 6-7. కనుక ఆ నిబంధనాన్ని పాటించడం జీవం. దాన్ని విస్మరించడం మరణం - 30,15.

## 3. శిక్ష

నరుల హృదయం పాపభూయిష్ఠమైంది. ఎవరు ఎన్ని హెచ్చరికలు చేసినా యిస్రాయేలీయులు ప్రభువు నిబంధనాన్ని పాటించలేదు. అతని ఆజ్ఞలను ఖాతరు చేయలేదు. కనుక ప్రభువు వారి పట్టణాన్నీ దేవాలయాన్నీ సర్వనాశం చేయించాడు. వారిని నేబుకద్నెసరు

రాజునకు దాసులనుగా జేసి బాబిలోనియాకు ప్రవాసులనుగా పంపాడు. అన్యజాతి ప్రజలు బుగ్గయియున్న యెరూషలేం ప్రక్కగా నడుస్తూ ఈ మహానగరానికి ఈ గతి యేలపట్టిందని ప్రశ్నిస్తారు. యిస్రాయేలీయులు తమ దేవుని నిబంధనాన్ని మీరి అన్యదైవాలను పూజించారు కనుక వారికీ దుర్గతి పట్టిందని తమకు తామే సమాధానం చెప్పుకొంటారు – యిర్మీ22,9.

### 4. ఆశావహమైన బోధలు

మీద యిర్మీయా పేర్కొన్న నూత్న నిబంధనాన్ని గూర్చి విన్నాం. ఆకాశం, భూమి, జగత్తు వున్నంతకాలం దేవుని నిబంధనం వ్యర్థంకాదని అతడు స్పష్టంగా జెప్పాడు – 31,35–37. అతనితోపాటు చాలమంది ప్రవక్తలు భవిష్యత్తులోనికి పారజూచారు. అంతవరకు ప్రభువు యూదులతో చేస్తూ వచ్చిన ఒడంబడికలు విఫలంకావని చెప్పారు. అతడు మళ్లా నూత్ననిబంధనాన్ని చేస్తాడని ప్రవచించారు. యెహెజ్కేలు ప్రవక్త ఈ నిబంధననుగూర్చి మాట్లాడుతూ, ప్రభువు ప్రజలకు నూత్న హృదయాన్నీ నూత్నాత్మనీ దయచేస్తాడని చెప్పాడు. ఆ ప్రజలలోనుండి రాతిగుండెను తొలగించి వారికి మాంసపు గుండెను దయచేస్తాడని చెప్పాడు – 36, 26–28. పురుషుడు దోషియైన భార్యను విడనాడి జాలితో ఆమెను మళ్ళా చేపట్టినట్లే ప్రభువు యిస్రాయేలును మళ్ళా స్వీకరిస్తాడని చెప్పాడు యెషయా –54,5–10. ఈ క్రొత్త వొడంబడిక లేచిపోయిన భార్యను తీసికొనివచ్చి మళ్లా పెండ్లిజేసికోవడంలా వుంటుందని పల్కాడు హోషేయ –2,20. రాబోయే బాధామయ సేవకునిద్వారా ఈ నూత్ననిబంధనం జరుగుతుందని బోధించాడు యెషయా –42,6. ఇవన్నీ చాల గొప్ప ప్రవచనాలు. పలుసారులు భక్తితో మననం చేసికోదగ్గవి.

## 4. నూత్న నిబంధనకారుడు క్రీస్తు

పై ప్రవచనాలన్నీ నెరవేరి నూత్ననిబంధన మధ్యవర్తియైన క్రీస్తు విజయం చేసాడు. ఆ ప్రభువు కడపటి విందును భుజిస్తూ పాత్రను అందుకొని "మీరందరు దీని లోనిది త్రాగండి. ఇది అనేకుల పాపపరిహారార్థమై చిందబడనున్న నూతన నిబంధనం యొక్క నా రక్తం" అన్నాడు –మత్త 26, 27–28. ఈ వాక్యం పూర్వం మోషే పీఠం మీదా ప్రజలమీనా నెత్తురు చిలకరిస్తూ "ప్రభువు మీతో చేసికొనిన నిబంధనకు సంబంధించిన రక్తం ఇదే" అన్న పలుకులను జ్ఞప్తికి తెస్తుంది – నిర్గ 24,8. ప్రభువు అక్కడ మోషే చిందించిన నెత్తురుద్వారా ప్రాత వొడంబడికను చేయిస్తే, ఇక్కడ క్రీస్తు చిందించే నెత్తురుద్వారా క్రొత్త వొప్పందాన్ని చేయిస్తాడు. అక్కడ జంతువుల నెత్తురుకు బదులుగా ఇక్కడ క్రీస్తు సొంత నెత్తురు పనిచేస్తుంది.

ఇంకా, యెషయా ప్రవక్త బాధామయ సేవకుని ద్వారా క్రొత్త నిబంధనం జరుగుతుందని చెప్పాడు గదా! ప్రభువు ఆ సేవకునితో

"నేను నిన్ను ప్రజలకు నిబంధనంగాను
జాతులకు జ్యోతినిగాను నియమించాను
నీవు గ్రుడ్డివారి కన్నులు తెరుస్తావు
బందీలను చెరనుండి వెలుపలికి కొనివస్తావు
చీకటిలో వున్న వారిని కారాగారం నుండి విడిపిస్తావు"

అని చెప్పాడు - 42,6-7. ఈ ప్రవచనంగూడ క్రీస్తునందు నెరవేరింది. ఇంకా, ఆ బాధామయ సేవకునిగూర్చి గూడ ప్రభువు

"అతన్ని బాధాభరితుని జేయాలనే నా సంకల్పం
అతని మరణం పాపపరిహారబలి అయింది
కనుక అతడు దీర్ఘాయువును బడసి
పుత్ర పౌత్రులను జూస్తాడు"

అని చెప్పాడు - 53, 10-11. ఈ ప్రవచనంగూడ క్రీస్తు విషయంలో నెరవేరింది. యెషయా పేర్కొన్న బాధామయ సేవకుడు క్రీస్తేనని నూత్నవేదం పలుతావుల్లో చెప్తుంది. ఆ క్రీస్తుద్వారా మనం పవిత్రాత్మను పొందాం. ఆ యాత్మ నూత్న ధర్మశాస్త్రాన్ని మన హృదయంలో లిఖిస్తుంది. ఈలా యిర్మీయా యెహెజ్కేలు పల్కిన ప్రవచనాలు నెరవేరతాయి. క్రీస్తు మరణంద్వారా మనం తండ్రితో మళ్లా రాజీపడ్డాం -2 కొ 5,19.

క్రీస్తు చేసిన నిబంధనం పూర్వం మోషే చేసిన నిబంధనంకంటె గొప్పది. "మరింత గొప్పవైన విషయాలను గూర్చిన వాగ్దానాల మీద ఆధారపడివుంది కనుక, దేవునకు మానవులకు మధ్య క్రీస్తు ఏర్పరచిన నిబంధనం మరింత శ్రేష్ఠమైంది - హెబ్రే 8,6. "క్రొత్త నిబంధనకు మధ్యవర్తియైన క్రీస్తువద్దకు, రక్తంకంటె ఉత్తమ విషయాలను పేర్కొనే ప్రోక్షక రక్తంవద్దకు, మీరు వచ్చారు" - 12,24. నేడు మన క్రైస్తవ జీవితమంతా ఈ నిబంధన జీవితమే.

## ప్రార్థనా భావాలు

1. ప్రభువు తన సిలువ మరణాన్ని సూచించే కడపటి విందును భుజిస్తూ "మీరు నా జ్ఞాపకార్థంగా దీనిని చేయండి" అని ఆజ్ఞాపించాడు - 1కొ 11,24-25. నేడు మనమర్పించే పూజద్వారా ఈ యాజ్ఞను నెరవేరుస్తున్నాం. ఈ పూజలో అనుదినం క్రీస్తు నిబంధనను జ్ఞాపకం చేసికోవడం వల్లనే మనం రక్షణం పొందుతున్నాం. ఇంకా, పూర్వ నూత్న వేదాల్లో కూడ భోజనంతోనే నిబంధనం ముగుస్తుంది. నేడు మనకు దివ్యసత్ప్రసాదమే నిబంధన భోజనం. కనుక అది మనకు అతిపవిత్రమైంది.

2. పూర్వవేదంలో నిబంధనం జరిగినప్పుడు "నేను వారి దేవుణ్ణి, వాళ్లు నా ప్రజలు" అనే వాక్యం విన్పిస్తుంది. ఇవి దైవసాన్నిధ్యాన్ని తెలియజేస్తుంది. నూత్న వేదంలో మన సాన్నిధ్యం క్రీస్తే. అతడు మనకు ఇమ్మానువేలు - మనతో వుండే దేవుడు.

3. పూర్వవేదంలో పశువుల నెత్తురు చిలకరించి పాప పరిహారమూ, నిబంధనమూ చేసారు. నూత్నవేదంలో క్రీస్తు నెత్తురు ద్వారా నిబంధనం జరిగింది. ఆ పశువుల రక్తంతో పోలిస్తే క్రీస్తు రక్తం ఎంతో పవిత్రమైంది. అమూల్యమైంది. కనుక అది మనకు చేకూర్చిపెట్టే రక్షణం పూర్వవేద రక్షణం కంటే గొప్పది.

4. నూత్న నిబంధనం వీలునామాలాంటిది. వీలునామాను వ్రాసినవాడు గతింపగనే అతని సొత్తు అతని వారసులకు లభిస్తుంది. కనుక క్రీస్తు మరణంతో అతని వారసులమైన మనకు అతని సొత్తయిన మోక్షం లభిస్తుంది - హెబ్రే 9,17. క్రీస్తు తాను జరిపిన నిబంధనం ద్వారా గొర్రెలకు కాపరి అయ్యాడు. ఆ గొర్రెలం మనమే - 13,20.

5. పూర్వవేద ప్రజలు సీనాయి నిబంధనం ద్వారా దేవుని ప్రజలయ్యారు. "మీరు నావారూ, నా సొంత ప్రజలూ ఔతారు. మీరే నాకు యాజకరూపరాజ్యం, పవిత్ర ప్రజ" నిర్గ 19,5-6. పూర్వవేదానికి నిబంధన మేలాంటిదో నూత్నవేదానికి జ్ఞానస్నానం అలాంటిది. కనుక నూత్నవేదం జ్ఞానస్నానం పొందిన క్రైస్తవులకు పై నిర్గమ కాండంలోని వాక్యాలను అన్వయిస్తుంది. "మీరు ఎన్నుకోబడిన జాతి, రాజరికపు గురుకులం, పవిత్రమైన దేవుని సొంతప్రజలు" అని చెప్తుంది - 1పే 2,9. మనం ఈ వేద వాక్యాలకు తగినట్లు పవిత్రంగా జీవించాలి.

6. క్రైస్తవ ప్రజల్లో కొందరు దేవుని ప్రత్యేకమైన పిలుపును పొంది గురువులూ మఠకన్యలూ ఔతారు. ఈ పిలుపు కూడ నిబంధనం లాంటిదే. ఆ పిలువబడిన వారిలో గొప్ప యోగ్యత ఏమీ లేకపోయినా దేవుడు కరుణతో వారితో నిబంధనం చేసికొంటాడు. ఆ పిలుపు మన యోగ్యత మీద కాక దేవుని ప్రేమ మీద ఆధారపడి వుంటుంది. "అతడు స్వయంగా మిమ్ము ప్రేమించాడు. కనుక మిమ్మే ఎన్నుకొన్నాడు" - ద్వితీ 7,8. కనుక ఈ పిలుపును పొందినవాళ్లు దేవునికి ప్రత్యేకంగా కృతజ్ఞత చూపాలి.

7. క్రీస్తు చేసిన నిబంధనం మోక్షంలో గొర్రెపిల్ల వివాహంతో గాని సంపూర్ణం కాదు. "అటు తర్వాత నేను స్వర్గంలోని దేవుని నుండి దిగివచ్చే పవిత్ర నగరమైన యెరూషలేమును చూచాను. ఆమె తన భర్తను చేరబోవడానికి గాను అలంకరించుకొని సిద్ధంగా వున్న యువతిలా వుంది. అంతట ఒక దేవదూత నన్ను సమీపించి గొర్రెపిల్ల వధువైన యువతిని నీకు చూపిస్తాను రా" అన్నాడు- దర్శ 21,2-9. అనగా నిబంధనం మనకు ఈ లోకంలో ప్రారంభమై పరలోకంలో ముగుస్తుంది.

# ప్రశ్నలు

1. విమోచనం అంటే యేమిటి? పూర్వవేదంలో యావే, నూత్నవేదంలో క్రీస్తు ఏలా విమోచకులయ్యారు?
2. క్రీస్తు నూత్నవేద మధ్యవర్తి – వివరించండి.
3. క్రీస్తు మన గొర్రెపిల్ల అనడంలో గల మూడు భావాలను విశదీకరించండి.
4. యావే, క్రీస్తు ఏలా కాపరులౌతారో తెలియజేయండి. కాపరిని గూర్చి నాల్గవ సువిశేషం పేర్కొనే ప్రత్యేక భావాలు ఏమిటివి?
5. వెలుగును గూర్చిన పూర్వ, నూత్నవేద భావాలను పేర్కొనండి.
6. దివ్యసత్ప్రసాదమూ దైవవాక్కూ రెండూ మనకేలా ఆహారమౌతాయో వివరించండి.
7. క్రీస్తు నేనే మార్గాన్ని అనడంలో అర్థం ఏమిటి?
8. తొలి ఆదాముకీ రెండవ ఆదాముకీ గల వ్యత్యాసాలను పేర్కొని, మనం రెండవ ఆదాముని ఏలా పోలివుండాలో వివరించండి.
9. శిల అనే పదం యావేకూ క్రీస్తుకీ ఏలా అన్వయిస్తుంది? మనం ఏలా సజీవశిలలం ఔతాం?
10. యావే, క్రీస్తు మనకు ఏలా రక్షకులౌతారు?
11. మెస్సీయా అనే పదం క్రీస్తుకి ఏలా అన్వయిస్తుందో వివరించండి.
12. యేసు నామం అర్థమూ, ఆ నామ ప్రభావమూ తెలియజేయండి.
13. పెండ్లికుమారుడు లేక వరుడు అనే పదం యావేకూ క్రీస్తుకూ ఏలా వర్తిస్తాయో తెలియజేయండి.
14. యావే, క్రీస్తూ తోట కాపుల్లాంటి వాళ్ళయితే, యిస్రాయేలీయులూ క్రైస్తవులూ వాళ్ళు నాటిన ద్రాక్షతోట లాంటివాళ్ళు అనే భావాన్ని వివరించండి. క్రీస్తు ద్రాక్షలత ఐతే మనం అతనిలోనికి అతుక్కొని వున్న రెమ్మలం అనే యోహాను భావాన్ని గూడ విశదీకరించండి.
15. యావే, క్రీస్తూ ఏలా మనకు జీవనదాత లౌతారో వివరించండి.
16. యావే, క్రీస్తూ ఏలా గృహనిర్మాత లౌతారో వివరించండి.
17. యావే చేసిన సీనాయి నిబంధనాన్నీ, క్రీస్తు చేసిన నూత్న నిబంధనాన్నీ వివరించండి.

✦✦✦



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J. గారు,** పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేష్యస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. **అనువాదకునిగా** : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. **ఆధ్యాత్మికవేత్తగా** : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. **విద్యార్థి బాంధవునిగా** : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. **వక్తగా** : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.